

# తెలుగులో మాండలిక కథా సాహిత్యం

ఎ.కె. ప్రభాకర్

తెలుగులో మాండలిక కథా సాహిత్యం - డా॥ ఎ.కె. ప్రభాకర్
(తెలంగాణాపై ప్రత్యేక దృష్టితో)

**Telugulo Maandalika Kathaa Saahityam - Dr. A.K.Prabhakar**
**(With Special Reference to Telangana)**


ప్రచురణ : జనవరి, 2002

ప్రతులు : 1,000

వెల : 50/-

కవర్‌పేజి చిత్రాలు - రూపకల్పన : ఏలె లక్ష్మణ్



సలహాలు - సూచనలకు : డా॥ ఎ.కె. ప్రభాకర్
బి-205, సోలంకీస్ గుల్మోహర్, బ్రాహ్మణవాడ - బేగంపేట,
హైదరాబాద్ - 500016



ప్రతులకు:
నవోదయ బుక్‌హౌస్,
ఆర్యసమాజ్ ఎదురువీధి, కాచిగూడ, హైదరాబాద్.

దిశ పుస్తక కేంద్రం
త్రినేత్ర సూపర్‌మార్కెట్ ఎదురుగా, చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రజాశక్తి బుక్ హౌస్
స్ట్రీట్‌నెం. 1, అశోక్‌నగర్, హైదరాబాద్ -20.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్‌భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ -01.

టైప్ కంపోజింగ్ : కె. జయశ్రీ
సాయిలక్ష్మీ ప్రాసెస్, చిక్కడపల్లి, హైదరాబాద్, ఫోన్: 040-7617540

కవర్‌పేజి ముద్రణ : సాయికృష్ణ స్కానర్స్ ప్రై. లిమిటెడ్, అమీర్‌పేట - హైదరాబాద్

ముద్రణ : సాయికృప ఆఫ్‌సెట్ ప్రింటర్స్, గోల్కొండ X రోడ్స్, హైదరాబాద్.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారంతో

# కృతజ్ఞతలు


పరిశోధనకు అవకాశం కలిగించి, డిగ్రీ నిచ్చిన తెలుగు విశ్వవిద్యాలయం పాలకవర్గానికీ-

ముక్కూ మొగం ఎరగని నన్ను ఆత్మీయుడిగా ఆదరించి పరిశోధనలో నా అభిరతిని గుర్తించి సోదర వాత్సల్యంతో అండగా నిలిచి అడుగడుగునా మంచి - చెడులని తెలియజేస్తూ నా అలసత్వాన్ని క్షమిస్తూ ముందుకు నడిపిన పర్యవేక్షకులు జయధీర్ తిరుమలరావు గారికీ-

పరిశోధన గమనంలో అప్పుడప్పుడూ తమ అమూల్యమైన సలహాలందించిన హరి పురుషోత్తమరావు గారికీ, వరవరరావుగారికీ, ఆచార్య - కె.కె. రంగనాథాచార్యులు గారికీ డా॥ బూదరాజు రాధా కృష్ణగారికీ, డా। ఏటుకూరి ప్రసాద్ గారికీ -

అడగ్గానే శ్రమకోర్చి మాండలిక కథల గురించి విస్తృతమైన ఇంటర్వ్యూలిచ్చిన మాండలిక రచయితలు కీ॥శే. జి. సురమౌళి, డా॥ పోరంకి దక్షిణామూర్తి, బి. ఎస్. రాములు గార్లకు-

ఉత్తరాల ద్వారా ప్రత్యక్షంగా కలిసినపుడు మాండలిక కథల గురించి ఎంతో విలువైన సమాచారం అందించిన అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తంరెడ్డి, కాలువ మల్లయ్య, వి. చెంచయ్య గార్లకు, ప్రచురణకు తగు సూచనలిచ్చిన ప్రొ. భక్తవత్సల రెడ్డి గారికి -

గ్రంధ రచనలో ప్రచురణలో సహకరించిన గురువర్యులు డా॥ సూరం శ్రీనివాసులు గారికీ, మిత్రులు డా। గరికపాటి నరసింహరావు, డా॥ సి. హెచ్. పి. సత్యనారాయణ, డా॥ జె. నాగేశ్వరరావు మరీ ముఖ్యంగా కె. పి. అశోక్ కుమార్, వాసిరెడ్డి నవీన్‌గార్లకు -

పాఠాలు చెప్తూ పరిశోధనకు అనుమతిచ్చిన సండూరు రెసిడెన్షియల్ జూ. కాలేజి, సండూరు, కర్నాటక - ప్రిన్సిపాల్ కీ.శే. మహాలక్ష్మిగారికి, హైదరాబాదు పబ్లిక్ స్కూలు బేగంపేట యాజమాన్యానికీ -

కవర్ పేజీకి బొమ్మలిచ్చి డిజైన్ చేసిన ఆత్మీయ చిత్రకారుడు ఏలెలక్ష్మణ్‌కీ, ముద్రించియిచ్చిన నా పూర్వ విద్యార్థి ఎ. శ్రీధర్ (సాయికృష్ణ స్కానర్స్ ప్రై. లి) కీ -

పుస్తక ప్రచురణకు కాగితాన్నిచ్చిన ఐ. టి. సి భద్రాచలం పేపర్ బోర్డుకీ, వైస్ ప్రెసిడెంట్ (లీగల్) ఎన్. రామకృష్ణన్ గార్కి -

అభిమానంతో ఆదరించిన నీలగారికీ - శ్రమపంచుకొన్న మిత్రులకూ -

నా చేసే ప్రతీ పనిలో సగభాగం స్వీకరించి, అలసిపోయినప్రతిసారీ నాలో కొత్తబలాన్ని ఉత్సాహాన్ని నింపే నా అర్ధాంగి రాజ్యలక్ష్మికి-

జీవితాన్నిచ్చిన తల్లిదండ్రులకు- అక్షర భిక్షపెట్టిన అధ్యాపకులందరికీ అడుగడుగునా కృతజ్ఞతలు.

# భూమిక

భాషా - సాహిత్యమూ రెండూ సామాజికాలే. సమాజంలో రాజకీయార్థిక రంగాల్లో మార్పు జరిగినప్పుడల్లా భాషా సాహిత్యాల్లో సైతం మార్పులు చోటుచేసుకుంటాయి. తెలుగు సాహిత్య చరిత్ర పొడవునా సామాజికావసరాల కనుగుణంగా భాషా సాహిత్యాలు తమ రూపాల్ని మార్చుకొన్నాయి. ప్రజల నిత్యవ్యవహారంలోని భాషకంటే భిన్నమైన సాహిత్య భాష ఒకటి ప్రత్యేకంగా ఏర్పడినప్పటికీ శివకవుల దగ్గర్నుంచీ యీనాటి వరకూ కవులు, రచయితలు మతప్రచారం కోసమో, రాజకీయ భావజాల ప్రచారం కోసమో సాహిత్యం ప్రజలదగ్గరకు పోవాలంటే ప్రజల జీవితంలో భాగమైన సాహిత్యరూపాన్నీ, భాషనీ అనివార్యంగా స్వీకరించారు.

సమాజంలో చోటుచేసుకునే మార్పే సాహిత్య చలనాన్ని సైతం నిర్దేశిస్తుందని సమీపగతంలోని వాడుక భాషోద్యమం మరోసారి నిరూపించింది. ఆర్థిక రాజకీయ రంగాల్లో నూతనంగా ఆవిర్భవించిన మధ్య తరగతి కోసం వారి విద్యా సాంస్కృతికావసరాలను తీర్చడం కోసం ఒక కొత్త సాహిత్య భాష తయారయింది. అది కొత్తగా తయారైన భాష కాదు - ప్రజల నిత్యవ్యవహారంలోని భాషే. అది పాత సాహిత్య భాషా స్థానాన్ని ఆక్రమించుకుంది. వాడుక భాషోద్యమం కాలంలో భాషే కాదు సాహిత్యరూపం కూడా మార్పుకి లోనైంది. గురజాడ కవిత్వ రూపం విషయంలో మార్పుకి దారి వేశాడు. అయితే కొత్తగా ఏర్పడిన సాహిత్య భాష - స్వీకరించిన రూపం సామాన్య జన వ్యవహారం నుంచి వచ్చినవే అయినప్పటికీ అవి 'శిష్ట' వర్గానికి చెందినవి. అందువల్లే ఆనాటి మారిన సాహిత్యభాషని శిష్టవ్యావహారిక భాషగానే పేర్కొన్నారు.

భాషా విషయకంగా వచ్చిన మార్పు వచనరచనల్లో, రూపం విషయంలో వచ్చిన మార్పు కవిత్వంలోనూ ముందుగా చోటు చేసుకొన్న విషయం గమనార్హం.

కొత్తగా అంగీకరించిన ప్రామాణిక భాష కూడా సామాజికావసరాలకు తీర్చడానికి సరిపోనికారణంగా, ప్రజల సాంస్కృతికావసరాలను తీర్చడానికి కింద తరగతి ప్రజల భాష సాహిత్యంలోకి చొచ్చుకు వచ్చింది. ఉపరితలంలో భాషా సాహిత్యరంగాల్లో చోటుచేసుకున్న మార్పుకి పునాదిలోని మార్పు కారణమవుతుందని గత తార్కిక వివేచన స్పష్టం చేస్తుంది. ఆ క్రమంలో ప్రామాణిక భాషలో సాహిత్య సృజనస్థానే ఒక ప్రాంతానికీ, అధిక సంఖ్యాకులైన కింది తరగతి ప్రజలకు ప్రాతినిధ్యం వహించే భాషలో ( దాన్నే మాండలికం అంటున్నాం) సాహిత్య సృజన ప్రారంభమైంది.

తెలుగులో మాండలిక సాహిత్యంపైన విస్తృతమైన పరిశోధన జరగలేదు. పోరంకి దక్షిణామూర్తి లాంటివాళ్ళు తెలుగు కథల మీద చేసిన పరిశోధనల్లో ఆనుషంగికంగా

మాండలిక కథల గురించి ప్రస్తావించారు. 'తెలంగాణా మాండలిక కవిత్వం'పై ఎం.ఫిల్ పట్టాకోసం పరమాత్మ పరిశోధన తెలంగాణా ప్రాంతానికి చెందిన వచన కవిత్వం వరకే పరిమితమైంది. తెలుగులో మాండలిక సాహిత్యావిర్భావానికి దారిదీసిన పరిస్థితులూ - మాండలిక సాహిత్య రచన ఏయే కాలాల్లో ఏ సామాజికావసరాలను తీర్చడం కోసం చేపట్టడం జరిగిందో విస్తృతంగా వివరించాల్సిన అవసరం మిగిలిపోయింది.

తెలుగులో మిగతా సాహిత్య ప్రక్రియలకన్నా కథా ప్రక్రియే అన్ని ప్రాంతీయ మాండలికాల్లో ఎక్కువగా వెలువడింది. తెలుగు మాండలిక కథకి 50 సంవత్సరాల పైగా చరిత్ర వుంది. ఆధునిక తెలుగు కవిత్వంలో స్తబ్దతని విమర్శకులు గుర్తించారుగానీ ఆధునిక కథ ఎప్పుడూ నిత్యనూతనంగానే పరిఢవిల్లింది. మాండలిక భాష కథకి కొత్త జవజీవాలు అందించింది. మాండలిక కథ పుట్టుకకి ప్రత్యేకమైన చారిత్రకావసరాలు వున్నాయి. అందునా తెలంగాణా నుంచి మాండలిక కథలు ముందు రావడం తర్వాతి కాలంలో అధికంగా రావడం వెనుక కూడా యిక్కడి జనజీవనంలో, ఉత్పత్తి సంబంధాల్లో చోటుచేసుకున్న ఘర్షణే ప్రధాన కారణంగా కనిపిస్తుంది.

తెలంగాణా మాండలిక కథల మీది ప్రత్యేక దృష్టితో చేసిన యీ పరిశోధనలో మాండలిక సాహిత్య సృజనకు కారణమయ్యే సమాజ చలన సూత్రాల్ని వివేచించడానికి కొంత ప్రయత్నం చేశాను. మాండలిక సాహిత్యానికి సంబంధించి నంత వరకూ యీ దారిలో యిది మొదటి ప్రయత్నంగా భావిస్తున్నాను. అందువలన పరిశోధనాంశం మాండలిక కథే అయినప్పటికీ తక్కిన మాండలిక సాహిత్య ప్రక్రియలని కూడా పరిశీలించాల్సిన అవసరం సైతం ఏర్పడింది.

విద్యాలయాల్లో ప్రామాణిక భాషనే మనం నేర్చుకుంటాం. ప్రజల నిత్య వ్యవహారంలో వున్న భాషకంటే అది భిన్నమైంది. అదే భాషలో సాహిత్య నిర్మాణం కూడా జరుగుతుంది. అత్యధిక సంఖ్యాకులైన ప్రజల సంస్కృతికి దూరమైన భాష అది. అందువల్ల సాహిత్య భాష సాంస్కృతిక భాష వేరుగా కనపడుతుంటాయి. ప్రజల సాంస్కృతిక భాష నిరాదరణకు గురయినప్పుడో లేదా సామాజికవసరాలవల్ల సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు తీసుకు వెళ్ళాల్సినప్పుడో సాంస్కృతిక భాషలోనే సాహిత్య సృజన జరుగుతుంది. ప్రామాణిక - మాండలిక భాషా సంబంధాల్ని ఆ దృష్టితో వివేచించాలి. అందుకు ప్రస్తావనగా భాషా మాండలికాల గురించి, తెలుగులో మాండలికాల గురించి కూడా స్పృశించాను.

సాహిత్యం ప్రజలకు చేరువయ్యే క్రమంలోనే మాండలికానికి సాహిత్యంలో స్థానం లభించింది. ఆధునిక కాలంలో సామాజికోద్యమాలు సాహిత్యోద్యమాలకు దారి తీయడం - ఆ ఉద్యమాల ప్రభావంతో మాండలికంలో సాహిత్య సృజన జరగడం మొదలైనవన్నీ ఒక క్రమంలో జరిగాయి. పెరుగుతున్న ప్రజాస్వామ్య సంస్కృతిలో భాగంగా సాహిత్యంలో మాండలికం నుంచి మాండలికంలో సాహిత్య రచనవైపు ప్రయాణం సాగింది.

తెలంగాణా మాండలికంలో కథారచన విస్తృతంగా జరిగినప్పుడు - మాండలిక సాహిత్యం పరిమితుల గురించి, లక్ష్యాల గురించి, ప్రయోజనాల గురించి తీవ్రంగా చర్చలు జరిగాయి. ఆ చర్చలు మాండలిక కథ పరిపుష్టమవడానికి ఎంతో దోహదం చేశాయి. చర్చల్లో తేలిన నిగ్గు మాండలిక సాహిత్య పరిణామ క్రమంలో మాండలిక కథ ఎదుర్కొన్న యిబ్బందులన్నిటినీ అధిగమించడానికి సైద్ధాంతిక బలాన్ని యిచ్చింది.

తెలంగాణాలో మాండలికకథ పుట్టడానికి, వికసించడానికీ ప్రత్యేకమైన చారిత్రక కారణాలు వున్నాయి. తెలంగాణాలో వచ్చిన ప్రజా ఉద్యమాల నేపథ్యం నుంచి తెలంగాణా కథని వివేచించాలి. తెలంగాణా మాండలిక కథ తెలంగాణాలో రగిలిన ప్రజా ఉద్యమాల చరిత్రని నిర్మించడానికి ఉపయోగపడేంతగా సామాజిక వాస్తవికతని ప్రతిఫలించింది. లిఖిత రూపంలోని కథ ప్రజలకు చేరాలంటే మౌఖికం కావాలనీ అందుకు మాండలికంలో వుండడమే సరైన దారనే అవగాహన రచయితలకి కలగడంతో మాండలిక కథ తెలుగుకథ చరిత్రని కొత్త మలుపు తిప్పింది.

సమాజంలో వేగంగా వచ్చే మార్పులు సాహిత్యం మీద ఎటువంటి ప్రభావాన్ని చూపిస్తాయో గతితార్కికంగా వివేచించడమే ప్రధాన లక్ష్యంగా సాగిన యీ పరిశోధనలో భాషా విశేషాల గురించిన అధ్యయనం చేయలేదు. మాండలిక సాహిత్యాన్ని సామాజికంగానూ, మాండలిక భాషలో సాహిత్య సృజనని జాతుల సమస్యలో భాగంగానూ భావించిన రచయితల నుండి వచ్చిన కథల్లో భాషా విశేషాలని చర్చించడం అసంగతమని భావించిన దృష్ట్యా అందుకు పూనుకోలేదు. అయితే తెలంగాణా మాండలిక కథలు - రైతాంగ - గిరిజన - కార్మిక పోరాటాల నేపథ్యంలో వెలువడినందువల్ల ఆ ఉద్యమాల గురించి స్థూలంగా వివరించాను.

మౌలికంగా నోటినుండి నోటికి మౌఖికంగా ప్రచారమయ్యే సంప్రదాయానికి చెందిన కథ అచ్చు యంత్రాల కారణంగా లిఖిత సంప్రదాయంలో స్థిరపడ్డ అరవై సంవత్సరాల తర్వాత - కథ ప్రజలకు చేరువకావాలంటే మౌఖికం కావాలనే ఆశయంతో, ప్రజా సంస్కృతితో ముడివడి వున్న వారి భాషే అందుకు మాధ్యమంగా ఉపయోగపడుతుందన్న అవగాహనతో, సాహిత్యం ప్రజల బతుకుల్లో మంచి మార్పుని తెచ్చేదై వుండాలన్న నిబద్ధతతో తెలంగాణాలో మాండలిక కథా రచన ఒక ఉద్యమంగా ప్రజా ఉద్యమంలో భాగంగా జరిగింది. అందువల్ల మాండలిక కథ ప్రజాసాహిత్యానికి మారు పేరయింది.

సాహిత్యాన్ని సామాజిక అస్తిత్వంతో అన్వయించి, సమాజ చలన సూత్రాలకనుగుణంగా సాహిత్యంలో మార్పులు చోటుచేసుకుంటాయన్న ఆలోచనతో మాండలిక కథని ప్రజాసాహిత్యంగా పరిగణించడంలో వున్న ఔచిత్యాన్ని అంచనా కట్టటమే ఈ సిద్ధాంత వ్యాస ప్రధానోద్దేశం.

## చివరిగా ఒక మాట -

ఈ సిద్ధాంత వ్యాసాన్ని డాక్టరేట్ డిగ్రీ కోసం తెలుగు విశ్వవిద్యాలయానికి 1993లో సమర్పించాను. ఈ ఏడెనిమిదేళ్ళలో తెలుగు సాహిత్యంలో ఎన్నో మార్పులు చాలా వేగంగా చోటుచేసుకొన్నాయి దళిత - స్త్రీవాద -మైనారిటీ సాహిత్యం విస్తృతంగా వెలువడింది. 'దళిత స్త్రీవాదోద్యమాలు బలపడుతున్న కొద్దీ దళితుల, స్త్రీల భాషకు వ్యక్తీకరణ పద్ధతులకీ అనివార్యంగా ప్రాముఖ్యం ఏర్పడే అవకాశం ఉంద'ని ఈ సిద్ధాంత వ్యాసంలో ఆనాడే పేర్కొన్నాను. స్త్రీవాద సాహిత్యం విషయంలో నా ఊహ పూర్తిగా నిజం కాలేదు గానీ నాగప్ప గారి సుందర్రాజు (మాదిగోడి కతలు), వేముల ఎల్లయ్య (కక్క) లాంటి దళిత రచయితల మాండలిక రచనలు తెలుగుసాహిత్యంలో దళిత భాషనే కాదు దళిత సంస్కృతిని సైతం ఉన్నతీకరించాయి. అంతేగాదు - ఖదీర్‌బాబు (దర్గామిట్టకతలు), స్కైబాబా లాంటి రచయితలు కొంతవరకు మైనారిటీ భాషా సంస్కృతుల్ని ప్రవేశపెట్టగలిగారు.

వివిధ పత్రికల్లో మాండలిక కథలు వెలువడుతూనే వున్నాయి. వాటినన్నిటినీ యిక్కడ క్రోడీకరించడం జరగలేదు. ప్రముఖంగా వినవచ్చిన ఒకరిద్దరు కథకుల గురించి మాత్రం ప్రస్తావించాను. డా॥ బి.దామోదర్‌రావు పూర్తిగా తెలంగాణా మాండలికంలో ఇంట్లో రాసిన 'సింగిడి' కథా సంపుటం పరిశోధనవ్యాసం రాస్తున్న రోజుల్లో లభ్యం కాలేదు. ఆ పుస్తకం అచ్చుపని పూర్తయ్యాక చూడటం వల్ల ఆయా సందర్భాల్లో ప్రస్తావించలేకపోయాను. ఇటువంటివి నా దృష్టికి రానివి మరికొన్ని కూడా ఉండవచ్చు.

ఆ రోజుల్లో మాండలిక కథలు విస్తృతంగా రాసిన రచయితలు ఆ తరువాత రాయడం మానేశారు. లేదా పత్రికాభాషలోకి మారిపోయారు. అడపాతడపా మాండలికం మీద యింకా చర్చ జరుగుతూనే ఉంది. చర్చ జరిగిన ప్రతీసారీ వాదనలు వేడిగా సాగుతూనే ఉన్నాయి. అణచివేతకు గురైన ప్రాంతాల భాషా సంస్కృతుల మీద అభివృద్ధి చెందిన ప్రాంతాల భాషా సంస్కృతుల ఆధిపత్యాన్ని నిరసిస్తూ ప్రజా ఉద్యమాలు బలపడుతున్న నేపథ్యంలో వెలువడుతున్న ఈ పుస్తకం ఆ దారిలో ఒక ఆలోచన రేకెత్తించడానికి తోడ్పడగలదనే నా నమ్మకం.

హైదరాబాద్
**9-1-2002**

- ఎ.కె. ప్రభాకర్

# 'మంది భాష'లో రాయని రచన ప్రజాసాహిత్యం కాలేదు

ప్రతి అంశానికి పునాది ఒకటి ఉంటుంది. దాన్ని అడుగుమట్టం అంటాం. దాన్ని అంటుకోవడమే మనిషి చేసే ప్రయత్నం. అప్పుడే పారం ముట్టినట్లు.

ఏ ప్రజాస్వామ్య, రాజకీయ సిద్ధాంతమైనా "ప్రజలపక్షం" (Pro-People) ఉండాలి. ఏ ప్రజలు అని ప్రశ్నించుకుంటే సమాజం అట్టడుగు పొరల్లో ఉన్నవారు అని జవాబు. బూర్జువా పార్టీలూ 'ప్రజలు' అంటాయి. వామపక్షపార్టీలు, విప్లవపార్టీలు, గ్రూపులూ 'ప్రజలు'అంటాయి. అడుగు మట్టం పునాదిగా ఉన్న ప్రజలు మన 'ప్రజలు' కావాలి. వాళ్ళని ప్రధానం చేసి ఆలోచించినప్పుడు ఏ సిద్ధాంతమైనా మంచి ఫలితాన్నిస్తుంది. అంటే పునాదిని ఉపరితలం చేయాలి. మన భాషా కళా సాహిత్య సంస్కృతులు ఇందుకు ఉపకరించాలి. ప్రజానామ జపంతో ఒక సమూహం, ఒక కులవర్గం అధినాయకులలౌతున్నారు. కింది ప్రజలెవరో వారి సంస్కృతి తిండి అలవాట్లు, ఆటపాటలు, సంప్రదాయాలు, కులం కట్టుబాట్లు, ఇతరకులాలతో వారి సంబంధాలు, సామాజిక స్థాయి తెలియకుండా వారి గురించి రాయడానికి రచయితలు, వారి భాషా స్వరూపం తెలియకుండానే భాషపై విశ్లేషణలు చేయడానికి పరిశోధకులు పోటీ పడుతున్నారు.

భాష సామాజికం. సమాజంలో వర్గాలు, కులాలు, స్థాయి, అంతరాలు ఉన్నట్లే భాషలో కూడా అవి కనిపిస్తాయి. ఇన్ని రకాల సాహిత్యం కూడా ఉంది. ఐతే సాహిత్యం గురించి మాట్లాడుకునేప్పుడు రాత, నోటి సాహిత్యాలను విడదీయవలసి ఉంది. చాలా కులాలకి లిఖిత, నోటి సాహిత్యాలు రెండూ ఉన్నాయి. అలాగే భాష కూడా. రాతసాహిత్యం చదువుకున్న వర్గం వారికే పరిమితం. నోటిసాహిత్యం మాత్రం ప్రజలందరిదీ. చదువుకున్న వారికీ పండితులకీ, సాదా జనం అందరికీ అర్థమవుతుంది. ఆ భాషని అన్ని కాలాల్లోనూ ఆనందించారు. అదే భాషని లిఖిత రూపంలోకి మార్చితే మాత్రం దాన్ని 'మాండలికం' అంటున్నాం. అర్థం కావడం లేదంటున్నాం.

అలా ఎందుకంటున్నాం?

1. సాహిత్యం భాష ఇలా ఉండాలని నిర్దేశించుకుంటున్నాం.

2. పరిచయమైన పాత పద్ధతిలోనే ఎందుకు లేదని, కోపగించుకొంటున్నాం.

3. సాహిత్య రూపంలోకి ఈ భాష వస్తున్నందుకు ఈసడించుకుంటున్నాం.

4. అడుగువర్గాల వారి సాహిత్య ప్రవేశంపై ఆంక్షలు విధిస్తున్నాం.

5. ఈ సాహిత్యం వెలువడ్డానికి వెనుక గల రాజకీయ ప్రయోజనాన్ని వ్యతిరేకిస్తున్నాం.

6. ఇంతవరకు మనం చూడని వస్తువు, సంస్కృతి, జీవితం మనతో అక్షరరూపంలో సంభాషించడం వల్ల బెదురుతున్నాం.

అన్నీ వెరసి ప్రజలభాషపై చిన్నచూపు ఏర్పడుతుంది. ప్రజాస్వామ్య భావాలుగల వారు సైతం ఈ కోవ సాహిత్యాన్ని కొన్ని రిజర్వేషన్లతో చూడ్డం వెనకగల స్పష్టమైన కారణాలు - బ్రాహ్మణ్యం, వర్గస్వభావాలే.

కుల/ ప్రాంతాల/ వృత్తి భాషా సాహిత్యాలను తెలుగు సాహిత్యం ఎన్నడూ స్వాగతించలేదు. అందులో తగిన భావవాతావరణం ఎన్నడూ కల్పించలేదు. పైగా అవి ఇతరేతర కారణాల వల్ల బయటకు వస్తున్న ప్రతి సందర్భంలో ఏదో ఒక తొంపు పెట్టడం....... అలా శతాబ్దాలు జరిగిపోయాయి.

నిజానికి వ్యావహారిక భాషావాదం గురజాడ రచనలు వచ్చాకనే ఊపందుకుంది. ఆ రచనలు ఆధునిక భావాలను ఆవిష్కరించాయి. ఛాందసవాదాన్ని విమర్శించాయి. ఆ కారణం వల్ల ఆ రచనలని భాష పేరుతో ఈసడించారు. గురజాడ రచనలని సమర్థించేవారిపై పండితులు ఖండన మండనలు చేశారు. అతడు కవేకాదు పొమ్మన్నారు.

గిడుగులాంటివారు సామాజిక మత సంస్కరణల వల్ల ప్రభావితులైన కాలం అది. పండిత/ఛాందస భాషలో కొత్త సాహిత్యం మొలకెత్తలేదనే విషయం పాపం గిడుగువారికి తెలుసు. ఆ తెలిసిందాన్నే చెప్పాడు. చెప్పిన విషయాన్ని వాదించాడు. మరికొంతమంది ఆ వాదనలో నిజం ఉందని నమ్మారు. అంతేగాని గురజాడ పరిమిత అభ్యుదయభావాలతో గిడుగుకి ఏమాత్రం అంగీకారం లేదు. ఉంటే కన్యాశుల్కంలో గల రిక్షావాల, బైరాగి తదితర నిమ్నకులాలకి చెందిన వారికి కూడా ప్రత్యేకమైన భాష కూడా వెలుగు చూడాలని అనేవాడు. అలా అనకుండా ఆయన "తుదివిన్నపం" వ్యాసంలో శిష్టజన వ్యావహారిక భాషనే సమర్థించాడు. అంతేగాని "గొల్లలు మొదలైన పామరులు పలికే గ్రామ్యభాష వ్యవహారికభాష కాదు అని తానే చెప్పుకొన్నాడు. ఇదే అభిప్రాయాన్ని పసుమర్తి కృష్ణమూర్తి రాసిన 'గృహలక్ష్మి కంఠాభరణము' (1935) గ్రంథనికి గిడుగు పీఠిక రాస్తూ వ్యవహారిక భాష అంటే "మా అమ్మ, అక్కయ్య

మొదలైన వాళ్ళు నన్నే భాషలో పెంచి పెద్దవాణ్ణి చేశారో అదే భాష. భాష. అనగా లౌకికభాష. లోకం అనగా శిష్టులు. లౌకిక శబ్దాలు అనగా శిష్టసంఘంలో నలుగురికి తెలిసేమాటలు. తెలియడమనగా చెవినిపడగానే మనస్సులో అర్థము స్ఫురించడము" అని విస్పష్టంగా రాశాడు. నేను తెలుగు అకాడమిలో ప్రచురణ సహాయకుడిగా ఉన్నప్పుడు వేసిన "గ్రాంథిక వ్యావహారిక వాదసూచిక" (1980) ప్రాజెక్టులో పనిచేసిన కాలం నుండి గిడుగువారి భాషా పరిమితులు నాకు అర్థమయ్యాయి. భాషోద్యమం లోగిడుగు తన కుటుంబం, కులం, తన చుట్టూ ఆనాడు ఉన్న బంధువుల భాష గురించే తంటాలు పడ్డాడు. ఛాందసుల ప్రయోజనాన్ని పరిరక్షించే గ్రాంధిక భాష స్థానే దీన్ని నిలపాలనుకున్నాడని ఇవ్వాళ గట్టిగా విశ్వసిస్తున్నాను. ఇలా అనడంలో గిడుగుని తప్పు పట్టడం కాదు. కాని ఆయన భాషని మధ్యతరగతి శిష్టుల వరకు మాత్రమే ఆలోచించాడనీ, అది ఆయన పరిమితి అనీ గుర్తించక తప్పదు.

**2**

ఇదే భాషా ధోరణిని ఆనాటి స్వాతంత్ర్యోద్యమం, సోషలిస్టు ఉద్యమాలు, జమీందారీ వ్యతిరేక పోరాటం, వామపక్ష పోరాటాలు పాటించాయని చెప్పక తప్పదు. ఐతే కొందరు ప్రజానాట్యమండలి కవులు గానరూపంలో దేశీయ బాణీలు స్వీకరించి పోరాట ప్రజల జీవిత చిత్రణ చేశారు. నిజానికి చదువుకున్న శిష్ట వర్గంలోని రచయితలే ఎక్కువగా రచనలు చేశారు. వీళ్ళే సమీక్షకులుగా, విమర్శకులుగా, పత్రికా సంపాదకులుగా రచయిత సంఘాల పెద్దలుగా వ్యవహరించారు.

సాహిత్య రంగంలో కిందివర్గాల వారిని ప్రోత్సహించి వారితో జవజీవాలున్న కొత్త కథావస్తువుని రాయించే ప్రయత్నం జరగలేదు. ఈ పార్శ్వంలో దళిత రచయితలని కూడా పనిగట్టుకుని ప్రోత్సహించే ప్రణాళిక లేకపోవడం వల్ల ఒకే వర్గ కుల రచయితలు గుర్తింపుపొందారు. అధవా ఒకరిద్దరు ఇతరులుంటే వారికి సాహిత్య చరిత్రలో గుర్తింపు లేకుండా పోయింది.

1970 తరువాత అటు శ్రీకాకుళం నుండి ఇటు తెలంగాణావరకు సాగిన విప్లవ పోరాటాల కనుబంధించి కింది స్థాయినుండి రచయితలు నాగేటి చాళ్ళను చీల్చుకుని వచ్చారు. సింగరేణి బొగ్గుగనుల్లోంచి నల్లవజ్రానికి అంటిన భాషనీ, వస్తువుని తోడు తెచ్చారు. గ్రామీణ వ్యవస్థలోని "మందిభాష" సాహిత్య మకుటమైంది. వ్యావహారిక భాషోద్యమం కాలం లాగే ఇప్పుడూ మాండలిక భాషపై చర్చలు పెరిగాయి. మేం మాకు తెలిసిన భాషలో కథలు రాస్తామని రచయితలు కరాఖండిగా చెప్పడంతో

ప్రజారాజకీయాలంటే పడని వర్గకులాలు ఆ సాహిత్యాన్ని 'అసాహిత్యం' అన్నారు. అర్థం కావడం లేదన్నారు. చర్చలకు గురిచేశారు. విప్లవకథని మాండలికం పేరుతో పక్కన పెట్టడానికి ఒకరకమైన నిశ్శబ్దం పాటింపబడింది. ఐనా జీవధాతువు లున్నందువల్ల అది బతికి బట్టకట్టి తన అస్థిత్వాన్ని నిలుపుకోగలిగింది.

కాని ఇటీవలి కాలంలో మాండలిక భాష పై చులకనభావం ప్రదర్శితం కావడం ప్రాంతీయత ఆధిపత్య భావ ప్రకటనగా చెప్పుకోవచ్చును. టీవీ, సినిమా మాధ్యమాల్లో మాండలిక /ప్రాంతీయ భాషల్ని ఎకసెక్కం చేయడం మొదటిసారిగా పెద్ద ఎత్తున జరుగుతోంది. ఇక్కడే కొత్త రాజకీయాలు రాజుకుంటున్న సమయమిది.

**3**

భాష సహమానవుల మధ్య వినిమయ బాంధవ్యం. ఒకే ఆచార సంప్రదాయాలు, నమ్మకాలు, విశ్వాసాలు, ఆశనిరాశలు, పోరాటాలు గల మనుషుల మధ్య భాష అర్థోపయోగమవుతోంది. ఇవన్నీ వేరైతే భాష అర్థం కాదు. అర్థం కానప్పుడే తమ కర్థమయ్యే పై అంశాలను ఇతరుల నెత్తిన రుద్దాలనుకుంటారు. అందుకు ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నం సుఖంగా సాఫల్యం కాకపోతే బలవంతం చేస్తారు. నియంతల్లా ప్రవర్తిస్తారు.

తాము వ్యక్తీకరించే భావంలో ఆధిక్యతని ప్రదర్శిస్తారు. ఆ ప్రదర్శన కోసం విలువల్ని రుద్దాలని ప్రయత్నిస్తారు. ప్రచారమాధ్యమాలను ఉపయోగించి తమ గొప్పతనాన్ని కాకుండా ఇతరుల భాషా సంస్కృతుల్ని తక్కువకి కుదిస్తారు. తమ అహంభావాన్ని తమ వర్గంలో, కులంలోంచి బయటకు తీసి ఆధిక్యత జిగురుని భాషకి అద్దుతారు.

ఎవరికైనా తన మాతృ భాషే గొప్పది. నా భాష గొప్పది అనలేనితనం నీ భాష తక్కువది అని పైకే అనేలా చేస్తుంది. అక్కడే పేచీ వస్తుంది. ఏ రూపంలో ఉన్నా 'మాండలిక భాష' కి ఈ వర్గ సమాజంలో గౌరవం తక్కువే.

**4**

వేల ఏండ్ల నుండి పాళీ ప్రాకృతాలు తెలుగు భాషతో సహజీవనం జరిపాయి. ఆ తరువాత సంస్కృత భాష కబంధహస్తాల్లో తెలుగుభాష కృంగి కృశించింది. ఆ మధ్య అటు ఆంగ్లం ఇటు ఉరుదూ భాషల విషకౌగిలిలో నలిగి చివరికి పోరాటాల ఫలితంగా స్వేచ్ఛ పొందింది తెలుగుభాష. ఈ భాషని తెలుగు ప్రజలు ఎంతో సంయమనంతో కాపాడుకున్నారు. ఆనాడు నన్నయ కాలానికి పండిత వర్గానికి పరిమితమై సంస్కృత

భూయిష్టమైన తెలుగు పాల్కురికికి దేశీ తెలుగుగా అన్నమయ్యకి తియ్యని తెలుగుగా వేమనకి తేటతెలుగుగా వారి రచనల్లో భద్రంగా ఒదిగిపోయింది. ఈ రచనలన్నీ మాండలిక భాషల్లో ఉండడం గమనార్హం. ఈ భాషని కాపాడుకున్నది ప్రజారాశులే. వీళ్ళ నిత్యవ్యవహారంలో ఉన్న 'ప్రజల తెలుగు' మీద పండిత తెలుగు భారాన్ని మోపారు. కృత్రిమ సాహిత్య భాష తయారు చేసి నోటి సాహిత్యం పైకి ఎగదోశారు. జానపద భాష అని పేరు పెట్టి దరుల్లో దాచేశారు. మాండలిక భాషని - దేశీభాష, శిష్టవ్యవహారిక భాష, వ్యవహారికభాష, వాడుకభాష, గ్రామ్యభాష, పల్లెభాష, లౌకికభాష, సామాన్యభాష, కొత్తభాష, ప్రాంతీయభాష, అపభాష అశిష్టభాష, మౌఖిక/నోటిభాష, ప్రజల భాష అని ఎన్నో విధాలుగా ఎన్నో రకాల పదాల్తో పిలిచారు.

ఏ పదం వాడిన అర్థం ఒకటే. మాండలిక భాష మాకు అర్థం కాదన్నారు. క్లిష్టం అన్నారు. మాండలిక పదాలు మారుతుంటాయి కదా అన్నారు. జిల్లాలో ఎన్నో రూపాలుంటాయన్నారు. వాడుతున్న ప్రాంతంలోనే అందరికీ అర్థం అవుతుందా అని ప్రశ్నించారు. ఉచ్చారణ వేర్వేరుగా ఉంటుందని శాస్త్రం చెప్పారు. పద స్వరూపం చాలా రకాలు అని దబాయించారు. భాషా స్వరూపస్వభావాలు తెలసిన విజ్ఞులు సైతం సాహిత్యానికి మాండలిక భాషని ఉపయోగించడం ఇష్టం లేక ఎన్నో తొంపులు పెట్టారు.

అసలే వెనకబడిన ప్రాంతం. అక్కడున్న వెనక పడిన కులాల నుండి వచ్చిన రచయితలకి ఏం చేయాలో పాలు పోలేదు. కొందరు బిక్కమొహం వేశారు. మరికొందరు పరీక్షకు వెళ్ళే విద్యార్థుల్లా చేతులు కట్టుకొని నిల్చున్నారు. ఏది ఏమైనా వాళ్ళకి ప్రోత్సాహకరమైన వాతావరణం ఈ నాటికీ లేదు. వీళ్ళ తరపున నిలబడి మాట్లాడగలిగిన రచయితల సంఘాలకు ఈ విషయాలు చాలా అల్పంగా కనిపిస్తాయి. సాహిత్య విషయాల కన్నా సైద్ధాంతికాంశాలే వారికి ప్రాధాన్యం. స్టేట్ రెప్రెషన్ ఖండించడం ఎంత ముఖ్యమో భాష ఆధిపత్య రూపాల్ని ఖండించడం మరింత అవసరం. లేదా రెంటికి సమప్రాధాన్యమైనా ఇవ్వడం విజ్ఞత.

వ్యావహారిక భాషగా అభివృద్ధి చెందిన పత్రికల భాషని వాడుతున్న ప్రాంతంలోని మాండలికభాష అస్థిత్వాన్ని కావాలని గుర్తించక పోవడం మరో అపశ్రుతి.

మాండలిక భాషని ప్రోత్సహించకపోతే ప్రజాసాహిత్యం రూపొందదు. ప్రజలే రచయితలు కావాలి - ప్రజలకోసం రచయితలు సాహిత్యాన్ని సృష్టించడం కన్నా వారినే రచయితలుగా చేయడం క్లిష్టమైనా - అనివార్యమే. మాండలిక భాషే వారి మాతృ భాష, కానీ ప్రామాణిక తెలుగుభాషలోనే రాసి దాన్ని సొంతం చేసుకొమ్మనడం ఒక రకంగా పులుముడు వ్యవహారమే.

శిష్ట వర్గకులం రచయిత తనపేరు కోసం, స్వీయభావ వ్యక్తీకరణ కోసమే రాస్తాడు. అంతేగాని ప్రజల మధ్యలోకి వెళ్ళి భాషనీ, యాసనీ, మాండలికాన్ని గ్రహించే నేర్పూ ఓర్పులు వారికి లేవు. సైద్ధాంతిక నిబద్ధత పాటింపే "ప్రజలమధ్య ప్రజలకోసం" అన్న అంశం నినాద ప్రాయమైంది. కేవలం స్థానికంగా ఉన్న కిందివర్గాల రచయితలు కొందరు మాండలికంలో రచనలు చేస్తున్నారే తప్ప అన్య అగ్రజాలు ఈ రంగం నుండి నిష్క్రమిస్తున్నారు. "ప్రజలకు ఎడంగా ఉండడం వల్ల, దొల్లగా జీవించడం వల్ల వారికి ప్రజల భాషతో పరిచయం లేదు. ఆ కారణంగా వారి రచన లోని భాష చప్పగా ఉండడమే కాక, వాటిలో వారు స్వయంగా సృష్టించుకున్న విలక్షణమైన నుడికారాలు ప్రజల నుడికారాలకు విరుద్ధంగా ఉన్నాయి.... ఐక్యత సాధించడానికి వాళ్ళు చిత్తశుద్ధితో ప్రజలభాష నేర్చుకోవాలి" అని మావో 'కళలు సారసత్వం ఎవరికోసం' వ్యాసంలో స్పష్టం చేశాడు. ఉపన్యాసవేదికల పైనే తప్ప నిజజీవితంలో నేర్చుకోవడానికి వెళ్ళిన నాగరిక రచయితలు ఈ కాలంలో లేరంటే అతిశయోక్తి కాదు. ప్రజల ముంగిళ్ళకి వెళ్ళని వాడు ప్రజలభాష, జీవితం గురించి రాసిన రచనలపై తీర్పునిచ్చే స్థాయిల ఉండడం కన్నా విచారకరమైన విషయం మరోటి లేదు. రచనా వ్యాసంగంలో కన్నా రచనేతర వ్యాపకాల్లో ఆధిపత్యాన్ని నెరపే రచయితల కళ్ళు తెరపించాల్సిన బాధ్యత నగరేతర ప్రాంతాల్లోని రచయితల పైనే ఉంది. అయితే వీళ్ళు Un organised గా ఉండడం ఒక శాపం.

ఐతే నగర ప్రాంత రచయితలు తామురాసేది కూడా ప్రజాసాహిత్యమే అంటారు. ప్రజల కోసమే రాస్తున్నాంకదా అని వారి భావన. అది ఎంతమాత్రం సత్యం కాదు. ప్రజలభాష లేకుండా రాసే రచన అయినా అది వృధానే. విప్లవ పండిత వర్గాలకి మాత్రమే ఉపయోగపడే రచనని సామాన్య ప్రజల కోసమని చెప్పడం బుకాయించడమే.

సంస్కృతంలో రాసినా, గ్రాంధిక భాషలో రాసినా అది ప్రజాసాహిత్యం కాదు. ప్రజలకి చేరువైన భాషలో రాయడమొక్కటే గీటురాయి. అది మాత్రమే Pro-People Literature. ఇలాంటి సాహిత్యం రాయడం కష్టం. కాని కృషి చేసి రాస్తే మాత్రం అది ఎంతో వైవిధ్యపూరితంగా, నవ్యంగా, శక్తి మంతంగా ఉంటుంది. ఇలాంటి రచనలు చూసి, విని ప్రజలు తమ గురించి పట్టించుకునే రచయితలున్నారని సంతోషిస్తారు. ఆ రకంగా వారు ఉద్యమాన్ని నమ్ముతారు. దాన్ని ముందుకు తీసుకుపోగలరు. కేడర్‌లో ఉండికాయలు కాసిన చేతులు రాసిన రాతల్ని తమ కృషిగా రాజధాని రచయితలు మలుచుకోవడం చెట్టుపేరుతో కాయలు చూపడమే.

**5**

ఇది భాషా రాజకీయాల కాలం. తెలుగు జాతి భాష అయిన "తెలుగు" (సినిమా, పత్రికల భాష) కీ వివిధ ప్రాంతాలలోని వెనకబడిన వాళ్ళ భాషకీ అంతరం పెరుగుతున్నది. ఈ అంతరం ఆర్థిక, రాజకీయ రంగాలలో స్పష్టంగా కనిపిస్తున్నది. వలస వచ్చిన వర్గాలు స్థానిక ప్రజలని బలవంతపు వలసలకి లోను చేయడం, భూమిని ఖాళీ చేయించడం, అన్యాక్రాంతం చేయడం సామ్రాజ్యవాద యుద్ధం లాంటిదే. ఐతే విదేశీయులైన మహమ్మదీయులు, పరాసులు, ఆంగ్లేయులు చేసిన యుద్ధం కంటే సహభాషీయులు చేసే యుద్ధ దోపిడిలో భౌతికంగా నీరు, భూమి, గాలి, చెట్టు చేమా పక్షులే కాదు భాష, యాస, ఆట, పాటలు కూడా చిత్రవధలకి గురవుతున్నాయి. ఇది అత్యాధునిక యుద్ధవ్యూహం. ధనికవర్గం, జాతీయస్థాయి బడా బాబులు, విదేశీ శక్తులు కలసికట్టుగా చేస్తున్న యుద్ధమిది. ఇక్కడ ఇప్పుడు భాష క్షత్రగాత్రమైంది.

**6**

అలాంటి మాండలిక భాషపై ఎంతో పరిశోధించి చక్కని పరిశీలనలతో రాసిన గ్రంథం ఇది. సాహిత్యపరంగా, భాషా శాస్త్ర అధ్యాయనానికి సామాజిక దృక్పథం జోడించిన తీరు బాగుంది. ఆ రకంగా పునాదిని స్పర్శిస్తూ పారం ముట్టడానికి చేసిన ప్రయత్నంలో మాండలిక భాషపై ఇతర భాషా ప్రభావాలు (పాళీ, ప్రాకృతం, ఉరుదూ ఇత్యాది) ఉన్నాయా లేక అది పూర్తిగా ప్రజల సృజనేనా అని చర్చిస్తే బాగుండేది. మౌఖికంగా ఉన్న మాండలిక భాషలో తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి కూడా ఆయా సందర్భాల్లో చర్చిస్తే ఉపయోగపడేది. నిజానికి మాండలిక రచనల్ని కిందివర్గం ప్రజలు ఎలా స్వీకరిస్తున్నారు - వారి మనోభిప్రాయాలు ఎలా ఉన్నాయని 'పాఠకుల'తో ఇంటర్వ్యూని / చర్చలని గాని నిర్వహిస్తే మాండలికభాష అవసరం, ప్రయోజనం గురించి మరింత లోతైన అవగాహన పెరిగే వీలుండేది. ఈ అంశాలు రచయితే చేయనవసరం లేదు. ఈ గ్రంథం చదివిన వారైనా చేయవచ్చు. అందుకు ఉసి కొల్పే గుణం గ్రంథానికి ఉంది. అలా ఆలోచనలు రేకెత్తించడమే మంచి గ్రంథం చేసే పని. అది సాధించినందుకు ప్రభాకర్‌ని అభినందిస్తున్నాను.

హైదరాబాద్
31-1-2002

- జయధీర్ తిరుమల రావు

# విషయసూచిక

## మొదటి అధ్యాయం

# మాండలికం - సాహిత్యం

*"The architects of our language are not literary artists, but the masses of people who use the language for purposes.''*

- C. F. Hockett

*A Course in Modern Linguistics.*

# మాండలికం - సాహిత్యం

## మొదటి భాగం

భాష మానవ శ్రమనుంచి ఆవిర్భవించింది. సామూహిక శ్రమలో మనుష్యుల మధ్య భావ వ్యక్తీకరణ అవసరంగా భాష రూపొందింది. ఆ తరువాత ప్రపంచానికి సంబంధించిన సంచిత మానవజ్ఞానాన్నీ, ఉత్పత్తి అనుభవాన్నీ, సామాజిక జీవితానుభవాన్నీ, ఆలోచనల సారాన్నీ, సాంస్కృతిక విజయాల్నీ, భౌతిక విలువల్నీ, ఆచరణ ఫలితాల్ని నిలువ వుంచుకుని ముందుతరాలకి అందించే ముఖ్యమైన సాధనంగా; సామాజిక సాధనంగా ఎదిగింది. భావ ప్రసార సాధనంగా మొదలైన భాష సంస్కృతి వాహకంగా కూడా పరిణమించింది. అయితే రెండు స్థాయిల్లోనూ భాష సామూహికమే, సామాజికమే - శ్రమలాగానే.

శ్రమ - భాష రెండూ మానవుణ్ణి మిగతా జంతువులనుంచి వేరుచేసి ఒక సామాజిక జీవిని చేశాయి.[1] శ్రమ మనిషిని చేయి తిరగేటట్టుచేస్తే నోరు ధ్వని సంకేతాన్ని మెదడు ఆశించినరీతిలో పలికింది. అంటే మౌలికంగా భాష వాగ్వ్యవహారం, అందునా సామూహిక వాగ్వ్యవహారం. మానవజాతి జీవితావసర సంపదల్ని ఉత్పత్తిచేసే సామూహిక క్రియలో పరస్పర సంబంధాల్ని ఏర్పరచడానికి తప్పనిసరిగా అవసరమైన సాధనం భాష. చేతిసంజ్ఞలనుంచి నోటి సంజ్ఞల రూపం దాల్చి భాష సామూహిక - సామాజిక ఉత్పత్తిని సుసాధ్యం చేయటానికి ఉపయోగపడింది. చారిత్రక అభివృద్ధి క్రమంలో మాట రూప సంజ్ఞల్ని ఏర్పరచుకొని లిఖితంకూడా అయింది.

సంపదని ఉత్పత్తిచేసి అదుపుచేసే క్రమంలోనే మానవ సంస్కృతి రూపుదిద్దుకుంటుంది. ఆ సంస్కృతి సామూహిక జ్ఞాపకాల - అనుభవాల నిధి అయిన భాషద్వారా ప్రసారమవుతుంది.[2] ఆ విధంగా భాష భావ ప్రసార సాధనమేగాక - సంస్కృతి ప్రసార సాధనం కూడా. భావ ప్రసార సాధనంగానూ సంస్కృతి వాహకంగా భాష సామూహికమైనప్పుడు - మానవ సంబంధాల్లో భాగమైనప్పుడు - అది విశాలమైన సమాజంలో వ్యవహారంలో వున్నప్పుడు ఒక సమూహంనుంచి మరొక సమూహానికీ, ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికీ, ఒకకాలంనుంచి మరో కాలానికీ వ్యాప్తి చెందుతుంది, వ్యాపించే దశలో మార్పులకు లోనవుతుంది. మార్పు భాషకి సహజ గుణం.

### భాషలో మార్పు

భాష మార్పుకి లోనుకాకపోతే అది బతికి బట్టకట్టలేదు. సామాజిక సాంస్కృతిక జీవితం మారుతున్నట్లు భాష కూడా మారుతుంది. మానవ సమాజం నుండి భాషని వేరుగా

చూడలేం.[3] భాషలో మార్పు ఎన్నో వైవిధ్యాలకి కారణమవుతుంది. భాషలో వైవిధ్యాన్ని భాషాశాస్త్రజ్ఞులు ప్రాథమికంగా మూడు విధాలుగా పేర్కొన్నారు.[4]

1. వైయక్తిక వాగ్భేదం(Idialect) 2.మాండలికం (Dialect)

3. శైలి(Style)

***1. వైయక్తిక వాగ్భేదం(Idialect):*** ప్రపంచంలో ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకలా మాట్లాడరు. ఒక వ్యక్తి భాషించే పద్ధతులు మరొక వ్యక్తి భాషించే పద్ధతులకంటే భిన్నంగా ఉంటాయి. అవి ఆ వ్యక్తి వైయక్తిక భాషాభేదాల్ని నిరూపిస్తాయి.

***2. మాండలికం(Dialect):*** భాషా వైవిధ్యం ఇద్దరు వ్యక్తుల మధ్యకాక రెండు సమూహాల మధ్య వున్నప్పుడు దాన్ని మాండలికంగా పేర్కొనవచ్చు. వైయక్తిక వాగ్భేదాల సమస్త రూపాల్ని Dialect లేదా మాండలికం అంటారు.

***3. శైలి(Style) :*** వ్యక్తికీ వ్యక్తికీ వైయక్తిక వాగ్భేదం ఉన్నప్పటికీ అదే వ్యక్తి వేరువేరు పరిస్థితుల్లో, వేరువేరు విషయాలగురించి ప్రత్యేక పద్ధతుల్లో మాట్లాడతాడు. ఆ పద్ధతుల్లో ఉండే వైవిధ్యాన్ని శైలి అంటారు.

బూదరాజు రాధాకృష్ణ శైలిని సైతం వైయక్తిక భాషలోనే కలిపేశారు. భాషలో వైవిధ్యంగా ఆరోపణ (Registar)ని కూడా కొంతమంది పేర్కొన్నారు.[6] మరికొంతమంది వైయక్తిక వాగ్వ్యాహారాన్ని ఒక భాషా వైవిధ్యంగా స్వీకరించకుండా మాండలికం, శైలి, ఆరోపణలని మాత్రమే భాషా వైవిధ్యాలుగా గుర్తించారు.[7] వీటన్నిటి పరస్పర సంబంధం గురించి తెలుగులో యింకా విస్తృత పరిశోధన జరగలేదు.

ఆధునిక భాషాశాస్త్రజ్ఞులకంటే ఎంతో ముందుగా సంస్కృతంలో వామనుడు, జయాదిత్యుడు మొ. వ్యాకరణవేత్తలు భాషలో ఏర్పడే మార్పులను శాస్త్రీయంగా విశ్లేషించారు. మనిషికీ మనిషికీ, ఇంటికీ ఇంటికీ, ప్రాంతానికీ ప్రాంతానికీ ఆయా సందర్భాల్లోని మానసిక పరిస్థితిని బట్టి కూడా భాషలో మార్పు ఏర్పడుతుందని తెలియజేశారు.[7a]

రెండు సమూహాల మధ్య ఏర్పడే భాషా వైవిధ్యమైన మాండలికం గురించి ప్రపంచవ్యాప్తంగా గత శతాబ్దినుంచి విస్తృతంగా పరిశోధన జరుగుతోంది. సామాజిక భాషా శాస్త్రజ్ఞులకీ, మాండలిక భాషా శాస్త్రజ్ఞులకి మాండలికం గట్టిపని కల్పించింది. తులనాత్మక - చారిత్రాత్మక భాషాధ్యయనంలో మాండలికాలపైన ప్రత్యేకమైన దృష్టిపడింది. మాండలిక భేదాల గురించి, ప్రామాణిక భాష - మాండలికాల సంబంధం గురించి పరిశోధనలు, చర్చలూ, వాదోపవాదాలు జరిగాయి. వాటిగురించి విచారించే ముందు 'మాండలికం' నిర్వచనం గురించి ఆలోచించాల్సి వుంది.

## మాండలికం - నిర్వచనం

ఇంగ్లీషులో DIALECT అన్న పదానికి సమానార్థకంగా 'మాండలికం' అన్న పదం వ్యవహారంలో స్థిరపడింది. ఈ పదం కూడా ఇంగ్లీషులోకి గ్రీకునుంచి దిగుమతి అయింది. గ్రీకు భాషలో వేర్వేరు ప్రాంతాల్లో వాడుకలో వున్న భిన్న మాండలికాల్లో వచ్చిన సాహిత్యాన్ని గుర్తించడానికి మొదట్లో ఈ పదం ఉపయోగించారు.[8] Encyclopaedia Britanica మాండలికాన్ని ఇలా నిర్వచించింది.

*"A Dialect is a variety of language. The word came from the Ancient Greek dialekto "discourse, language, dialect'' which is derived from dialegesthai "to discourse talk''.*

గ్రీకు భాషలో మాండలికమంటే ప్రాంతీయ భాషాభేదం మాత్రమే. కాని ఫ్రెంచి, ఇంగ్లీషు భాషల్లో దానికి అర్థవిస్తృతి కలిగింది. ప్రాంతీయ భేదాలనే కాకుండా సామాజిక వైరుధ్యాలవల్ల ఏర్పడ్డ భాషావైవిధ్యాన్ని కూడా మాండలికంగానే భావించడం జరిగింది. తెలుగులో కూడా ఈ పద్ధతినే అనుసరిస్తున్నాం.

'మండలం' అన్న శబ్దంనుంచి మాండలికం పుట్టింది. మండలం అంటే ప్రాంతం. నాడు, విషయం, మండలం అనేవి ప్రాంతానికీ, దేశానికీ పర్యాయపదాలుగా వాడటం జరిగింది. అయితే ఆ మండలాలు పరిపాలనా సౌలభ్యం కోసం ఏర్పడిన రాజకీయ మండలాలు.

1987లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రాష్ట్రాన్ని పరిపాలనా వ్యవహారం కోసం మండలాలుగా విభజించింది. ఆ మండలాలు కొన్ని గ్రామాల కలయికతో ఏర్పడ్డాయి. ఈ 'మండలం' పదానికి, భాషాశాస్త్ర దృష్ట్యా ఏర్పడిన 'మండలం' పదానికి అర్థాలు వేరు.

మాండలిక పదం సూర్యరాయాంధ్ర నిఘంటువు, శబ్దరత్నాకరం, శబ్దార్థ చంద్రిక, బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటువుల్లో ఎక్కడా లేదు. మాండలికుడు - అన్న పదానికి మాత్రం ఒక మండలానికి / జిల్లాకి అధికారి అన్న అర్థం కనిపిస్తుంది. భాషకి సంబంధించిన మండలాల్లో కనిపించే భాషాభేదాల్ని 'మాండలికం' అనడం తర్వాతికాలంలోనే జరిగింది.

వ్యావహారిక భాషోద్యమ కాలంలో ప్రాంతీయ భాషాభేదాన్ని వేదం, గిడుగు మొ.వారు 'మాండలీయకం' అని వ్యవహరించేవారు. మాండలికంలో సాహిత్యం వస్తున్న ఈకాలంలో కొందరు 'మాండలీకం' అని కూడా వాడుతున్నారు. భాషాశాస్త్రజ్ఞులు మాత్రం రాష్ట్రాన్ని భాషాభేదాలమీద ఆధారపడి కొన్ని భాషామండలాలుగా విభజించి మండలాల్లో మాట్లాడే భాషనీ, సామాజిక వైరుధ్యాల కారణంగా ఏర్పడ్డ వర్గాలు, కులాలు ప్రాతిపదికగా వచ్చే వైవిధ్యాన్నీ 'మాండలికం' అని పేర్కొంటున్నారు.

"A dictionary of linguistics and Phonetics' లో Dialect అన్నదానికి ఈ విధంగా వివరణ కనిపిస్తుంది.

**Dialect:**

A regionally or Socially distinctive VARIETY of language, identified by a particular set of WORDS and GRAMMATICAL STRUCTURES. Spoken dialects are usually also associated with a distinctive pronunciation or ACCENT. Any language with a resonably large number of speakers will develop dialects; especially if there are geographic barries separating groups of people from each other or if there are divisions of social class.

ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికీ లేదా ఒక వర్గంనుంచి మరో వర్గానికి ఏర్పడే భాషావైవిధ్యాన్ని మాండలికం అని అంటారు. ఆ వైవిధ్యం ఉచ్చారణలోనూ, వ్యాకరణ నిర్మాణంలోనూ, పదాలలోనూ వుండవచ్చు. వ్యాకరణ నిర్మాణ వైవిధ్యం, పదరూప వైవిధ్యం ఒకకాలంనుంచి మరో కాలానికి కూడా ఏర్పడుతుంది.

భాషలో వైవిధ్యం ఏర్పడ్డప్పుడు ఆ వైవిధ్యాల సమాహార రూపాన్ని ప్రత్యేక భాషగా పేర్కొనకుండా, దాన్ని మాండలికం అని వ్యవహరించడంలో ఔచిత్యాన్ని తెలుసుకోవాలంటే భాష మాండలికాల సంబంధాల్ని పరిశీలించాలి.

## భాష - మాండలికం

నిజానికి ఏది భాష? ఏది మాండలికం? అని తేల్చిచెప్పడం కష్టమవుతుంది. ఒక్కో మాండలికం పరిణామ క్రమంలో భాషగా మారుతుంది. ఉదాహరణకి మూలద్రావిడ భాషకి ఒకప్పుడు మాండలికాలుగా వున్న కన్నడ - తెలుగు, తమిళం - మలయాళాలు కాలక్రమేణా ప్రత్యేక భాషలుగా రూపొందాయి. తులనాత్మక భాషాధ్యయనం ఈ విషయాన్ని నిరూపించింది. అటువంటి పరిస్థితుల్లో భాషనీ, మాండలికాన్నీ విభజించడం ఎలా - అన్న ప్రశ్న ఉదయిస్తుంది.

ఇద్దరు వ్యవహర్తలు మాట్లాడుకొంటున్నప్పుడు ఒకరు మాట్లాడే ధ్వనుల సమాహారం మరొకరికి అర్థంకాని పక్షంలో వారిద్దరూ వేరువేరు భాషలు మాట్లాడుతున్నారనీ, భాషావైవిధ్యం వున్నప్పటికీ పరస్పర వ్యక్తీకరణ, భావ ప్రసారం - తేలికగానో కష్టంగానో జరుగుతున్నప్పుడు వారు ఒకే భాషకున్న వేరువేరు మాండలికాలు మాట్లాడుకుంటున్నారనీ చెప్పవచ్చు. మాండలికాల మధ్య వైవిధ్యం ఎక్కువై అవగాహనా రాహిత్యం ఏర్పడ్డప్పుడు అవి ప్రత్యేక భాషలుగా మారిపోతాయి.

ఇందుకు అతివ్యాప్తి, అవ్యాప్తులు వున్నాయి. 'మాండరిన్', కాంటోనీస్, పికింగీస్ అనేవి చైనీస్ భాషకు మాండలికాలుగా పేర్కొంటారు. కానీ ఆ మాండలికాల వ్యవహర్తలు

మాట్లాడుకుంటే ఒకరి భాష మరొకరికి అర్థం కాదు. వాళ్ళంతా 'రాత'లో ఒకే భాషని ఉపయోగిస్తారు. అది చైనీయులందరికీ రాత భాష. ఆ భాషే - ఆ మాండలికాలన్నిటినీ అర్థం కాకపోయినా కలిపి ఉంచుతుంది.

కాబట్టి పరస్పర అవగాహనే భాష - మాండలికాల్ని విడదీయడానికి ఉపయోగించే సాధనం అని చెప్పడం కూడా కష్టమే. దీనికి భిన్నంగా డచ్, జర్మన్ భాషలు వేరువేరు భాషలుగా గుర్తింపబడినా సరిహద్దు ప్రాంతాల్లో ఆ రెండుభాషలూ ఒకే భాషకున్న రెండు మాండలికాలుగా వినిపిస్తాయి. అలాగే స్వీడిష్, నార్వేయన్, డచ్‌భాషలు వేరువేరు భాషలుగా చెలామణి అవుతున్నా ఆ భాషలు మూడు దేశాల వారికీ అర్థమవుతాయి.

భాష 'స్వతంత్రమ' నీ, మాండలికం 'అస్వతంత్రమ' నీ **Olga Akhananove**[9] భావిస్తే భాషకి స్వయం ప్రతిపత్తి వుంటుందని మాండలికానికి స్వయం ప్రతిపత్తి వుండదని **Peter Trudgill**[10] అభిప్రాయపడ్డాడు. మాండలికం భాషకి ఒకపాయే గాని దానికి స్వయం ప్రతిపత్తి వుండదు. దేశ రాజకీయ భౌగోళిక చిత్రపటంలో ఎన్నో కారణాలవల్ల ఒక భాషకి అధికారికంగా గుర్తింపు లభిస్తుంది. దానికి చెందిన మాండలికానికి ఆ గుర్తింపు వుండదు. ఉదా: హిందీ ప్రత్యేక భాషగా అధికారికంగా గుర్తింపు పొంది రాష్ట్రభాషగా కూడా వ్యవహారంలో వుంది. కానీ దానికి మాండలికమైన 'భోజపురి' విస్తృత భూభాగాల్లో ప్రచారంలో వున్నప్పటికీ ప్రత్యేక భాషగా గుర్తింపుపొందలేదు. స్వయం ప్రతిపత్తి కోరుకునే క్రమంలోనే మాండలిక సాహిత్య సృజన జరగవచ్చు. ఏదైనా ఒక భాష సాహిత్యాన్ని సృష్టించగల సామర్థ్యం పొందితే అది భాష అనీ ఆ సామర్థ్యం లేనప్పుడు మాండలికం అనీ కొందరు చెప్తారు''[11] కానీ ఈ అభిప్రాయం సరైందికాదని తోస్తుంది. ఎందుకంటే ఒక భాషకి మాండలికంగా గుర్తింపుపొందిన విస్తృత ప్రచారంగల మాండలికంలో సాహిత్యం రావడం అనేక దేశాల్లో కన్పిస్తుంది. ఇంగ్లీషు మాండలికాల్లో ముఖ్యంగా స్కాటిష్ మాండలికంలో వచ్చిన సాహిత్యం, తెలుగులో వస్తున్న మాండలిక సాహిత్యం ఇందుకు వుదాహరణ. సాహిత్య సృజనా సామర్థ్యం వున్నప్పటికీ మాండలికాలు ప్రత్యేక భాషలుగా రూపొందిన దాఖలాలు లేవు.

మాండలికం ప్రత్యేక భాషాగౌరవం పొందాలంటే తక్కిన సజాతీయాలకంటే భాషాశాస్త్ర దృష్టిలో తగినంత విలక్షణంగా వుండాలి. అందులో విలక్షణ రచనా సంప్రదాయం వుండాలనీ చెబుతారు.[12]

గంటి జోగి సోమయాజి ''ప్రధాన భాషాంతర్గతమయి పరిమిత ప్రదేశాన్ని బట్టిగానీ ఉపయోగిస్తున్న వర్గాన్ని బట్టి గానీ- ఏర్పడి ప్రధాన భాషతో సామీప్యాన్ని నిరూపిస్తూ స్వతంత్రమైన సారస్వతంగానీ నాగరికతగానీ లేకపోవడం మాండలికం ముఖ్యలక్షణం'' అని భాషామాండలికాల మధ్య తేడాని వివరించారు.[13]

ఈ రెండు అభిప్రాయాలద్వారా విలక్షణ రచనా సంప్రదాయం, స్వతంత్రమైన సారస్వతం, నాగరికతా వుంటే భాష అవుతుందనీ అవి లేనప్పుడు ప్రధాన భాషలో భాగంగా మాండలికం వుంటుందనీ వ్యక్తమవుతుంది.

రాజకీయ సరిహద్దులు వేరయినప్పుడు, నాగరికతా సంస్కృతులు వేరయినప్పుడు, సారస్వత వారసత్వం పూర్తిగా వేరయినప్పుడు, అనవగాహన చోటుచేసుకున్నప్పుడు, భిన్న మాండలికాల మధ్య అనుసంధానంగా ఒక ప్రామాణిక భాష లేనప్పుడు, మాండలికం భాషగా స్థిరపడుతుందని తెలుస్తుంది. కానిపక్షంలో అది మాండలికంగానే మిగిలి వుంటుంది. ఈ సూత్రీకరణ ప్రపంచ భాషలన్నిటికీ అన్వయించుకోవచ్చు.

కాబట్టి ఒక భాషకి మాండలికం అని దేన్నయితే వ్యవహరిస్తున్నామో అది ఆ భాషలో ఒక భాగంగానే వుంటుంది తప్పితే దానికి ప్రత్యేక భాషగా రూపొందే స్థాయి, విలక్షణత వుండవని తెలుస్తుంది.

మాండలికాల్లో వచ్చే సాహిత్యం ప్రధాన భాషాసాహిత్యాల్లో ఒక ప్రత్యేకమైన పాయగా వస్తుంది. అయినప్పటికీ ప్రామాణిక భాషా సాహిత్యాలకు మాండలిక సాహిత్యం పరిపోషకంగా కూడా వుంటుంది.

తెలుగులో 'యాస' అన్న పదాన్ని మాండలికానికి పర్యాయపదంగా అలవోకగా వాడటం కనిపిస్తుంది. ఉత్తరాంధ్ర మాండలికాన్ని తెలంగాణా యాస అనీ, కళింగ మాండలికాన్ని (పూర్వాంధ్ర= విశాఖ, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలు) తూర్పుయాస అనీ, ఇలా ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి ఉచ్చారణలో ఉన్న భేదాన్ని యాసగా పేర్కొంటున్నారు. కానీ యాస- మాండలికం రెండూ వేరు.

## మాండలికం - యాస

మాండలికం భాషలో వున్న పద జాలానికీ, వ్యాకరణానికీ, ధ్వనులకీ సంబంధించినదయితే యాస కేవలం ఉచ్చారణకి పరిమితమైనది.Trudgill అభిప్రాయంకూడా ఇదే విషయాన్ని బలపరుస్తుంది.

"The term "dialect' refers, strictly speaking, to differences between kinds of language which are differences of vocabulary and grammar as well as pronounciation. The "accent' on the other hand, refers solely to differences of pronounciation.''

కానీ ఇంగ్లీషులో **slang** అన్నదానికి పర్యాయపదంగా యాసని స్వీకరిస్తూ అపభాష లేదా అశిష్టభాషని యాస అని భాషాశాస్త్రజ్ఞులు పేర్కొంటున్నారు. బొడ్డుపల్లి పురుషోత్తం Webster Dictionaryని ఆధారం చేసుకొని 'యాస' (Slang)ని ఇలా నిర్వచించారు.

''అపభాష లేక అశిష్టభాష (**Slang**) : దీన్నే యాసభాష అని భావిస్తారు. నిత్య వ్యవహారంలో ఎప్పటికప్పుడు మారుతూ సాంప్రదాయికప్రయోగాన్ని తేలికపరచి, అర్థ విపరిణామాల్ని కలిగిన భాష. వ్యావహారిక భాషకున్నంత గౌరవంకానీ, పతితుల భాషకున్న నైచ్యంగాని లేని భాష. ఇందులో చిత్రమైన కాల్పనిక పదాలధికం. ఎప్పటికప్పుడు మారుతుంది''

పురుషోత్తంగారు యాసని మాండలిక భేదంగా కూడా పేర్కొన్నారు.[14]

**F.M.Berezin - Slang** అనేది ఒక ప్రత్యేకమైన పదసంపదతో కూడివున్న కింది తరగతి (**declassed**) వాళ్ళ భావప్రకటనా వైవిధ్యం అనీ, ఆ పదాలు, ఆ వ్యాకరణ పద్ధతీ, ధ్వనులూ వ్యావహారిక భాషనుంచే స్వీకరించడం జరుగుతుందని చెప్పారు.[15]

బూదరాజు రాధాకృష్ణ కావ్యభాషను కొందరు సాహిత్య మాండలికంగానూ, మరికొందరు 'ఏస' (**Slang**)గాను పరిగణిస్తారని పేర్కొన్నారు.[16]

పై మూడు అభిప్రాయాలద్వారా 'యాస'కి సరైన వివరణ లభించడం లేదు. పైగా యివి ఒకదానితో ఒకటి పొంతనలేని అభిప్రాయాలుగా కన్పిస్తున్నాయి. ఒకచోట 'యాస' అపభాష, అశిష్టభాష అనీ, మరొకచోట అది కావ్యభాష అనీ, కింది తరగతి వాళ్ల భాష అనీ, పతితుల భాషకున్న నైచ్యం (?) లేని భాష అనీ, రకరకాలుగా యాసని నిర్వచించడం జరిగింది. అది మాండలికంకన్నా భిన్నమైనదా- అదొక మాండలిక భేదమా అన్నది కూడా స్పష్టపడటం లేదు.

**German Dialect**కి ముందుమాటలో కెల్లర్ మాండలికం-యాసల్ని విభజిస్తూ చెప్పిన మాటల్ని ఇక్కడ పేర్కొనవల్సి వుంది.

''మాండలికాల్లో కూడా అపభాషా ప్రయోగాలు (='ఏస' మాటలు) వినిపిస్తాయి... అపభాష- మాండలికాలు మౌలికంగా భిన్నమైనవి. అపభాషఎప్పుడూ శక్యాభివ్యక్తికి ద్వితీయ రూపమే. దాని ప్రత్యేక లక్షణాలు సాధారణంగా వ్యవహర్తకు తెలుసు. మాండలికం స్వయం సంపూర్ణం; నిర్దిష్టవ్యక్తికి ఏకైకభాష. అపభాష నిర్దిష్టార్థ లక్షణాలకు పరిమితం; దానికి ప్రత్యేకమైన ధ్వనిశాస్త్రం గాని పద నిర్మాణం శాస్త్రంగాని వుండవు.''[17]

ఈ అభిప్రాయం కూడా 'యాస' (అపభాషా) ప్రయోగాలు మాండలికాల్లో వినిపిస్తాయనీ ఆ రెండూ మౌలికంగా భిన్నమైనవని పేర్కొన్నప్పటికీ యాసని సమగ్రంగా నిర్వచించడం లేదు.

అపభాషకు లేదా అశిష్టభాషకు, **Slang**కు 'యాస'ను పర్యాయపదంగా వాడటంలోనే ఈ గందరగోళం ఏర్పడిందని తోస్తుంది.

నిజానికి తెలుగులో 'యాస'ను ఇంగ్లీషులో **Slang** అన్నదానికి పర్యాయపదంగా వాడకుండా కేవలం భిన్న మాండలికాల్లో ఏర్పడే ఉచ్చారణా వైవిధ్యానికి మాత్రమే ఉపయోగించడం మంచిది.

యాస ఉచ్చారణకి సంబంధించినది కాబట్టి 'రాత'లో దాన్ని పట్టుకోలేం. ధ్వనిశాస్త్రంలో ఉచ్చారణకి సంకేతాలేర్పరచుకొన్నా సాహిత్యంలో దాన్ని అచ్చొత్తించడం కష్టం. 'యాస' ద్వారా వ్యవహర్త ఏ ప్రాంతానికి చెందినవాడో చెప్పవచ్చు. అంతమాత్రాన యాస - మాండలికం ఒకటి కావు. మాండలిక లక్షణాల్లో ఒకటైన ఉచ్చారణ భేదమే యాస.

'మాండలిక భేదాలు పద స్వరూపానికీ పదానికీ సంబంధించిన భేదాలు. పలకడంలో తేడావల్ల ఏర్పడే ఉచ్చారణాభేదం యాసా భేదం'[18] అనీ-

'ఏ ప్రాంతపు జనం మాటలోనైనా యాస అక్షరానికతీతం'[19] అనీ కాళీపట్నం రామారావు మాండలిక కథలని విశ్లేషిస్తూ మాండలిక రచయితలు 'యాస' ని అక్షరబద్ధం చేయబోయారనీ అది యితర ప్రాంతాలవారికి అనువదించుకోవడంలో ఇబ్బందయిందనీ పేర్కొన్నారు. ఆవిధంగా 'యాస' ఒక ప్రాంతానికి చెందిన 'విలక్షణమైన' ఉచ్చారణ భేదంగానే రచయితల్లోనూ, విమర్శకుల్లోనూ, పాఠకుల్లోనూ ప్రచారంలో వుంది.

(యాస గురించి ఈ చర్చ అంతా అప్రస్తుతం కాదు. ముందు ముందు 'యాస' అన్న పదాన్ని మాండలికాల్లో వున్న విలక్షణమైన ఉచ్చారణ భేదంగానే ఈ సిద్ధాంత వ్యాసంలో వాడుతున్నాను).

ఉచ్చారణలోగానీ, పద జాలంలోకానీ, వ్యాకరణంలోగానీ భాషలో వైవిధ్యం కలగడానికీ భాషలో మాండలికాలు ఏర్పడ్డానికీ కారణాలు తెలుసుకోవలసి వుంది. అంతేకాదు ఆ కారణాలు మాండలిక భేదాలకి ఎలా అన్వయిస్తాయో కూడా చూడవలసి వుంది.

## మాండలిక భేదాలు – అవి ఏర్పడటానికి కారణాలు

మాండలికం ప్రధానంగా మూడు రకాలు:

1. చారిత్రకం 2. ప్రాంతీయం 3. సాంఘికం

***1. చారిత్రకం :*** కాలక్రమానుసారంగా భాషలో వచ్చే మార్పుల్ని చారిత్రక మాండలికాలుగా పేర్కొంటారు. చారిత్రక మాండలికం ఏర్పడటానికి కారణం ఇతర భాషల ప్రభావం, రాజకీయమైన మార్పులూ ముఖ్యంగా చెప్పుకోవచ్చు. అయితే అవి పదజాలానికి చెందినవి. వ్యాకరణానికి చెందిన మార్పులు, (వాడు - వాండు - వాణ్ణు- వాన్లు - అవన్లు) పదస్వరూపంలో వచ్చిన మార్పులు, అర్థవిపరిణామాలుకూడా చారిత్రక మాండలిక పరిశీలనలోకే వస్తాయి.

***2. ప్రాంతీయం :*** ఒకే కాలంలో ఒక ప్రాంతంలో వున్న వాడుకకీ వేరే ప్రాంతంలో వున్న వాడుకకీ మధ్య పదాల్లోనూ, వ్యాకరణాంశాల్లోనూ తేడాలున్నప్పుడు దాన్ని ప్రాంతీయ మాండలికం అంటారు. (ఉదా: చేసినాడు, చేశాడు, చేసిండు మొ॥; పేడ, పెండ మొ॥; మోట, కపిల మొ.) దీన్ని ఇంగ్లీషులో Regional Dialect అంటారు.

''ప్రజల మధ్య వ్యవహార ప్రాబల్యం సన్నగిల్లడమే (భాషలో) ప్రాంతీయ భేదాలు ఏర్పడటానికి ప్రధాన కారణం. రాజకీయపు సరిహద్దులు, నైసర్గిక సీమలు (పర్వత పంక్తులు, నదులు) కూడా భాషా మండలాలకు పొలిమేరలవుతాయి. వాటికిరువైపుల వున్న వ్యవహర్తలు కలవడం, ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం తరచుగా జరగదు. ఒక ప్రాంతంలో వాడుకలో ఏర్పడ్డ నూతన శబ్దాలు, ధ్వని పరిణామాలూ ఆ ప్రాంతంలోనే వ్యాపించి సరిహద్దు తగిలినచోట ఆగిపోతాయి'' అని భాషాశాస్త్రజ్ఞులు భాషలో ప్రాంతీయ మాండలికాలు ఏర్పడటానికి కారణాలు పేర్కొన్నారు.[20]

ఆదిమ సమాజంలో కూడా గణాల మధ్య సంబంధాలు దూరం కావటం కారణంగా కొత్త మాండలిక భేదాలు ఏర్పడ్డాయనీ అవే కొన్ని తరాల తర్వాత ప్రత్యేక భాషలుగా పరిణమించాయనీ ఏంగిల్స్ అభిప్రాయం. అయితే కొన్ని 'సంచారజాతులు' సుదూర ప్రాంతాల్లో వున్నప్పటికీ పరస్పర సంబంధాల్ని కాపాడుకోవడం ద్వారా వారి భాష పూర్తిగా విడిపోయి భిన్న భాషలుగా పరిణమించక మాండలికాలుగానే మిగిలాయి. ఉదాహరణకి ఎస్కిమో భాష. తూర్పు గ్రీన్‌లాండ్‌లో వున్న ఎస్కిమో జాతి వ్యక్తి సుమారు 5000 కి.మీ దూరంలో వున్న పడమటి అలాస్కాలో వున్న అదే జాతి వ్యక్తితో తన మాతృభాషలో సంభాషణ జరపగలడు. దానికి కారణం వారికున్న సంచారగుణమే. వ్యవహర్తలు సంబంధాలని నిలుపుకోవడం ద్వారా భాషని పూర్తిగా చీలిపోకుండా కాపాడుకోవచ్చని తెలుస్తుంది.

పరస్పర సాంస్కృతిక సంబంధాలు భాషలో ఏర్పడే మార్పుల్ని ప్రచారంచేయడానికి ఉపయోగపడతాయి. దుర్గమారణ్యాలు పర్వతాలు మాండలికాలేర్పడటానికి కారణమయినా - రాకీ పర్వతాలదగ్గర ప్రాక్పశ్చిమ ప్రాంతాల ప్రజలు 'సంత'లద్వారా కలుసుకొని అన్యోన్యావగాహన సాధించి - తమ భాషని అఖండంగా నిలుపుకోగలిగారు.

అలాగే ఈశాన్య న్యూగినీ ద్వీపంలోని మక్లాయ్ తీరంలో ప్రతి గ్రామానికీ మాండలికం వుందనీ, ఆరుమైళ్ళదూరంలో వున్న చిన్న గ్రామాల ప్రజలు ఒకర్నొకరు అర్థం చేసుకోలేరని గేబలెంజ్ మే మలేషియన్ భాషాధ్యయనంలో పేర్కొన్నారు''[21]

తూర్పు పశ్చిమ జర్మనీ దేశాల్లో బెర్లిన్ గోడకవతల, ఇవతల ఎన్ని మాండలిక భాషాలేర్పడ్డాయో - బెర్లిన్‌గోడ కూలిన తర్వాత ఇప్పుడు పరిశీలిస్తే మాండలిక శాస్త్రంలో కొత్త విషయాలు వెలుగులోకొస్తాయి.

ప్రచార సాధనాలు, రవాణా సౌకర్యాలూ అంతగాలేనిరోజుల్లో దట్టమైన అరణ్యాలు, విశాలమైన ఎడారులు, ఎత్తయిన పర్వతాలూ అడ్డంకులై భాషలో మాండలిక భేదాలు ఏర్పడటానికి కారణమయ్యాయి.

అయితే ఇవన్నీ ప్రాంతీయ మాండలికానికి మాత్రమే అన్వయిస్తాంఖ. ప్రాంతీయ మాండలికంతో సమాన ప్రాధాన్యంగల మరొక మాండలిక భేదం - వర్గ మాండలికం. అదే సాంఘికం.

***3. సాంఘికం :*** సమాజంలో వున్న అంతరాలూ, వైరుధ్యాలూ, ఆర్థిక, సాంఘిక అసమానతలూ, సాంస్కృతికమైన తేడాలూ సాంఘిక మాండలికాలు - లేదా వర్గ మాండలికాలు ఏర్పడటానికి కారణమవుతాయి. ప్రాంతీయ మాండలికాన్ని బట్టి వ్యవహర్త ఏ ప్రాంతానికి చెందినవాడో చెప్పినట్లే వర్గ మాండలికాలని బట్టి వ్యవహర్త సాంఘిక స్థాయిని తెలుసుకోవచ్చు. వర్గాలను బట్టి వచ్చే భేదాలు ఒకే ప్రాంతంలోనే ఒకేకాలంలోనే వుండవచ్చు.

పర్వతాలకన్నా ఎత్తైన సామాజికపు అడ్డుగోడలు, నదులకన్నా అగాధమైన ఆర్థిక అంతరాలు వర్గమాండలికాన్ని సృష్టిస్తాయి. ఆఖరికి ఒకే ఊరిలో నివసిస్తున్న ప్రజల మధ్య ఆర్థిక ప్రాతిపదికగా ఏర్పడ్డ అంతరాలు భాషలో వైవిధ్యాన్ని సృష్టిస్తాయి. వీటిని **class dialects** అనీ, **Social dialects** అనీ మరీ కొత్తగా **Socialects** అనీ అంటున్నారు.[21a]

సమాజంలో వ్యక్తులు ఆదాయం, చదువులు, వృత్తులు, వుండే పరిసరాలని బట్టి - కింది తరగతి వాళ్ల - మధ్య తరగతివాళ్ళూ - పై తరగతివాళ్ళూ; చదువుకున్నవాళ్ళు - చదువులేనివాళ్ళు; వ్యవసాయ కార్మికులు; వ్యవసాయానుబంధమైన రకరకాల వృత్తులవాళ్ళు; పట్టణ - గ్రామీణ ప్రాంతీయులు; గిరిజనులు - మైదానవాసులు ఇలా ఎన్నో వర్గాలుగా విడిపోయాం. సమాజం వైరుధ్యాలపుట్టగా తయారయినప్పుడు, వర్గాలుగా విడిపోయినప్పుడు ప్రజల్లో వారివారి జీవిత నేపథ్యానికి అనుగుణమైన 'సంస్కృతి' 'మాట' వేరువేరుగా ఏర్పడతాయి. ఆ మాటల తేడాలన్నీ వర్గమాండలికం కిందికి వస్తాయి. ఇంగ్లీషులో ఈ రంగంలో సూక్ష్మదృష్టితో చాలా విస్తృతమైన పరిశోధన జరిగింది.[22] తెలుగులో వృత్తిపదకోశాల కోసం భిన్న వృత్తులకి చెందిన వర్గ మాండలికాన్ని సేకరించడం ద్వారా కొన్ని మాండలిక పటాల్ని తయారుచేయడం జరిగింది.[22a] కానీ తక్కిన వర్గమాండలిక వైవిధ్యాల గురించి యింకా విస్తృతంగా కృషి జరగాల్సి వుంది.

రెండు ప్రాంతాలమధ్య దూరం ఎక్కువైనకొద్దీ ఆ ప్రజలు మాట్లాడుకునే మాండలికంలో వైవిధ్యం ఎక్కువవుతుంది. ఉదా॥ విశాఖ, శ్రీకాకుళంల భాషకీ, ఆదిలాబాదు, కరీంనగరాల భాషకీ చాలా అంతరం కన్పిస్తుంది. అలాగే రెండు వర్గాల మధ్యసామాజిక వైవిధ్యం ఎంత ఎక్కువగా వుంటే అంత ఎక్కువగానూ మాండలిక వైవిధ్యం ఏర్పడుతుంది. రవాణా, ప్రచార సౌకర్యాలు పెరుగుతున్న కొద్దీ ప్రాంతీయ మాండలికాల మధ్య దూరం తగ్గినట్లే సామాజిక, ఆర్థిక వైరుధ్యాలు తగ్గిన కొద్దీ ఆ కారణంగా ఏర్పడే వర్గమాండలికాల్లో వైవిధ్యం తగ్గుముఖంపట్టి సారూప్యత ఏర్పడే అవకాశాలు వుంటాయి.

ప్రాంతీయ మాండలికాన్ని నిర్వచించినంత తేలిగా వర్గమాండలికాల్ని నిర్వచించలేం. ప్రాంతాలకి సరిహద్దులు గుర్తించినంత తేలికగా సమాజంలో వున్న వర్గాలమధ్య గీతగీసి చూపలేకపోవడమే అందుకు కారణం. శిష్టభాష - శిష్టేతర భాష అని స్థూలదృష్టితో భద్రిరాజు కృష్ణమూర్తిగారి విభజన[23] వర్గ మాండలికాన్ని విభజించడానికి న్యాయం చేయలేదు. పైన చెప్పుకున్నట్టు సమాజంలో వివిధ రకాల వ్యత్యాసాలున్నప్పుడు వర్గమాండలికాల్లో కూడా ఎన్నో రకాల వైవిధ్యాలుంటాయి. పారిశ్రామికీకరణ(industrialisation) పట్టణీకరణ (Urbanisation) ఎక్కువ అవుతున్నకొద్దీ సమాజంలో కొత్త వర్గాలు ఏర్పడతాయి. వర్గ మాండలికాల రూపం కూడా మారుతుంది. కింది తరగతి వాళ్లకి కూడా చదువు అందుబాటులోకి వచ్చాక వారి భాషలో మార్పు రావడం సహజం. మారే సాంఘిక పరిస్థితులు ఒక వూరిలోని వర్గ మాండలికాలపై ఎలా ప్రభావం చూపుతాయో ఒక చిన్న గ్రామాన్ని సర్వే చేస్తూ ఎస్. శివరామమూర్తి ఒక వ్యాసం రాశారు. అయితే తెలుగులో ఈ రంగంలో జరిగిన కృషి తక్కువే. అక్కడ వ్యాసకర్త కులాన్ని ఆకరాలు (Source)గా తీసుకున్నారు.[24]

సామాజిక వైరుధ్యాలు ప్రపంచమంతా ఒకే రీతిలో వుండని కారణంగా కూడా వర్గ మాండలికాల్ని వివరించడం కష్టమనీ భారతదేశంలో అయితే సమాజం కులాలుగా విడిపోయి వుంది గాబట్టి మాండలికాల అధ్యయనం ఇండియాలో తేలిక అనీ Peter Trudgill అభిప్రాయం.[25]

అయితే కులాలనాశ్రయించి వర్గ మాండలికాన్ని అధ్యయనంచేయడం ఎంతవరకు సమంజసమో ఇంకా సూక్ష్మంగా పరిశీలించాల్సివుంది. స్థూలంగా పైకులాల్లో చదువుకున్నవాళ్లు, కిందికులాల్లో చదువుకోలేనివాళ్లు వున్న కారణంగా బ్రాహ్మణ - బ్రాహ్మణేతర మాండలికాల గురించి తమిళంలోనూ, కన్నడంలోనూ కొంత పరిశీలన జరిగింది. కానీ అది సరయిన దృష్టి కాదని కొందరు అభిప్రాయపడుతున్నారు.[26]

నిజానికి శరీర కష్టం చేసే సామాజిక ఉత్పత్తిలో భాగస్వామ్యం వహించే శ్రమజీవుల భాషకూ, శ్రమకు దూరమై సంపదను అనుభవించే విశ్రాంతి వర్గీయుల భాషకు చాలా అంతరం ఉంటుంది. వారి జీవన విధానంలోను సంస్కృతిలోనూ ఉండే వైవిధ్యం భాషలో సైతం చోటు చేసుకుంటుంది. మాదిగభాష, గొల్లభాష, బ్రాహ్మణ భాష ఒకలాగే ఉంటాయని చెప్పడానికి ఈ రోజున భాషావ్యాకర్తలు సాహసించలేరు. ఎన్నో ఉత్పత్తి సాధనాల పేర్లు (కొరముట్లు / పనిముట్లు / అత్యారాలు) కూడా ఉత్పత్తి సంస్కృతితో సంబంధం లేనివాళ్ళకు తెలియవు. చాలా సందర్భాల్లో కొన్ని పదాల ప్రచారం ఆ వృత్తికి సంబంధించిన వారికి మాత్రమే పరిమితమై ఉంటుంది.

తెలుగులో వృత్తిమాండలికాల సేకరణ విస్తృతంగా జరిగింది. వీటికంటే భిన్నంగా యూరప్, అమెరికా ఖండాల్లో సామాజిక భాషావేత్తలు ఎక్కువగా అధ్యయనం చేసిన మరో శాఖ: జాతులు - భాష. ఆ దేశాల్లో తరతరాలుగా బానిసలుగా అణచివేతకు గురై సామాజికంగా దుర్భరజీవితాన్నీ స్వేచ్ఛారాహిత్యాన్నీ అనుభవించి విద్యావకాశాలకు దూరమై సాంస్కృతిక అస్తిత్వాన్ని కూడా కోల్పోయిన నల్లజాతి వారి భాష, వారిమీద అన్నివిధాల ఆధిపత్యం చెలాయించిన తెల్లవారి భాష కంటే విలక్షణంగా కన్పిస్తుంది. భాషలో ఏర్పడ్డ ఈ నలుపు - తెలుపు వైవిధ్యాన్ని గూర్చి - W.Lebove (Language in the inner city), Peter Trudgill (Sociolinguistics), Robbins Burling (English in Black & White), J.L.Dillard (Black English) మొదలైన సామాజిక భాషా శాస్త్రజ్ఞులు విస్తృతంగా పరిశోధన చేశారు.

జాతుల గురించి చెప్పుకునేటప్పుడు - ఆంధ్రదేశంలో వేరువేరు ప్రాంతాల్లో ఎన్నో గిరిజన జాతులు వున్నాయి. గోండు, సవర, కోయ, కోలాం, లంబాడీ, ఎరుకల మొదలైన జాతులప్రజలు తెలుగుని రెండోభాషగా మాట్లాడతారు. వాళ్ళు మాట్లాడే తెలుగుమీద వారి మాతృభాషల ప్రభావాన్ని, వారి సంస్కృతి ప్రభావాన్ని సామాజిక భాషాశాస్త్రవేత్తలు పరిశీలించాల్సి వుంది. తద్వారా ఎన్నో కొత్త విషయాలు వెలికివస్తాయి.

చారిత్రక, ప్రాంతీయ, సాంఘిక (వర్గ) మాండలికాలేగాక భాషలో మరికొన్ని వైవిధ్యాలు కూడా ఏర్పడవచ్చు.

ఉదా: రాసేభాష / వాడుకభాష; సాహిత్యభాష / దైనందిన వ్యవహార భాష; ఉపన్యాస భాష/ సంభాషణ భాష; గృహ వ్యవహారం / బహిరంగ వ్యవహారం మొ. ఈ ద్వంద్వాలే కాకుండా భాషావైవిధ్యంలో - వయోలింగ భేదాలుకూడా ముఖ్యమైన పాత్ర వహిస్తాయి. స్త్రీల భాష, పిల్లల భాష, వృద్ధుల భాష గురించికూడా భాషాశాస్త్రజ్ఞులు వివేచన చేశారు.

రెండు ప్రాంతీయ మాండలికాల మధ్య లేదా వర్గ మాండలికాల మధ్య వైవిధ్యం ఉన్నప్పటికీ వ్యవహర్తలు పరస్పరం అర్థం చేసుకోవడానికి వీలు కల్గించే ఒక 'అనుసంధానగుణం' ఆ మాండలికాల్ని ప్రత్యేక భాషలుగా విడిపోకుండా చేస్తుంది. రెండు మాండలికాల్లో కనిపించే కొన్ని సమాన లక్షణాలు ఆ అనుసంధానాన్ని కలిగిస్తాయి. ఇంగ్లీషులో దీన్నిRedundacy అని పేర్కొంటున్నారు.[27] ఈ అనుసంధానగుణం రెండు విభిన్న మాండలిక వ్యవహర్తల మధ్య అవగాహన కలుగజేస్తుంది - యాసలో, పదరూపంలో, వ్యాకరణంలో వైవిధ్యం వున్నప్పటికీ అవగాహన సాధ్యమవుతుంది.

## ప్రాంతీయ వర్గ మాండలికాల సంబంధం

ప్రాంతాలు వేరైనాచదువుకున్న ఉన్నత వర్గాల్లో ప్రయత్నపూర్వకంగా మాండలికాలని పరిహరిస్తూ భాషలో ఏకసూత్రతని సాధించే ప్రయత్నం జరుగుతుంది. ఆ ప్రయత్నమే

ప్రామాణిక భాషలో ఏకరూపతని సాధించడానికి వీలు కలిగిస్తుంది. కాబట్టి చదువుకున్న ఉన్నతవర్గాల్లో ప్రాంతీయ మాండలిక వైవిధ్యం తక్కువగా వుంటుంది. చదువులేని కింది తరగతి వర్గాల్లో ఎక్కువగా వుంటుంది. దూర ప్రాంతాల్లో స్థిరంగా ఒకచోట నివసించే కింది తరగతి ప్రజల మధ్య సంబంధాలు తక్కువగా వుండటం ఇందుకు కారణం. సామాజిక స్థాయి పెరిగే కొద్దీ మాండలిక భేదాలు ప్రామాణిక భాషకి దగ్గర కావడం కూడా కనిపిస్తుంది.[28]

ఉదా॥ 'చక్రం' అన్న పదాన్ని తీసుకున్నప్పుడు మన సమాజంలో చదువుకున్న ఉన్నత వర్గాల వారంతా దాదాపు అన్ని ప్రాంతాల్లోనూ (భాషా మండలాల్లోనూ) చెక్రం (చక్రం) అని వ్యవహరిస్తారు. కానీ కింది తరగతివాళ్ల వ్యవహారంలో దీనికి - ఉండ, గాను, గాలు, గారె, గిర్ర, గిల్ల, గీర, పయ్యి, రోజా, రోదా లాంటి పదాలు వేరువేరు ప్రాంతాల్లో ఉచ్చారణా వైవిధ్యంతో సహా కనిపిస్తాయి.[28]

ఈ విషయాన్ని ఒక పటంగా గీసి చూడవచ్చు.




*(పటం : ప్రాంతీయ - వర్గ మాండలికాల సంబంధం)*

పై పటం సామాజిక అంతరం ఎక్కువయినకొద్దీ ప్రాంతీయ మాండలికాల వైవిధ్యం ఎక్కువవుతుందనీ, అది తగ్గేకొద్దీ తక్కువవుతుందని నిరూపిస్తుంది. మధ్యతరగతి గ్రామీణ ప్రజలు చక్రంతోపాటు ప్రాంతీయంగా పలుకుబడిలోవున్న మరో పదం సైతం వాడుతూ వుంటారు. పై తరగతి చదువుకున్న వాళ్లు చక్రం తప్ప మిగతా పదాల్ని వినికూడా వుండకపోవచ్చు. ప్రామాణిక లిఖితభాషలో, సాహిత్యభాషలో తక్కిన మాండలిక శబ్దాలకి ప్రవేశం ఏర్పడక పోవడమే అందుకు కారణం. మాండలిక సాహిత్యం ఆ లోటుని పూరించి భాషని పరిపుష్టం చేయడానికి ఎంతో తోడ్పడుతుంది. 'యాస' విషయంలో కూడా ఇదే కనిపిస్తుంది. సామాజిక అంతరం ఎక్కువైనకొద్దీ ప్రాంతీయమైన యాస ఎక్కువవుతుంది.

ప్రామాణిక లిఖిత భాష తెలిసిన ఉన్నతవర్గం ప్రజల్లో ప్రస్తుతానికి ఆయా ప్రాంతాల్లో 'యాస' యింకా వేరువేరుగానే కన్పిస్తున్నప్పటికీ, ప్రామాణిక లిఖిత భాష ఏర్పడ్డట్టు 'ప్రామాణిక యాస' కూడా ఏర్పడటానికి అవకాశం ఉంది. ఇంగ్లీషులో R.P. (Receiving Pronounciation) అవిధంగానే ఏర్పడింది. ఈ ప్రామాణిక యాసనే ఆంగ్లభాషలో BBC ఇంగ్లీషుని పిలుస్తున్నారు.

సామాజిక అంతరం ఎక్కువయిన కొద్దీ ప్రాంతీయ వైవిధ్యం కూడా ఎక్కువవుతున్నప్పుడు వైవిధ్యం మరీ ఎక్కువై పరస్పరావగాహన లేకుండాపోయే ప్రమాదం కూడా ఏర్పడవచ్చు.

ఉదా: ఆంధ్రదేశంలో విశాఖ, శ్రీకాకుళం జిల్లాల్లో స్థానికంగా స్థిరపడ్డ అట్టడుగు వర్గాల ప్రజలు ఉపయోగించే తెలుగు - ఆదిలాబాదు జిల్లా అదేవర్గం ప్రజలకో, చిత్తూరుజిల్లా ప్రజలకో (వీళ్ళూ స్థానికంగా స్థిరపడి లిఖితభాషతో, ప్రామాణిక వ్యవహారంతో పరిచయం లేనివాళ్లే) అర్థం కావడం చాలాకష్టం. వాళ్లకి పరస్పరం ఇతర మాండలికాలు పరాయిభాషగా అనిపించవచ్చుకూడా. పదాలు, పదాంశాల్లోవున్న తేడాకన్నా వాళ్ల 'యాస'లో వున్న వైవిధ్యమే పెద్ద అడ్డంకి. ఈ మారుమూల కింది తరగతి ప్రజలు ఏ ప్రాంతం వారయినప్పటికీ వాళ్లంతా మాట్లాడేది తెలుగే.

ఇంతకుముందు పేర్కొన్న చైనీస్‌భాషకి చెందిన మాండలికాల విషయంలో కూడా ఇదే గమనించవచ్చు. కానీ భాషా రాష్ట్రాల విభజన కారణంగా రాజకీయంగా వీళ్లంతా ఒకే గొడుగుకింద జీవించడంవల్ల, వీళ్ల చారిత్రక, సారస్వత వారసత్వం ఒకటే కావటం వల్ల - సాంస్కృతిక వారసత్వాలు వేరుగా కనిపించవచ్చు - ఈ మాండలికాలు వేరువేరు భాషలుగా విడిపోలేదు.

ఇలా దూరంగా విసిరేసినట్టున్న వేరువేరు ప్రాంతవర్గ మాండలికాల మధ్య పరస్పరావగాహనలో వచ్చే క్లేశాన్ని ప్రామాణిక భాష తగ్గిస్తుంది. ప్రామాణిక భాష అవిధంగా మాండలికాల మధ్య అనుసంధానంగా వుండటంవల్లనే తెలుగులో మాండలిక వ్యవహర్తల మధ్య అవగాహన సాధ్యమవుతుంది.

తెలుగులో మాండలికాలకీ - ప్రామాణిక భాషకీ వున్న సంబంధం గురించి ఆలోచించాలంటే ముందుగా తెలుగులో వున్న భాషా మాండలికాల గురించి, భాషా శాస్త్రవేత్తలు విభజించిన భాషా మండలాల గురించి తెలుసుకోవలసి వుంది.

## తెలుగులో మాండలికాలు

'బహుపథంబు లాంధ్ర భాషకుఁగలవు' అని కేతన ఆంధ్రభాషాభూషణములో తెలుగుభాషకి వివిధ మాండలికాలు వున్నాయని పేర్కొన్నాడు. రాజకీయ సరిహద్దులు కారణంగా, నైసర్గికమైన అడ్డంకుల మూలంగా ప్రజలమధ్య వ్యవహార ప్రాబల్యం తగ్గి తెలుగునాటకూడా ప్రాంతీయ మాండలికాలు ఏర్పడ్డాయి.

ప్రాంతీయ మాండలికాల గురించి తెలుగులో మొదటిసారిగా పరిశీలన చేసింది గ్రియర్‌సన్. ఆయన మహారాష్ట్ర చాందా జిల్లాలకు వలసపోయిన తెలుగువాళ్ళ (కోమట్లు (కోంటావు), సాలెవాళ్ళు (సాలేవారీ), గొల్లర్లు (గోలారీ)); బొంబాయి ప్రాంతంలో కోరీపని చేసుకు బ్రతికేవాళ్ళు (వడరీ) ఇటుకపని చేసేవాళ్ళు (కామాఠీ); బెల్గాం జిల్లాలో దాసర్లు (దాసరీ), దేశదిమ్మర్లు (బేరాడీ) మాట్లాడే తెలుగుభాషల్ని ఉత్తర సర్కారులలోని భాషతో పోలుస్తూ వాటిని తెలుగుకున్న మాండలికాలుగా గుర్తించారు.[29]

ఆ తర్వాత మరింత శాస్త్రీయంగా మాండలికాల పరిశోధన జరిగింది. భద్రిరాజు కృష్ణమూర్తి ఈ రంగంలో విశేషమైన కృషిచేశారు.

ఆయన వృత్తిపద పరిశోధన ద్వారా ఆంధ్రదేశాన్ని నాలుగు భాషా మండలాలుగా విభజించారు. ఆయా చేతివృత్తులవారు ఎంతోకాలంగా వలసపోకుండా ఒకచోట స్థిరపడి వుండటంవల్ల ఆవిధంగా సేకరించిన మాండలిక పదాల పరిశీలనా ఫలితాలు మాండలికశాస్త్ర (Dialectology) దృష్ట్యా చాలా నిర్దుష్టమైనవిగా భావించవచ్చు.

అవి : 1. పూర్వమండలం (కళింగదేశం: శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు)

2. దక్షిణ మండలం (రాయలసీమ: నెల్లూరు, ప్రకాశం జిల్లాలు)

3. ఉత్తర మండలం (తెలంగాణా)

4. మధ్య మండలం (కోస్తాలో గుంటూరు, కృష్ణా, ఉభయ గోదావరిజిల్లాలు)

(ఖమ్మం, మహబూబ్‌నగర్‌జిల్లాల్లో కోస్తా రాయలసీమలని ఆనుకుని వున్న తాలూకాలు ఆయా భాషా మండలాల్లో కలుస్తాయి)

శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు ఇప్పుడు విజయనగరం కూడా 16వ శతాబ్దం దాకా కళింగరాజ్యంలో భాగంగావుండి మిగతా తెలుగుదేశంతో సంబంధం లేకుండా వుండటంవల్ల అక్కడి పదాలూ, పలుకుబళ్ళూ, ఉచ్చారణలూ విలక్షణంగా కన్పిస్తాయి. ఈ మాండలికంలో సరిహద్దున వున్న ఒరియా భాషా పదాలు ఎక్కువగా చోటుచేసుకున్నాయి.

(ఉదా: కంబారీ, బుగత / బోగతా, పైన / పన్నె (= దువ్వెన), వేపి (= కుక్క) మొ॥)

తెలుగు చోడుల కాలంలోనూ, విజయనగరరాజుల కాలంలోనూ ఒకే గొడుగు కింద వున్న రాయలసీమ, నెల్లూరుజిల్లాల భాషలో సమరూపత కనిపిస్తుంది. ఈ ప్రాంతంలో కూడా పెన్నకి ఉత్తరాన ఒకరకంగానూ, దక్షిణాన ఒకరకంగానూ విలక్షణమైన పలుకుబళ్ళు కనిపిస్తాయి. అనంతపురం, కర్నూలు జిల్లాల పడమటి సరిహద్దుల్లో భాషమీద కన్నడ ప్రభావం కనిపిస్తుంది (ఉదా: గోడంబి = జీడిపప్పు, ఓళిగలు= బొబ్బట్లు, ఉద్దులు = మినుములు మొ॥). చిత్తూరు జిల్లా తమిళనాడు సరిహద్దుల భాషమీద తమిళ ప్రభావం కనిపిస్తుంది. (ఉదా: తనీగా = ఒంటరిగా, కాసు = డబ్బు మొ॥)

తెలంగాణా రాయలసీమలకు కృష్ణా తుంగభద్రలు నైసర్గిక హద్దులుగా గుర్తించవచ్చు. ఆ హద్దులు భాషావైవిధ్యానికి కారణమయ్యాయి. అంతేగాకుండా కాకతీయులు అటుపిమ్మట మహమ్మదీయులు పాలించిన తెలంగాణా ప్రాంతానికి రాజకీయ సరిహద్దు కూడా ఆ ప్రాంతాన్ని మిగతా ప్రాంతాలనుంచి వేరుచేసి అక్కడి భాషని విలక్షణంగా తయారుచేసింది. ఉర్దూ ప్రభావంవల్ల హైదరాబాద్ చుట్టుపక్కల ప్రాంతాల్లో తెలుగుమాటల బదులు ఉర్దూ మాటలెన్నో వినిపిస్తాయి. (ఉదా: తుకం <తుఖం = నారు, పయ్యె <పహియా= చక్రం మొ॥)[30]

రాజకీయమైన అస్థిరత్వం కారణంగా కృష్ణాగోదావరుల మధ్యప్రాంతం ప్రత్యేక భాషా మండలంగా కనిపించదు. ఇక్కడి వాడుకలో ప్రతి పదం మిగతా మూడు ప్రాంతాల్లో ఏదో ఒక దానితో కలుస్తుంది. అందువల్ల దీన్ని 'మిశ్రమ వ్యవహార మండలం'(**Mixed dialect region**) అనవచ్చు. కృష్ణా గోదావరీ నదీ సంగమ ప్రాంతం కావడంగా, సముద్ర వాణిజ్యానికి తీరభూమి అయిన కారణంగా జనసాంద్రత ఎక్కువై ప్రజల రాకపోకలు ఎక్కువై వ్యాపారరంగానికే గాక విద్యా సాంస్కృతిక రంగాలకు కూడా కూడలై, సారవంతమైన నేల కాబట్టి పాలకులు పోటాపోటీగా తమ అధీనంలో వుంచుకోవడానికి చేసిన ప్రయత్నాలవల్ల రాజకీయ అస్థిరత ఏర్పడి తక్కిన ప్రాంత పదాలన్నిటికీ ఇది కూడలి అయింది. అందుకే ఇక్కడి భాష తక్కిన అన్ని ప్రాంతాల వారికీ పరిచితమై వుంటుంది. తెలుగునాట వున్న అన్ని మాండలికాలనూ కలిపి వుంచే అనుసంధాన భాషగా ప్రామాణికతను సంతరించుకుంది.[31]

నిజానికి జిల్లాజిల్లాకి భాషావైవిధ్యం కనిపిస్తుంది. ఆ వైవిధ్యాల్ని నిరూపిస్తూ తెలుగు అకాడమీ వాళ్ళు జిల్లా బులిటిన్లని వాటి మోనోగ్రాఫులని తయారుచేశారు. వాటివల్ల ఆంధ్రదేశంలో ప్రతి జిల్లాకీ ప్రజల భాషలో కన్పించే ఉచ్చారణ ధ్వనులూ, ఊనికలూ, స్వరాలూ, యాసలూ తెలుసుకోవడానికి అవకాశం లభిస్తుంది.

కృష్ణమూర్తిగారి విభజన 1962లో జరిగింది. మాండలిక వృత్తిపదాల పరిశోధనద్వారా భద్రిరాజు కృష్ణమూర్తి విభజించిన నాలుగు భాషా మండలాలనే తర్వాతివారు ప్రమాణంగా స్వీకరించారు. ఆతర్వాతి కాలంలో వెలువడ్డ మరికొన్ని వృత్తిపదకోశాలు ఆ విభజనని బలపరిచాయి. కానీ ప్రయాణ సౌకర్యాలూ, సినిమా, రేడియో, టెలివిజన్, పత్రికలు లాంటి ప్రసార సాధనాలు ఎక్కువై ప్రామాణిక భాషని ప్రచారం చేస్తూ భిన్న మాండలికాల మధ్య అంతరాన్ని తగ్గిస్తున్నాయి. మాండలిక సాహిత్యం కూడా అందుకు ఎంతో దోహదపడుతుంది. అందువల్ల అప్పట్లో గీసిన మాండలిక పటాలు, ఆ సరిహద్దులు మారిపోయి వుండవచ్చు. పట్టణీకరణ, పారిశ్రామికీకరణ, విద్యావకాశాలు పెరగడంవంటి మరికొన్ని హేతువులుకూడా భాషా మండలాల సరిహద్దుల్ని మార్చే ముఖ్యాంశాలు.

పది, ఇరవై ఏళ్లకొకసారి మళ్లీ పదసేకరణ చేసి పటాలు గీసి అంతకుముందు గీసిన వాటితో పోల్చిచూస్తే వ్యవహార భేదకరేఖలు మరో తీరున గుర్తించవలసి ఉంటుందన్న కృష్ణమూర్తిగారి మాటలు తర్వాత ఆచరణలోకి రాలేదు. కాబట్టి మళ్ళీ మాండలిక పటాల రచన జరగవలసిన ఆవశ్యకత వుంది.

దేశంలో ఇతర రాష్ట్రాల్లో, త్రివేంద్రం, రాజపాలియం, సేలం, కోయంబత్తూరు, మద్రాసు, కోలారు, మైసూరు, బళ్ళారి, బరంపురం, గంజాం, ఖరగ్‌పూర్, జంషెడ్‌పూర్, కలకత్తాలాంటి ప్రాంతాల్లో మాట్లాడే తెలుగుభాషనికూడా దృష్టిలో వుంచుకుని మాండలికాల పరిశోధన జరగాల్సి వుంది. ఆ ప్రాంతాల తెలుగుమీద అక్కడి భాషల ప్రభావం పరిశీలించాలి.

వర్గ మాండలికాల విషయానికివస్తే వృత్తిపదాల పరిశోధనే కాకుండా సమాజంలోని వివిధ వర్గాల మధ్య వైరుధ్యాల్ని దృష్టిలో వుంచుకుని అవి భాషలో ఎలాంటి వైవిధ్యాన్ని తీసుకొచ్చాయో పరిశీలించాలి. వేర్వేరు సంస్కృతుల్ని నేపథ్యం చేసుకొన్న భిన్న కులాలు మాట్లాడే భాషని అధ్యయనం చేయాలి. అలాగే గోండి, సవర, కొండ, కోయ, కొలామీ, లంబాడీలాంటి కొండభాషల ప్రభావం ఆ జాతులు మాట్లాడే తెలుగుమీద ఎంతవరకు ప్రసరించిందో పరిశీలించవలసి ఉంది.

**గిరిజన భాష:** గిరిజనుల జీవితం సాహిత్య వస్తువుగా భాషా సాహిత్యాల్లో ఒక గొప్ప మార్పు తీసుకురావడం 1970నుంచి కన్పిస్తుంది. పాటలు, కథలు, నవలలు, నాటకాలు, ఒగ్గుకథలువంటి ఎన్నో ప్రక్రియలు గిరిజన సంస్కృతిని ప్రతిబింబించడమే కాకుండా వాళ్ల జీవితాల్లో పెనవేసుకున్న ఎన్నో సమస్యల్ని చిత్రించి వాటి పరిష్కార మార్గాలని చూపుతున్నాయి. తెలుగు ప్రాంతంలో వామపక్ష అభ్యుదయవాదులు మానవ సంబంధాల్ని శాసించే ఉత్పత్తి సంబంధాల్ని గూర్చి చర్చించినంత బలంగానూ, జాతుల సమస్యని గురించి ఆలోచించినంత తీవ్రంగాగానూ భాషను గురించి, గిరిజన భాషని గురించి ఎక్కువగా ఆలోచించలేదు. ఎప్పుడో గిడుగు సవర భాషగురించి చేసిన కృషి తప్ప ఆ తర్వాత ఈరంగంలో కాలుపెట్టిన వాళ్ళు లేరు. జాతుల సమస్యలో భాషనికూడా ఒక భాగంగా గుర్తించి ఈ రంగంలో ఎంతో కృషి జరగాల్సి ఉంది. శ్రీకాకుళం, ఉత్తర తెలంగాణా పోరాటాల నేపథ్యంలో తెలుగులో వచ్చిన గిరిజన సాహిత్యంపై గిరిజన భాషల ప్రభావాన్ని కూడా అంచనావేయాలి.

ఇలా నైసర్గిక, రాజకీయ సరిహద్దులవల్ల, సాంఘిక భేదాలవల్ల, విద్యాసంస్కృతుల్లో వున్న తేడాలవల్ల భాషలో ఎన్నో రకాల వైవిధ్యాలుంటాయి. అయితే ఈ వైవిధ్యాలన్నిటినీ మించి సమిష్టి సాధారణ లక్షణాలు కూడా కొన్ని వుంటాయి. అవే భాషకి ప్రామాణిక రూపాన్ని ఏర్పరుస్తాయి. మాండలికాలమధ్య అవగాహనని(intelligibility) కలుగజేస్తాయి.

## మాండలికాలు - ప్రామాణిక భాష

ప్రామాణికభాష నుంచే మాండలికాలు ఏర్పడతాయనీ - ప్రామాణిక భాషయొక్క అపభ్రంశ రూపాలే మాండలికాలనీ మొదట్లో అనుకున్నారు. అంతేకాదు ప్రామాణిక భాష మాత్రమే సాహిత్యరచనకు అనుకూలమనీ - అది ఎన్నటికీ మారదనీ - అందువల్ల అది అన్ని - ప్రాంతాలవారికీ అర్థమవుతుందనీ - మాండలికం సాహిత్య సృజనకు అసమర్థమైనదనీ - మాండలికాలు చేరడంద్వారా ప్రామాణిక భాష చెడిపోతుందనీ భావించారు. కానీ భాషాశాస్త్రవేత్తలు ప్రపంచ భాషలని తులనాత్మకంగా - చారిత్రాత్మకంగా అధ్యయనంచేసి ''మాండలికమే భాషయొక్క సహజస్థితి''[32] అనీ, కొన్ని రాజకీయ, చారిత్రక కారణాలవల్ల మాండలికాలనుంచే ప్రామాణిక భాషలు ఏర్పడ్డాయని తెలుసుకున్నారు.

కొన్ని ప్రత్యేక చారిత్రాత్మక కారణాలవల్ల ఒక్కో దేశానికి విద్యా రాజకీయ సాంస్కృతిక నాగరికతా కేంద్రాలు ఏర్పడతాయి. అవే అత్యున్నత భాషాకేంద్రాలు(**Spreme speech Centers**) అవుతాయి. ఆ కేంద్రాల్లో నివసించే విద్యావంతుల, ఉన్నత వర్గాల ప్రజల భాషమీద ఆధారపడి ప్రామాణిక భాష ఏర్పడుతుంది. ఉదా: ఇంగ్లీషు (లండన్); ఫ్రెంచి (పారిస్); రష్యన్ (మాస్కో); గ్రీకు (ఏథెన్స్ - అట్టిక్).

ప్రామాణిక జర్మన్, లిథువేనియన్ భాషలని పరిశీలిస్తే అన్ని దేశాల్లోనూ రాజకీయ సాంస్కృతిక కేంద్రాల స్థానిక మాండలికమే ప్రామాణిక భాషగా రూపొందలేదని కూడా తెలుస్తుంది.[33]

మన దేశానికి వస్తే ఢిల్లీ ప్రాంత భాషాభేదం ఖడీ బోలీ - ప్రామాణిక హిందీగా, కలకత్తా మాండలికమే ప్రామాణిక వంగభాష (చలిత్)గా స్థిరపడ్డాయి. అయితే ప్రామాణిక భాషకీ, అధిక వ్యాప్తిలో వుండే మాండలికానికీ సంఘర్షణ ఎప్పుడో ఒకసారి తప్పకుండా కలుగుతుంది. అప్పుడు - మరో కొత్త ప్రామాణిక భాష ఏర్పడవచ్చు.

తెలుగులో కోస్తా ప్రాంతం విద్యావైజ్ఞానిక సాంస్కృతిక కేంద్రంగా వుంది. ఆధునికకాలంలో ప్రామాణిక భాష ఏర్పడే క్రమంలో చాలామంది రచయితలు ఈ ప్రాంతంనుంచే ఈ భాషలోనే రచనలు చేశారు. మొదట్నుంచీ రాజకీయ అస్థిరత్వం కారణంగా మిగతా ప్రాంతాలతో సంబంధాలు కలిగివుంది. ఆర్థిక రాజకీయ రంగాల్లో కూడా మిగతా ప్రాంతాలకన్నా సత్వరాభివృద్ధిని సాధించింది. వెనకబడ్డ ప్రాంతాల మీద ఆధిపత్యాన్ని కూడా స్థిరపరచుకొంది. ఈ కారణాలవల్ల మధ్యాంధ్ర (కోస్తా) మాండలికం ప్రామాణిక భాషగా రూపొందింది. వ్యవహార బలమే ప్రామాణికతకి నిదర్శనం అని యెస్పెర్సన్ అభిప్రాయం.[34]

భాషకి ప్రామాణికత్వాన్ని నిర్ణయించేది ఆ భాషని మాట్లాడే ప్రజలేగాని పండితులూ, కవులూ - వాటి పరిషత్తులూ కాదు. ఫ్రెంచి అకాడమీ చేసిన నిర్ణయాలు కాలగమనంలో

నిలవలేదు. తెలుగులో ఆధునిక ప్రామాణిక భాష ఏర్పడుతున్న క్రమంలో రనండి (< Run - అండి), చెరిషింపు (<cherish - ఇంచు), పెరిషింపు (<perish - ఇంచు), హైహీలుయాన వంటి ఆధునిక కవుల[35] ప్రయోగాలకి ప్రామాణికత సిద్ధించలేదు. గ్రాంధిక భాషనే ప్రామాణిక భాషగా నిలపాలని చేసిన ప్రయత్నాలు అందుకే సఫలం కాలేదు. ఈనాడు పత్రికల భాషగా ప్రామాణికంగా చెలామణీ అవుతున్న శిష్టవ్యవహారిక భాష కూడా ప్రజావసరాల కొద్దీ మారుతుంది. దాని స్థానాన్నే మరింత ప్రజాస్వామికీకరణ పొందిన భాష ఆక్రమించుకొంటుంది.

ప్రజాస్వామికంగా స్థిరపడే ప్రామాణికం సామాన్యంగా రాజకీయ కేంద్రాలనుంచే ఏర్పడుతుంది.[36]

రాజకీయ స్వాతంత్ర్యం, ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాల్లో ప్రజావసరాల కొద్దీ ప్రామాణిక భాషలు కొత్తగా ఏర్పడతాయి.[37] అంతేగాదు - ప్రామాణిక భాషగా ఏ భాషా స్థిరంగా కలకాలం రాజ్యమేలదని కూడా ప్రపంచ దేశభాషల పరిశీలనలో తెలుస్తుంది.

వోపలన్ భాషని 12 సం.రాల్లో ఆరుసార్లు మార్చారు. డచ్ సారస్వత భాష అయిదు శతాబ్దాల్లో (13AD నుంచి 17AD వరకు) మూడుసార్లు మారింది. ఈజిప్షియన్ సాహిత్యభాష వాడుకభాష నాధారం చేసుకొని నాలుగుసార్లు మారింది.

## తెలుగులో ప్రామాణిక భాష

''కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి దేశభాషే లలితాంగి మాఱుంటది సత్కవి సమ్మతము'' అని తిరుపతి వేంకట కవులు (పాణిగృహీతీ (1-19) పేర్కొన్నట్లుగా తెలుగులో కూడా సాహిత్య భాష మార్పుకి గురికావడం సహజంగానే జరిగింది.

కొత్తగా ఏర్పడే ప్రామాణిక భాష మాండలికాన్ని ప్రభావితం చేసినప్పటికీ మాండలికం తన స్వత్వాన్ని కోల్పోదు. దాని ప్రత్యేకతని అది నిలుపుకుంటుంది. ప్రామాణిక భాషలో సాహిత్యం వచ్చినట్లు మాండలిక భాషలోసైతం సాహిత్యం వస్తే ప్రామాణిక భాష మరింత పరిపుష్టమవుతుంది. ఆక్రమంలో మాండలికాలమధ్య సమరూపత, ప్రామాణిక భాషకి పరిపూర్ణత కలుగుతాయి. కానీ ఇది అంత సులభసాధ్యం కాదు. అసాధ్యం అనికూడా కొందరు భావించారు.[38]

నిజానికి ప్రపంచంలో ఏ భాషకీ పూర్తి ప్రామాణికత లభించలేదు. తెలుగులో కూడా పూర్తి ప్రామాణిక భాష ఇంకా ఏర్పడలేదని భాషావేత్తలు భావిస్తున్నారు.[39]

అయితే తెలుగులో ప్రామాణిక భాషలో సమరూపత సాధించడానికి వ్యావహారిక భాషోద్యమం మొదలయిన దగ్గర్నుంచీ ప్రయత్నాలు సాగుతూనే ఉన్నాయి. భాషలో

ఏకరూపతని సాధించడానికి టేకుమళ్ళ కామేశ్వరరావు లాంటివారు - 'వాడుకభాష: రచనకు కొన్ని నియమాలు'' వుండాలని భావించారు. వఝ్లమూడి గోపాలకృష్ణయ్య వంటివారు ''వ్యావహారిక భాషావ్యాకరణం'' రచించారు.

అయితే రాజకీయ కేంద్రంలో విద్యావంతులువాడే భాష ప్రామాణికమైనప్పుడు, దానికే ప్రచారం లభించినప్పుడు లేదా కలుగజేసినప్పుడు తక్కిన ప్రాంతాల మాండలికం, విద్యలేని ప్రజల భాష నిర్లక్ష్యానికి గురయ్యే ప్రమాదమూ, నిరాదరణకు లోనయ్యే అవకాశమూ వున్నాయి. ఒక ప్రాంతంలోని విద్యావంతులకు పరిమితమై జనాభాలో కొద్దిశాతం మంది మాత్రం మాట్లాడే భాషని ఎక్కువమంది మీద రుద్దడానికి భాషలోనూ, సాహిత్యంలోనూ విధినిషేధాలు ఏర్పరచడం కూడా జరుగుతుంది. మండపాక పార్వతీశశాస్త్రి - వాడుకభాషలో మాండలికం విరివిగా వ్యాపిస్తుందనీ దానికి అడ్డుకట్ట వేయాలనీ భావించారు.

కానీ గిడుగు అది అశాస్త్రీయమని అభిప్రాయపడ్డారు. అంతేకాదు రచయితలు పామరభాష తెలుసుకోవాలనీ తను గ్రంథాల్లో అన్యదేశాలేకాక ''మాండలికాలు' కూడా యథేచ్ఛగా ప్రయోగించాలనీ అవి "standard' భాషలో అంతర్భూతాలయి దాన్ని 'వృద్ధి' పొందిస్తాయనీ పేర్కొన్నారు.[40]

వ్యావహారిక భాషని గ్రామ్యమని గ్రాంధికవాదులు అప్పట్లో నిందించినట్లే ప్రామాణిక భాష స్వచ్ఛమనీ మాండలికం గ్రామ్యమనీ, పరుషమనీ, సాహిత్యరచనకి అనర్హమనీ, పాఠకుడికి ప్రామాణిక భాష అర్థమైనట్లు మాండలికం కాదనీ కొన్ని వాదనలు ఈనాడూ వున్నాయి. మాండలికాల నుంచీ పుట్టి సాంఘిక సాంస్కృతిక ప్రతిష్టను సంపాదించిన భాషారూపమే ప్రామాణికం అని మర్చిపోవడంవల్ల ఇలాంటి వాదనలు బయలుదేరతాయి. భాషాశాస్త్ర దృష్టితో మాండలికానికి తక్కువదనం (inferiority) లేదు. సామాజికంగా కిందితరగతి చదువురానివాళ్ళమీద ఉన్నతవర్గాల్లో చదువుకున్న వాళ్ళకుండే చిన్నచూపు, ఆర్థికంగా సాంస్కృతికంగా రాజకీయ అభివృద్ధి సాధించిన ప్రాంతీయులకు వెనుకబడిన ప్రాంత ప్రజలమీద వుండే చిన్నచూపు భాషమీద కూడా ప్రసరించి మాండలికాలు ( వర్గ, ప్రాంతీయ) హీనమైనవనే భావనని కలుగజేస్తాయి.

ప్రామాణిక భాషసమాజంలో ఉన్నతవర్గ విద్యావంతుల భాషగా, సాహిత్య భాషగా, సమాచార మాధ్యమ భాషగా పత్రికల్లో, రేడియోల్లో, టీవీల్లో ఆధిపత్యాన్ని నెరపుతుంది. ప్రసార సాధనాలు పాలకవర్గం చేతిలో వుండి ప్రామాణిక భాష వాళ్ల అవసరాల కోసం మాత్రమే ఉపయోగపడుతూ అవిద్యావంతులు, పామరులు, ఆర్థిక సామాజికరంగాల్లో వెనుకబడిన అధిక శాతం ప్రజల భాషకన్నా పైమెట్టుమీదే వుంటుంది. మాండలికం అప్రామాణిక భాషగా పాలకుల నిర్లక్ష్యానికీ, సాహిత్యకారుల అనాదరణకి గురవుతుంది. ఆ నేపథ్యంలో అధికశాతం

ప్రజలు మాట్లాడే భాష గుర్తింపు కోసం, న్యాయసమ్మతమైన అస్తిత్వం కోసం ప్రామాణిక భాషతో పోటీపడుతుంది.

సాహిత్యరచనకి ఉపయోగించే ప్రామాణిక భాషకి (సాహిత్య భాష) అందుకు నోచుకోని మాండలిక భాష (ప్రజల భాష)కి ఒక సంఘర్షణ ఏర్పడుతుంది.

ఆ సంఘర్షణలోనుంచి కొత్త సాహిత్య భాష ఏర్పడవచ్చు. ప్రజల వ్యవహారంలో వుండి వారి సాంస్కృతిక జీవితంలో ముడిపడివున్న భాషకు సాహిత్య భాషతో సంఘర్షణ జరిగినప్పుడు ప్రామాణిక భాషలోని సాహిత్యానికి సమాంతరంగా ప్రజల సాంస్కృతిక భాషలోకూడా సాహిత్యం వెలువడవచ్చు. మాండలిక సాహిత్యం ఆ క్రమంలో పుడుతుంది.

# మాండలికం - సాహిత్యం
## రెండో భాగం

విద్యాసంస్థల్లో నేర్చుకునే ప్రామాణిక భాష - ప్రజల దైనందిన జీవితంలో వారి సంస్కృతితో ముడిపడివున్న భాష వేరుగా వుంటాయి. వర్గ సమాజంలో ఈ అంతరం మరీ స్పష్టంగా కనిపిస్తుంది. మౌఖికరూపంలో వున్న భాషకీ లిఖితరూపంలో వున్న భాషకీ ఉచ్చారణ ధ్వనుల స్వరూపాలు వేరుగా వుంటాయి. అది కేవలం ధ్వనిశాస్త్రానికి సంబంధించిన విషయమే. కానీ సాహిత్య భాషకీ - ప్రజల సాంస్కృతిక భాషకీ వున్న సంబంధాన్ని పరిశీలించేటప్పుడు సామాజిక శాస్త్రచర్చ ముందుకు వస్తుంది.

### సాహిత్య భాష - సాంస్కృతిక భాష

సమాజంలో ఉత్పత్తి సంబంధాలమీద ఆధారపడి ప్రజా సంస్కృతి ఏర్పడుతుంది. ఆ సంస్కృతికి వాహకంగా సామాజిక వారసత్వంగా ప్రజల సాంస్కృతిక భాష ఏర్పడుతుంది. శ్రమనుండి దూరమైన సాహిత్యంలో అధిక సంఖ్యాక ప్రజల సాంస్కృతిక భాష ప్రవేశించలేదు. శ్రమతో దగ్గర సంబంధమున్న సాహిత్యంలోకి మాత్రమే ప్రజల సాంస్కృతిక భాష చోటుచేసుకుంటుంది.

శ్రామికవర్గం తమ దైనందిన శ్రామిక సంస్కృతికీ, భావనలకీ, వ్యక్తీకరణలకీ భిన్నమైన ధోరణులని శ్రామికేతర వర్గ భాషలో విద్యాలయాల్లో నేర్చుకోవలసివస్తుంది. అంటే వాళ్ళు నేర్చుకునే ప్రామాణిక భాషవాళ్ల సంస్కృతి ప్రసార సాధనం కాదన్నమాట. వాళ్లకది మాతృభాష కాకుండా రెండో భాష (**Second language**) అవుతుంది.[41]

భావాల్ని వ్యక్తీకరించే పద్ధతులు, అందుకు వుపయోగించే పదజాలం ఆయా వర్గాల సంస్కృతితో ముడిపడివుంటాయి. అందువల్ల శిష్టసాహిత్యంలో శిష్టసంస్కృతిని ప్రతిఫలించే భాష, జానపద సాహిత్యంలో శ్రమజీవుల సాంస్కృతిక భాష చోటు చేసుకుంటాయి. భాషలో ఏర్పడ్డ ఈ అంతరాలు తొలగాలంటే ప్రజల సాంస్కృతిక భాషలో విరివిగా గ్రంథరచన జరగాలి.

అందువల్ల ఇప్పుడున్న ప్రామాణిక భాషలో మార్పులు సంభవిస్తాయి. భాషలో మార్పు వచ్చి దాని స్వరూపం మారడం దోషంకాదు- సహజం. ప్రామాణిక భాష అధిక సంఖ్యాకుల వ్యవహారంనుంచి దూరమవుతున్నప్పుడు దానికి మార్పు అవసరం.

మౌఖిక వ్యవహారంలో వచ్చినంత త్వరగా లిఖితభాషలో మార్పులు రావు. ప్రామాణిక లిఖితభాష సాహిత్యభాషగా స్థిరపడినప్పటికీ ప్రజల సాంస్కృతిక భాషనుంచి వేరుకాకుండా

వుండాలంటే వాళ్ల వ్యక్తీకరణ పద్ధతుల్నీ, పదజాలాన్నీ, భావజాలాన్నీ తనలో ఇముడ్చుకుంటూ వుండాలి. అందులో భాగంగానే సాహిత్యంలో మాండలిక రూపాలు పదాలు చోటుచేసుకుంటూ వుంటాయి. ప్రజల సాంస్కృతిక భాషకి సాహిత్యంలో సరైన స్థానంకల్పించడం ద్వారా ప్రామాణిక భాష పరిపుష్టమవుతుంది. మాండలికాలకి ప్రామాణిక భాషతో సమానగౌరవం - స్థాయి కల్పించని పక్షంలో మాండలిక భాషలో సాహిత్యరచన సమాంతరంగా వెలువడే అవకాశం వుంటుంది.

అయితే మాండలికంలో సాహిత్య రచన కేవలం ప్రామాణిక భాషతో జరిగే సంఘర్షణ నుంచే పుడుతుందనీ - ఇది ఒక్కటే కారణం అని చెప్పటానికి వీలులేదు. ఇది కూడా ఒక ముఖ్యమైన కారణం. మాండలికంలో సాహిత్యరచన - దానికి కారణాలు వివేచించాలంటే ముందుగా సాహిత్యంలో మాండలికం ఎలా చోటుచేసుకుంటుందో ఆలోచించాలి. అప్పుడు మాండలికంలో సాహిత్యం వెలువడిన తీరుని సమీక్షించుకోవడానికి వీలవుతుంది.

## సాహిత్యంలో మాండలికం

ప్రజల వాడుక భాషకన్నా భిన్నంగా సాహిత్యభాష ఒకటి రూపొందడం ప్రపంచ భాషలన్నింటిలోనూ కనిపిస్తుంది. వాడుక భాష నుంచి సాహిత్య భాష కాలక్రమంలో దూరమైనప్పటికీ ప్రజా వ్యవహారాన్ని, మాండలిక పదజాలాన్నీ పూర్తిగా కాదని తిరస్కరించడం అసాధ్యం. అసంకల్పితంగానో, ప్రయోజనాన్నాశించో మాండలికం సాహిత్యంలో చోటుచేసుకుంటూనే వుంటుంది.

దైనందిన వ్యవహారంలో మాండలికం వాడే కవి దాని ప్రభావంనుంచి తప్పించుకోలేని కారణంగా సాహిత్యభాషలోనూ తనకు తెలియకుండానే మాండలికం ఉపయోగిస్తాడు. కవి/రచయిత తన రచనకి సహజత్వాన్ని ఆపాదించుకోవడానికి మాండలికాన్ని సాహిత్య భాషలో పనిగట్టుకుని ఉపయోగించవచ్చు. పాత్రౌచిత్యం కోసం ఒక్కో పాత్రతో మాండలికం పలికించవచ్చు.

'గ్రామ్యం తత్తద్విధౌసాధు' అని వికృతి వివేకం చెప్పినా, 'గ్రామ్యంబు తత్తజ్జాతి వర్ణనంబున ప్రయోగార్హంబు' అని ప్రౌఢ వ్యాకరణం చెప్పినా దానికి కారణం కొంతమంది కవులు పాత్రోచిత భాషగా మాండలికాన్ని (సాహిత్య భాషేతరమైన లేదా ఆర్య వ్యవహారేతరమైన గ్రామ్యాన్ని) వాడి వుండటమే.

కవులు/రచయితలు ఒక్కోసారి స్వస్థాన భాషాభిమానం వల్లగానీ, స్వవర్గ భాషాభిమానం వల్లగానీ, తన ప్రాంత వర్గ మాండలిక పదాలకి కావ్యభాషలో ప్రాచుర్యం కలుగజేయాలనే కోరికతోగానీ, తక్కిన ప్రాంతాల్లో లేని పదాలకి పర్యాయోపయోగం కల్పించాలనే

పట్టుదలతోగానీ మాండలికానికి సాహిత్యంలో స్థానం కల్పించవచ్చు. అయితే అన్య ప్రాంతాలవారికి అర్థంకాని స్వమండల పదాల్ని కావాలని ఏ కవీ ప్రయోగించడు.

కావ్యభాషలో ప్రయోగించే పదాల్లో అర్థచ్ఛాయా భేదాలున్న కారణంగా సాహిత్య భాషలో ప్రాచుర్యంలో వున్న పదం చెప్పదలుచుకున్న విషయాన్ని వ్యక్తీకరించడానికి అసమర్థమైనదని అని భావించి కవి, రచయిత మాండలిక పదాల జీవాన్ని గుర్తెరిగి వాటిని ప్రయోగిస్తారు.

మాక్స్‌ముల్లర్ మాండలికాలు సాహిత్య భాషకి పరిపోషకాలే తప్ప దానికన్నా తక్కువ, నీచమని భావించకూడదంటాడు. అంతేకాదు హోమర్ పద్యకవితకన్నా, సిసిరో గద్య సాహిత్యంకన్నా ఎన్నడూ సాహిత్య గౌరవం నోచుకోని కొన్ని మాండలికాలే విలువైనవని చెప్పాడు.[42]

ప్రేక్షకుల వినోదం కోసం, ప్రదర్శన రక్తికట్టడం కోసం, ఔచిత్యం కోసం వేషంతోబాటు (ఆహార్యం) భాష(వాచకం) కూడా ముఖ్యమైన అభినయ విధానంగాబట్టి ప్రదర్శనావసరాల కొద్దీ మాండలిక భాషని నాటకాల్లో ఒక అవసరంగా ఉపయోగించడం జరుగుతుంది.

సంస్కృత నాటకాల్లో కొన్ని పాత్రలు ప్రాకృత భాష మాట్లాడటం ఇందుకు ఉదాహరణ. నీచ పాత్రలకి నీచ భాష వాడే పద్ధతిగా దీన్ని పూర్తిగా భావించలేం. స్త్రీలకీ - రాణివాసం స్త్రీలకయినా- విదూషకుడికీ - బ్రాహ్మణుడే అయినా - ప్రాకృత భాషని ఉపయోగించడం కనిపిస్తుంది. స్త్రీల భాష పురుషుల భాషకన్నా భిన్నంగా వుంటుందని నిరూపించడానికీ, విదూషకుడి వాగ్వైచిత్రిద్వారా హాస్యరసం పోషించడానికి ఆ పద్ధతి అనుసరించి వుండవచ్చు. ప్రాకృతం పాత్రయొక్క వర్గాన్నీ, (సామాజిక స్థాయినీ) ప్రాంతాన్ని సైతం తెలియజేసేది.

ప్రదర్శనకి ప్రచార గుణం సాధించడానికి, పాత్రౌచిత్యాన్ని కాపాడటానికీ యక్షగానాల్లో మాండలిక శబ్దజాలం ఎక్కువగా చోటుచేసుకోవడం కనిపిస్తుంది.

సామాజిక ప్రయోజనాన్ని ఆశించే నాటకాల్లో సామాన్య ప్రజానీకానికి దగ్గరయ్యే క్రమంలో మాండలికాన్ని విస్తృతంగా వుపయోగించడం జరుగుతుంది.

హాస్యం కోసం కూడా శిష్టసాహిత్యంలో మాండలికం చోటుచేసుకుంటుంది. ఆ ఉద్దేశాన్ని ఆశించే వేదంవారు, గురజాడ నాటకాల్లో మాండలికాన్ని వాడారు. సామాన్య జనానికి అవగాహనకోసం, హాస్యం కోసం నాటకాల్లో మాండలికం వుపయోగించినట్టు గురజాడ పేర్కొన్నారు.[43]

పైన పేర్కొన్న అంశాలన్నీ మార్గకవిత్వంలోనో శిష్టసాహిత్యంలోనో మాండలికం చోటుచేసుకోవడానికి కారణాలని వివరిస్తున్నాయి.

దేశికవిత్వంలో మాండలికం చోటుచేసుకోవడానికీ, జానపద సాహిత్యం మాండలికంలో వెలువడటానికీ ప్రత్యేకమైన కారణాలున్నాయి.

ప్రజలకు దగ్గరవ్వాలంటే సాహిత్యభాష ఆటంకమవుతుంది. కాబట్టి దేశీకవులు ప్రజల భాషనీ, భావాలనీ, వ్యక్తీకరణ పద్ధతుల్నీ, జీవితాన్ని స్వీకరించారు. భక్తిభావాన్ని చెప్పిన పదకవిత్వంలోగానీ, కీర్తనల్లోగానీ, ధర్మప్రచారానికి పూనుకున్న ద్విపద సాహిత్యంలోగానీ ప్రజల భాష ముఖ్యమైనస్థానం వహించింది. తమ సాహిత్యానికి ప్రజారంజకత్వం సాధించడానికీ, భావప్రచారానికీ దేశీకవులు ప్రజల భాషని స్వీకరించారు. భాషలోనూ, ఇతివృత్తంలోనూ, ఛందస్సులోనూ దేశీయమై వుండేదే దేశీ అనడంలో అది ప్రజల సంస్కృతిలో ఒక భాగమై వుంటుందని తెలుస్తుంది

ఛందస్సు కూడా దేశీఅయినప్పుడు పాడుకోడానికి అనువుగావుండి దేశీ మౌఖికతని సాధించుకొంటుంది. సాహిత్యానికున్న మౌఖిక లక్షణమే దానిలోని భాషని సైతం నిర్ధారిస్తుంది.

మౌఖిక సాహిత్యంలో భాష లిఖిత భాషకన్నా, సాహిత్యభాషకన్నా భిన్నంగా వుండటం సహజం. రాతలో చోటుచేసుకుని మాండలిక భాష ఉచ్చారణా పద్ధతులూ, ఊనికలూ స్వరాల్తో సహా ఆ సాహిత్యంలో ప్రవేశించింది.

జానపద సాహిత్యానికికూడా ఇదే సూత్రాన్ని అన్వయించుకోవాలి. జానపద సాహిత్యానికి మరోప్రత్యేకత కూడా వుంది. దేశీ సాహిత్యానికి కవులో, రచయితలో వున్నారు. వారు శిష్టవర్గంనుంచి వచ్చినవారే గానీ తమ అవసరాలకోసం దేశీ వాడుకున్నారు. పదాలు, కీర్తనలూ మౌఖిక సాహిత్యం కిందకే వస్తాయి కానీ ఆ కవులమీద, వాగ్గేయకారులమీద శిష్టభాషా సంస్కృతుల ప్రభావంవుంటుంది. మౌఖిక ధోరణిని స్వీకరించినప్పటికీ వారి కవిత్వాన్ని లిఖిత సాహిత్యం కిందే పరిగణించాలి. దాన్ని మిశ్రమౌఖిక(**Mixed Oral**)గా భావించాలి.

జానపద సాహిత్యం అందుకు భిన్నం. జానపద సాహిత్యం కూర్పరులు, గాయకులు, ప్రదర్శకులు, ప్రచారకులు, శ్రోతలు, ప్రేక్షకులు అంతా జానపదులే. వీరి భాష, సంస్కృతి, ఆలోచనలు, భావాలు - వాటి వ్యక్తీకరణలు అన్నీ శిష్టధోరణికన్నా భిన్నంగా వుంటాయి. అందువల్ల జానపద సాహిత్యం పూర్తిగా ప్రజల సాంస్కృతిక జీవితాలతో ముడివడి వుంటుంది. భాష అందులో భాగమే. సాహిత్య భాష సాంస్కృతిక భాషకన్నా భిన్నంగా వుంటుందని ఇంతకుముందు చెప్పింది ఈ అంశాన్ని దృష్టిలో వుంచుకునే. జానపద సాహిత్యంలోని భాష ప్రజల సాంస్కృతిక భాష. దీనిమీద శిష్టభాషా ప్రభావం చాలా తక్కువ. జానపద సాహిత్య కళారూపాలన్నీ మౌఖిక సంప్రదాయానికి చెందినవేకాబట్టి ఇందులో భాష 'రాత' భాషకన్నా పూర్తిగా భిన్నంగా మౌఖికరూపంలో వుంటుంది. ప్రజల నోటి భాష మాండలికం అవుతుందనడంలో సందేహంలేదు. జానపద గేయాలూ కళారూపాలు లాగే జానపద కథకూడా మౌలికంగా మౌఖికమే కాబట్టి వచనం సైతం మాండలికంలోనే వుంటుంది.

దేశీసాహిత్యంలో మాండలిక ప్రయోగం ఒక ప్రయోజనం కోసం జరుగుతుంది. జానపద సాహిత్యంలో అది ప్రకృతి సిద్ధంగా ప్రజా జీవితంలో, సంస్కృతిలో భాగంగా సహజంగా జరుగుతుంది.

కవి తన సొంత భాషలోని పదాలని ప్రామాణిక సాహిత్య భాషలో ఉపయోగించడంతో ఆగడు. సాహిత్యంలో మాండలికంనుంచి మాండలికంలో సాహిత్యం వరకు ప్రయాణిస్తాడు. కొన్ని ప్రయోజనాలని దృష్టిలో వుంచుకుని మాండలికంలో సాహిత్యం సృష్టించడం జరుగుతుంది. సాహిత్యంలో మాండలికాలు అనివార్యంగా ప్రవేశించడానికి కారణాలు వున్నట్లే మాండలికంలో సాహిత్యం రావడానికి కూడా కారణాలున్నాయి.

## మాండలికంలో సాహిత్యం

ప్రామాణిక భాషకన్నా భిన్నమైన స్థానిక మాండలికంలో(local dialect), అప్రామాణిక మాండలికంలో(Sub - standard dialect) వచ్చిన సాహిత్యం మాండలిక సాహిత్యం కిందకు వస్తుంది. అందరూ నడిచే దారికీ, ప్రామాణిక భాషలో సాహిత్యరచనకీ భిన్నంగా అప్రామాణికం అనీ, సాహిత్య రచనకీ అనర్హమనీ కొందరు భావించే మాండలికంలో సాహిత్యాన్ని సృష్టించాలని పూనుకోవడానికి ప్రేరణగానీ, తాత్త్విక చింతనగానీ, ప్రయోజనోద్దేశ్యాలుగానీ వున్నాయోమోనని ఆలోచించాలి.

భాషకి మాండలికం సహజస్థితి గాబట్టి ప్రకృతిని ప్రేమించే- సౌందర్యారాధనా- దృష్టితో మాండలికంలో రచనలు చేయడానికి రచయితలు కొందరు పూనుకునే అవకాశాలున్నాయి. 'ప్రకృతిని యథాతథంగా స్వీకరించాలి. దాని సహజస్థితికి ఏమాత్రం భంగం కలిగించరాదు. ఒకవేళ ఏదయినా మార్పువచ్చినా అది సహజ సిద్ధంగా వచ్చిన మార్పయితేనే దాన్ని అంగీకరించాల'నే తాత్విక దృక్పథంతో- నిసర్గ సౌందర్య దృష్టితో - 'మాండలికంలో రచనలు జరగవచ్చు. మాండలికంలో వస్తున్న సాహిత్యం చాలా సహజంగా వుంటుంది - భాషలోని ఆత్మని పట్టుకోగలిగిన సాహిత్యం మాండలిక సాహిత్యమే' వంటి విమర్శలు కూడా ఈ ధోరణికే చెందుతాయి.

మానవ జీవిత సహజ చిత్రణ(Natural life description) కోసంకూడా మాండలికంలో రచన జరగవచ్చు. సహజ జీవిత చిత్రణలో పరిశీలన, విశ్లేషణకంటే వర్ణనకే ప్రాముఖ్యం వుంటుంది. మాండలికం మానవ జీవితంలో ఒక సహజ భాగం కాబట్టి ఈ ఉద్దేశంతో కూడా మాండలిక రచనలు జరగవచ్చు. పైన పేర్కొన్న ఆలోచనలో మార్పుని సైతం అంగీకరించని ప్రాకృతికమైన సౌందర్య దృష్టి మాత్రంవుంటే, ఇందులో జీవితచిత్రణతోపాటు అందులో వచ్చే మార్పులని సైతం యథాతథంగా వర్ణించడం వుంటుంది. మానవ జీవితంలో భాగమైన భాషని కూడా యథాతథంగా స్వీకరించడంకూడా అందుకే. ఈ జీవిత చిత్రణకి ఒక సామాజిక దృక్పథం వుండదు. ఉన్నది ఉన్నట్లుగా వర్ణించడమే రచయిత చేసేది.

జీవిత చిత్రణకి ఒక సామాజిక దృక్పథం తోడయినప్పుడు ప్రజల జీవితంలో వచ్చే మార్పులకి, సమస్యలకి కారణాలు వెతుకుతూ, సమస్యలకి పరిష్కారాలని అన్వేషిస్తూ మానవ

సంబంధాల పరిశీలనా దృష్టితో చేసే సాహిత్య సృజనలో సైతం మాండలికం ఒక సాధనంగా అవసరమవుతుంది. సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా పీడనకి గురవుతున్న ప్రజల పక్షం వహించి సాహిత్య రచనకి పూనుకున్న రచయిత తన సాహిత్యం ఏ ప్రజల అభ్యుదయం కోసం ఉద్దేశించబడిందో ఆ ప్రజలకి దగ్గరకావడానికి తన రాతల్లో వాళ్ల భాషనే ఉపయోగించడం అనివార్యంగా భావిస్తాడు.

అధిక సంఖ్యాకుల సంస్కృతిని ప్రతిబింబించడానికి వారి భాషనే సాహిత్య మాధ్యమంగా చేసుకోవాలనే ప్రజాస్వామ్య దృక్పథంలో మాండలిక సాహిత్యం పుడుతుంది.

మానవ సంబంధాల్ని పరిశీలించే క్రమంలో రచయిత సామాజిక అస్తవ్యస్త పరిస్థితుల్లో నలిగిపోతున్న అట్టడుగు వర్గం ప్రజల జీవితాన్ని కేవలం కారుణ్యదృష్టితో విశ్లేషించవచ్చు - లేదా, ఆ పరిస్థితుల్ని వ్యతిరేకిస్తూ - వాటికి విరుద్ధభావాలని ప్రతిపాదిస్తూ పరిష్కార మార్గాలు చూపవచ్చు. ప్రజలు చేసే జీవన పోరాటాల్ని బలపరుస్తూ వాటిని చిత్రించవచ్చు. అందుకు ప్రజల సాంస్కృతిక భాషని సాహిత్యరచనకు ఎన్నుకోవడం జరుగుతుంది.

ప్రజా సంస్కృతి పునాదిగా గల రచయితలూ, కవులూ తమ సాంస్కృతిక భాష సాహిత్య భాష- ప్రామాణిక భాషలముందు నిరాదరణకీ, నిర్లక్ష్యానికీ గురవుతున్నప్పుడు సాంస్కృతిక అస్తిత్వం కోసంచేసే పోరాటంలో భాగంగా కూడా మాండలిక రచనలు చేయడం జరుగుతుంది.

ప్రజలు జీవించిన జీవితం, అందులోని సంఘర్షణ, ఉత్పత్తి క్రమంలో వాళ్ళ సంస్పందననుండి పుట్టిన భాషలోనే - సాంస్కృతిక భాష - రచన చేయాలనే శాస్త్రీయ దృక్పథం మాండలిక సాహిత్యోత్పత్తికి కారణం అవుతుంది.

రచయితలు, కవులు తమ ప్రాంతీయ భాషమీదో, వర్గభాషమీదో అభిమానం కలిగివుండి తమ మాండలిక భాషా సంపదని పరిరక్షించుకోకపోతే (సాంస్కృతిక భాషా సంపదని) శిష్ట, ప్రామాణిక భాషాధిపత్యంలో మరుగునపడి నశించిపోతుందనే భావనతో దాన్ని కాపాడటానికీ, తమ ప్రాంత మాండలికంలో వున్న సహజసౌందర్యాన్ని తక్కిన ప్రాంతాలవారికి తెలియజేయాలనే తపనతోనూ, ఉత్సాహంతోనూ మాండలికంలో సాహిత్యాన్నందివ్వడానికి పూనుకోవచ్చు.

మాండలిక భాషలో వున్న సౌందర్యంపట్ల ఆకర్షితులై దానిమీద ఒకరకమైన మోజుతో శిష్టభాషా ప్రభావంనుంచి తప్పించుకోలేని రచయితలుకూడా మాండలిక సాహిత్య రచనానుకరణ చేయవచ్చు.

ప్రామాణిక (సాహిత్య) భాషలో సాహిత్యంచదివే పాఠకుల కోసం వినోదాన్ని అందివ్వడానికి హాస్యం ప్రధానంగా (మాండలికాల పట్ల చిన్నచూపు వుండటంవల్ల హాస్యం పుడుతుంది). మాండలిక రచనలు చేయడం జరుగుతుంది. నాటకాల్లో, సినిమాల్లో విదూషకులకీ, హాస్యపాత్రలకీ మాండలికం వాడటం ఈ ధోరణి కిందికే వస్తుంది.

ప్రామాణిక భాషాసాహిత్యాలతో మాండలిక భాషా సాహిత్యాలకు, ఏర్పడే సంఘర్షణ ఒక్కోసారి జాతుల సమస్యలో భాగంగాకూడా తయారవుతుంది. అందువల్ల పీడిత జాతుల పక్షాన కలం పట్టిన అభ్యుదయ / ప్రగతిశీల / ప్రజాస్వామ్యవాద రచయితలు సామాజిక పోరాటంలో **(Social struggle)** భాగంగా మాండలిక రచనని చేపడతారు.

ఒక వర్గ ప్రాంత భాషల ఆధిపత్య ధోరణిని నిరసిస్తూ గుర్తింపు చైతన్యంతో అణచివేతకు గురైన తను భాషా సంస్కృతుల్ని ఉన్నతీకరించే లక్ష్యంతో కూడా రచయితలు మాండలిక సాహిత్యాన్ని సృజిస్తారు.

మాండలికాలు భాషకి ప్రాథమిక దశ అయినప్పుడు, వాటిని సంస్కరించుకుని ప్రామాణిక రూపాన్ని ఏర్పరచుకొన్నప్పుడు, అది సాహిత్య భాషగా రూపుదిద్దుకుంటున్నప్పుడు మళ్ళీ మాండలికాలవైపు దృష్టి మళ్లించి అందులో సాహిత్యాన్ని సృష్టించడం మానవుడు సాధించిన అభివృద్ధిని కాదని వెనక్కు మళ్ళినట్లు అవుతుందికదా అని ఒక ప్రశ్న పుడుతుంది.

భాషకి ప్రామాణికత సాధించడం అంటే అందులో వచ్చే మార్పుని అడ్డుకోవడం కాదు. సమాజంలోని అన్ని వర్గాలఉకులాల ప్రాంతాల భాషల్ని కలుపుకుపోవడం ద్వారా ప్రామాణిక భాష ప్రజాస్వామ్య దృక్పథంతో బలపడుతుంది. వివిధ మాండలికాల చేరికతో ప్రామాణిక భాష మారుతూ మరింత పరిపూర్ణమవుతుంది. మాండలిక సాహిత్యం అందుకు ఉపయోగపడుతుంది.

మారుతున్న సమాజంలో విద్యావైజ్ఞానిక సాంకేతిక రంగాలు అభివృద్ధి చెంది ప్రసార సాధనాల సహాయంతో, రవాణాసౌకర్యాల పెరుగుదలవల్ల ప్రాంతాలమధ్య దూరం తగ్గిపోయి మానవుడుసాధించిన అభివృద్ధి ఫలితాలు సమాజంలో అన్నివర్గాలవారికీ సమంగా అంది సామాజిక అంతరాలు చెరిగిపోయి ప్రామాణిక భాషలో సమరూపత సాధించే వరకూ మాండలిక సాహిత్యం పుడుతూనే వుంటుంది. భాషలో అంతస్సంఘర్షణ కొనసాగుతూనే వుంటుంది.

# రెండో అధ్యాయం

# తెలుగు సాహిత్యంలో మాండలికం

''ప్రజల అండా ఆధారమూ కోల్పోయినందువల్ల సాహిత్య భాష తన జీవశక్తిని కోల్పోయింది. ఎందువల్లనంటే, మొత్తం సమాజం యొక్క నానావిధావసరాలను తీర్చుతూ వాటి మార్పులకు అనుగుణంగా తన ప్రతి అంగాన్ని మలచుకోలేని భాష ఏదీ సజీవంగా వుండజాలదు''

- విట్నీ : భాష, భాషాధ్యయనం

(గురజాడ అసమ్మతి పత్రంనుంచి ఉద్ధృతం)

# తెలుగు సాహిత్యంలో మాండలికం

## మొదటి భాగం : ప్రాచీన తెలుగు సాహిత్యంలో మాండలికం

వెయ్యిసంవత్సరాలకు పైగా లిఖిత సాహిత్య చరిత్ర, అంతకుమించిన మౌఖికసంప్రదాయం వున్న తెలుగు సాహిత్యంలో మాండలిక భాష ఏయే కాలాల్లో, ఏయే పరిస్థితుల్లో, ఎలాంటి స్థానాన్ని సంపాదించుకుందో తెలుసుకోవాలంటే లిఖిత - మౌఖిక సాహిత్యాలని ప్రత్యేకంగా పరిశీలించాలి.

తెలుగు సాహిత్యం రాజులనాశ్రయించుకొని వేరువేరు కాలాల్లో పరాయి ప్రాంతాలకి - కన్నడ, తమిళ దేశాలకి వలసపోయింది. ఆనాటికవులమీద ఆయా ప్రాంత భాషల ప్రభావం పడటంవల్ల సాహిత్యంలో భిన్న ప్రాంతీయ మాండలికాలు చోటుచేసుకున్నాయి. వ్యవహారబలం వల్ల కొన్ని కొత్త పదాలు వచ్చి చేరాయి; కొన్ని తర్వాతికాలంలో లుప్తమైపోయాయి. కాలగతిలో పదనిర్మాణం, వ్యాకరణ రీతులు కూడా మార్పులకి లోనయ్యాయి. ప్రాంతీయ మాండలికంతోబాటు జనవ్యవహారంలో వుండి అప్రామాణికంగా లాక్షణికులు భావించిన వర్గమాండలికాల్నికూడా సాహిత్య భాషలో కవులు ప్రయోగించారు. అయితే అర్వాచీన వ్యాకరణ గ్రంథాల సూత్రీకరణలనీ, అనుశాసనాలనీ ఆధారం చేసుకొని - అవి కూడా సమగ్రమైనవి కావు - ప్రాచీన కావ్యాలని పరిష్కరిస్తూ పండితులు ఎన్నో దిద్దుబాట్లు చేశారు. అందువల్ల ఆ శబ్దజాలాన్ని, వాటి వాస్తవ స్వరూపాన్నీ సరిగా తెలుసుకోలేకపోతున్నాం.

తెలుగు సాహిత్యంలో మాండలిక పదాల గురించి పరిశోధించడంలో ఎదురయ్యే పెద్ద చిక్కు యిది. అయినా దొరుకుతున్న ఆధారాలతోనే ముందుగా ప్రాచీన తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లో మాండలిక పదాల వ్యాప్తినీ, పరిమితుల్నీ పరిశీలించుకోవాలి. తద్వారా సాహిత్యంలో మాండ్లికం దశనుంచి మాండలిక సాహిత్యం ఏర్పడ్డ దశ వరకూ జరిగిన పరిణామాన్ని అంచనావేయడం సులభమవుతుంది.

### మార్గ కవిత

ప్రాచీన తెలుగు సాహిత్య భాష అనగానే మనకు స్ఫురించేది కావ్యభాషే. నన్నయకి పూర్వమే తెలుగులో కావ్యరచనాశైలి ఏర్పడిందనీ, ఆ శైలి ఆనాటి వాడుకభాషలకంటే భిన్నంగా వుందనీ ఆనాటి శాసనాలు నిరూపిస్తున్నాయి. లిఖిత సాహిత్య సంప్రదాయం మొదలయ్యాకా ఏర్పడ్డ కావ్యభాషకీ జనసామాన్యంలో వ్యవహారంలో వున్న వాడుక భాషకీ చాలా అంతరం వుందని కూడా ఆ శాసనభాషే తెలుపుతుంది.

తెలుగులో లిఖిత సాహిత్య సృజన మొదలవగానే అందులో భాష ప్రజల వ్యవహార భాషనుంచి వేరయిపోయింది. సంస్కృత సాహిత్యం క్షీణ దశలో వున్నకాలంలో తెలుగు సాహిత్య సృష్టి మొదలైన కారణంగా, ఆ క్షీణ దశ లక్షణాలైన భాషా, కళాసంప్రదాయాలు తెలుగు సాహిత్యంలో పాతుకుపోయాయనీ, సంకుచితమైన సామాజిక రాజకీయ సాహిత్యాలది పైచేయిగా వున్న సమాజ పరిస్థితులవల్ల కావ్యభాష ఉత్పన్నమైందనీ, అందువల్లే అది ప్రజలకు, ప్రజా సంస్కృతికి దూరమైపోయిందనీ పండితులు భావించారు.[1]

దీన్నిబట్టి తెలుగులో లిఖిత సాహిత్యం పుట్టుక వర్గ ప్రయోజనాలతో ముడివడి వుందని తోస్తుంది. విశాల ప్రజానీకం పాలక వర్గాల కోసమే శ్రమించే రోజులవి. శ్రమ పరాయీకరణకి లోనయి విరామకాలాన్ని అనుభవించే వర్గానికే సంపదలు పెంచుతున్న కాలంలో శ్రమజీవి శ్రమతోపాటు అతని కళలూ, సాహిత్యంకూడా పరాయీకరణకి గురవుతాయి. అందువల్లే తెలుగు సాహిత్యభాష సైతం సామాన్య ప్రజలనుంచి దూరమై పండితవర్గానికే పరిమితమై అదే లాక్షణికులకి కూడా ప్రమాణమయిందని భావించవచ్చు. అయినప్పటికీ సాహిత్యభాషలో ప్రజా వ్యవహారంలోని మాండలిక భాష ప్రవేశించింది.

ఇంతకు ముందు పేర్కొన్నట్లు కవి తన దైనందిన వ్యవహారం ప్రభావంనుంచి తప్పించుకోలేక పోవడంవల్లగానీ, సాహిత్యభాషలో వున్న పదంకన్నా జన వ్యవహారంలో నలిగిన మాండలిక పదం శక్తివంతం అని భావించడం వల్లగానీ, ఒకే పదానికి వేరువేరు అర్థచ్ఛాయలున్నప్పుడు తానాశించిన అర్థస్ఫురణ ప్రత్యేకమైన మాండలికపదం ద్వారా లభిస్తుందని అనుకొన్నప్పుడుగానీ, స్వవర్గ ప్రాంత భాషాభిమానంతో తన మాండలికానికి సాహిత్య గౌరవం కల్గించాలని ఆశించినప్పుడుగానీ మాండలికం కావ్యభాషలో స్థానం పొందినదని భావించవచ్చు. వ్యాకరణానుశాసనాలని కాదని 'శిష్ట సమాజం అసభ్య రూపాలుగా పరిగణించే కింది వర్గాల భాషారూపాలు తెలుగు కవిత్వ భాషలో' ఎన్నో వచ్చి చేరాయి.[2] ప్రాచీన తెలుగు సాహిత్యంలో వ్యవహార బలం వల్ల వచ్చిచేరిన పద ప్రయోగాల గురించి భాషాసాహిత్య వేత్తలు విపులంగా వివరించారు.[3]

అయితే కావ్యభాషలో కనిపించే వ్యావహారిక రూపాలని తీసుకుని ఈ వ్యవహారం ఈ మండలంలో ఉండేదని నిరూపించే వ్యవహార భేదరేఖలని(isogloss) ఈనాడు తేల్చి చెప్పడం కష్టం. అప్పటి రాజకీయ సరిహద్దులు ఈనాటి భాషా మండలాలు ఏర్పడటానికి ఒక కారణమేగానీ ఆ ఒక్క కోణంనుంచే వ్యవహార పరిమితినీ వ్యాప్తినీ నిర్ణయించలేం. అన్యభాషా సంపర్కంతో తెలుగులో ప్రవేశించిన అన్యదేశాల వ్యాప్తిని గుర్తించడంలోకూడా ఇదే చిక్కు ఉంది. ఆ పదాలు పరిమితమైన ప్రాంతంలో మాత్రమే వ్యాప్తి చెంది తక్కిన ప్రాంతీయుల వ్యవహారంలో చోటుచేసుకోనప్పుడు వాటిని మాండలికాలుగా గుర్తించవచ్చు. అప్పటి వ్యాప్తిని ఊహించాల్సిందే తప్ప నికరంగా తేల్చిచెప్పలేం. అరబ్బీ పారశీక భాషలు మొదట్లో

మహమ్మదీయుల పాలనలో ఆంధ్రదేశం అంతటా తమ ప్రభావం చూపాయి. కానీ మహమ్మదీయుల పాలన ఎక్కువ కాలం సాగిన తెలంగాణా ప్రాంతంలో ఆ భాషా పదాలు ఇప్పటికీ వ్యవహారంలో వినిపిస్తాయి. అయితే తక్కిన ప్రాంతాల్లో సైతం వ్యాపించి తెలుగుభాషా సంపదలో విలీనమైన వాటిని ( ఉదా: అసలు, కబురు, ఖర్చు, కలం, డబ్బా లాంటి పదాలు) ప్రత్యేక మాండలికాలుగా పేర్కొనకూడదు. కొన్ని పదాల వ్యాప్తి కొన్ని ప్రాంతాల్లో నశించిపోవచ్చు - దానికి కారణం కొత్త పదాలు పూరకాలుగా పనిచేయడమే. కొత్తగావచ్చిన పదం మిగతా ప్రాంతాల్లో వ్యాపించకుంటే అది ప్రాంతీయ మాండలికం అవుతుంది. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకునే - 16వ శతాబ్దికి ముందు తెలంగాణా ప్రాంతీయ మాండలికం ప్రత్యేకతను సంతరించుకున్న నిదర్శనాలు దొరకవు అని భాషాశాస్త్రవేత్తలు అభిప్రాయపడ్డారు.[4]

సంభాషణాశైలిని ఆశ్రయించిన చోట వ్యవహార బలంవల్ల మాండలిక శబ్దాలు కావ్యభాషలోకి వచ్చాయి. ఆశువుగా చెప్పిన చాటువుల్లో కూడా మాండలిక శబ్దాలని చూడవచ్చు. ఆశుకవిత్వంలో ఉండే మౌఖికమైన కూర్పు చాటువుల్లో మాండలికపదాల ప్రయోగానికి కారణం అవుతుంది.

'ప్రాతవడ్డ' మాటలన్ని పరిహరించాలన్న తిక్కనకవిత్వంలో, నానా దేశాలుతిరిగిన కవిగాబట్టి శ్రీనాథుడి కవిత్వంలోనే కాక మాండలిక పదాలు తక్కిన కవుల ప్రయోగాల్లో సైతం కనిపిస్తాయి. ఆనాడు కవులు ప్రయోగించినవీ, జన వ్యవహారంలో వున్నవీ ఎన్నో మాండలిక పదాలు పర్యాయపదాలుగా, రూపాంతరాలుగా నిఘంటువుల్లోకి ఎక్కాయి.[5]

శ్రీనాథుడి తర్వాత మాండలిక పద ప్రయోగం ఎక్కువగాచేసిన కవి ధూర్జటి.[6] జన వ్యవహార బలం నుంచికవులు తప్పించుకోలేరని ఆనాటి కావ్యభాషలో కన్పించే మాండలిక పదజాలం నిరూపిస్తుంది. ప్రబంధకాలం తర్వాత తెలుగుకవిత్వం ఎన్నో వింతపోకడలు పోయింది. పండిత వర్గానికి మాత్రమే పరిమితం అనుకున్న సాహిత్యం కొత్తదారులు తొక్కింది. స్త్రీ పురుష వ్యత్యాసం లేకుండా, కులమతాలభేదం లేకుండా ఎందరో కవులు కవయిత్రులు కవిత్వ రచన చేశారు. జన వ్యవహారంలోని భాషకి మునుపటికన్నా ఎక్కువ ఆదరణ కావ్యభాషలో లభించింది. పాత్రోచితభాషగా - గ్రామ్యభాష అని పిలువబడ్డప్పటికీ - శిష్టేతర వ్యవహారంలోవున్న మాండలిక భాషనికవులు స్వీకరించారు.

అవ్యవధానంగా ఉచ్చరించడంవల్ల జరిగే సంధులే కాదు- పదాల ఉచ్చారణా భేదాలు కూడాకవిత్వంలో వచ్చి చేరాయి. వీటిని అసాధురూపాలని కొట్టి పారేయకూడదు. 'మాండలీయకత'[7], మాండలిక వ్యవహారమే[8] ఈ ప్రయోగాలకి కారణమని పండితులు అభిప్రాయపడ్డారు. ఈడ, ఆడ, ఏడ, ఏంది, ఈబిడ, ఎంగిలయ్యాని, మెరుసుట, ఇస్తిని మొ॥ ఎన్నో పదాల ప్రయోగాలు కావ్యభాషలో చేరి దానికి కొంత జీవం, జవం చేకూర్చిపెట్టాయి. ఈ ప్రయోగాలకి లక్షణ బలం లేదు. ప్రజా పునాది తప్పితే. అషు ఇషు బోవకే అవునషే

కాదోషే[10] లాంటి ఛాందస వైదికుల మాటలు, విడుసు, సంపు, సూచి వచ్చినారు[11] మొ॥ వర్గమాండలికాలు పాత్రోచిత భాషగా కావ్యభాషలోకి స్వేచ్ఛగా ప్రవేశించాయి.

హాస్యంకోసం, తిట్టు కోసం మాండలిక పద ప్రయోగం చెయ్యవచ్చునని కొందరు లాక్షణికులు చెప్పారు. అయితే వారి పరిభాషలో అది గ్రామ్యభాష.

ఈసడములు గోరడములు

గాసర బీసరలునైన కట్టిడి పలుకుల్

భాసిల్లు గ్రామ్యములు నా

హాసోక్తులఁ దెగడు చోట నవియున్ వలయున్[12]

చంద్రశేఖర శతకంలో పరిహాసం తిట్టుకోసం వర్గ మాండలికాన్ని వాడటం అందుకు ఉదాహరణ.[13] అయితే ఆ భాష గ్రామ్యభాషనీ, దాన్ని ఉపయోగించేవారు పామరులనీ, మూఢులనీ నిందించారు. ప్రజల భాష శిష్టసాహిత్యంలో ఒక రకమైన నిరాదరణకి గురైందని దీనిద్వారా తెలుస్తుంది. అధిక్షేప శతకాల్లో చాలాచోట్ల ఇటువంటి పద్యాలు కనిపిస్తాయి. నిజానికి శతకసాహిత్యంలోని భాషగురించి ప్రత్యేకంగా పరిశీలించాల్సి వుంది.

**శతకాలు**

రాజస్థానాల్లోనికవులేగాక సామాన్య ప్రజానీకంనుంచి కూడా ఎంతోమంది కవులు వందలాది శతకాలురాశారు. నీతిజ్ఞాన భక్తి వైరాగ్యాల్ని బోధించడానికి పుట్టే శతకాల్లో ప్రచార గుణం సాధించడంకోసం ప్రజల భాషని వాడక తప్పదు. మకుట సంప్రదాయం వున్నతెలుగులో శతక పద్యాలకి సంభాషణశైలి ఏర్పడ్డ కారణంగాకూడా వాడుక భాష వాటిలో చోటుచేసుకుంది. తక్కిన కావ్యాల్లా కాకుండా సామాజిక జీవితాన్ని ప్రతిబింబించే శతకాల్లో ప్రజల భాష ఒక అవసరంగా ప్రవేశించింది. అంతేకాదు - సామాజిక రుగ్మతల్ని పరిహసించడానికీ, సమాజంలోని చెడుకి కారణమైన వ్యక్తుల్నీ లేదా మొత్తం సమాజాన్నీ సామాన్యంగా నిందించడానికీ ప్రజల భాషని శతకకవులు స్వీకరించారు. అందుకే శతకాల్లో మాండలిక శబ్దజాలం ఎక్కువగా చోటుచేసుకున్నట్టు పరిశీలనలో తెలుస్తుంది.

శతకకవులు ఉపయోగించిన భాషగురించి గిడుగు ఇలా అభిప్రాయపడ్డారు.

''ఒక శబ్దము సర్వజన సమ్మతమైనదనిన్నీ, సర్వజన విదితమైనదనిన్నీ, సర్వప్రియమైనదనిన్నీ రుజువు చేయుటకు సర్వజనీనమైన <u>పాటలోనూ శతకములోనూ</u> చూపించక తప్పదు. లోకులందరికీ తెలిసేటట్టు వ్రాయవలెనని కోరేవారు ఇట్టి శబ్దములే వాడుదురు''.[14]

గిడుగు శతకాలనీ పాటలనీ ఒకేవిధంగా ప్రమాణంగా స్వీకరించారు. పాటకి జనాదరణ కోసం ప్రజల భాష ఎంత అవసరమో శతకాలకికూడా అదే జనాదరణ కోసం ప్రజల భాష అవసరం. అందుకే వేమన, సుమతీ, కవిచౌడప్ప, గువ్వలచెన్నా లాంటి శతకాల్లో నిరాడంబరమైన సహజమైన వాడుక భాష కనిపిస్తుంది. అంతేకాదు ఈ శతకపద్యాలు ప్రజల్లోకి లిఖితరూపంగాకంటే మౌఖికంగానే చొచ్చుకెళ్లాయి. ముఖ్యంగా వేమన తన పద్యాల్ని రాయలేదు -చెప్పాడు. ఆశువుగా చెప్పిన ఆ పద్యాలకి మౌఖిక సాహిత్యానికుండే కూర్పు, ప్రసారంలాంటి లక్షణాలున్నాయి. గణానికీ గణానికీ పదాలుగావిడిపోవడం, పాదానికీ పాదానికీ వాక్యాలు ఇమిడిపోవడంలాంటి పద్యశరీర నిర్మాణంలోని మౌఖిక లక్షణాలు వేమన పద్యాలకి శ్రవణసుభగత్వాన్నే కాకుండా ధారణా సౌలభ్యాన్ని సైతం సాధించి పెట్టాయి.

వేమన ఒకడిలోనేకాదు వేమనలాంటి ప్రజా కవులు అందరిలోనూ ఈ శ్రవణ సుభగత్వం, ధారాశుద్ధి, ధారణాసౌలభ్యం, ప్రజల భాషలాంటి మౌఖిక సాహిత్య లక్షణాలు సామాన్యంగా కనిపిస్తాయి. తిరువళ్వార్, కబీర్, తుకారాం, సర్వజ్ఞ, వీరబ్రహ్మం వీళ్ళంతా శ్రామికవర్గానికి (వ్యావసాయక కుటుంబాలకు, తదనుబంధమైన వృత్తికులాలకు) చెందినవారు. శ్రమలో ఒక లయ వుంది. కమ్మరిపని, నేత పని, దంపుడు పని, ఏతం వేయడం ఏదయినా కావచ్చు - పనిపాటలకి విడదీయరాని సంబంధం ఉంది.[15] శ్రమలోవున్న లయ శ్రామిక జీవితంలోకూడా చోటుచేసుకుంటుంది. శ్రామికవర్గంనుంచి వచ్చిన ఈ కవుల, తాత్త్వికుల రచనల్లో శ్రమ సాన్నిహిత్యంతో అలవడిన లయ చోటుచేసుకుంది. శ్రమజీవులకి తమ జీవితంలోని లయ ఈ కవుల పదాల్లో విన్పించింది. అందుకే అవి ప్రజల నాలుకలమీద బతికాయి. ఈనాడు గద్దర్ పాటలకి లభించే ఆదరణకికూడా కారణం అదే.

ప్రజా సంస్కృతితో ముడివడి వున్న శతక సాహిత్యంలో అదే సంస్కృతికి వాహకంగా, వుండే భాషకూడా వుండటంలో వింత లేదు. తాము 'తేటతెనుగు' వాడుతున్నట్టు కూడా శతకకవుల్లో కొందరు చెప్పుకున్నారు.[16]

అలా అని చెప్పి అన్ని శతకాల్లోనూ ప్రజల జీవద్భాషకి సాహిత్య గౌరవం లభించిందని చెప్పలేం. కింది తరగతి ప్రజల్ని వాళ్ల భాషనీ అవహేళనచేస్తూ, నిందిస్తూ అధిక్షేప శతకాల్లో పద్యాలు కనిపిస్తున్నాయి. శిష్టభాషని అపభ్రంశం చేయడంద్వారా తయారుచేసిన వర్గమాండలికంలో పద్యాలు రాసి ఆ భాషని 'మోటు మానవుల యెడ్డి మాటలనీ,[17] 'పలు మోటు మాటలనీ', ఆ 'గ్రామ్యమునకు గలుగదెందు నాగరికముద్ర'[18] అనీ నిందించారు. మాండలిక భాషని పామర భాషగా ప్రాకృత మూర్ఖజనుల మోటు మాటలుగా వర్ణించిన ఈ కవులకి అసభ్య బూతుపదజాలాన్ని విశృంఖలంగా, నిరంకుశంగా వాడటానికి ఏ సంస్కృతీ -నాగరికతా అడ్డురాలేదు. అయితే తమ తిట్టు పద్యాలకి ప్రజల్లో ప్రచారం కోసం తమ ప్రాంతంలో జనవ్యవహారంలో వున్న మాండలిక పదాలని వీళ్ళుకూడా ధారాళంగానే

వాడుకున్నారు. ఇదే ధోరణి కొన్ని చాటుపద్యాల్లో కూడా గమనించవచ్చు.

అయితే వీటన్నిటికంటే భిన్నంగా దేశీ సాహిత్యంలో ప్రజల భాషకి ఉచితమైన స్థానం లభించింది. మార్గకంటే ఎన్నో తరాలముందు నుంచి ప్రచారంలోవుండి మార్గకవితతో పోటీపడుతూ ప్రత్యేకపాయగా దేశీ ప్రవహించింది. ఆంధ్రదేశంలో దేశికి సాహిత్యగౌరవం, పండితాదరణ కలగడానికి ఒక చారిత్రక నేపథ్యం వుంది.

రాజరాజ నరేంద్రుడి తర్వాత 12వ శతాబ్దంలో తెలుగునాట రాజకీయమైన, మతపరమైన సంక్షుభిత వాతావరణం ఏర్పడింది. తెలుగుదేశం చిన్న చిన్న మండలాలుగా (వెల్నాడు, పాకనాడు, పల్నాడు, కమ్మనాడు మొ॥) విభక్తమైంది. తమిళనాడులో రామానుజుని వైష్ణవం (1017-1137) వ్యాప్తిపొందుతున్న రోజుల్లోనే కొంచెం అటూఇటూగా కన్నడ దేశంలో బసవన్న ప్రతిపాదితమైన వీరశైవం నిప్పులా వ్యాపించింది. రెండు దేశాలకీ మధ్యనున్న ఆంధ్రదేశం మీద రెండు మతాల ప్రభావం తప్పనిసరిగా పడింది. శైవం అప్పటికే ఆంధ్రదేశంలో వ్యాపించివున్న కారణంగా వీరశైవానికే ముందు ఆదరణ లభించింది. శైవవైష్ణవాల మధ్య సంఘర్షణ కూడా చోటుచేసుకుంది. అలాంటి పరిస్థితుల్లో మత ప్రచారానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా స్వీకరించడం జరిగింది. వీరశైవ వైష్ణవాలు వైదిక మతంలోంచి వచ్చినవేగానీ అందులోని బ్రాహ్మణాధిక్యతమీద కులవ్యవస్థ మీద వ్యతిరేకతని ప్రదర్శించాయి. వైష్ణవమతానుయాయి బ్రహ్మనాయుడి 'చాపకూడు' వ్యవహారం అందులో భాగమే. అంతటితో ఆగిపోకుండా కులాంతర వివాహాలవరకూ దారితీసిన వీరశైవం ప్రజల్ని మరింత ఆకర్షించింది. సమాజంలోని కిందితరగతి చేతివృత్తులవారినీ, శ్రామికవర్గాన్నీ తనవైపు తిప్పుకుంది. కులనిరసన - సర్వసమత వారిని ఆకట్టుకుంది.

ఈ మత ప్రచారానికి సాహిత్యం ఒక సాధనమైంది. అందుకు ప్రజల్లో ప్రచారానికి అనువైన భాషనీ, ఛందోరీతుల్నీ స్వీకరించడం జరిగింది. ప్రజల దగ్గరకు చేరుకోడానికనువైన దేశీ సాహిత్య ప్రక్రియల్ని శైవకవులుపయోగించుకున్నారు. పాడుకోడానికనువైన 'ద్విపద'కి శైవసాహిత్యం ఊపిరిపోసింది. పాటకనువైన భాషగా ప్రజల సాంస్కృతిక భాష (దేశీభాష)కి శైవసాహిత్యంలో విశిష్టమైన స్థానం లభించింది.

## ద్విపద

దేశీప్రక్రియ అయిన ద్విపదకి దేశీయ భాష అవసరాన్ని గుర్తించడంవల్లే 'జానుతెనుగు' రంగంలోకి వచ్చింది. ఎవరెన్ని అర్థాలు చెప్పినా ప్రజలకు సులభంగా అర్థమయ్యే సరళమూ, లలితమూ అయిన తెలుగే జానుతెనుగని భావించవచ్చు. తాను రచించేది 'తేట తెనుగు'లోనని, ద్విపద తక్కిన గద్యపద్యాది ప్రబంధాలతో సమమనీ, అంతకుముందున్న కావ్యభాష 'సర్వసామాన్యం' కాని కారణంగా 'జానుతెనుగు' స్వీకరించాననీ పాల్కురికి సోమన

చెప్పుకున్నాడు.[19] మత ప్రచారం కోసం తానీపని చేస్తున్నట్లు సోమన పేర్కొనలేదు గానీ అది పరమార్థమనీ దాన్ని సాధించడంకోసమే సామాన్య ప్రజల దగ్గరికి సాహిత్యాన్ని తీసుకుపోవడానికే సోమన ప్రజల భాషనీ, దేశీ ఛందస్సునీ, దేశీ ఇతివృత్తాల్ని స్వీకరించాడని చెప్పకుండానే తెలుస్తుంది.

కూర్పులో వైయక్తిక రచనలు అయినప్పటికీ రంగనాథ రామాయణంలాంటి ద్విపద సాహిత్య గ్రంథాలు ప్రసారంలో, ప్రదర్శనలో సమష్టి రూపాన్ని పొంది మౌఖిక లక్షణాలుకలిగి వున్నాయి. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథలయితే పూర్తిగా మౌఖిక ధోరణికి చెందినవే. బసవపురాణం, రంగనాథ రామాయణం లాంటివి కూడా ప్రధానంగా వినడానికి ఉద్దేశించినవే.[20]

అందువల్ల వాటిలో ప్రజల భాష అనివార్యంగా చోటుచేసుకుంది. సాహిత్యం ప్రచారం కోసం వుద్దేశించినదైనప్పుడూ - మౌఖికరూపాన్ని ధరించినప్పుడూ అందులో భాష ప్రజల సంస్కృతితో ముడివడి వున్న భాష అయి తీరుతుందని తెలుగులో ద్విపద సాహిత్య పరిశీలనద్వారా తెలుస్తుంది. కేవలం భాషకి చెందిన పదాలే కాదు- ఉచ్చారణ ధ్వనులూ, ఊనికలూ, స్వరాలూ యివన్నీ ప్రజా వ్యవహారంలో విన్పించే యాసతో సహా ద్విపద సాహిత్యంలో కనిపిస్తాయి. ఈ విధంగా మాండలిక భాష ఒక సామాజిక అవసరంగా సాహిత్యంలో ప్రవేశించడాన్ని తెలుగులో శైవవైష్ణవ సాహిత్యాలు నిరూపిస్తున్నాయి. సామాజిక అవసరాలకు అనుగుణమైన మార్పు కవిత్వంలో వచ్చినప్పుడల్లా అది భాషలో ప్రతిఫలిస్తుందని తెలుగులో వచ్చిన మార్గదేశీ సాహిత్య ప్రక్రియల్ని పరిశీలించినప్పుడు మనకర్థమవుతుంది.

ద్విపదల తర్వాత సంగీత సాహిత్యాలకి సమ ప్రాధాన్యం ఇచ్చిన మరో దేశీ సాహిత్య ప్రక్రియ పద కవిత. అందులోకూడా మాండలిక భాష ఎక్కువగా కనిపిస్తుంది. అంతేకాదు కొన్ని పదాలు పూర్తి మాండలికంలో వుండటం చూస్తే పదకవితలో మాండలికానికి ఒక ప్రత్యేక స్థానం వుందని తెలుస్తుంది.

## పదకవిత

మార్గకవితకన్నా ముందు ఏనాటినుంచో దేశీ కవితారీతులుగా ఎన్నో పదాలు జానపదుల జీవితంలో భాగంగావుంటూ వచ్చాయి. పాల్కురికి, నన్నెచోడుడు పేర్కొన్న రోకటి పాటలు, గౌడగీతికలు, ఊయలపాటలు లాంటివి పద సాహిత్యానికి శ్రమతోవున్న అవినాభావ సంబంధాల్ని తెలియజేస్తున్నాయి. ఆనాటి పదాలు కొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. కొన్ని నిబద్ధ చందోరూపం ధరించి తరువోజలు, మధ్యాక్కరలు, రగడలు, సీసాలుగా నన్నయకి ముందున్న శాసనాల్లోనూ, నన్నయ భారతంలోనూ కనిపిస్తాయి. తాళ్లపాక కవులు, క్షేత్రయ్య,

సారంగపాణి, త్యాగయ్యలాంటివాళ్లు తమ కాలంలో ప్రచారంలో వున్న పదాల్ని స్వీకరించి ఆ దేశీయ గేయఫణితుల్లోనే వేలాది పదాలు సృష్టించారు. భక్తివైరాగ్యాలతోపాటు శృంగారాన్ని కూడా జోడించి ఈ కవులు కూర్చిన పదాలు అట్టడుగు వర్గ ప్రజలకి చేరువ కాలేకపోయాయి. సంగీత శాస్త్రజ్ఞులు ఈ పదాలకి స్వరప్రస్తారాలూ, రాగాలూ, తాళాలూ నిర్ణయించారు. దాంతో వాటికి శాస్త్రీయ రూపం ఏర్పడిపోయింది. ప్రజలనుండి ముడిసరుకు స్వీకరించారుగానీ ఆ సాహిత్యం ప్రజలకు దగ్గరకాలేకపోయింది. దేశీ పద కవితలకి శ్రోతలు జానపదులైతే ఈ శాస్త్రీయ పదకవితలకి కొత్త శ్రోతలు ఏర్పడ్డారు. అంతేకాదు అవి ప్రత్యేక గాయక వర్గానికే పరిమితమయ్యాయి.

ఏగంటివారి వచనాలు, వీరబ్రహ్మం కాలజ్ఞానం, సిద్ధప్ప తత్త్వాలు ప్రజలకి చేరువైనట్లు అన్నమయ్య కీర్తనలుగానీ, క్షేత్రయ్య, సారంగపాణి పదాలుగానీ, త్యాగరాజు సంకీర్తనలుగానీ - ప్రజల నాలుకలమీద ఆడకపోవడం గమనించాల్సిన విషయం. సంగీత వైదుష్యం, శాస్త్రీయత అనేవి పదకవులకీ, ప్రజలకీ మధ్య అడ్డుగా నిలిచాయి. ఆ అడ్డు తత్త్వకవుల విషయంలో లేదు. అదీగాక తత్త్వకవులు కిందికులాలనుంచి వచ్చిన వాళ్ళు. వాళ్ళంతా భక్తివైరాగ్యాలని బోధించారు. కులం పేరిట సమాజంలో తామనుభవించిన హైన్యాన్ని కూడా చూపగలిగారు. దైనందిన జీవిత కోణాలని స్పృశించిన కారణంగా కూడా తత్త్వకవులు ప్రజలకు దగ్గరయ్యారు. ఈ పరిస్థితి భారతదేశం అంతటా కొంచెం అటూఇటూగా ఒకే కాలంలో జరిగింది. జయదేవుడు, లీలాశుకుడు, వల్లభాచార్యులు, మీరాబాయి వంటి వాళ్ళు మధురభక్తిని ప్రచారం చేశారుగానీ సర్వజ్ఞుడు, నామదేవ్, తుకారాం, వీరబ్రహ్మం, కబీరువంటి వారు కులాల హెచ్చుతగ్గులమీద దృష్టిసారించారు. పరమతస్థుల రాజ్యాధికారంనుంచి, స్వమతస్థులైన రాజుల - పాలెగాళ్ళ - భూస్వాముల దుర్ణయాలనుంచి ఈ కవుల తాత్త్విక ప్రచారం ప్రజలకి కొంత ఊరట కలిగించింది. కాసేపు కష్టాలని మరిపించే భక్తికికూడా అందుకే ప్రచారం లభించింది.

తెలుగులో పద కవితలకి ప్రజలు గాయకులుగా మారలేదు; కానీ తత్త్వాలని పాడుకున్నారు. తత్త్వకవులు ప్రజా పునాదిని వదలకపోవడమే అందుకు కారణం.

పదకవిత్వం మౌలికంగా దేశీ మౌఖిక సంప్రదాయానికి చెందిన శ్రవ్యరూపం. అందువల్ల అన్నమయ్య లాంటివాళ్ల పదకవితలో శ్రవ్యభాషకు తగిన శబ్దజాలం ప్రవేశించింది. గొబ్బిళ్ళో, అల్లోనేరెళ్ళో, జాజర, సువ్విపాట, ఛాంగుబళా, తందనానా, ఉయ్యాల, చందమామ లాంటి అన్నమయ్య పదాలన్నీ జానపద గేయ పద్ధతుల్ని అనుసరించినవే. కేవలం అన్నమయ్యే కాదు నాటినుంచీ నేటివరకూ జానపదగేయానుకరణ జరుగుతూనే వుంది. వీటన్నిటినీ జానపద గేయ సాహిత్యంలో చేర్చనక్కరలేదని పరిశోధకులు భావించారు.[21] అంతేకాదు వీటన్నిటినీ జానపదాభాస సాహిత్యంగా **(Fake literature)** పరిగణించారు.[22] అందువల్ల ఆ సాహిత్యంలో వినిపించే భాష కూడా ప్రజల భాషఅని చెప్పలేం. అది కూడా అనుకరణే. పదకవితలో భావాలు,

కవిసమయాలు ప్రబంధకాలంనాటి కవుల మార్గకవితా ధోరణికి చెందినవే అయివుండటం కూడా గమనించవచ్చు. అయితే అన్నమయ్య, క్షేత్రయ్య, సారంగపాణి పదాల్లో జానపద భాషని అనుకరించడంవల్ల వర్గ, ప్రాంత మాండలికాలెన్నో చోటుచేసుకున్నాయి.[23]

జానపదగేయ రీతుల్ని, శైలినీ, కొంతవరకు భాషనీ కొల్లగొట్టి శిష్టభావాల్నే వ్యక్తంచేసిన పదకవిత ప్రజాసాహిత్యరూపాన్నీ, భాషనీ పాలకవర్గ భావజాల ప్రచారానికే పరిమితంచేసింది.

'తిక్కన తరువాత తేటతెలుగు నుడులతో, పలుకుబళ్ళతో పదాలు అల్లిన జాతీయ కవిగా క్షేత్రయ్య',[24] 'పామర ప్రజల వాడుక భాషలో జాతీయ పదాల్ని'[25] కట్టిన ప్రజాకవిగా సారంగపాణి భాషావిషయకంగా విమర్శకుల మెప్పుపొందారు.

నిజానికి తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తన లక్షణంలో శృంగార పదాల్లో గ్రామ్యోక్తులు ఉపయోగించవచ్చని చెప్పిన[26] పద కవితాలక్షణానికి అనుగుణంగా క్షేత్రయ్య, సారంగపాణి జానపద భాషలో పదరచన చేశారు.

సారంగపాణి పదాల్లోని భాషని చూసే ఎస్.గంగప్ప 'అతని భాష ప్రజల భాష; అతడు ప్రజాకవి'[27] అని అన్నారు. అయితే కేవలం ఉపయోగించే భాషని బట్టే ఒక కవిని ప్రజాకవిగా నిర్ధారించలేం. ప్రజల దగ్గర్నుంచీ భాషనీ, రూపాన్నీ స్వీకరించి పదాలు కూర్చడంలో సారంగపాణి అన్నమయ్య క్షేత్రయ్యలకంటే ఒకడుగు ముందున్నాడేమోగానీ పదకవులందరూ ఆదరించిన వస్తువు - శృంగారం, మధురభక్తి, వైరాగ్యం - కావడం మూలంగా ప్రజా జీవితాలు పునాదిగా లేని కారణంగా గంగప్పగారి మాటని ఆమోదించలేం. త్యాగయ్య విషయానికొస్తే సంగీతం అతని సాహిత్యాన్ని మించిపోయింది. 'అతను పాట నేర్చినంత శ్రద్ధతో మాటను నేర్వలేదు'.[28] వీరందరికంటే భిన్నంగా తత్త్వకవులు ప్రజాసామాన్యానికి దగ్గరయ్యారు.

## తత్త్వకవిత

పాత సమాజం శిథిలమైపోయి మానవతా విలువలన్నీ ధ్వంసమైపోతున్న రోజుల్లో కాలజ్ఞానంవంటి తత్త్వాలు ప్రచారం పొందడం గమనించాల్సిన విషయం. వీరబ్రహ్మం, సిద్ధయ్య, ఏగంటివారి తత్త్వాలకి విశేష ప్రచారం లభించడానికి ముఖ్యకారణం తత్త్వబోధలో గేయానుకూలత - ప్రజల భాష - అనే మౌఖిక లక్షణాలు చోటుచేసుకోవడమే అని చెప్పాలి.

వేమన పద్యాలలాగానే ఈ తత్త్వాలకి శ్రోతలూ - గాయకులు ఉన్నత వర్గాల వారుకారు. పైవర్గాలవారి వేదాంతం సంస్కృతంలో ఉపనిషత్తుల్లో వుంది. తెలుగులో వచ్చిన ఈ తత్త్వాలకి గాయకులూ - శ్రోతలూ -కర్తలూ కూడా కిందితరగతి ప్రజానీకమే. అందువల్లే తత్త్వాల్లో ప్రజాజీవితంతో ముడిపడి వున్న భాష ప్రవేశించగలిగింది. తెలుగులో ద్విపద - పద - తత్త్వకవితల్లో మాండలికం ప్రవేశించడానికి హేతువులు పరిశీలించాకా ప్రదర్శనోద్దిష్టమైన

యక్షగాన ప్రక్రియలో ప్రజల భాష గురించి కూడా వివేచన చేయవలసి వుంది.

## యక్షగానం

మార్గనాటకానికన్నా భిన్నంగా కురవంజి, తోలుబొమ్మలాటలు, వీథినాటకం లాంటి జానపద కళారూపాలనుంచి పాత్రల్నీ, పద్ధతుల్నీ ఇముడ్చుకుని, దేశీ సంగీత ఛందో రీతులెన్నిటికో (ద్విపద, రగడ, దరువు, జక్కిణి, త్రిస్తబకాలు మొ॥) పాదయిన యక్షగానం పండితవర్గాన్నే కాక సామాన్య జనాన్ని సైతం ఆకర్షించింది. అందువల్లనే భాషలో సైతం మార్పు అవసరమైంది. ఏదైనా ఒక సాహిత్య ప్రక్రియ ప్రజలకి సన్నిహితం కావాలంటే అందులో ప్రజల భాష ఉపయోగించక తప్పదని యక్షగానంకూడా నిరూపించింది. సంభాషణలో ప్రదర్శనకి అనుగుణమైన వ్యావహారికమే కాదు- సింగి, సింగడు, ఎరుకలసాని, పురోహితులు, గొల్లలు మొదలైన పాత్రలకి పాత్రోచిత భాషగా వర్గమాండలికం కూడా యక్షగానాల్లో విస్తృతంగా కనిపిస్తుంది. ఆనాటి పద్యకావ్యాల్లో ప్రవేశించిన వ్యావహారిక మాండలిక పదజాలం కంటే భిన్నంగా సంభాషణరూపంలో కన్పించే యక్షగాన భాష ఆనాటి వచన స్వరూపాన్ని తెలియజేస్తుంది.

ప్రదర్శనానుగుణంగా సామాజికుల స్థాయిని బట్టి సంభాషణల్లోని భాషని మార్చుకోవడం యక్షగానాల్లో కనిపిస్తుంది.[29] హాస్యరస పోషణకి పాత్రోచిత భాషని ప్రయోగించడం ద్వారా కూడా యక్షగానాల్లో మాండలికం ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకుంది.

ఆవిధంగా తెలుగు పద్య, పద, నాటక రూపాల్లో ప్రజల సాన్నిహిత్యాన్ని పొందే క్రమంలో ప్రచారం కోసం, ప్రదర్శనకోసం ఒక అవసరంగానూ, చాలా సహజంగానూ ప్రజల భాష ఉపయోగించడం జరిగింది. యక్షగానాల్లోని సంభాషణలు, వచనం కూడా అయిన కారణంగా వచనంలో ఆనాటి జన వ్యవహారం, మాండలికం గురించి తెలుసుకోవడానికి వీలవుతుంది. పద్యభాషకన్నా వచనభాష భిన్నమైంది. పద్యంకన్నా వచనంలో వాడుక భాషని ఉపయోగించడానికి ఎక్కువ వీలుంటుంది. తెలుగు వచన రచనలని పరిశీలిస్తే జనవ్యవహారంలోని మాండలికాలెన్నో కనిపిస్తాయి.

## వచనం

గిడుగు (గద్యచింతామణి), నిడదవోలు వేంకటరావు (ఆంధ్ర వచన వాఙ్మయం), యం.కులశేఖరరావు (ఆంధ్రవచన వాఙ్మయం), బూదరాజు రాధాకృష్ణ (వ్యావహారిక భాషా వికాసం), తెలుగువచనంలో కనిపించే వ్యావహారిక భాషగురించి, అందులో భాగమయిన మాండలికం గురించి వివరించారు.

తెలుగులో సాహిత్య సృజన మొదట్నుంచీ అధిక భాగం చంపూ రూపంలో జరిగిన కారణంగా స్వతంత్ర నాటక రచనకానీ, ప్రత్యేక వచన రచనగానీ చాలా ఆలస్యంగా మొదలైంది. 16వ శతాబ్దంనుంచీ చెదురుమదురుగా వచన రచనలు వెలువడటం మొదలైంది. అచ్చుయంత్రాలు వచ్చేనాటికి ఇంగ్లీషు సాహిత్య ప్రభావంవల్ల ఆనాటి చారిత్రక సామాజికావసరాల కనుగుణంగా వచన రచనల పరిధి, ఆవశ్యకత విస్తృతమైంది.

అంతకుముందు చంపూ రచనల్లోని గద్యభాగాల్లా కాకుండా యక్షగాన ప్రక్రియలో సంభాషణలు వ్యావహారికానికి దగ్గరగా వుండి గద్యరచన్లోకి, తద్వారా పద్యాల్లోకి సైతం వాడుక భాష, మాండలికం చొరబడటం గమనించవచ్చు. ఒకవిధంగా ఆ గద్యం సాహిత్యభాషలోకి మాండలికం విస్తృతంగా ప్రవేశించడానికి రాజమార్గం వేసింది. అంతేకాదు వ్యావహారిక భాషలో వెలువడ్డ శాసనాల్లోని అధికారిక భాషాశైలి(**Official language style**) వచన సాహిత్యంలోకి కొన్నిచోట్ల దిగుమతయింది. ఆ ఒరవడిలో వచ్చిందే 'రాయ వాచకం'.

సాహిత్య విలువలకన్నా చారిత్రకాంశాలకి ప్రాధాన్యం ఇచ్చిన కారణంగా సాహిత్య భాషకి భిన్నమైన రాజ్యపరిపాలనా వ్యవహారాల్లో ఉపయోగించిన శిష్ట వ్యావాహారిక భాష మాండలిక పదాలతో సహా రాయవాచకంలో చోటుచేసుకుంది.

అంతకుముందు భక్తి మత వేదాంతాలకి సంబంధించిన తాళ్లపాక పెద తిరుమలయ్య - వేంకటేశ్వర వచనము మొ॥ రచనల్లో, లౌకిక విషయాలకి సంబంధించినదైనప్పటికీ ఏకామ్రనాథుడి ప్రతాప చరిత్రలో గ్రాంథిక భాషే ఉపయోగించడం జరిగింది. పుట్టడం ద్రావిడ దేశంలోనే అయినా తమిళ భాషా ప్రభావం అంతగా పడని[0] రాయవాచకంలో ఆనాటి ఆంధ్రుల నిత్య వ్యవహారంలో వున్న భాషే కనిపిస్తుంది.

మరో విశేషం ఏమంటే రాయవాచకం భాష నోటిమాటను యథాతథంగా రాతలో చూపించడానికి ప్రయత్నించింది. ఆనాటి ప్రజల మౌఖిక భాషా స్వరూపాన్ని తెలుసుకోవడానికి రాయవాచకం సరైన ప్రమాణం. రాజకీయ వ్యవహారాలని నడిపే అధికార వర్గీయుల భాష కాబట్టి రాయవాచకంలోని భాషని వర్గమాండలికంగా పేర్కొనవచ్చు. ఆవిధంగా రాయవాచకాన్ని తెలుగులో మొదటి మాండలిక వచన రచనగా పేర్కోవడంలో అసమంజసత లేదు.

రాయలవారి శౌర్యపరాక్రమాల్నీ, రాజనీతి చాతుర్యాన్నీ ప్రచారం చేయాలనే ఉద్దేశంవల్ల ప్రజలకి సులభంగా అర్థమయ్యే భాషలో రాయవాచకం రాయడం జరిగింది.

యక్షగానాలు ఒకే కాలంలో వేరువేరు ప్రాంతాలనుంచి ( ఆంధ్ర, తెలంగాణా, దక్షిణాంధ్ర) వెలువడ్డ కారణంగా అందులోని వచనంలో ప్రాంతీయ మాండలికాన్ని కూడా చూడవచ్చు.

అచ్చుయంత్రాలు రాకముందు పద్యసాహిత్యంతో పోల్చి చూసుకున్నప్పుడు తెలుగులో గద్యరచనలు తక్కువే. దొరికేవాటిల్లో భాషని కూడా అచ్చుయంత్రాలు వచ్చాకా పండిత పరిష్కర్తలు గ్రాంథికంలోకి అచ్చొత్తించారు. రాయవాచకం లాంటివి చెదురుమదురుగా వాడుకభాషలోనే లభిస్తున్నాయి. శాసనాల్లో, వ్యాఖ్యానాల్లో, టీకాటిప్పణుల్లో కూడా భాష వ్యావహారికానికి దగ్గరగా ఉండేది.[30a] ఇవన్నీ ఆనాటి వచన రచనా భాషని తెలియజేస్తాయి.

ఇంతవరకూ పరిశీలించిన విషయాలన్నీ క్రోడీకరిస్తే తెలుగు సాహిత్యంలో మాండలికం ప్రవేశించడానికి స్థూలంగా ఈ కింది కారణాలని పేర్కొనవచ్చు.

- సాహిత్యం అధిక సంఖ్యాకులైన సామాన్య ప్రజానీకానికి చేరువ కావాలనుకున్నప్పుడు,

- ఏదయినా ఒక ధర్మాన్నీ, నీతినీ, భక్తినీ ప్రచారం చేయదలచినప్పుడు,

- సాహిత్యంలో వస్తువు సామాజికమై సమకాలీన విషయాన్ని ప్రతిబింబించదల్చినప్పుడు,

- శిష్టేతర వర్గాలనుంచికూడా కవులు సాహిత్య సృజనకు పూనుకున్నప్పుడు తెలుగు సాహిత్యం మౌఖిక సంప్రదాయానికి దగ్గరయింది. రూపం మౌఖికమయినప్పుడు లిఖిత సాహిత్యంలో కన్నా భిన్నంగా ప్రజల సాంస్కృతిక జీవితంతో ముడివడివున్న భాష సహజంగానే చోటుచేసుకుంది.

అయితే లిఖిత సాహిత్య సంప్రదాయ ప్రభావం పడ్డ ద్విపద, పద కవితల్లో పూర్తిగా మౌఖికభాష ప్రవేశించ లేదు. అదీకాక ద్విపద, పద కర్తలు పండితవర్గానికి చెందిన వాళ్లయిన కారణంగా కూడా వాటిని పూర్తిస్థాయి మౌఖికరచనలుగానూ, మాండలిక సాహిత్యంగానూ పేర్కొనలేం.

వీటికి భిన్నంగా జానపద సాహిత్యం అంతా పూర్తిగా మౌఖిక సంప్రదాయానికే చెందింది. చదువులేని పామర వర్గానికి చెందిన సాంస్కృతిక భాషలో జానపద సాహిత్యం వెలువడింది. జానపదుల సంస్కృతి, ఆలోచనలు, భావాలు, భావ వ్యక్తీకరణ పద్ధతులు శిష్టసంస్కృతి కంటే అన్ని విధాలా భిన్నంగా వుంటాయి. అందువల్ల జానపదుల భాషకూడా శిష్టభాషకన్నా భిన్నమైందే. ఇక్కడ భాష కేవలం పదజాలానికి పరిమితమైందికాదు. అది సంస్కృతిలో భాగం - సమాజం వర్గాలుగా విడిపోయిన కారణంగా వర్గ సంస్కృతి కూడా వేరుగా రూపొందుతుంది. జానపదుల సంస్కృతిని ప్రసారం చేస్తూ వారి భాషసాహిత్యంలో కనిపించే తీరుని పరిశీలించాల్సి వుంది.

# తెలుగు సాహిత్యంలో మాండలికం

## రెండో భాగం : జానపద సాహిత్యంలో మాండలికం

జానపదుల భాష వారి జీవితం లాగేనే సూటిగా, సహజంగా ఉంటుంది. సజీవమైన ఆ భాషలో కృత్రిమత్వం వెదికినా కనిపించదు. శిష్టసాహిత్య భాషకున్న వ్యాకరణాల అనుశాసనాలు లేకపోవడం మూలాన జానపద సాహిత్యంలో భాష నిజజీవిత వ్యవహారం కంటే భిన్నంగా వుండదు. కావ్యభాష జన జీవన వ్యవహారంనుంచీ దూరమైపోయి వుండటం అందరికీ తెలిసిన సంగతే. ఆ పరిస్థితి జానపద సాహిత్యంలో కనిపించదు - అందుకే జానపద ప్రక్రియలన్నిటా (పాట, కథ, నాటకం మొ॥) నిత్యజీవన వ్యవహారంలో వినిపించే పదబంధాలూ, నానుడులూ, జాతీయాలూ, సామెతలూ చాలా సహజంగా చోటుచేసుకునుంటాయి. కావ్యభాష కేర్పరచుకున్న వ్యాకరణం జానపద సాహిత్యానికుండదు - అంటే జానపదుల భాషకి వ్యాకరణమే వుండదనుకోకూడదు - వ్యవహారంలోని భాష తన వ్యాకరణాన్ని తానే నిర్మించుకుంటుంది.[31]

జానపద సాహిత్యంలో భాష అన్నప్పుడు - దాదాపు జానపద సాహిత్యమంతా వర్గమాండలికానికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. జానపదగేయాలూ, కథాగేయాలూ, కథలు కళారూపాలు ప్రత్యేక ప్రాంతంలో మాత్రం ప్రచారంలో వున్నవి ఎన్నో లభిస్తున్నాయి. వాటిలో వర్గమాండలికంతోపాటు ప్రాంతీయ మాండలికం కూడా వుంటుంది.

శిష్టసాహిత్యంలో మాండలిక పదాలని వెదుక్కున్నట్లు జానపద సాహిత్యంలో మాండలికేతర పదాలని వెదుక్కోవాలి. జానపద భాషని క్షుణ్ణంగా ఒక పథకం ప్రకారం పరిశీలిస్తే తెలుగు మాండలిక భేదాల్ని స్థాపించి మాండలికాలను నిర్ణయించగలమనీ, జానపద సాహిత్య భాషనీ భాషా శాస్త్ర దృష్ట్యా వివేచించాలని పండితులు భావించారు.[32]

ఏ ప్రాంతంలో పుట్టి ప్రచారమవుతుందో ఆ ప్రాంతీయ మాండలికం వుండటం జానపద సాహిత్యానికి సహజ గుణం.[33] అంతేకాదు - విశ్రాంతివర్గం వారి సాహిత్యభాషకన్నా భిన్నమైన శ్రామిక సంస్కృతితో ముడివడివున్న భాష జానపద సాహిత్యంలో కనిపిస్తుంది. ఆ భాష వారి సంస్కృతి నుంచి విడిపోయి వుండదు. ఆచారాలూ, నమ్మకాలూ, వ్రతాలూ, నోములూ, క్రతువులూ, పండుగలూ, పబ్బాలు వీటిని జానపద సంస్కృతిగా పరిగణించడం సామాన్యంగా జానపద విజ్ఞాన విశ్లేషణలో జరుగుతుంది. కానీ ఇవిగాక వీటన్నిటికీ మూలమైన శ్రమజీవన సంస్కృతి జానపదులది. మౌలికంగా జానపదుల సంస్కృతి శ్రమ. అది వారి వర్గ సంస్కృతి. ఆ సంస్కృతి జానపద సాహిత్యంలో అడుగడుగునా కనిపిస్తుంది. జానపద సాహిత్యంలో చోటుచేసుకునే భాష ఆ సంస్కృతి వాహకం. భాష కేవలం భావ ప్రచారానికే కాకుండా సంస్కృతి వాహకం [illegible]చేయడం జానపద సాహిత్యంలో ప్రత్యేకంగా గమనించాల్సినవిషయం.

పాట

జానపద గీతాల్లో వాడే పదబంధాలూ, పోలికలూ, వ్యక్తీకరణ పద్ధతులూ, భాషకి సంబంధించిన తక్కిన అంశాలు శ్రమనుంచి ఉద్భవించడం గమనించవచ్చు. పనిపాటల సంబంధం పనిలో, పాటలో వున్న లయ వరకే పరిమితం కాదు. శ్రమ - ఉత్పత్తికి సంబంధించిన భావజాలమంతా భాషగా మారి పాటలోకి వస్తుంది. ఆ విధంగా కూడా పని - పాటల్ని విడదీయలేం. పాటలోని పదాలకున్న ధ్వని మాత్రమే (Sound) కాదు; శబ్దాలని శాసించే అర్థం కూడా పనితో కలిసిపోయి వుండటం చూడవచ్చు.

బొక్కెనంతా చిల్లుపడి, తొండమంతా పాడైపోయి, మోటలాగే బక్కెద్దు పడకోస్తే, పైరంతా ఎండిపోతే, ఇవాళారేపూ తన డొక్కలు మాడిపోతాయని బెంగపడే రైతు వేదనలోంచి వెలికివచ్చే మోటపదం కావచ్చు,[34] ఏటికేతంబట్టి వెయ్యిపుట్లు బండించి గంజిలోకి మెతుకెరుగని కష్టజీవి వెతలపాట కావచ్చు.[35] వాటిలో రూపం - భాష - భావం - ప్రతీకలు - ఉత్పత్తి సాధనాలూ అన్నీ శ్రమజీవి జీవితంలోవే. అందులో ప్రతిబింబించే జీవితానుభవం, వేదన, దాని - వ్యక్తీకరణ పద్ధతీ శిష్టసాహిత్యంలో కనిపించడానికి అవకాశం లేదు.

ఈ పాటల్లో వాడిన భాష శ్రామిక సంస్కృతికి చెందినది. ఆ సాంస్కృతిక భాషని మోటుభాషనీ, గ్రామ్యమనీ, మాండలికమనీ రకరకాల పేర్లతో పిలుచుకుంటున్నాం.

శ్రామికుల శృంగార గేయాల్లో సైతం వాళ్ల శ్రామిక సంస్కృతి అంతర్లీనంగానో, ప్రస్ఫుటంగానో తొంగిచూస్తూనే వుంటుంది.[36]

ఉత్పత్తి సంబంధాల్లో ఏర్పడ్డ మార్పుల కారణంగా నూతన శ్రామిక వర్గం ఏర్పడ్డప్పుడు - ఆ పాటల్లో భాషపైన కూడా నూతన శ్రమకి సంబంధించిన సంస్కృతి ప్రభావం వుంటుంది. శిష్టవర్గ సంస్కృతి శిష్ట సాహిత్యంలోనే కాదు ఆ వర్గానికి చెందిన పాటల్లో సైతం వారి భాషలో ప్రతిఫలిస్తుందనడానికి ఉదాహరణంగా 'కలవారి కోడలు కలికి కామాక్షి'ని చూపించవచ్చు. అదేకథ శ్రామిక వర్గంలోకి వచ్చేసరికి అందులోని భావం, భాష, ప్రతీకలు అన్నీ మార్పుకి లోనయ్యాయి.[37]

జానపద గీతాలని పాడేవాళ్లు కూడా శిష్టసంప్రదాయం నుంచి దూరంగా వున్నవాళ్ళే కాబట్టి తరతరాలుగా మౌఖికరూపంలో వున్న జానపద గీతాల్లో భాష ఉచ్చారణ ధ్వనులూ - ఊనికలూ, స్వరాల్తోపాటు మాండలికంగానే నిలిచిపోయింది.

భాష - రూపాలతోపాటు భావం, ప్రతీకలు కూడా శ్రామికుల జీవితంలో భాగమైనప్పుడు ఆ సాహిత్యం ప్రజా సాహిత్యమవుతుంది. భావం, ప్రతీకలు శ్రమనుండి దూరమై కనిపిస్తే అవి అంతమేరకు పరాయీకరణకి గురయ్యాయని గ్రహించాలి.[38]

పాటల్లోనే కాదు, సామెతలు, పొడుపుకథలు, కథలు లాంటి తక్కిన జానపద సాహిత్య శాఖలన్నిటిలోనూ కనిపించే భాషని వాళ్ల శ్రామిక సంస్కృతే నిర్దేశిస్తుంది. తాము పాడుకునే పాటల్లో, చెప్పుకునే కథల్లో, జానపదులు తమ పరిసరాల్ని, ఉత్పత్తి సామగ్రినీ, ప్రకృతినీ చొప్పించకుండా సాహిత్యం కూర్చుచేయరు. 'ప్రజలనుండి ప్రజల్లోకి' అనే నినాదంతో జానపదుల బాణీని, భాషనీ విప్లవ సంస్కృతికి జోడించే జననాట్యమండలి, ప్రజా కళా మండలిపాటల్లో కూడా ఈ పద్ధతిని గమనించవచ్చు. ప్రతీకలు - వస్తువు తప్ప తక్కిన జానపద సాహిత్యంలోని మౌఖిక సంప్రదాయాన్నంతా స్వీకరించడంవల్ల విప్లవ గీతాలు కూడా ప్రజల నాలుకలపై జీవిస్తున్నాయి.

'వందానలు వందనాలమ్మో మా బిడ్డలు', 'సిరిమల్లె సెట్టుకింద లచ్చుమమ్మో' లాంటి గద్దర్ పాటల్లోనూ,[39] 'బస్సు నడిపే విధము దెలియండీ జనులార మీరు' లాంటి వంగపండు పాటల్లోనూ[40] జానపదుల భాషే, బాణీలు మాత్రమేకాదు జానపద సంస్కృతిని, మొత్తం వారి జీవితాన్నే స్వీకరించి విప్లవీకరించడం కనిపిస్తుంది.

జానపద సాహిత్యాన్ని విప్లవీకరించే క్రమంలో ఈనాటి కవులకీ, రచయితలకీ ప్రజల భాషని స్వీకరించడం అనివార్యం. ఆ భాషని భాషాశాస్త్రజ్ఞులు ప్రాంతీయ మాండలికం అనొచ్చు - వర్గ మాండలికం అనొచ్చు - కానీ వాస్తవానికి అది అట్టడుగువర్గాల పీడిత జనుల జీవద్భాష. వారి సాంస్కృతిక భాష.

జానపద సాహిత్యంలోని భాషనీ, బాణీలనీ, వ్యక్తీకరణ పద్ధతినీ స్వీకరించి తమ రాజకీయ సిద్ధాంత ప్రచారానికనుగుణంగా మల్చుకోవడం తెలంగాణా రైతాంగ పోరాటం కాలంనుంచి విస్తృతంగా మొదలైంది. అంతకుముందు స్వాతంత్ర్యోద్యమ కాలంలో సాహిత్యంలో అడపా దడపా గరిమెళ్ళ సత్యనారాయణ వంటి వాళ్ళు ఈ పద్ధతిని అనుసరించారు. తెలంగాణా రైతాంగ పోరాటంలో ఎన్నో జానపద సాహిత్య కళారూపాల్ని రాజకీయ ప్రచారోద్యమానికి అనువుగా మల్చుకోవడం చూడవచ్చు. శ్రీకాకుళం గిరిజనోద్యమం స్తబ్దంగా వున్న తెలుగు సాహిత్యాన్ని కదిలించి మరోసారి జానపద సాహిత్యంవైపు దృష్టి సారించేలా చేసింది. శివుడి 'నరుడో భాస్కరుడా'[41] తెలుగు సాహిత్యంలో గొప్ప మార్పు తీసుకొచ్చింది. పాణిగ్రాహి శివసాగర్‌ల స్ఫూర్తితో తెలుగు విప్లవ కవితోద్యమంలో వెలువడుతున్న పాటల్లో- 'నీటిలో చేపల్లా ప్రజల్లో పుట్టిన ఈ పాటల్లో'[42] - ప్రాంతీయ మాండలికం కోసమో వర్గ మాండలికం కోసమో వెదుకులాడవలసిన పనిలేదు. మాండలికానికి సాహిత్య గౌరవం కలిగించిన పాటలవి.

## కథ

**కథల** విషయానికొస్తే - జానపదగేయాల సేకరణ జరిగినంత విస్తృతంగా కథల సేకరణ జరగలేదు. జరిగినా జానపదులు చెప్పుకునే కథలు యథాతథంగా వారి భాషలోనూ -

యాసలోనూ అచ్చొత్తించడం జరగలేదు. అయితే పాటలానే కథ కూడా మౌలికంగా మౌఖిక సంప్రదాయానికి చెందిందే. అందువల్ల మౌఖిక సాహిత్యంలో ముఖ్యమైన అంశంగా అందులోని భాష మాండలికమవుతుంది. అంతేకాదు - పాటలాగే కథ కూడా సామూహికమే. పాట ఎప్పుడైనా వైయక్తిక శ్రమ చేసేటప్పుడు ( ఉదా॥ మోట పాటలు, ఏతాం పాటలు, విసుర్రాయి పాటలు మొ॥) వైయక్తికం కావచ్చు కానీ కథ ఎప్పుడూ ప్రదర్శన రూపమే. సామూహికమే. శ్రోత లేకుండా కథ చెప్పడం జరగదు. ఈ రోజున కాగితంమీద లిఖితరూపంలో కథ ఒకరే చదువుకునే ప్రక్రియగా మారిందిగానీ తరతరాలుగా కథ మౌఖికమే - సామూహిక ప్రదర్శన రూపమే. మన దేశం ముఖ్యంగా వ్యావసాయిక దేశం గాబట్టి జానపద సాహిత్యం ప్రధానంగా వ్యావసాయిక సంస్కృతికి చెందింది.[43] కాబట్టి జానపదకథ మౌఖికంగా ఇంకా మిగిలివుంది.

తెలుగులో ఆధునిక లిఖిత కథకి వందేళ్ళ చరిత్ర మాత్రమే ఉంది. అయితే ఈ వందేళ్ళలోనూ కథ అంటే చదివేదేనన్నంత భ్రమ లిఖిత కథ కలిగించింది. సాహిత్యాన్ని ప్రజల పరం చేయడంలో ప్రజలనుండి ప్రజల దగ్గరకు అన్న నినాదంలో పాట విషయంలో విప్లవ రచయితలు ముందున్నట్టే కథ విషయంలో కూడా వాళ్ళే మౌలిక తాత్త్విక చింతనతో లిఖిత కథని మౌఖికం చేయడానికి ప్రయత్నించారు. అందులో భాగంగానే జానపద కథ - మాండలిక కథగా మారింది. కథ చెప్పేది - వినేది అనే ఆలోచనతో మాండలిక కథ ఒక సామాజిక అవసరంగా తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది. జానపద కథలో భాష కథకుడి ప్రాంతీయ మాండలికం, వర్గ మాండలికం అయి వుండటం సహజం. అంతేగాదు ఆ భాష ఇంతకుముందు పాటల విషయంలో గమనించినట్టు వారి సంస్కృతిలో భాగంగా వుంటుంది. కథలో పాత్రలు రాజులు, రాజకుమారులూ అయినప్పటికీ వాళ్ల జీవన పద్ధతులు తమ జీవన పద్ధతుల్లోనే వుంటాయని భావించి కథ చెప్పడం జరుగుతుంది. ఉదా: టింగు బుర్రకథ.

''ఒగూర్లో ఒక రాజంట. ఆ రాజుకు ఒక పెండ్లాము, ఏడుగురు కొడుకులు పుట్టగోశంత భూమి ఉన్నెంట. ఆ చేన్లో రాజు జొన్నలు చల్లతా ఉన్నెంట. జొన్నలు చల్లతా వుంటే గూలొచ్చి ఏరక, తినేస్తా ఉన్నెంట (గూలు = గువ్వలు). అబ్బుడు రాజు, పెండ్లము, బిడ్డ్లు గెనుం మీద కూచ్చొని ఏడుస్తా వుండిరంట. ....''[44]

ఇందులో భాషేకాదు, సంస్కృతి సైతం జానపదులదే వుండటం గమనించవచ్చు. రాజు సైతం చేలో జొన్నలు జల్లుతాడు - గువ్వలు జొన్నలు తినిపోతే పెళ్లాం బిడ్డలతో గట్టుమీద ఏడుస్తూ కూర్చుంటాడు. ఈ కథలోనే కాదు - జానపద కథలన్నిటా కథకుడి జీవన నేపథ్యం కనిపిస్తూనే వుంటుంది.

లిఖిత కథలో పాత్రల సంభాషణ కన్నా భిన్నమైన కథనాన్ని రచయితకీ పాఠకుడికీ మధ్య సంభాషణగా పేర్కొనవచ్చు. మామూలు సంభాషణల్లో పాత్రోచితంగా జానపదుల భాష -మాండలికం - వాడినా రచయిత సాధారణంగా కథనంలో శిష్ట వ్యావహారికాన్నే వాడటం, దాన్నే తనకీ, పాఠకుడికి మధ్య భావవాహకంగా ఎన్నుకోవడం జరుగుతుంది. శిష్ట వ్యావహారిక భాషలోనే కథనం జరిగినా రచయిత తన ప్రాంతపు భాషని కూడా వాడటం మానుకోలేడు. అసంకల్పితంగా ఆ మాండలిక శబ్దాలు చోటుచేసుకుంటాయి. ఆవిధంగా ప్రాంతీయ వర్గమాండలికాలు రెండూ లిఖిత కథలో కూడా సహజంగానే ప్రవేశించాయి.

అయితే మధ్యతరగతి పాఠకవర్గంనుంచి చదువులేని శ్రామికవర్గం దగ్గరకి తెలుగు కథని తీసుకుపోయి వారికి వినిపించాలనీ - అది ఒక సామాజికావసరమనీ భావించిన రచయితలు లిఖిత కథని సైతం మౌఖికం చేయాలని పూనుకున్నప్పుడు - తాము కథని వినిపించదల్చుకున్నప్పుడు - పాఠకుల్నే కాక శ్రోతల్నికూడా దృష్టిలో వుంచుకుని కథ నడపాలని గ్రహించారు. కథకి పాఠకులకన్నా శ్రోతలే ముఖ్యమని భావించినప్పుడు, ఆ శ్రోతలు శ్రామిక వర్గానికి చెందినవారయినప్పుడు కథలోని భాష మాండలికమై తీరుతుంది. తెలుగులో ఈనాటి మాండలిక కథ ఆ క్రమంలో తన అవసరానికి అనుగుణమైన భాషని ఎన్నుకుంది. కానీ ఇదంతా ఒక్కసారిగా జరగలేదు.

సహజత్వం కోసం పాత్రల సంభాషణ ని మాండలికంలో - వర్గ మాండలికంలోనో, ప్రాంత మాండలికంలోనో - రాసే స్థితి నుంచి పూర్తి మాండలికంలో వెలువడే దశకు చేరుకోవడంలో తెలుగుకథ భాషా విషయకంగా ఎన్నో చర్చలకు లోనయింది.

ఈ చర్చలూ - వాదోపవాదాలూ కేవలం కథల వరకే పరిమితం కావు - ఆధునిక సాహిత్యానికంతటికీ వర్తిస్తాయి. ఈనాడు నవల, కథ, నాటకం లాంటి ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియలన్నీ మాండలికంలో వెలువడుతున్నాయి. వాటిగురించి తెలుసుకోవాలంటే ఆధునికాంధ్ర సాహిత్యంలో మాండలికం ప్రవేశించిన తీరూ, క్రమంగా మాండలిక సాహిత్యం ఆవిర్భవించడానికి కారణమైన పరిస్థితులూ - అవసరాల గురించి పరిశీలించాల్సి ఉంది.

# తెలుగు సాహిత్యంలో మాండలికం

## మూడో భాగం : ఆధునికాంధ్ర సాహిత్యంలో మాండలికం

అచ్చు యంత్రాలు ఆంధ్ర సాహిత్య చరిత్రలో పెద్ద మార్పుని తెచ్చాయి. ఈ మార్పు ప్రభావం వచన రచనల మీద మరీ ఎక్కువగా కనబడుతుంది. పుస్తకాలు అచ్చుకాకముందు సాహిత్యాన్ని ధారణ చేసి గుర్తుపెట్టుకోవడం అలవాటుగా వుండేది కాబట్టి ఛందోబద్ధమైన పద్యరచనలే ఎక్కువగా వుండేవి. శాస్త్ర విషయాలు సైతం పద్యాల్లోనే వుండేవి. వచనం వున్నా పాడుకోవడానికి అనువుగా వుండే దండకాలు, రగడల రూపంలోనో, వృత్తగంధి రూపంలోనో వుండేది. అచ్చుయంత్రాలు వచ్చాకే శుద్ధ వచన గ్రంథాల రచన ఎక్కువగా జరిగింది.

దేశ భాషల్లో విద్యాబోధన జరగాలన్న 'చార్టర్ ఆక్ట్' పాసయిన దరిమిలా మద్రాసులో కొత్తగా స్థాపించిన కళాశాలలో విద్యార్థుల కోసం తెలుగు పాఠ్యపుస్తకాలు వెలువడ్డాయి. పాలనా వ్యవహారాల నిర్వహణ కోసం తెలుగు నేర్చుకోవాలన్న ఆంగ్లేయుల కోసం కూడా వ్యాకరణాలూ, నిఘంటువులూ, పుస్తకాలు అవసరమయ్యాయి. సాహిత్యం అవసరాలూ, పరిధి విస్తరించాయి. ఆ నేపథ్యంలో ఆనాటి సాహిత్యంలో భాషఎలాంటి పరిణామాన్ని పొందిందో చూడాలి. 1910 తర్వాత వచ్చిన భాషోద్యమాలకి పూర్వరంగాన్ని - అప్పటి భాషలో వచ్చిన మార్పులు తర్వాతి ఉద్యమాలపైన కలిగించిన ప్రభావాన్ని పరిశీలించాల్సి ఉంది.

### వ్యావహారిక భాషోద్యమం పూర్వరంగం – భాష – మాండలికం

కన్యాశుల్కం రెండో కూర్పు వెలువడిన (1909) తర్వాత గురజాడ కవిత్వం సైతం వ్యావహారికంలోనే ప్రచురితమయ్యాక కొంతమంది పండితులు వాడుక భాషని గ్రామ్యమని పరిహసించడం, అధిక్షేపించడం మొదలుపెట్టారు. గిడుగు తన వ్యాసాలూ, ఉపన్యాసాల ద్వారా వ్యావహారిక భాషా పదానికి ప్రచారం మొదలుపెట్టాకా వ్యావహారిక భాషావాదం ఉద్యమ రూపం దాల్చింది.

చిన్నయసూరి నీతిచంద్రిక (1853), బాలవ్యాకరణం (1855) పాఠ్య గ్రంథాలుగా స్వీకరించక ముందున్న వచన సాహిత్యంలో, పాఠ్యపుస్తకాల్లో, వ్యాకరణాల్లో, వ్యాఖ్యానాల్లో, పత్రికల్లో జన వ్యవహారానికి దగ్గరగా వున్న భాషే రాజ్యమేలింది.

మొదటి తెలుగు పత్రికల్లో పోయినతూరి, మున్నూరు, కొల్లైత్తువాండ్రు, పటాళము, నిండా, అగత్యం లాంటి మద్రాసు ప్రాంతీయ మాండలికాన్ని సైతం వాడటం జరిగింది.[45]

కావలి సోదరుల సహాయంతో మెకంజీ తయారుచేసిన కైఫీయతులని బ్రౌన్ పునారచింపజేసి భద్రపరిచాడు. అందులో భాష వ్యావహారికమే. 'పెండ్లి చేసుకోబొయ్యేవాడు', 'కంకణాలు విప్పక మునుపే' లాంటి తర్వాతి కాలంలో గ్రామ్యమని పండితుల నిందకు గురయిన ప్రయోగాలెన్నో[46] యీ కైఫీయతుల్లో కనిపిస్తాయి.

1842లో బ్రౌన్ సేకరించి 1855లో అచ్చేయించిన తాతాచార్ల కథల్లో కూడా జన వ్యవహారంలోని భాషనే చూడవచ్చు. తర్వాతికాలంలో వ్యాప్తిచెందిన కృత్రిమ గ్రాంథిక భాషా వాసన ఏమాత్రం లేనిదీ రచన. వక ధొరగారు, పొస్తుకం, పూజచేస్తూ వస్తినే లాంటి అసంఖ్యాకమైన మాండలిక పద ప్రయోగాలు - మౌఖికమైన ఉచ్చారణ పద్ధతుల్నీ యథాతథంగా అచ్చొత్తించడం ద్వారా - కనిపిస్తున్నాయి.[47] వీటిని ఆనాటి జనవ్యవహారానికి సరైన సాక్ష్యంగా భావించవచ్చు. స్థానిక చరిత్రలుగా మనకు దొరుకుతున్న మెకంజీ కైఫీయతుల్లోగానీ, తాతాచార్లు చెప్పగా రాసిన తాతాచార్ల కథల్లోగానీ జానపదుల మౌఖిక భాషా శైలి కనిపిస్తుంది. అందుకే భాషా విషయకంగా ఈ రెండు గ్రంథాలకీ సాహిత్యంలో ఒక ప్రత్యేక స్థానముంది.[48]

తాతాచార్ల కథల సేకరణ, ప్రచురణ కంటే పూర్వమే వచన రచన - సాహిత్య గౌరవాన్ని పొందిన వచన రచన - వ్యవహారంలోనే ఎక్కువ జరిగింది.[49]

రావిపాటి గురువమూర్తి శాస్త్రిగారి పంచతంత్ర కథల్లో ప్రయోగించిన 'ధనము పొయ్యేటందుకు, నిండిన చెరువులకు అలుగులు తీసినట్లు సంపాదించిన ధనము పాత్రమెరిగి సెలవు చేయుట (=ఖర్చు చేయుట - మద్రాసు మాండలికం) రక్షించడమేను' వంటి ప్రయోగాలు[50] ఆనాటి సాహిత్యంలో వ్యావహారిక భాషా ప్రాధాన్యాన్నే కాకుండా మాండలిక పద ప్రయోగ బాహుళ్యాన్ని కూడా తెలియజేస్తున్నాయి.

కాశీయాత్రా చరిత్రద్వారా ఆనాటి తెలుగులో ఇంగ్లీషు పదాల వ్యాప్తి (ఉచ్చారణతో సహా) తెలుస్తుంది. అంతేకాదు. అందులోని భాష ఆంగ్ల విద్యాగంధం, పాశ్చాత్య సంస్కారం, ఇంగ్లీషు దొరల సాంగత్యం సంపాదించిన ఆనాటి ఒక ఉన్నత మధ్యతరగతి ప్రజల మాండలికం అని చెప్పుకోవచ్చు.

తాతాచార్ల కథల్లో కనిపించే 'మౌఖిక శైలి' పాటూరి రామస్వామి శాస్త్రిగారి శుకసప్తతి కథల్లో (1840) కనిపిస్తుంది. ఈ శైలి విలక్షణమైనందువల్ల ప్రత్యేకంగా పేర్కోవాలి.

''ఈ ప్రకార మార్గురిని పారవేసి ఏడోవాణ్ణి ఎత్తుకొని వీడు యెక్కడ వేసినా లేచి నాకంటే ముందుగా వచ్చి చేరుతున్నాడు. ఈ తేప వూరి వెలుపల వుండే గుంటలో వేతామని గబుక్కున వేశి వీడు ఎట్లు లేచివస్తాడో చూతామని నలుదిక్కులూ కనిపెట్టి...''[51] ఇందులో కనిపిస్తున్న వేతాం, చూతాం, ఈ తేప (=యీసారి, యీతడవ) లాంటి ప్రయోగాలు ప్రాంతీయ మాండలికాలే.

విక్రమార్కుని కథలు, శుకసప్తతి కథలు, సాలభంజిక కథలు నిజానికి జానపద సంప్రదాయానికి చెందినవి. ఎన్నో తరాలుగా మౌఖిక ధోరణిలోనే నిలిచి వున్నవి. తెలుగులో ముద్రణా సౌకర్యం లభించాకా అచ్చులోకి వచ్చినా అవి మౌఖిక భాషకి దగ్గరగా వుండటం గమనించవచ్చు. చిన్నయసూరి యీ జానపద వచన పద్ధతికి కావ్యవచన పద్ధతి అంటగట్టాడు. సూరి తర్వాత అతని వ్యాకరణ సూత్రాలకనుగుణంగా ఉన్న భాషే సలక్షణమనీ, తక్కినదంతా గ్రామ్యమనే భ్రమకు పండితలోకం లోనైంది.

అచ్చుయంత్రం మౌఖిక కథని లిఖితరూపంలోకి తర్జుమా చేసే మార్పుకి కారణమైంది. అందువల్ల కథకున్న మౌఖికతత్వం మరుగునపడిపోయింది.

అంతేకాదు కథకున్న సామూహిక శ్రవ్యరూపం పోయి వైయక్తిక పఠనరూపం ఏర్పడింది.

సూరి వచన రచనలనీ, వ్యాకరణ సూత్రాల్ని ప్రమాణంగా భావించడంవల్ల అంతకుముందున్న వచన రచనలని పట్టించుకోకపోవడంవల్ల ఆనాటి కొత్త చదువరులకి సూరి ప్రవచించిన కొత్త సంప్రదాయమే కానీ అంతకుముందున్న సంప్రదాయం తెలియకుడాపోయింది.[52]

అందువల్ల వ్యావహారిక భాషావాదం ఉద్యమ రూపం ధరించేవరకూ వచన రచనల్లో మొదట్లో వాడుక భాషే తర్వాత గ్రాంథికం వాసనలూ కనిపిస్తాయి. వచనంలో సరళ గ్రాంథికం ప్రవేశపెట్టిన వీరేశలింగంగారి ప్రహసనాల్లో ముఖ్యంగా బ్రాహ్మ వివాహ ప్రహసనం (1880)లో భాష-పాత్రల సంభాషణ అయినా కారణంగా- వ్యవహారానికి దగ్గరగా నడిచింది.

వేదం వేంకటరాయశాస్త్రిగారు నాగానందం (1895)లో నీచపాత్రలకి 'పాత్రోచితభాష' పేరుతో వ్యావహారికం ప్రయోగించారు. లాక్షణికులు గ్రామ్యమని ఆక్షేపించిన శబ్దజాలమంతా నీచపాత్రల భాషలో ప్రవేశించింది. ఇందుగురించి వాదోపవాదాలు జరిగాయి.[53]

అయితే నాటకాల్లో పాత్రోచిత భాష పేరున 'వర్గమాండలికాన్ని' ప్రవేశపెట్టిన వేదం వారికి గానీ, దాన్ని సమర్థించినవారికి గానీ ఉన్నది నాటక కళాదృష్టి - రసపోషణ దృష్టేగానీ ప్రజల భాషకి సాహిత్యంలో స్థానం కల్పించాలనే అభ్యుదయ భావన కాదు. ఈపాటి కళాదృష్టిని అంతకుముందే యక్షగానాల్లోనూ చూడవచ్చు. అంతేగాదు - నీచపాత్రలకి నీచమైన భాష అనే ధోరణి ప్రజల వాడుక భాషపట్ల వారికున్న చిన్నచూపుని సైతం వెల్లడిస్తుంది. వాదోపవాదాల వల్ల పాత్రోచితభాషపట్ల వ్యతిరేకత తగ్గుముఖం పట్టింది గానీ వ్యావహారికం పట్ల గౌరవం పెరగలేదు- నిమ్నదృష్టి తగ్గలేదు.

1897లో గురజాడ కన్యాశుల్కం మొత్తం నాటకం ఒక ప్రాంతానికి చెందిన వ్యవహారంలోనే వెలువడింది. తెలుగు సాహిత్యంలో పూర్తి మాండలికంలో వెలువడ్డ మొదటి నాటకం యిది; నాటకమే కాదు- ఏ సాహిత్య ప్రక్రియ అయినా ఇదే. అంతవరకూ భాషా సాహిత్యాలపట్ల

గూడుకట్టుకున్న విలువలనీ సంప్రదాయాలన్నిటినీ కన్యాశుల్కం ధ్వంసం చేసింది.[4] కుంటుతూ నడిచే అసహజమూ, శుష్క పాండిత్య ప్రదర్శకమైన గ్రాంథిక భాషని వదిలేసి మామూలు జీవితంలో సర్వసామాన్యమైన భాషని అందునా ఆంధ్రరాష్ట్రంలోని ఉత్తర జిల్లాల జనాభాలో అన్ని వర్గాల్లో వాడుకలో వున్న జీవద్భాషనీ ఉపయోగించిన మొదటి 'మాండలిక నాటకం' కన్యాశుల్కం.

పాత్రోచిత భాషగా వాడుక భాష, మాండలికం నాటకాల్లో ప్రవేశించే రోజుల్లో మొత్తం నాటకాన్నే ఒక ప్రత్యేక మాండలికంలో రాసి ప్రదర్శించిన (ప్రదర్శన 1892- ప్రచురణ 1897) ఘనత గురజాడది.

గ్రాంథిక భాష తెలుగువారి మీద తరతరాలుగా సంప్రదాయం రుద్దిన గుది బండ అనీ, ఆ సంకెళ్ళని తాను ధరించదల్చుకోలేదనీ, వాడుక భాషే తన మాతృభాషనీ ఖరాఖండీగా పేర్కొంటూ ఆ జీవద్భాషలోనే సాహిత్యం దేశంలోని ప్రజలందరికీ చేరువై వాళ్ళని తట్టి లేపుతుందనీ గురజాడ నమ్మాడు.[55] ఆ విధంగా ప్రజాసామాన్యానికి సాహిత్యం అందుబాటులో వుండాలంటే మాండలికం ఎంత అవసరమో గురజాడ గుర్తించినంతగా మరెవరూ గుర్తించలేదంటే అతిశయోక్తి కాదు. తాను ఏ ప్రజల్లో సంఘ సంస్కరణ భావాలు తట్టిలేపి, చైతన్యాన్ని నింపాలనుకున్నాడో ఆ ప్రజల కోసం వాళ్ల భాషని ఒక సాధనంగా గురజాడ ఎన్నుకున్నాడు. ''నాది ప్రజల ఉద్యమం, నా ఆశయం ప్రజల ఆశయం. దాన్ని ఎవర్నీ సంతోష పెట్టడానికైనా వదులుకోలేను.''[56] అని సాహిత్యంపట్ల అందునా ప్రజల సాహిత్యంపట్ల ఒక శాస్త్రీయ ఆధునిక దృష్టిని వ్యక్తపర్చాడు. ఆ విధంగా సాహిత్యానికొక నూతన ప్రజాస్వామిక (సంస్కృతిపరమైన) దృక్పథంతో కూడిన ప్రయోజనాన్ని గురజాడ ఆశించాడు.

ఇదంతా వ్యావహారిక భాషావాదం ఉద్యమరూపం ధరించకముందే జరిగింది. తెలుగులో ఒక ప్రాంతానికి చెందిన మాండలికంలో కన్యాశుల్కం పుట్టి వంద సంవత్సరాలయినప్పటికీ - అప్పటినుండి ఇప్పటివరకూ సాహిత్యంలో మాండలికంగురించో మాండలికంలో సాహిత్యం గురించో చర్చలు జరుగుతూనే వున్నాయి. మాండలికంలో సాహిత్య సృజన కూడా జరుగుతూనే వుంది - ప్రజలు తమ జీవద్భాషలోని ఆ సాహిత్యాన్ని ఆదరిస్తూనే వున్నారు.

అయితే మాండలికంలో సాహిత్య సృష్టి ఒక్కసారిగా జరగలేదు. దానికొక క్రమ పరిణామం వుంది. అందుకు చారిత్రక అవసరాలు కూడా వున్నాయి. సంఘ సంస్కరణ భావాలు ప్రజల్లో ప్రచారం చేయాలనే ప్రయోజన దృక్పథంతో గురజాడ మాండలికంలో నాటక రచన చేశాకా ఆ కొత్తదారిని ఎంతోమంది ఆదరించారుగానీ శిష్టవ్యావహారిక భాషని వాడినంత ధారాళంగా ఆ తర్వాత కవులు, రచయితలు మాండలిక భాషని వాడలేదు. వ్యావహారిక భాషోద్యమం ద్వారా కొత్త సాహిత్య భాషని రూపొందించుకునే ప్రయత్నం చాలా మందకొడిగా సాగుతుందని గురజాడే ఫిర్యాదుచేశాడు.[57]

మాండలిక భాషలో సాహిత్యం ముమ్మరంగా రాకపోవడానికి ఏవైనా ప్రత్యేక కారణాలున్నాయోమో తెలుసుకోవాలంటే వ్యావహారిక భాషోద్యమానికున్న పరిమితుల్నీ, సాహిత్యంలో మాండలిక శబ్దజాలం గురించి ఆనాటి రచయితల ఆలోచనల్ని గమనించాల్సి వుంది.

## వ్యావహారిక భాషోద్యమం నాటి సాహిత్యం - మాండలికం

ఇంగ్లీషు చదువులు ఆనాటి ప్రజల సామాజిక, సాంస్కృతిక జీవితాలపైనే కాకుండా సాహిత్యంపైన కూడా విస్తృతమైన ప్రభావం కలిగించాయి. ''కండ్లకు వెలుగిచ్చి కొత్త బాటలు కనబర్చి దృక్పథమే మార్చేసింది ఇంగ్లీషు వాఙ్మయం'' అని విద్యాధికులూ, రచయితలూ భావించారు.[58] వచన రచనా ప్రక్రియలైన కథ, నవల ఇంగ్లీషు భాషా వాఙ్మయసంపర్కంవల్ల లభించినవే. సంస్కరణ భావాలు సమాజం వరకే పరిమితం కాకుండా భాష వరకూ వ్యాపించాయి.

సంఘం వృద్ధిలోకి రావాలంటే ప్రజల్లో విద్య వ్యాపించాలనీ, ఆ విద్య సామాన్య ప్రజలందరికీ అందుబాటులోకి రావాలంటే అది వాళ్లకి అర్థమయ్యే భాషలో వుండాలనీ, ప్రజలు తమ భాషలో రాయడానికీ చదవడానికీ సమర్థులై వుండాలనీ అందుకు అనుకూలమైన సాహిత్యం వెలువడాలనే ప్రజాస్వామిక దృక్పథంతో[59] వాడుక భాషోద్యమం ప్రారంభమయింది. అయితే శిష్ట వ్యావహారిక భాషగా గిడుగు, గురజాడలు పేర్కొన్న భాషని గ్రామ్యమని పండితులు నిందించారు. వాడుక భాషని గ్రామ్యమని - దాన్ని అనుసరించే వాళ్లని గ్రామ్యవాదులనీ తిట్టిపోశారు.[60]

గ్రామ్యభాషని సాహిత్య భాషచేస్తే భాషలో 'మాండలిక' పదజాలం ఎక్కువై 'పరిశుభ్రత' చెడిపోతుందని వాదించారు.[61] ఆ విధంగా మాండలికం వాడుక భాషోద్యమంలో గొప్ప చర్చనీయాంశమైంది.

భిన్న ప్రాంతాల్లో వాడుక భిన్నంగా ఉన్న కారణంగా ఒక ప్రాంతపు మాండలిక శబ్దాలు మరొక ప్రాంతం వారికి తెలియవు కాబట్టి వాడుక భాషలో రచన అనేది ఆచరణ యోగ్యం కాదని గ్రాంథికవాదుల అభిప్రాయం. అంతేకాదు తమ ప్రాంత వ్యవహారమే గొప్పదనే భావన అన్ని ప్రాంతాలవారూ కలిగివుంటారు; కాబట్టి వాడుక భాష తెలుగువారి మధ్య భాషా వైషమ్యం కలిగించి అనైక్యతకు కారణమవుతుంది; కాబట్టి అందరికీ ఆమోదయోగ్యమైన గ్రాంథికమే ఆదరణీయమని కూడా గ్రాంథికవాదులు వాదించారు.

మాండలిక రూపాల బూచిని చూపెట్టి వాడుక భాషని వ్యతిరేకించిన వారికి సమాధానంగా గిడుగు గురజాడలు ప్రాచీన కాలంనుంచీ కవిత్వంలో చోటుచేసుకున్న మాండలిక పదజాలాన్ని

ఎత్తిచూపారు.[62] ప్రాచీన కవిత్వ భాషలోని పర్యాయపదాల పట్టిక ఇచ్చి కావ్యభాషలో వున్న పదాల పరిచయం కన్నా వాడుక భాషలో వున్న మాండలిక పద పరిచయం సులభంగా చేసుకోవచ్చని వివరించారు.[63] నిజానికి తెలుగుదేశం వివిధ ప్రాంతాల్లో మాట్లాడే భాషలో పెద్దగా మాండలిక భేదాలు లేవనీ సమర్థులైన రచయితలు మనస్ఫూర్తిగా పూనుకున్నట్టయితే సులభంగానే కావ్యభాషని సృష్టించవచ్చనీ మాండలిక పదజాలమం తటినీ కలుపుకుని వ్యవహారంలో వున్న భాషతోనే కొత్త సాహిత్య భాషని తయారుచేసుకోవచ్చనీ అభిప్రాయపడ్డారు.[64]

వేరువేరు మాండలికాల భిన్నత్వంలోంచే సమగ్రమూ, సమైక్యమూ అయిన భాష ఉత్పన్నమవుతుందనీ; భిన్నత్వంలోని ఏకత్వమే జీవితం అనీ భిన్నత్వం లేని ఏకత్వం మృత్యువనీ; మాండలికాన్ని మననివ్వడమంటే భాషకి మరింత జీవం పొయ్యడమేననీ గ్రాంథిక వాదులకి శాస్త్రీయమైన సమాధానమిచ్చారు.

మాండలిక శబ్దాలు వ్యావహారిక భాషా ప్రయోగానికి ప్రతిబంధకాలు అనేవారికి లక్షణ సంప్రదాయమే తెలీదని చెప్పవచ్చు. ఏ సాహిత్యభాషా మాండలిక శబ్దాలు లేకుండా పెంపొందలేదు. వ్యాకరణ నిర్మాతలు ప్రయోగబలాన్ననుసరించి మాండలికాన్ని సాహిత్యభాషలో అనుశాసించారు. పాణిన్యాదులు - ప్రాచాం, ఉదీచాం అంటూ ఎన్నో మాండలికాల్ని నిపాతాల రూపంలో లక్షణ బద్ధం చేశారు.

వాడుక భాష వాడటం మూలంగా మాత్రమే కాలగతిలో అన్ని మాండలికాలు కూడా ప్రామాణిక భాషలో వచ్చి చేరుతాయి. మాండలిక సాహిత్యం అందుకు దోహదపడుతుంది. అయితే ఆనాడు వాడుక భాషావాదం ఉద్యమంగా ఊపందుకున్నప్పుడు దానికి పుష్టినిచ్చే సృజనాత్మక సాహిత్యం ముమ్మరంగా రాలేదనే పండితులు అభిప్రాయపడ్డారు.[65]

ఉద్యమకాలంలో కూడా గురజాడే కథ- కవితల్ని సైతం వాడుక భాషలో రచించారు. 'దిద్దుబాటు' కథని మొదటి గ్రాంథికంలో రాసి తర్వాత వ్యావహారికంలోకి మార్చడంవల్ల కొంత సహజత్వం కొరవడింది. 'మీ పేరేమిటి?'లో భాష శుద్ధ వ్యావహారికం - అంతేగాదు - మను వాళ్లయ్య, నాయుడు, వెంకయ్యల భాష పాత్రోచితంగా ప్రాంతీయ - వర్గ మాండలికంలో వుండటం గురజాడకున్న కథా నిర్మాణ చాతుర్యాన్నీ, కళాదృష్టినీ మాత్రమే కాకుండా సాహిత్య భాష పట్ల ఆయనకున్న అభ్యుదయ దృక్పథాన్ని సైతం తెలియజేస్తుంది.

ఆవిధంగా గురజాడ ద్వారా వాడుక భాషోద్యమంలో అంతర్భాగంగానే మాండలికానికి సాహిత్య గౌరవం కలిగింది.

కవిత్వం విషయానికొస్తే గురజాడ తీసుకువచ్చిన విప్లవం భాషకే పరిమితం కాదు - వస్తు నిర్మాణం - దాని ప్రతిపాదించిన రూపాన్ని ఎన్నుకోవడం వరకూ అది విస్తరించింది. తను

చెప్పదలుచుకున్న విషయం ప్రజలకి చేరాలంటే పాట సరైన సాధనమని గ్రహించాడాయన. లిఖిత సంప్రదాయంలో కవిత్వం ప్రజలకి దూరమైపోయిన పరిస్థితుల్లో కవిత్వాన్ని మళ్లీ ప్రజాభిముఖంగా తిప్పడానికి గురజాడ మౌఖిక రూపాన్ని ఎన్నుకున్నాడు. తెలుగు కవిత్వంలో గురజాడ సాధించిన ఈ మార్పు అసంపూర్ణ విప్లవమనీ, అడుగుజాడ గురజాడ అని చెప్పుకున్న శ్రీశ్రీ సైతం ఆయన చూపించిన మార్గంలో నడవలేదని విమర్శకులు భావించినప్పటికీ[66] గురజాడ మొదలుపెట్టిన మౌఖిక సంప్రదాయ పద్ధతిని గరిమెళ్ల వంటి స్వాతంత్ర్యోద్యమ కవులూ, సుంకర, వాసిరెడ్డి, నాజర్ వంటి కళాకారులు, తెలంగాణా రైతాంగ పోరాటంలో పాటలు కట్టిన ఎందరో అజ్ఞాత కవులూ మళ్లీ కొనసాగించారు. దానికి సాహిత్యగౌరవం కలిగించే శాస్త్రీయ విశ్లేషణ, సాహిత్య విమర్శ ఆనాడు జరగలేదు. ఈ ధోరణిని రాజకీయోద్యమ ప్రచార సాహిత్యంగా మాత్రమే పరిగణించారు. అయితే తరతరాల మౌఖిక ధోరణి ప్రజావసరాల కోసం మళ్లీ సాహిత్య వేదిక పైకి వచ్చిందని ఆ తర్వాతి తరం విమర్శకులు గ్రహించగలిగారు.

పాణిగ్రాహి సుబ్బారావు, శివుడు, గద్దర్, వంగపండు వంటి వాళ్ల పాటలు గురజాడ తిరగదోడిన మౌఖిక సంప్రదాయానికి కొనసాగింపే. అయితే ఉన్నత కులాల వారి ఆశు సాహిత్యమైన కీర్తనలూ, స్త్రీల పాటలూ గురజాడ స్వీకరిస్తే - శ్రామికవర్గ సంస్కృతిలో భాగమైన మౌఖిక సాహిత్యం ఈనాటి కవుల చేతిలో విప్లవ సాహిత్యంగా మారింది. కవిత్వంలో గురజాడ భాష వ్యావహారికం వరకే పరిమితమైతే విప్లవ కవులు మరింత ముందుకు పోయి ప్రజా సంస్కృతిలో భాగంగా కింది తరగతి వాళ్ల భాషని కూడా యథాతథంగా స్వీకరించారు. వస్తువు - భాషనీ, రూపాన్నీ ఎన్నుకొంటుందనడానికి యీ క్రమ పరిణామం ఒక ఉదాహరణ.

గురజాడ నాటి మత, భాష, సంఘ సంస్కరణల కంటే మరింత ప్రజాస్వామిక ప్రగతిశీల దృక్పథంతో తర్వాతి సాహిత్యం వెలువడింది. ప్రచారం అన్నిచోట్లా సమానంగా కనిపిస్తుంది. సంఘ సంస్కరణ భావాల ప్రచారం కోసం మొదలైన మౌఖిక ధోరణి - రాజకీయోద్యమాల ప్రచారం కోసం అట్టడుగు వర్గాల భాషామాధ్యమంగా సాహిత్యంలో మార్పు తీసుకొచ్చింది. కింది తరగతి ప్రజల భాషలో సాహిత్య సృజన గురించి తెలుసుకోవాలంటే స్వాతంత్రోద్యమ, సామ్యవాదోద్యమ, విప్లవ సాహిత్యాలని పరిశీలించాలి.

## స్వాతంత్ర్యోదమ సాహిత్యం - మాండలికం

వ్యావసారిక భాషోద్యమం, స్వాతంత్రోద్యమం దాదాపు సమకాలికంగానే జరిగాయి. వాడుక భాషలో సాహిత్య రచన స్వాతంత్రోద్యమానికి సహాయం చేయగలుగుతుందని ఆనాడు కొందరయినా గ్రహించారనిపిస్తుంది. ప్రజల భాష స్వాతంత్ర్య భావాల వ్యాప్తికి దోహదపడుతుందని భావించబట్టే ఉన్నవ 'మాలపల్లి' (1922)ని వాడుక భాషలో రాశారు.

వాడుక భాషలో వచ్చిన మొదటి తెలుగు నవలది. గుంటూరు జిల్లా పల్నాటి భాష నవలలో అడుగడుగునా దర్శనమిస్తుంది.

గ్రామీణ జీవితాన్న అందునా అట్టడుగు తరగతి ప్రజల జీవితాన్ని తీసుకుని వాళ్ల అభ్యుదయాన్ని కాంక్షిస్తూ రాసిన మొదటి నవల మాలపల్లె. గాంధీ యింకా హరిజనోద్యమాన్ని ప్రచారం చేయకముందే కడజాతిగా అణచివేతకు గురయినవారి గురించి నవల రాయడానికి పూనుకుని - అందులో వారి భాషని ఉపయోగించడం - అంతవరకూ సంఘ సంస్కరణ భావాల్ని ప్రేరేపించిన రచనల ధోరణికంటే పూర్తిగా భిన్నమైంది. రష్యాలో ఏర్పడ్డ కార్మిక రాజ్యం ప్రపంచ దేశాల్లోని అభ్యుదయ వాదులందర్నీ ఉత్తేజపరిచిన నేపథ్యంలో ఈ నవల వెలువడింది. గురజాడ తర్వాత ఒక ప్రాంతానికి చెందిన వాడుక భాషని సాహిత్య సృజనకుపయోగించుకున్న ప్రతిభాశాలి ఉన్నవవారే.

ఉన్నవ తర్వాత గోదావరి జిల్లా భాషతో కథనాన్ని ఓ మోస్తరు నవలలంత పెద్ద కథల్ని నడిపిన కథకుడు శ్రీపాద. సంభాషణల ద్వారా కథనడిపే పద్ధతినుపయోగించి గోదావరి జిల్లా బ్రాహ్మణాగ్రహారాల భాషనీ, స్త్రీ భాషనీ (రెండూ వర్గ మాండలికాలే) ఆ భాషలోని 'యాస'తో సహా కథల్లో ఉపయోగించి తనకంటూ ప్రత్యేకమైన భాషాశైలినీ, కథన శైలినీ శ్రీపాద ఏర్పరచుకోగలిగారు. మొదట్లో కథల్ని సరళ గ్రాంథికంలో రాసినప్పటికీ పాత్రోచిత భాషగా గోదావరి జిల్లా నిమ్న జాతి భాషని సైతం శ్రీపాద ఉపయోగించారు. గోదావరిని దాటిపోని ఇతివృత్తాల ఎంపికవల్ల కూడా ప్రాంతీయత (నేటివిటీ) తో ఈ కథలు మాండలిక రచనలుగా అనిపిస్తాయి.

సాహిత్యంలో వాడుక భాషస్థానం పదిలమవుతున్న రోజులవి. అయితే వాడుక భాషోద్యమం అంతిమ లక్ష్యం శిష్టవ్యావహారిక భాషే. గిడుగు తాను సమర్థించింది శిష్టజన వ్యావహారిక భాషనేగానీ గొల్లలు మొదలైన పామరులు పలికే గ్రామ్య భాషని కాదని చెప్పుకున్నారు![7] పాత్రోచిత భాషగా కింది తరగతి వారి భాషకి సాహిత్యంలో స్థానం లభించిందిగానీ ఆ భాషలో ప్రత్యేకంగా సాహిత్య సృజన జరగలేదు. కవిత్వంలో అయితే 1930 వరకూ కూడా వాడుక భాష పూర్తిగా ప్రవేశించలేదు.

కానీ 1930-40 మధ్యలో స్వాతంత్ర్యోద్యమం బాగా వూపందుకున్న రోజుల్లో పాట ఉద్యమ ప్రచారానికి బాగా ఉపయోగపడింది. తక్కిన సాహిత్య ప్రక్రియలకంటే భిన్నంగా జానపద గేయ ధోరణిలో - భాషలో స్వాతంత్ర్యోద్యమ గీతాలు వెలువడ్డాయి.

ఆంధ్రభారతిలో గురజాడ కవితలు (తోకచుక్క, కాసులు మొ॥) ప్రచురితమైన సంవత్సరం (1910)లోనే 'మాలవాంఢ్ర పాట' అనే గేయం కూడా వచ్చింది. కవి పేరు లేదు. కానీ ఆ అజ్ఞాత కవి కవిత్వంలో భాషా విషయకంగా గురజాడకన్నా ముందున్నాడని భావించాలి.

అందారు పుట్టేరీ హిందమ్మ తల్లికీ,

అందారు ఒక్కటై ఉందారి సక్కంగ -' అన్న పాట గ్రామ్యభాషకి పట్టంగట్టిన ప్రప్రథమ గేయమని నారాయణరెడ్డిగారు పేర్కొన్నారు.[68]

అయితే దేశాన్ని 'హిందమ్మతల్లి'గా పేర్కొన్న శిష్ట భావనతో వెలువడ్డ ఈ గేయంలో భాష మాండలికానుకరణేగానీ మాండలికం కాదు.

స్వాతంత్ర్యోద్యమంలో గరిమెళ్ళ, దామరాజు, కొండపల్లి జగన్నాథదాసు, నెల్లూరు వెంకట రామానాయుడు, బసవరాజు అప్పారావులాంటివాళ్ళు, జానపద భజనలు, కీర్తనలూ అనుకరిస్తూ జాతీయ గీతాలు రాశారుగానీ 'వాడుక భాషలో సాహిత్యం రైతుల్ని తట్టిలేపుతుంద'ని గురజాడ ఆశించినంతగా[69] ఫలితం కనిపించలేదు. గరిమెళ్లలాంటి వారి పాటలు మధ్యతరగతి ప్రజల్లో విస్తృతంగా ప్రచారం పొందాయిగానీ మిగతా సాహిత్యం శ్రామికవర్గ పునాదుల్ని స్పృశించలేదు. కమ్యూనిస్టు ఉద్యమం - ఉద్యమ సాహిత్యం ఆ పని చేయగలిగాయి. స్వాతంత్ర్యోద్యమ కాలంతోబాటే సమాంతరంగా సామ్యవాదోద్యమ సాహిత్యం కూడా వెలువడింది. వస్తు - రూప వైవిధ్యాల కారణంగా కమ్యూనిస్టు ఉద్యమ సాహిత్యంలో భాష కూడా ప్రజా పునాదికి చెందిందే.

## సామ్యవాదోద్యమ సాహిత్యం – మాండలికం

అభ్యుదయ కవిత్వం భావకవిత్వంపై తిరుగుబాటుగా వచ్చిన దరిమిలా తక్కిన సాహిత్య ప్రక్రియల్లో సైతం అభ్యుదయ ధోరణి వ్యక్తమైంది. వచన రచనా ప్రక్రియల్లో యీ ధోరణి ముందుగా కథల్లోనే కనిపించింది. కరుణకుమార, మా గోఖలే వంటి కథకులు పూర్తిగా గ్రామీణ జీవితాన్ని తమ కథల్లో చిత్రీకరించారు. గ్రామాల్లో తరతరాలుగా దోపిడీకి గురవుతున్న కష్టజీవుల వెతలు కథావస్తువులయ్యాయి. కింది తరగతి ప్రజల సంస్కృతిని యథాతథంగా వర్ణించిన యీ రచయితలు వాళ్ల భాషని కూడా స్వీకరించారు. కొంచెం అటుయిటుగా అదేకాలంలో హైదరాబాదు సంస్థానంలో తెలుగువారి సాంస్కృతిక జీవన అస్తిత్వానికి ఉద్యమించిన సురవరం ప్రతాపరెడ్డిగారు కూడా కథానికారచన చేశారు. వారి కథల్లో తెలంగాణా మాండలికం చోటు చేసుకుంది. రాజకీయ ఉద్యమాలు కవుల్ని ముందుగా ప్రభావితం చేశాయి - గానీ భాషా విషయకంగా కథానికా రచయితలే ముందుండి అట్టడుగు వర్గాలవారి భాషని సాహిత్య భాషగా మలిచారు.

కరుణకుమార, కవికొండల వెంకట్రావు లాంటి, వారు గ్రామీణుల జీవితపు లోతుల్నీ తెలుగు పల్లెల వ్యావసాయిక సంస్కృతినీ స్పృశించారు. ఆ కారణంగా వారి కథల్లో సన్నజీవాల మాండలికం విస్తృతంగా చోటుచేసుకుంది. కరుణకుమార వాడిన భాష గురించి మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిలా అన్నారు.

''ఈ పుస్తకంలో కథకంటే ముందుగా భాషే మనస్సును ఆకడుతుంది. పట్న వాసులకు కొన్ని కొన్ని మాటలు అర్థం కావడం కూడా కష్టమే. అందులోనూ నెల్లూరి జిల్లా వ్యావహారిక భాష ఇతర మండలాల వారికి ఎబ్బెట్టుగా తోచవచ్చు.''[70] శర్మగారు కరుణ కుమార కథల్లో నెల్లూరి ప్రాంతపు పల్లీయుల భాషసాహిత్యంలో ప్రవేశించిన తీరునీ, శిష్టవ్యావహారిక భాషకు అలవాటుపడ్డ నాగరిక పాఠకులు ఆ మాండలికానికి అలవాటుపడటంలో ఎదుర్కొనే ఇబ్బందిని వివరించడం చూస్తే మాండలికంలో సాహిత్యం బయల్దేరిన దారి అంత సుగమం కాదని తోస్తుంది. ఉన్నవవారి మాలపల్లితో ప్రభావితులయ్యే కరుణ కుమార గ్రామీణ సంస్కృతినీ, కింది తరగతివాళ్ల జీవితాన్ని - వాళ్ల భాషనీ స్వీకరించారు.[71] మాలపల్లి ద్వారా పల్నాటి మాండలికం, కరుణ కుమార కథల ద్వారా నెల్లూరి మాండలికం తెలుగువారందరికీ పరిచయమైంది. సాహిత్యంలో సామాజిక వాస్తవికత జోడించడానికి మాండలికం ఒక ప్రముఖ సాధనమని కూడా యీ రచనలు నిరూపించాయి.

పాత్రోచిత భాషకీ, గిరిజన జీవితానికీ ప్రాధాన్యం ఇచ్చిన మరో కథకుడు చింతా దీక్షితులు. గిరిజన జీవితం గూర్చి మొదటిసారిగా కథలు రాసినందీయనే. గిరిజన జీవితంలో భాగంగా పాత్రోచిత భాష దీక్షితుల కథల్లో కనిపిస్తుంది. అయితే అంతకు ముందే గిరిజన జీవితం గురించి నెల్లూరు ప్రాంతానికి చెందిన రాజేంద్రకథలు రాసిన దాఖలాలు ఉన్నాయికానీ, ఆయన అనామకంగానే వుండిపోయాడు.

పాత్రోచిత భాషతో, గ్రామీణ జనజీవిత చిత్రణతో, మాండలిక భాషా ప్రయోగంతో ఆగిపోకుండా కింది తరగతివారి భాషలో - సంభాషణలే కాకుండా కథనంతో సహా- కథలు రాసినవాడు మా గోఖలే.

కింది తరగతి ప్రజల జీవన శైలినీ, సంస్కృతినీ సాహిత్యంలో యథాతథంగా చిత్రించదలుచుకున్న సాహిత్య చిత్రకారుడు మా గోఖలే. అట్టడుగు వర్గాల వారి భాషని వారి సంస్కృతి నుండి విడదీయడం ఉచితం కాదని భావించడంవల్లే గోఖలే కథనం సైతం మాండలికంలోనే చేశాడనుకోవచ్చు. శ్రీపాద సంభాషణ పద్ధతిలో గోదావరి మాండలికాన్ని వాడి తన కథలకి ఒక ప్రత్యేకమైన శైలి ఏర్పరచుకున్నాడు. అది అతని వైయక్తిక రచనా శైలిగా స్థిరపడింది. కానీ గోఖలే కథల్లో వైయక్తికి శైలికి తావులేకుడా ప్రజా జీవన శైలిలో భాగంగా వారి భాషే ఉపయోగించాడు. శ్రీపాద మధ్యతరగతి బ్రాహ్మణ వర్గ మాండలికంలో కథ నడిపినప్పుడు రాని ఆక్షేపణలు మాగోఖలే కింది తరగతి వారి భాషలో రాసినప్పుడు రావడం గమనించాలి. పాత్రోచిత భాషగా అట్టడుగు వర్గాల భాషని స్వీకరించవచ్చుగానీ కథనం సైతం 'అలగా' భాషలో వుండటాన్ని ఎంతోమంది ప్రశ్నించారు.[72] ఆ ఖండనల్ని తట్టుకొని కొ.కు - 'మార్గదర్శకత్వం' లో 'మూగజీవాల ఘోష'ని వారి భాషలోనే విన్పించాడు గోఖలే.[73] ఏది

యేమయినా మాగోఖలే తెలుగులో మాండలిక కథకి ఒకవిధంగా ఆద్యుడు. ఈదారి ఉన్నవ, కరుణకుమారలు నడిచిన దారేగానీ వాళ్లకంటే గోఖలే కొన్ని అడుగులు ముందే వున్నాడు. చెప్పవచ్చు - అంతేగాదు - తర్వాతి కాలంలో మాండలిక కథారచయితలకి ఆదర్శం కూడా అయ్యాడు.[74]

అయితే నిజాం పాలనలో సాంస్కృతిక అణచివేతకు గురవుతున్న తెలుగువారి భాషా సాహిత్యాల గురించి ఆనాడు తక్కిన ప్రాంతాలవారికి అంతగా తెలియదు. వాడుక భాషోద్యమం కాలంలో అయితే తెలంగాణా భాషే పరిగణనలోకి రాలేదు. కానీ ప్రాంతీయ మాండలికంలో కథలు, నాటకలు రాయడం ఆనాడే తెలంగాణాలో సైతం జరిగింది.

నిజాం రాష్ట్రాంధ్రుల సాంస్కృతిక పునరుజ్జీవోద్యమంలో భాగంగా స్థాపించిన గ్రంథమాలలు - ప్రచురణ సంస్థలు ఎన్నో కథాసంకలనాలు ప్రచురించాయి.

పూర్తి తెలంగాణా మాండలికంలో రాసిన కథలు 'కమ్మ తెమ్మెరలు' కథా సంకలనంలో వున్నాయి. తెలంగాణా భాషని తెలుగు వారందరికీ పరిచయం చేయాలని ఉద్దేశపూర్వకంగానే తెలంగాణా మాండలికాన్ని వాడినట్లు ప్రచురణకర్తలు తెలియజేశారు. అయితే వాళ్ళు దాన్ని గ్రామ్యమని[75] పేర్కొన్నారు. 1941 ప్రాంతంలో ఆంధ్రపత్రికలో మా గోఖలే మాండలిక కథలు రావడానికి కొంచెం ముందుగానే తెలంగాణాలో మాండలిక కథలు వెలువడ్డాయన్నది గమనించాల్సిన విషయం. వెల్దుర్తి మాణిక్యరావు తెలంగాణా మాండలికంలో రాసిన మొదటి నాటిక 'దెయ్యాల పన్గడ' కూడా ఆ కాలంలోనే వెలువడింది.

వీటన్నింటికీ మించి ప్రజల భాషలో పాట తెలంగాణా రైతాంగ పోరాటం నేపథ్యంలో విస్తృతంగా వెలువడింది.

1945 తర్వాత ఆంధ్ర మహాసభ భాషా సాంస్కృతిక రంగాలకే పరిమితం కాకుండా వెట్టిచాకిరికీ, అక్రమ లెవీకి వ్యతిరేకంగా స్థానిక భూస్వాములపై పోరాటం ప్రకటించింది. దాంతో తెలంగాణాలో సాంస్కృతిక ఉద్యమం రాజకీయోద్యమంగా భూపోరాటంగా మారింది. ఊరూరా రైతాంగం అంతా సంగంగా ఏర్పడి తరతరాల పీడనని ప్రతిఘటిస్తున్న రోజులవి. ఆ చరిత్రని నడిపిన ప్రజలే విముక్తి గీతాలు ఆలపించారు. పీడకుల్ని పాటల్లో దుయ్యబట్టారు. పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన అమరవీరులకి పాటల జోహార్లు అర్పించారు. ఆ పాటల్లో భాష వారి శ్రామిక సంస్కృతితోనే కాదు - పోరాట సంస్కృతితో కూడా ముడిపడి వుందని పాటల పరిశీలనలో తెలుస్తుంది.

ఆ పాటలు పోరాటం కొలిమిలో పుట్టినవి. శ్రామికుల జానపద సంస్కృతి నేపథ్యంలో మౌఖికంగా ప్రచారమైన పాటలు మధ్యతరగతి కవులు - కళాకారుల్ని కూడా ఉత్తేజపరిచాయి. జానపద ధోరణిలో కళారూపాలు కూడా ఉద్యమావసరాల కనుగుణంగా తక్షణ ప్రయోజనాల

కోసం తయారయ్యాయి. మౌఖిక రూపంలో ప్రచారమైన ఆ పాటల్లో, కళారూపాల్లో భాష అనివార్యంగా మాండలికమే అవుతుందనడంలో ఎటువంటి విప్రతిపత్తి లేదు.

ప్రజా సాహిత్యంలో 'ప్రజల భాష' ఒక విడదీయరాని అంగం అని తెలంగాణా రైతాంగ పోరాటం చారిత్రకంగా నిరూపించింది.

ఆనాటి సాయుధ పోరాటాన్ని సజీవ మాండలికంలో చిత్రిస్తూ నాటకాలు వెలువడ్డాయి. పొట్లపల్లి రామారావు రాసిన 'పగ', 'న్యాయం', 'సర్‌బరాహి' తెలంగాణా రైతాంగ పోరాట జీవితంలోని భిన్నకోణాల్ని స్పృశించాయి. సుంకర వాసిరెడ్డి రాసిన 'మాభూమి'ని ప్రజా నాట్యమండలి దళాలు ఊరూరా ప్రదర్శించాయి. అయితే ఇందులో తెలంగాణా పోరాటం చోటుచేసుకున్నంతగా తెలంగాణా గ్రామీణ జీవనం, సజీవ మాండలికం చోటుచేసుకోలేదని సంభాషణా, భాషా, నుడికారాలు ఆంధ్ర ప్రాంతానికే ప్రాతినిధ్యం వహిస్తాయనీ, సృజనాత్మకమైన యీ లోటు నాటకంలో లోటుగానే కనిపిస్తుందనీ విమర్శకులు భావించారు.[76]

నిజానికి నాటకాల్లో ఇతివృత్తాన్ని బట్టీ, పాత్రలను బట్టీ తదనుగుణమైన మాండలికాన్ని వాడటంలో జాగ్రత్త వహించాలి. నాటక రచయిత తన సొంత మాండలికంలోనే రచన చేయాలి.

అభ్యుదయ సాహిత్యోద్యమంలో భాగంగా తెలంగాణా రైతాంగ పోరాటాన్ని జీవిత వాస్తవికతనుంచి దూరం కాకుండా చిత్రిస్తూ ఎన్నో కథలు, నవలలు వచ్చాయి. కథ కంటే నవలే సమాజ జీవితాన్ని విస్తారంగా ప్రతిబింబించడానికి సమర్థవంతమైన సాధనం గాబట్టి తెలంగాణా విమోచనోద్యమాన్ని చిత్రిస్తూ ఎన్నో నవలలు వెలువడ్డాయి. తెలుగు నవలా సాహిత్యంలో స్వాతంత్ర్యోద్యమ కాలంలో వెలువడ్డ 'మాలపల్లి' తర్వాత పేర్కొనదగ్గ మంచి నవలలన్నీ తెలంగాణా విమోచనోద్యమానికి సంబంధించినవే అవడం అసత్యం కాదు.

తెలంగాణా పోరాటాన్ని చిత్రిస్తూ ఎందరో రచయితలు కథలు, నవలలు రాశారు. అయితే వారిలో ఎక్కువ మంది ఆంధ్ర ప్రాంతానికి చెందినవాళ్ళే. నిజానికి ఉద్యమానికి ప్రత్యక్షంగా స్ఫూర్తినిచ్చిన పాటలు, కళారూపాలు తప్పితే తక్కిన సాహిత్య ప్రక్రియల్లో - వచన కవిత, నవల, కథ, నాటకాల్లో - తెలంగాణేతర ప్రాంతంవాళ్ళు రాసినవే ఎక్కువ. ఉద్యమంలో తలమునకలుగా ఉన్నవాళ్ళ పాట, జానపద కళా ప్రదర్శనలమీదే ఎక్కువ ఆధారపడ్డారు.

నవలల్లో ఎక్కువ శాతం పోరాటం ఆగిన తర్వాతే వచ్చాయి. తెలంగాణా గ్రామీణ జన జీవితాన్ని ఈ కథలు, నవలలు అన్ని ప్రతిబింబించినప్పటికీ స్థానికులూ, పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న రచయితల రచనల్లోనే సజీవమైన తెలంగాణా భాష, మాండలికం గోచరిస్తాయి. ఒక ప్రాంతపు భాషలోని జీవాన్ని, ఆ ప్రాంత రచయితలే పట్టుకోగలరు. తెలంగాణా జీవద్భాషని సహజంగా ఉపయోగించిన వాటిలో వట్టికోట ప్రజల మనిషి (1955), [illegible] (1965), దాశరథి రంగాచార్య చిల్లరదేవుళ్ళు ముఖ్యంగా పేర్కొనదగ్గవి.

కథల విషయానికొస్తే కథల్లో సంఘటనకే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు - అందువల్ల భాష రెండో స్థానం ఆక్రమించుకుంది. తెలంగాణా రచయితల కథల్లో మాత్రం మాండలికం ఎక్కువగా కనిపిస్తుంది.[77]

ఉన్నవ 'మాలపల్లి' తర్వాత ఒక ప్రాంతపు భాషనీ, గ్రామీణ జీవితాన్నీ సహజంగా చిత్రీకరించిన నవల 'ప్రజల మనిషి' అనొచ్చు. మౌఖిక వ్యవహారంలోని భాషా ప్రయోగాల్ని సృజనాత్మక రచనలో సహజంగా మలిచే నేర్పు వుంటేనే మాండలికం వాడటంలో రచయితలు విజయం సాధించగలరు. మాలపల్లి, ప్రజల మనిషి నవలల్లో పల్నాడు, తెలంగాణా ప్రజల జీవద్భాష ఎంతో సహజంగా చోటుచేసుకుందని విమర్శకులు భావించినా ఉన్నవ, వట్టికోట ఇద్దరూ తాము సజీవమైన వాడుక భాషని ఉపయోగించలేమేమోనని భయసందేహాల్ని వ్యక్తం చేశారు.[78]

ఇంచుమించు ఇదేకాలంలో ఇరివెంటి కృష్ణమూర్తి, జి.సురమౌళి లాంటివారు తెలంగాణా మాండలికంలో కథలు రాశారు. అళ్వారుస్వామి నడిపిన దేశోద్ధారణ గ్రంథమాల ప్రచురించిన 'పరిసరాలు' (రెండు భాగాల కథల సంపుటం) లోనే ఈ రచయితల చోటుచేసుకోవడం గమనించాలి.

1955 జనరల్ ఎన్నికల్లో కమ్యూనిష్టు పార్టీ రాష్ట్ర రాజకీయాల్లో అధికారంలోకి రావటంలో విఫలమైన తర్వాత తెలుగు కవిత్వంలో స్తబ్దత ఏర్పడిందిగానీ నవలల విషయానికొస్తే తెలంగాణా పోరాటానికి సంబంధించిన నవలల్లో ఎక్కువ భాగం 51-60 మధ్యలోనే వచ్చాయి. అభ్యుదయ రచయితల అభ్యుదయాంశ కవిత్వంలో తగ్గుముఖం పట్టి కథ, నవలలవైపు ప్రసరించడం గమనించదగ్గ విషయం.

1960 ప్రాంతాల్లో ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే కవిత్వం రాలేదు- కానీ కొడవటిగంటి కుటుంబరావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు, చాగంటి సోమయాజులు, జి.వి.కృష్ణారావు లాంటి ప్రతిభగల రచయితలు నాలుగు కాలాలపాటు నిలిచే నవలలు, కథలు రాశారు. వీరిలో రావిశాస్త్రి, కాళీపట్నం, చాసో ఉత్తర కోస్తా మాండలికాన్ని సందర్భోచితంగా విస్తృతంగా వాడారు.

కింది తరగతి ప్రజల పక్షాన నిలిచిన ఈ రచయితల్లో రావిశాస్త్రి పట్టణాల్లోని అట్టడుగు వర్గాల భాషనీ, సంస్కృతినీ తన కథాశిల్ప నైపుణ్యానికి జోడించి' ఆరు సారా కథలు', మధ్యతరగతి గుమస్తా జీవితాన్ని చిత్రిస్తూ చైతన్య స్రవంతి ధోరణిలో 'అల్పజీవి' నవల ఈ కాలంలోనే రాశాడు. 'బుక్కులు' కథలు కూడా యీ కాలంలోనే వెలుగుచూశాయి. కాళీపట్నం 'యజ్ఞం' శ్రీకాకుళం జిల్లా గ్రామీణ నేపథ్యంలో [illegible] మరో గొప్ప కథ.

గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి వెలుగునీడల ప్రభావం కింది తరగతి ప్రజల జీవితాలమీద ఏవిధంగా ప్రసరించిందో చెప్పిన ఈ కథలో శ్రీకాకుళం ప్రజల భాష అనివార్యంగా చోటుచేసుకుంది. అప్పటికే చాసో కథలు ఈ ప్రాంతపు భాషని పాఠకులకి పరిచయం చేశాయి. రావిశాస్త్రి, కాళీపట్నం రాకతో ఉత్తర కోస్తా మాండలికానికి సాహిత్య గౌరవం లభించింది. కవిత్వం తిరోగమించిన కాలంలో ఈ విధంగా వచనం పురోగమించటమే కాదు - కవుల్ని తట్టి లేపింది కూడా.[79]

ఈ మధ్యలో కథనం, సంభాషణలతో సహా మొత్తం నవలంతా జానపద భాషలో రాసే ప్రయోగాలు కూడా జరిగాయి. పోరంకి దక్షిణామూర్తి వెలుగూ వెన్నెలా గోదారీ (1958), ముత్యాలపందిరి (1964) అందుకు ఉదాహరణలు. తెలుగులో పూర్తిస్థాయి మొదటి మాండలిక నవలగా వెలుగూ వెన్నెలా గోదారీని పేర్కొనవచ్చు.

కమ్యూనిస్టు పార్టీ రెండుగా చీలిపోవటానికి ముందు, ఆ తర్వాత 1967 వరకూ తెలుగు సాహిత్యంపై అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రభావం పూర్తిగా తగ్గిపోయిందనే చెప్పుకోవాలి.

తెలుగు సాహిత్య చరిత్రలో 1970 ఒక మలుపు. తెలంగాణా విమోచనోద్యమం అభ్యుదయ రచయితల సంఘానికి ఊపునిస్తే, శ్రీకాకుళం గిరిజన రైతాంగ ఉద్యమం విప్లవ రచయితల సంఘం పుట్టుకకు కారణమైంది.

ప్రజలకు దూరమైన సాహిత్యాన్ని మళ్ళీ ప్రజల దగ్గరకు తీసుకుపోయే ప్రణాళిక మరోసారి సాహిత్యోద్యమంలో 'ఎజెండా' అయింది. ప్రజాసాహిత్య కళారూపాలు, భాష విప్లవ సాహిత్యంలో ముఖ్య విషయాలయ్యాయి.

1970 తర్వాత సామాజిక పరిస్థితులు, ఉద్యమావసరాలు సాహిత్యంలో మాండలికాన్ని వాడి వాస్తవ జీవితాన్ని చిత్రించటంతో ఆగిపోకుండా మాండలికంలోనే సాహిత్య రచన చేసేందుకు కవుల్ని రచయితల్ని ప్రేరేపించాయి. ఆ వివరాలు కూడా పరిశీలిస్తే ఆధునిక సాహిత్య ప్రక్రియలన్నీ మాండలిక భాషని అనివార్యంగా సాహిత్య భాషగా స్వీకరించటానికీ, అట్టడుగు ప్రజల భాషకి సాహిత్య గౌరవం కలగటానికి గల కారణాలు అర్థమవుతాయి.

## విప్లవ సాహిత్యోద్యమం - మాండలికం

సాహిత్య సాంస్కృతిక రంగాల్లో అరసం, ప్రజానాట్యమండలి స్తబ్దుగా వున్నరోజుల్లో శ్రీకాకుళం గిరిజనోద్యమం కొత్తగా కలం పట్టిన కవుల్ని, విద్యార్థుల్ని కదిలించింది. విశాఖలో 1970 ఫిబ్రవరిలో శ్రీశ్రీ సన్మానవేదిక మీద 'రచయితలారా మీరెటువైపు?' (రచయితలకు

సవాల్) అన్న ప్రశ్న విప్లవ రచయితల సంఘం ఆవిర్భావానికి కారణమైంది. తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం నాటి సాహిత్య స్ఫూర్తి మరోసారి మొదలయింది. కొత్త తరం కవులు వచన కవిత్వం దారిని పాటవైపు మళ్లించారు.

లిఖిత సాంప్రదాయ పద్ధతినుంచి సాహిత్యం ఉద్యమావసరాల కనుగుణంగా మౌఖిక రీతిపై దృష్టిసారించింది. పాట - జానపద జీవన సంస్కృతిలో వున్న గుణాంశాల్ని స్వీకరించి పోరాట సంస్కృతిని ప్రచారం చేయటానికి పూనుకుంది. 1970లో 'ఝంఝ' కవితా సంకలనంలో వచ్చిన శివుడి - 'నరుడో భాస్కరుడా' అందుకు ఉదాహరణ. విరసం వ్యవస్థాపకుల్లో ముఖ్యుడైన శ్రీశ్రీ మాండలికంలో 'నిన్నటి జట్కావాలా' అన్న వచన పద్యం రాశాడు.

అయితే ఉద్యమావసరాలకి పాట వచన పద్యం కన్నా బలంగా ఉపయోగపడుతుందని భావించిన శ్రీశ్రీ 'యిప్లవం యాడుందిరా, ఆడనే నీకూడుందిరా, నీ గూడుందిరా' అని ప్రజల భాషలో పాటలు రాసి మరో ప్రస్థానం (1973) చేశాడు. ఆ తర్వాత శ్రీశ్రీ పాటని వాడుకోలేదుగానీ - పాణిగ్రాహి సుబ్బారావు లాంటి వాళ్ళు పాటల ద్వారా, జముకుల కథలాంటి జానపద కళారూపాలద్వారా ఊరూరా తిరుగుతూ ప్రజల్లో విప్లవ భావజాలాన్ని ప్రచారం చేశారు. పాణిగ్రాహి వారసత్వాన్నీ విప్లవ రచయితలు తర్వాత కాలంలో కొనసాగించారు.

ఉత్తర తెలంగాణా జిల్లాల నాగేటి చాళ్లలో, బొగ్గుగనుల్లో, గిరిజన తండాల్లో - రైతాంగ, కార్మిక, గిరిజనోద్యమాలు మొదలయ్యాయి. పూర్వం తెలంగాం రైతాంగ పోరాటంలో ప్రజానాట్యమండలిలా ఈసారి ఉద్యమం కొత్త అవసరాలకనుగుణంగా జననాట్యమండలి (జనామం) ఆవిర్భవించింది.

తెలంగాణాలో చరిత్ర పునరావృతమైంది. శివసాగర్, గద్దర్, చెరబండరాజు, వర్గీస్, భూపాల్, అల్లం వీరయ్య లాంటి విరసం, జనామం కవులు కళాకారులు ప్రజల జీవద్భాషలో పాటలు, ఒగ్గుకథలు వంటి కళారూపాల్తో సాహిత్యాన్ని కింది తరగతి జనంవైపు నడిపించారు.

పాటలు మౌఖికంగా ప్రాంతీయ భాషలో ప్రచారమవుతున్న రోజుల్లో - వాటి ప్రభావం మధ్యతరగతి కవుల వచన పద్యాలమీద సైతం పడింది. పంచరెడ్డి లక్ష్మణ (ఇసిత్రం), దేవరాజు మహారాజు (గుడిసె-గుండె), భాను (ఊరోళ్ళు) లాంటి కవులు తెలంగాణా మాండలికంలో వచన పద్యాలు రాయడమే కాదు - వాటిని సంపుటాలుగా కూడా ప్రచురించారు.

పాటలు మాండలికంలో మౌఖికంగా ప్రచారమవుతున్న రోజుల్లోనే ఉత్తర తెలంగాణా గిరిజనుల్లోంచి, కార్మిక శ్రామిక వర్గాల్లోంచి ఉద్యమ స్ఫూర్తితో కొత్త రచయితలెందరో తమ భాషలోనే తమ అభిప్రాయాల్ని వ్యక్తం చేయటానికీ, ఉద్యమానుభవాల్ని రికార్డు చేయడానికి పూనుకున్నారు. పాటలే కాకుండా వచన ప్రక్రియలు, కథ, నవల కూడా మాండలికంలో

వచ్చాయి. అది తక్కిన ప్రాంతాల వారికి మాండలికంగానీ వారికి మాతృభాషే, జీవనాడి, సృజన, నూతనలాంటి పత్రికలు ప్రజల భాషలో వెలువడే ఈ రచనలని ప్రోత్సహించాయి. ఆ నేపథ్యంలోఅల్లం రాజయ్య, చుక్కా, సాహు, వెంకన్న, కార్మిక, తుమ్మేటి రఘోత్తంరెడ్డి, బి.ఎస్.రాములు, వుప్పల నరసింహం లాంటి రచయితలెందరో జనజీవన పోరాటాల్ని సాహిత్యంగా మలిచారు. ఒక దశలో పాటలాగే కథ, నవల కూడా 'మౌఖిక రూపం' ధరించి జనానికి వినిపించేవిగా పరిణామం చెందాయి. నోటినుండి నోటికి, నోటినుండి రాతకి, రాతనుండి మళ్ళీ నోటికి మారే అమోఘమైన సాహిత్య అనుసృజనగా విమర్శకులు దీన్ని భావించారు.[80]

ఈ క్రమంలో సాహిత్యం అంటే నాజూకు భాష అనే భయం తొలగిపోయింది. సాహిత్యమంటే బతుకనీ - బతుకులో పెనుగులాటనీ, భూమికోసం - బువ్వకోసం - విముక్తి కోసం - జరిపే జీవన్మరణ పోరాటాలనీ - వాటిని తమ సొంత భాషలో రాయొచ్చనే భరోసా పొలాల్లో, కార్ఖానాల్లో, బొగ్గుగుట్టల్లో పనిచేసే శ్రామికులకీ, అడవి కడుపులోని ఆదివాసులకీ కలిగింది.[81]

40ల్లో తెలంగాణా రైతాంగ పోరాటంలో వెలువడ్డ సాహిత్యానికి ఈనాటి సాహిత్యానికీ వస్తువు - రూపాల్లో పెద్ద తేడా లేదుగానీ ఈ సాహిత్యానికి కావలసిన సైద్ధాంతిక బలాన్ని విరసం అందించింది. మాండలికం అందునా తెలంగాణా మాండలికం బలమైన శక్తితో పోరాట స్ఫూర్తితో సాహిత్యంలోకి చొచ్చుకొచ్చింది. కథలే కాకుండా నవలలు కూడా పూర్తిగా ప్రజల భాష (మాండలికం)లో వెలుగుచూశాయి.

తెలంగాణాలోనే కాదు - ఉత్తర కోస్తా జిల్లాల్లో కూడా భూషణం, రావిశాస్త్రి, బీనాదేవి, ఎన్నెస్ ప్రకాశరావు, అప్పల్నాయుడు వంటి రచయితలు అక్కడి ప్రజల భాషలో, నవలలు; కథలు వంగపండు ప్రసాదరావు లాంటి వాళ్ళు పాటలు రాశారు. భూషణం 'కొండగాలి' నవలలో పాక్షికంగా మాండలికం చోటుచేసుకుంటే, రావిశాస్త్రి 'సొమ్ములు పోనాయండి' నవలిక పూర్తి మాండలికంలో వెలువడింది.

అయితే మాండలికంలో వచ్చిన సాహిత్యమంతా ఉద్యమ అవసరాల కోసమే వచ్చిందని చెప్పటానికి వీలులేదు. తమ ప్రాంతీయ భాషలో వున్న పదాలనీ - సౌందర్యాన్ని కాపాడుకోవాలనే భాషాభిమానంతో కూడా యశోదారెడ్డి లాంటివాళ్ళ (తెలంగాణా) మాండలికంలో కథలు రాశారు.

కరువుసీమ రాయలసీమలో మధ్యతరగతి వారి వ్యక్తిత్వాన్ని విశ్లేషిస్తూ మధురాంతకం రాజారాం, అట్టడుగు వర్గ జనుల జీవితాల్ని చిత్రిస్తూ డా॥ కేశవరెడ్డి రాసిన కథలు, నవలలు

కూడా సజీవమైన రాయలసీమ మాండలికానికి సాహిత్యంలో ప్రత్యేక స్థానాన్నీ, గుర్తింపునీ తెచ్చాయి. ఇటీవల 'స్వామి' లాంటి వాళ్ళు రాస్తున్న కథలు రాయలసీమ మాండలికానికి చక్కటి ఉదాహరణలు. ఈ విధంగా తెలుగు నేల నాలుగు చెరగుల్నుంచీ ప్రజల భాషలో సాహిత్యం వెలువడటంతో సాహిత్య వ్యవస్థలో మాండలికాలపట్ల వున్న చిన్నచూపు తగ్గింది. వివిధ మాండలికాలకి సాహిత్య గౌరవం లభించింది. తెలుగులో మాండలిక సాహిత్యం ప్రత్యేక స్థానాన్న సంపాదించింది.

దిన, వార పత్రికల్లో మాండలిక రచనలకి ప్రత్యేకంగా శీర్షికలు (కాలమ్స్) నిర్వహించడం మొదలయింది. వార్తాపత్రికల్లో జిల్లాలవారీగా ప్రత్యేకానుబంధాలు రావటం, సాహిత్యానికి పేజీలు కేటాయించడం లాంటి ధోరణులు మొదలయ్యాకా మాండలిక రచనలు రావడం ఎక్కువయింది. నామిని సుబ్రహ్మణ్యం నాయుడు, పులికంటి కృష్ణారెడ్డి, రామకృష్ణారెడ్డి, గోపయ్య లాంటివాళ్ళు రాయలసీమ ప్రజల భాషలోను - వుప్పల నరసింహం, తెలిదేవర భానుమూర్తి కాలువ మల్లయ్య లాంటివాళ్ళు తెలంగాణా భాషలోనూ, ఈ మధ్యకాలంలోనే దిన, వార పత్రికల్లో శీర్షికలు (కాలమ్స్) నిర్వహించటమే కాదు- సామాన్య పాఠకుల ఆదరాభిమానాలు కూడా పొందారు.

(తర్వాతి సంవత్సరాల్లో ఖదీర్‌బాబు లాంటి వాళ్ళు ముస్లిం మైనారిటీ సంస్కృతిని నేపథ్యంగా చేసుకొని నెల్లూరి మాండలికంలో రాసిన కథలు కూడా ప్రత్యేకంగా పేర్కొదగ్గవి. దళితోద్యమం ఊపందుకొన్న రోజుల్లో నాగప్పగారి సుందరరాజు లాంటి వాళ్ళు దళిత సంస్కృతిని భాషని ప్రవేశపెట్టి మాండలికానికి కొత్త భాష్యం చెప్పారు.)

ఏది ఏమయినా ప్రజా ఉద్యమాలు ప్రజల భాషకీ, సాహిత్యానికీ కారణమయ్యాయి.

ఆధునికాంధ్ర సాహిత్యంలో మాండలికాల స్థాన, ప్రస్థానాల గురించి స్థూలంగా యిలా చెప్పుకోవచ్చు.

- మాండలికం వాడటంవల్ల భాషచెడిపోతుందనే గ్రాంథిక భాషావాదంపై శిష్టవ్యావహారిక భాష విజయం సాధించింది.

- ఆ తర్వాత సామాన్య ప్రజల వాడుక భాష కూడా సాహిత్యంలో విస్తృతంగా చోటుచేసుకుంది.

- అట్టడుగు వర్గాల ప్రజల జీవితాల్ని చిత్రించే క్రమంలో గ్రామీణ నేపథ్యంలో వాళ్ల భాషలోనే సాహిత్యం వచ్చింది.

- ప్రజా ఉద్యమాలు సాహిత్యంలో మాండలికానికున్న స్థానాన్ని పదిలపర్చడమే కాకుండా మాండలికంలోనే సాహిత్య సృజన జరిగే క్రమానికి కారణ మయ్యాయి.

- ఈనాడు మాండలిక సాహిత్యానికి ఒక ప్రత్యేకమైన గుర్తింపు లభించింది.

మాండలిక సాహిత్యం వివిధ ప్రక్రియల్లో విస్తృతంగా వస్తున్న నేపథ్యంలో ఆ సాహిత్యానికున్న పరిధి పరిమితుల్ని, ప్రయోజనాల్ని మదింపు చేయాలంటే మాండలికంలో పాట, వచన పద్యం, నాటకం, కథ, నవల లాంటి ప్రక్రియలు సాధించిన పరిణామక్రమాన్ని కూడా పరిశీలించవలసి వుంది.

# మూడో అధ్యాయం

# మాండలిక సాహిత్యం - కథ

''సాహిత్య రూపాలుగానీ, ప్రమాణాలుగాని, ఆశయాలుగాని కాలానుగుణంగా మారుతూ వచ్చినట్టే సాహిత్యానికి సంబంధించిన సమస్యలు కూడా మారుతూ వస్తాయి. ప్రజల భాష, ప్రజల సాహిత్యం అనేది ఈ కాలపు సమస్య.''

**- కొడవటిగంటి కుటుంబరావు,**

కళలు - శాస్త్రీయ విజ్ఞానం.

# మాండలిక సాహిత్యం - కథ

మాండలికంలో సాహిత్య రచన 1970నుంచి ఎక్కువయింది. పాట, వచన పద్యం, నవల, కథ, నాటిక, నాటకం, వ్యంగ్యరచన, గల్పికలాంటి సృజనాత్మక సాహిత్య ప్రక్రియలే కాకుండా మాండలికంలో పీఠికలు సైతం వచ్చాయి.[1] పత్రికలు మాండలిక రచనలకి ప్రత్యేకమైన 'శీర్షికలు' నిర్వహిస్తున్నాయి. ఒక దినపత్రికలో మాండలిక సాహిత్యం గురించి సంపాదకీయం కూడా వచ్చింది.[2]

ఇవన్నీ ఈనాడు మాండలిక రచనలపట్ల వున్న ఆదరణనీ, అవి సాహిత్యంలో పొందిన స్థానాన్నీ, సాధించుకొన్న గౌరవాన్నీ తెలియజేస్తున్నాయి. కానీ ఒకప్పుడవి నిరాదరణను, చిన్నచూపుకు గురయ్యాయి. మాండలిక సాహిత్యం ఈనాడు ఇంతటి వ్యాప్తిని పొందిన పరిణామ క్రమంలో ఎన్నో అడ్డంకులను ఎదుర్కొంది. ప్రామాణిక భాషకు సమాంతరంగా మాండలిక సాహిత్యం వచ్చిన ప్రతిసారీ ఎన్నో చర్చలూ, వాదోపవాదాలూ జరిగాయి.

మాండలిక భాషా సాహిత్యాలపట్ల ఎన్నో ఆక్షేపణలు, అభ్యంతరాలు వుండేవి. అయితే అదే కాలంలో మాండలిక సాహిత్యాన్ని సమర్థించినవాళ్ళూ- దాని లక్ష్యాలనీ, ప్రయోజనాలనీ అంగీకరించిన వాళ్ళూ ఉన్నారు. తెలుగులో మాండలిక సాహిత్యం ప్రకటించిన లక్ష్యాలూ సాధించిన ప్రయోజనాలూ, మాండలిక సాహిత్యంలో వివిధ ప్రక్రియలు పొందిన పరిణామాలూ, ప్రామాణిక భాషలోని సాహిత్యంకంటే భిన్నంగా మాండలిక సాహిత్యానికున్న ప్రత్యేకతలూ, సమాంతర సాహిత్యంగా అది ఎదుర్కొన్న ఒడిదుడుకులు మొ॥ విషయాన్ని చర్చించాల్సి వుంది. ఈ చర్చ మాండలిక సాహిత్యం పట్ల ఒక అవగాహన కలిగించడానికి ఉపయోగపడుతుంది. మాండలిక సాహిత్యం స్థాయీ- స్థానం గురించి కూడా తెలుసుకోవడానికి తోడ్పడుతుంది. ముందుగా మాండలిక సాహిత్యం మీద వచ్చిన అక్షేపణల గురించి, వాటిలోని మంచి చెడ్డల గురించి, మాండలిక సాహిత్యం పరిధి పరిమితుల గురించి ఆలోచించాల్సి వుంది.

## పరిధి–పరిమితి:

మాండలిక సాహిత్యాన్ని నిరాకరించే ఆలోచనలని మూడు విధాలుగా వర్గీకరించవచ్చు. అవి-

1. మాండలిక భాషపట్ల వున్న చిన్న చూపు కారణంగా మాండలిక సాహిత్యాన్ని కూడా గుడ్డిగా నిరాకరించడం,

2. మాండలిక భాషా సాహిత్యాలపట్ల నిరాదరణ లేకపోయినా- ఆ భాషా సాహిత్యాలు అర్థం కావని భావించడం.
3. ప్రామాణిక భాష అందరికీ అర్థమయ్యే సాహిత్య మాధ్యమం కాబట్టి మాండలిక సాహిత్యానికి పరిధి చిన్నదై విశాల పాఠక లోకానికి అందదనీ- అందువల్ల మాండలిక సాహిత్యం అనవసరం అనీ భావించవచడం.

ఈ మూడు ఆలోచన్లనీ, వాటిలోని నిజానిజాల్నీ తెలుగు సాహిత్యానికి అన్వయించుకొని బేరీజు వేయాల్సి వుంది.

మాండలికాల పట్ల చిన్నచూపు ప్రాంతీయ మాండలికాల పట్ల కంటే వర్గ మాండలికాలపైనే ఎక్కువ. సాహిత్య భాష నాజుకు భాష అనీ, కింది తరగతి వాళ్ళు మాట్లాడే మాండలికం మోటు భాష అనీ, అసంస్కృతమైన మాండలికాలకు సాహిత్య రచనార్హత లేదనీ, దైనందిన వాగ్వ్యవహారానికి మాత్రం పనికివచ్చే ఆభాషకు సాహిత్యంలో వ్యక్తీకరించే భావాలకు రూపం కల్పించే శక్తి లేదనీ భావించడం జరుగుతుంది. గురజాడ వాడిన వాడుక భాషని గ్రామ్యంగా నిందించడానికి కారణం కూడా అదే.

అయితే ఈ వాదనలో పస లేదని వ్యావహారిక భాషోద్యమం నిరూపించింది. శిష్టవ్యావహారిక భాష గ్రాంథిక భాషమీద పైచేయి సాధించి సాహిత్య భాషగా స్థిరపడింది. భూస్వామ్య వ్యవస్థనుంచీ పెట్టుబడిదారీ సమాజం అభివృద్ధి పొందిన క్రమంలో అన్ని కళారంగాల్లోనూ విద్యాగంధం అబ్బి నాగరికులైన మధ్యతరగతి వాళ్లచేతిలో ఒకరకమైన ప్రామాణిక పత్రికా భాష ఏర్పడింది. అయితే కొత్తగా తయారైన ఈ మధ్యతరగతి పాఠకులకి కింది తరగతి వాళ్ళ భాష పట్ల చిన్నచూపు ఏర్పడింది. గ్రాంథిక భాషావాదులు వాడుక భాషని గ్రామ్యమని నిందించినట్లే శిష్ట వ్యావహారికాన్ని సాహిత్యభాషగా స్వీకరించిన వాళ్ళు మాండలికాన్ని 'అలగా భాష'గా భావించడం జరిగింది. మాగోఖలే గుంటూరు జిల్లా అట్టడుగు వర్గ ప్రజల భాషలో కథలు రాసినప్పుడు అందువల్లే ఈ పాఠక వర్గం నుంచి వ్యతిరేకత వ్యక్తమయింది. ఆనాటి పాఠక వర్గ ప్రతి క్రియనీ, తన అభిప్రాయాన్ని కొడవటిగంటి కుటుంబరావు ఇలా చెప్పారు : -

''1941లో 'అలాగావాళ్ళ' భాషలో వచ్చిన గోఖలే కథ ఎక్కువ మందికి సాహిత్య మనిపించలేదు. వాళ్లకు పట్టిచ్చినది అలగాభాష. అందులో కొందరు ఉదారులైన మిత్రులు 'వాళ్ల నోటి మాటలు వాళ్ల భాషలో ఉండవచ్చు కాని కథనం కూడా అదే భాషలో ఏమిటి?' అన్నారు. అంటే వాస్తవికత పాత్రోచితభాష దాకా వస్తే వారికి అభ్యంతరం లేదు. కాని కథకుడే 'అలగావాళ్ళ' ప్రతినిధి కావడం ఏమిటి? వాడు మధ్యతరగతిలోనే ఉండాలి... గోఖలే కథలోని విషయాన్ని గుర్తించి ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. కథనంలో కళాకారుడి కుంచెను ఆ 'అలగా' భాషలో అంత ప్రౌఢంగా వాడినవాడు గోఖలే తప్ప మరొకడు ఉన్నట్టు నాకు అనిపించలేదు.''[2]

శారీరక శ్రమపట్ల, శ్రమజీవుల పట్ల చిన్నచూపే వారి భాషపట్ల కూడా వుండటంవల్ల మాండలిక సాహిత్యాన్ని నిరాదరించడం జరుగుతుందని చెప్పవచ్చు. జనాభాలో అత్యధిక శాతం ఉన్న శ్రామికవర్గం పట్ల సరైన ప్రజాస్వామిక దృక్పథ లేకపోవడం మూలానే వారి భాషలో వెలువడే సాహిత్యాన్ని కించపరచడం జరుగుతుంది.

కింది తరగతి ప్రజల జీవితాలని చిత్రించవలసిన సామాజిక అవసరంలో, వారి సంస్కృతి సాహిత్యంలో వస్తువుగా ప్రవేశించినప్పుడు ఆ సంస్కృతిలో భాగమైన వారి భాష కూడా చాలా సహజంగా, అవసరంగా, అనివార్యంగా చోటుచేసుకొంటుంది. శిష్టభాష అందుకు సరైన సాధనం కాదు. అది అసహజంగా కూడా వుంటుంది.

మాండలిక రచయితల పట్ల వున్న చిన్నచూపు కూడా మాండలిక రచనలపట్ల వ్యతిరేకతకి కారణంగా పేర్కొనవచ్చు. సాహిత్యంలో లబ్దప్రతిష్ఠులైన రచయితల మాండలిక రచనలకి లభించే ఆదరణ మాండలిక రచనలద్వారానే సాహిత్యరంగంలో కొత్తగా ప్రవేశించే వాళ్ల రచనలకు లభించకపోవడం గమనించవచ్చు. అందుకే రావిశాస్త్రి విశాఖ మాండలికంలో రాసినప్పుడు రాని ఆక్షేపణలు రాజయ్య తెలంగాణా మాండలికంలో కథలు, నవలలు రాస్తున్నప్పుడు ఎదురయ్యాయి.

మాండలికం సాహిత్యంలో కొన్ని భావాలను వ్యక్తీకరించడానికి అసమర్థమైనది అనుకోవడం కూడా పొరపాటే. అట్టడుగు ప్రజల జీవితాన్ని వర్ణించడానికి శిష్ట వ్యావహారికంలోని పదజాలం కన్నా మాండలికమే ఎక్కువ శక్తిమంతంగా వుంటుంది. అదీగాక శిష్టవ్యావహారిక భాష వారి సంస్కృతికి దూరమైన భాష.

ప్రజల భాష ప్రజా సాహిత్యానికి ప్రాణం. అందువల్ల ఏ వర్గ ప్రజల గురించి రాస్తున్నామో ఆ మాండలికం వాడటం సహజం. అంతేకాదు - మాండలికంలో సాహిత్యం ఆ ప్రాంత వర్గ ప్రజల గుండెల్లోకి తిన్నగా చొచ్చుకుపోగలుగుతుంది. అది వారి సొంత భాష. ఆ భాషమీద వారికి అభిమానం, ఆత్మీయత ఉంటాయి. ఆ విధంగా సాహిత్యంద్వారా ఆశించిన ప్రయోజనాల్ని సాధించడానికి మాండలికం ప్రముఖమైన సాధనమవుతుంది.

నిజానికి మాండలికంలో సాహిత్యం రచించకూడదన్నది కృత్రిమ నియమం. ఒక భాష విశాల ప్రజానీకానికి చెందినప్పుడు అందులో ప్రాంతీయ వర్గ మాండలిక భేదాలు వుండటం ఎంత సహజమో, ఆయా ప్రాంత వర్గ ప్రజల జీవితాల్ని సృజనాత్మక సాహిత్యంగా మలిచేటప్పుడు ఆయా మాండలికాలని వాడటం - కళాదృష్టితో చూస్తే అంతే సహజం. అందువల్ల మాండలిక భాషపట్లగానీ, సాహిత్యంపట్లగానీ చిన్నచూపు వుండాల్సిన అవసరం లేదు.

విశాలమైన ఒక ప్రాంతానికి చెందిన మాండలికం కూడా ప్రామాణిక భాషకు తీసిపోదని కెలర్ చెప్పిన మాటలు గమనించదగ్గవి. ''సమాజం మొత్తంలో దైనిక వ్యవహారంలో వుండి

అన్ని తరగతుల వ్యక్తులూ ఇంచుమించు తమ తమ కార్యకలాపాల్లో ఉపయోగిస్తున్న మాండలికం ఏ ప్రామాణిక భాషకైనా తుల్యమే. దాన్ని సమర్థ రచయితలెవరైనా నిపుణంగా శక్తిమంతంగా సాహిత్యభాషగా వాడగలరు.''[4]

అందువల్ల మాండలిక భాష సాహిత్య రచనకు అసమర్థం అని భావించనవసరం లేదు.

మాండలిక సాహిత్యం అర్థం కాదు - అన్నది ఆ సాహిత్యం గురించి వున్న మరో ఆక్షేపణ. ఈ ఆక్షేపణ పుట్టడానికి బలమైన కారణాలు ఉన్నాయి.

మాండలిక సాహిత్యం విస్తృతంగా వచ్చిన 70ల్లో ఈ వాదన బయలుదేరింది. ఆరోజుల్లో జీవనాడి, సృజన, నూతన లాంటి పత్రికలు మాండలిక సాహిత్యాన్ని ఎక్కువగా ప్రచురించేవి. మాండలిక భాష - సాహిత్యాల గురించి చర్చలు కూడా ఆ పత్రికల్లోనే జరిగాయి. పాఠకులూ, రచయితలూ, సాహిత్య సంస్థలు సైతం ఈ చర్చల్లో ఉత్సాహంగా పాల్గొన్న నేపథ్యంలో హైదరాబాదు 'సాహితీ సర్కిల్' పాఠకుల కోసం మాండలిక రచన - భాషల గురించి ప్రశ్నావళి తయారుచేసింది.[5] ప్రముఖ మాండలిక రచయితలనీ, పాఠకులనీ ముఖాముఖీ నిలబెట్టి ఆసక్తికరమైన చర్చలు చేసిన ఆ సంస్థ కృషి గమనించతగ్గది. మాండలికం అర్థం కాదనడానికి కారణాలు పరిశీలిస్తే అందులోని మంచి చెడ్డా తెలుసుకోవడానికి వీలుంటుంది.

మాండలికం అనడంలోనే ఒక మండలానికి పరిమితం అన్న అర్థం వుంది కాబట్టి, అది విస్తృత ప్రజానీకానికి అందదనీ, ఒకవేళ నిఘంటువు సహాయంతో అర్థం చేసుకుందామన్నా ఆ పదాలు నిఘంటువుల్లో దొరకవనీ, ప్రామాణిక భాషా సాహిత్యం అన్ని ప్రాంతాల వారికీ సమానం కాబట్టి విస్తృత ప్రజానీకానికి చేరువ కావడం అన్న సాహిత్య లక్ష్యం ప్రామాణిక భాష ద్వారానే సాధ్యమౌతుంది కానీ మాండలికం వల్ల కాదనీ వీరి వాదన.

ఇది పాఠకుల పక్షం నుంచి వినిపించే వాదన. ప్రాంతీయ మాండలికం అర్థంకాదన్నది సత్యదూరం. ఏ మాండలికమూ పూర్తిగా అర్థం కాకపోవడం అన్నది ఉండదు. పూర్తిగా అర్థం కాకపోతే వేరే భాష అవుతుంది కానీ అది మాండలికం కాదు. ఏవో కొన్ని ప్రాంతీయమైన పదాలు తెలియనంత మాత్రాన మాండలికం అసలే తెలియదని అనుకోనక్కరలేదు.

ఈ తెలియకపోవడం కూడా ప్రాంతీయ శిష్ట మాండలికం విషయంలో అంతగా ఉండదు. శిష్ట మాండలికంలో ప్రాంతీయ వైవిధ్యం తక్కువ వుంటుంది. అందుకే శ్రీపాద గోదావరి జిల్లా మధ్యతరగతి బ్రాహ్మణ భాషలోని కథలు తెలుగునాట అంతటా వ్యాపించాయి. కింది తరగతి ప్రజల భాషలోనే ప్రాంతీయ వైవిధ్యం ఎక్కువ.[6] మధ్యతరగతి పాఠకులు ప్రామాణిక భాషకు అలవాటుపడి ఉంటారు; కింది తరగతి ప్రజల జీవితానుభవాలూ, భాషా, సంస్కృతీ ఈ పాఠకులకి పరిచయం ఉండవు. అందువల్ల ప్రాంతీయ నిమ్నవర్గ మాండలికంలో వున్న సాహిత్యమే అర్థం కాకుండా పోతుందని ఈ ఆక్షేపణ ద్వారా తెలుస్తుంది. మాగోఖిలే వాడిన గుంటూరు జిల్లా కింది తరగతి ప్రజల భాష ఆ జిల్లా పాఠకులకే పట్టిచ్చిందంటే కారణం అదే.[7]

తెలంగాణా మాండలికంలో కథలు, నవలలు వచ్చిన 70ల్లో మాండలికం గురించి అభ్యంతరాలు - చర్చలూ మొదలయ్యాయి. అంతకుముందు విశాఖ మాండలికంలో రావిశాస్త్రి - బీనాదేవి, శ్రీకాకుళం మాండలికంలో కాళీపట్నం లాంటివాళ్ళు రాసినప్పుడు చర్చలూ లేవు - పాఠకులకు ఇబ్బందీ కలగలేదు. పైపెచ్చు ఆ భాషా శిల్పచాతుర్యాన్ని మెచ్చుకొన్నారు కూడా.

అందుకు ఒక చారిత్రక కారణం వుందని తోస్తుంది. వాడుకభాషోద్యమ కాలంలో తెలంగాణా భాషని పండితులు పట్టించుకోలేదని చెప్పాలి. నిజాం పాలనలోని తెలంగాణాకు, బ్రిటిష్ పాలనలోని ఆంధ్రాకు సాంస్కృతిక సంబంధాలు చాలా తక్కువగా వుండేవి. ఆ కారణంగా తెలంగాణా భాషా సాహిత్యాలే కాదు - సంస్కృతి కూడా ఇతర ప్రాంతాలకు తెలియని పరిస్థితి; విశాలాంధ్ర ఏర్పడ్డాకా సైతం; ఎదురైంది. వారి భాష, సంస్కృతి తక్కిన ప్రాంతాలవారికి వేరుగా కనిపించడమే కాదు - ప్రామాణికం భాష ప్రభావం పడని ఆ భాషలోని సహజ సౌందర్యం అసంస్కృతంగా కూడా తోచిందని చెప్పవచ్చు. విశాఖ, శ్రీకాకుళం మాండలికాల్లో వచ్చిన సాహిత్యం అలాంటిది కాదు. ప్రామాణిక మాండలికానికి(**Standard dialect**) ఈ మాండలికాలు దగ్గర వున్నాయి. ప్రామాణిక మాండలికంలో సాహిత్య పఠనానికి అలవాటుపడ్డ పాఠకులకి అందుకే రావిశాస్త్రి, కాళీపట్నం లాంటివారి భాష అంత కొత్తగా అనిపించలేదు. కొద్దో గొప్పో తేడాలున్నా 'అలవాటు' అయిన కొద్దీ సందార్భన్ని బట్టి పదాల అర్థాన్ని ఊహించుకుంటూ ఆ మాండలిక వ్యత్యాసాన్ని అధిగమించగలిగారు. గురజాడ కాలంనుంచీ కూడా గోదావరి, విశాఖ జిల్లాల నుంచి ఆధునిక సాహిత్యం ఎక్కువగా వచ్చిన కారణంగా కూడా ఆ భాష మాండలికమని తోచలేదు - తోచినా ఇబ్బంది కాలేదు.

తెలంగాణా మాండలికంలో యశోదారెడ్డి 'మావూరి ముచ్చట' చెప్పినప్పుడు .....గానీ, పోరంకి దక్షిణామూర్తి మూడు ప్రాంతాల జానపద భాషలో నవలలు రాసినప్పుడుగానీ ఈ వ్యతిరేకత రాలేదు. అల్లం రాజయ్య పూర్తిగా కింది తరగతి ప్రజల భాషలో 'కొలిమంటుకొన్నది' నవల రాస్తున్నప్పుడు మాండలికంమీద చర్చ మొదలైంది. 'మాలపల్లి' రాసినప్పుడు ఉన్నవ, 'ప్రజల మనిషి' రాసినప్పుడు వట్టికోట, 'కొలిమంటుకొన్నది' రాసినప్పుడు రాజయ్య ఒకేవిధమైన పరిస్థితి ఎదుర్కొన్నారనిపిస్తుంది. అయితే మాండలికం వాడటంలో వాళ్లకున్న భయాలూ, జంకులూ రాజయ్యకు లేవు. తన భాషలోనే, తనచుట్టూ వున్న ప్రజల భాషలోనే తప్ప వేరే భాషలో చెప్ప చేతకాదని అతను చెప్పాడు. భాష గురించి ఉన్నవ, వట్టికోట లాగా రాజయ్య పాఠకులకి సంజాయిషీ ఇచ్చుకోలేదు - విన్నవించుకోలేదు. మారుమూల తెలంగాణా పల్లెల్లోని కింది తరగతి ప్రజల భాషలో కథ - కథనం నడిపేసరికి ఆ భాషా సంస్కృతులు మధ్యతరగతి పాఠకుడికి అందలేదు. దాంతో భాషమీద చర్చ జరిగింది.

అంతకుముందే మాండలికంలో పాటలూ, వచన కవితలూ వచ్చాయి. రాజయ్యలాంటి వాళ్ల కథలు కూడా కొన్ని వెలువడ్డాయి. కానీ నవల వచ్చినప్పుడే వ్యతిరేకత కొట్టొచ్చినట్టుగా

వచ్చింది. మాండలిక కథల గురించి రెండు వర్గాల ప్రజలు- మధ్యతరగతికి చెందిన పాఠకులూ, మాండలికకథలు- నవలల్లో వ్యక్తీకరించిన విప్లవ రాజకీయాల పట్ల అవగాహన సానుభూతి వున్న మేధావులూ- అభ్యంతరాలూ లేవదీశారు. మాండలికంలో వచ్చిన పాటల్ని అన్ని వర్గాల ప్రజలూ ఆదరించారు.

'' ఉత్తమమైన విరసం గేయాలూ తెలంగాణా అట్టడుగు వాళ్ల భాషలో గద్దర్‌లాంటివాళ్ళు పాడితే శరీరాలు పులకరిస్తున్నవి. విప్లకార్యులకు మాత్రమే కాదు- సాహిత్యాభిమానులైన విప్లవ వ్యతిరేకులకు కూడానూ'' అని విమర్శకులు భావించారు.[9] కాని దానికి పూర్తిగా భిన్నంగా విప్లవాభిమానాలనుండి సైతం మాండలిక కథలు, నవలల గురించి ఆక్షేపణలు వచ్చాయి.

''విప్లవం విశాల ప్రజానీకం కొరకైనప్పుడు, విప్లవ ప్రయోజనాన్ని నెరవేర్చడానికి లక్షించబడ్డ రచన కూడా విశాల ప్రజానీకం కొరకే వుండాలి. అట్లాకాక మాండలికంలో వున్నందువల్ల అది తన విశాలతను కోల్పోయే ప్రమాదం వుంది'' అని కొందరు అభిప్రాయపడ్డారు.[10]

ఈ అభిప్రాయం నిజం కాదు. విప్లవాచరణలో భాగంగా వెలువడ్డ సాహిత్యంలో వస్తువు విప్లవ ప్రయోజనాల వ్యాప్తిని నిర్ధారిస్తుంది. భాష- శిల్పం లాంటివి ద్వితీయ స్థానంలో నిలబడతాయి.

అదీగాక ఉద్యమావసరాల కనుగుణంగా ఉద్యమ ప్రాంతాల భాష కళల్లో చోటుచేసుకుంటుంది. తమ చుట్టూ వున్న సమాజంలో వేగంగా వస్తున్న మార్పుల్నీ సంక్లిష్ట జీవన పరిస్థితుల్నీ స్థానిక రచయితలూ, కళాకారులే సరిగా గ్రహించగలరు- వాటికి కళారూపం ఇవ్వగలరు. అటువంటి సందర్భాల్లో విప్లవాచారణలో భాగం వహించిన ప్రజల జీవితాన్ని అందులోని సంఘర్షణనీ వారి జీవితం నుంచి వేరుగా వుండే పత్రికల భాషలోకి అనువదించడం అసహజం. అందుకే ప్రజలు జీవించిన జీవితం, అందులోని సంఘర్షణ, ఉత్పత్తి క్రమంలో వాళ్ల స్పందన నుండి పుట్టిన భాషలోనే రచన చేయాలని రచయితలు భావించారు.[11]

భాష విప్లవ ప్రయోజనాలు సాధించడానికి ఎన్నడూ ఆటంకం కాదు. ఉద్యమం పట్ల సానుభూతి, ప్రజల జీవితం పట్ల అనురక్తి 'మమ'కారం ఉన్నప్పుడు ఎన్ని అవరోధాలైనా అధిగమించి ఆ సాహిత్యాన్ని అర్థం చేసుకోవచ్చు.

మాండలికాల్లో రచనలు పెరిగే కొద్దీ క్లిష్టత తగ్గి స్పష్టత పెరుగుతుంది. మాండలిక రచనలని పత్రికలు విస్తారంగా ప్రచురించడంవల్ల కూడా ప్రాచుర్యం పెరిగి అర్థం కానితనం క్రమంగా తగ్గిపోతుంది. అంతవరకూ పాదసూచికల్లో పదాలకు అర్థాలు, వివరణలు ఇస్తే మంచిది. తద్వారా మాండలిక రచనలపట్ల వున్న సంకోచాలు తగ్గుముఖం పట్టే అవకాశాలున్నాయి.

మాండలికం అందరికీ అర్థం కాదు కాబట్టి శిష్ట వ్యావహారికాన్నే వాడాలనే వాదనని పూర్వపు గ్రాంథిక భాషావాదుల ధోరణితో సమానంగా భావించి నిర్ద్వంద్వంగా కొందరు ఖండిస్తే, మరికొందరు మధ్యేమార్గాన్ని సూచించారు.

వివరణలు, వర్ణనలు పూర్తి మాండలికంలో రాయాల్సిన పనిలేదనీ, పాత్రల ఆలోచనలు, మాటలు తప్ప మిగతా కథనం పత్రికల భాషలో చేయడం ద్వారా మధ్యతరగతి పాఠకుడికి కూడా మాండలిక రచన చేరువవుతుందనీ, మాండలికాల్లో కూడా మారుమూల పదాల్ని వాడటం తగ్గించడం ద్వారా మాండలిక రచనల్ని చదువుకోవడం సులభతరమవుతుందనీ, కొంతకాలం పదాలకు అర్థవివరణలు ఇవ్వడం ద్వారా మాండలికాన్ని పాఠకులకి అలవాటుచేస్తే ఆ తర్వాత పూర్తి మాండలికం రాసినా అర్థం చేసుకొంటారని ప్రతిపాదించారు.

సంభాషణలు మాండలికంలో రాసి మిగతా కథనం అంతా ప్రామాణిక భాషలో రాసే పద్ధతి కొత్తదేం కాదు. రచనకి సంబంధించిన ఈ శైలి పాత్రోచిత భాషగా ఎప్పటినుంచో వస్తుంది. అయినా - ఏదో రాయితీ ఇచ్చినట్టు రచయితకి మాండలికం రాసుకోవడానికి కొన్ని షరతులు పెట్టి -వెసులుబాటు కల్పించినట్లున్న ఈ సూచనకు మాండలిక రచయితలు చాలా తీవ్రంగా ప్రతిస్పందించారు. తాము తమ మాతృభాషలో రాస్తుంటే ఇలా రాయకూడదనీ, అలా రాయొచ్చనీ నిర్బంధించడం అంటే తమ భాషనీ- భావాల్నీ ప్రామాణిక భాష -సాహిత్య వ్యవస్థ నియంత్రించడమేననీ అది కూడా ఒక విధమైన అణచివేత కిందకే వస్తుందనీ రచయితలు భావించారు.[12]

భాషా సమస్య జాతుల సమస్యలో భాగమనీ, తమ భాష అణచివేతకు గురవుతుందనే భావనలోంచే ప్రత్యేక ప్రతిపత్తిని కోరే అవకాశం ఉందనీ, తెలంగాణా భాష అటువంటి సాంస్కృతిక పీడనకు గురయిన సంర్భాలున్నాయనీ బి. ఎస్. రాములు అభిప్రాయపడ్డారు.[13]

ఇది చాలా తీవ్రంగా, లోతుగా ఆలోచించదగ్గ విషయం. మాండలికంలో రచనలు వెలుగులోకి రావడానికీ, ఈ చర్చలు జరగడానికీ ఒక రాజకీయార్థిక సామాజిక నేపథ్యం వుంది. గ్రామాల్లో భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా భూమికోసం రైతాంగం తిరుగుబాట్లు చేస్తున్నప్పుడూ, గిరిజనేతురులు ప్రభుత్వం అడవి నుంచి తమని దూరంచేసి తరతరాలుగా పోడు వ్యవసాయం చేస్తున్న తమ హక్కుని నేలరాస్తున్నారని గిరిజనులు ఎదురుతిరిగినప్పుడు, బొగ్గు పొరల్లో తమను తాము కోల్పోయి జీవచ్ఛవాల్లా బతుకుతూ కనిపించని పెట్టుబడిదారీ దోపిడీకి గురవుతున్నామని కార్మికులు పోరాటాలు చేస్తున్నప్పుడు - తమ చుట్టూ వున్న జీవితాల్లోని చేదు వాస్తవాలని చూసి చలించిన రచయితలు పరిష్కారమార్గాలు అన్వేషిస్తూ తమ గుండెల్లోని భావాలకి అక్షర రూపం ఇవ్వాలని పూనుకున్నప్పుడువాళ్ల సంస్కృతిలో భాగమైన సజీవమైన భాషే వాళ్లకు రచనా మాధ్యమంగా కనిపించింది. అందువల్లే రచయితలు ఏ వర్గాలనుంచి వచ్చారో ఆ అట్టడుగు వర్గాల భాష ఆ అక్షర స్పందనలో చోటుచేసుకుంది. దాని మీద ఆంక్షలు విధిస్తూ- కథనం శిష్ట వ్యవహారంలో వుండాలి, సంభాషణలు మాత్రం మాండలికంలో వుండొచ్చు అని చెప్పడం రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లోనే గాక సాంస్కృతిక రంగంలో కూడా వాళ్లని పీడనకు గురిచేసినట్టవుతుంది. అందుకే మాండలికం

అన్న పదం కూడా ప్రాంతీయ విభజననీ, సామాజిక అసమానతని ఎత్తి చూపేదనీ, అది ఆ భాషనీ- ఆ భాష మాట్లాడే ప్రజల్నీ న్యూనతకి గురిచేసే క్రమాన్ని పునాదిగా కలిగి ఉందనీ విమర్శకులు భావించారు. కొత్తగా సాహిత్య - సాంస్కృతిక రంగాల్లోకి ఒక హక్కు కోసం పోరాడుతూ వచ్చిన ఈ రచయితల భాషని 'ప్రజల భాష'గా గుర్తించమంటున్నారు.[14]

'మా భాషలో వేం రాస్తున్నాం - అది మా న్యాయసమ్మతమైన హక్కు' అని బి.ఎస్.రాములు భావించడం వెనుక వున్న ఈ తాత్త్విక చింతనని భాషా - సాహిత్య - సామాజిక వేత్తలు గమనించవలసి వుంది.

భాషా-సాహిత్య-సాంస్కృతిక రంగాల్లో వ్యవస్థీకృతమైన ఆధిపత్యధోరణిపైన పోరాటంలో భాగంగా మాండలిక సాహిత్య సృజన జరిగిందని దీనిద్వారా స్పష్టమవుతుంది.

ప్రామాణిక భాష పాఠశాలల్లో నేర్చుకునే ద్వితీయ భాషే గానీ మాతృభాష కాదు. అందువలనే 'రచయిత ఏ భాషలో శక్తిమంతుడో, ఏ భాషలో అయితే బలంగా తాను వ్యక్తీకరించగలడో ఆ భాషనే వాడటం ఆరోగ్యకరం; అతని ప్రతిభా సంపత్తి సృజన ఏ భాషలో వికసిస్తుందో, దానిలోనే వికసించనీయండి' అని కవులు భావించారు.[15]

అయితే మాండలికంలో సాహిత్య రచన అంత సులభమైన విషయం కాదు. ప్రామాణికంలో రాయడం కన్నా మాండలికంలో రాయడం తేలిక - అనే భావనతో మాండలిక సాహిత్య సృజనకు పూనుకొంటే మాండలిక సాహిత్యాన్నంతటినీ అనుచితంగా అప్రతిష్ఠపాలు చేయడమే. మాండలిక రచయితలు ప్రామాణిక రచయితలకన్నా భాష- శిల్పం లాంటి విషయాల్లో ఎక్కువ శ్రద్ధ వహించాలి. ఆ శ్రద్ధ లోపిస్తే మాండలిక రచన అర్థం కాకపోవడానికి రచయిత అసమర్థత అన్వర్హతకూడా కొంతవరకు కారణం అవుతుంది.

నిజమైన మాండలిక సాహిత్య రచన అసాధ్యం అని కూడా ఒక వాదం వుంది. నిజమైన మాండలిక రచయితలు లేకపోవడమే అందుకు కారణంగా పేర్కొంటారు.[16] రచయితలు సామాన్యంగా చదువుకున్నవారై వుంటారు. అందువల్ల వారికి కొత్త సంస్కారం, కొత్త జ్ఞానం అలవడి వుంటాయి. వారి పదజాలం, శైలి, నుడికారం, ఉక్తివైచిత్రి ప్రామాణిక భాషవల్ల ప్రభావితమై వుంటాయి. ఆ కారణంగా వాళ్ళు మాండలిక భాషలో ప్రామాణిక / సాహిత్య భాషను మిళితం చేసే ప్రమాదం వుంది. అంతేగాక ప్రామాణిక భాషలో ఆలోచించి దాన్ని మాండలిక ధ్వని - వ్యాకరణాల్లోకి అనువదించే అలవాటు కూడా ఏర్పడుతుంది. అందువల్ల రచయితలు శుద్ధమైన సజీవ మాండలికం రాయలేరని ఈ వాదన సారాంశం.

నిజానికి సరైన మాండలికం తెలిసినవాళ్ళు ప్రజలు. వాళ్ళే మాండలిక సాహిత్య రచన చేయడానికి అర్హులు. కానీ వాళ్ళు నిరక్షరాస్యులు. అందువల్ల వారు తమ సాహిత్యాన్ని లిఖితరూపంలో సృజించలేరు; కానీ మౌఖికంగా కూర్చగలరు. లిఖిత సంప్రదాయ శైలీ, నిర్మాణాలకు అలవాటుపడ్డ రచయితలు 'రాసే' మాండలికం కృత్రిమంగా తయారయ్యే

ప్రమాదం ఉంది. అందువల్ల మాండలిక సాహిత్య నిర్మాణంలో భాషపట్ల రచయిత ఎంతో జాగరూకుడై వుండాలి. రచయిత భాషమీద ప్రత్యేక శ్రద్ధ చూపించే సందర్భంలో శిల్పం, వస్తువు దెబ్బతినే అవకాశం వుంది.

భాషా విషయికంగానే కాదు - సంస్కృతిపరంగా కూడా రచయిత ప్రజలనుండి దూరంగా వున్నప్పుడు సైతం సజీవ మాండలిక రచన జరగదు. అందువల్ల మాండలిక రచయిత ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగి వుండటమే గాక వాళ్లతో 'మమేకం' కావాలి. ప్రజల జీవితానుభవాల్నీ, భాషనీ వాళ్లతో తాదాత్మ్యం చెందడం ద్వారా మాత్రమే సాధించగలడు. మానసికంగానూ, సాంస్కృతికంగానూ, తదితరంగా అన్ని రంగాల్లోనూ రచయిత ప్రజలతో, ప్రజల భాషతో తాదాత్మ్యం చెందినప్పుడు సజీవ మాండలిక రచన సాధ్యమే. అయితే ఇదంతా రచయిత మధ్యతరగతి నుంచి వచ్చినప్పుడు జరిగే వ్యవహారం. రచయిత కింది తరగతికి చెందినవాడైనప్పుడు మాండలికం రాయడం అంటే - అది అతని మాతృభాషలో రాస్తున్నట్లే. ఉత్తర తెలంగాణా మాండలిక రచయితలు చాలామంది కింది తరగతినుండి వచ్చినవాళ్ళే కాబట్టి వాళ్ళ భాషలో కృత్రిమత్వం కనిపించదు. ప్రామాణిక భాషలో ఆలోచించి దాన్ని మాండలికంలోకి తర్జుమా చేయాల్సిన అవసరం ఈ రచయితలకు కలగలేదు.

చిన్నప్పటినుండి సజీవమైన మాండలికంతో పరిచయం లేనప్పటికీ; దైనందిన జీవితంలో ప్రామాణిక భాషే అలవాటున్నప్పుడు; మాండలిక రచన చేయడానికి పూనుకొనే రచయిత చాలా మెళకువలతో ఉండాలి. తెలుగులో పోరంకి దక్షిణామూర్తి కోస్తా - తెలంగాణా - రాయలసీమ మాండలికాలు మూడింటిలోనూ నవలలు రాశారు.[17] మాండలికంలో (జానపద భాష) పూర్తిస్థాయి నవల రాసే ప్రయోగం చేసిన మొదటి రచయిత ఆయనే. పోరంకి చేసిన ప్రయోగం నిజానికి పెద్ద సాహసం. మూడు మాండలికాల్లోనూ నవలా రచన చేయడం ఎలా సాధ్యమయిందని అడిగినప్పుడు రచయిత చెప్పిన మాటలు గమనించదగ్గవి.

'నేను నవలల్లో ప్రయోగించిన మూడు మాండలికాలూ నా నిత్య జీవిత వ్యవహారంలో వున్నవి కావు. నాకు చిన్నప్పటినుంచీ అలవడిందీ అలవాటులో ఉందీ ప్రామాణిక భాషే. కానీ మాండలిక (వర్గ, ప్రాంతీయ) భాష మాట్లాడే వాళ్లతో కలిసి మెలసి ఉంటూ వాళ్లలో ఒకడిని అనిపించేంతగా తాదాత్మ్యం చెందడంవల్ల, అనుకరణవల్ల మాండలికం నాకు పట్టుబడింది. అందువల్ల మాండలిక రచన నాకు అసాధ్యమనిపించలేదు.''[18]

అయితే పరాయి మాండలికంలో రచన చేస్తున్నప్పుడు పూర్తిగా న్యాయం చేయగలనో లేదో అన్న 'జంకు' రచయితకు తప్పనిసరిగా వుంటుంది. తెలంగాణా మాండలికంలో 'ముత్యాల పందిరి' నవల రాస్తూ పోరంకి ఆ జంకును వ్యక్తం చేశారు.

తెలంగాణా మాండలిక కథా రచయిత బి.ఎస్.రాములు తూర్పుగోదావరి జిల్లా మన్యం గిరిజన భాషలో కథ రాస్తూ గిరిజనుల పోరాటాన్నీ, భాషనీ సజీవంగా పెట్టలేకపోయినందుకు **'అశక్తత'**ని అంగీకరించారు.[19]

సాంఘికంగానూ, ప్రాంతీయంగానూ భిన్న మాండలికానికి చెందిన రచయిత చేసే అనుకరణ ప్రయత్నాలు మిథ్యా మాండలిక సృష్టికి దారితీయవచ్చు; లేదా హాస్యాస్పదంగానైనా పరిణమించవచ్చు.

అందువల్ల రచయిత తనది కాని మాండలికంలో రచన చేయడానికి ప్రయత్నించకపోవడమే మంచిది. అయితే ప్రజా జీవితాన్ని, భాషా వ్యవహారాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసి కళారహస్యాలు తెలుసుకున్న ప్రతిభావంతులైన రచయితల మాండలిక రచనలకి సాహిత్యంలో ప్రత్యేకమైన స్థానం లభిస్తుంది.

మాండలిక రచన విషయంలో రచయిత ఎదుర్కొనే ఇబ్బందులూ- వాటిని అధిగమించడానికి పి.సి.నరసింహారెడ్డి చేసిన సూచనలు ఇక్కడ పేర్కొనదగ్గవి.

''రచయితకు జనజీవితంతో సన్నిహితం పరిచయముండాలి. ప్రజల భాషతో పాటు నిత్యజీవితంలోని భావజాలం, దాని వ్యక్తీకరణ రీతులు తెలియాలి. రచయితల భాషా రూపాల ప్రయోగంలో మరో రచనపై కాకుండా భాషా వ్యవహర్తలపై ఆధారపడవలసి వస్తుంది. అందుకు ఇతర కౌశలాలతోపాటు భాషా విషయకంగా రచయిత గ్రహణ, మననశక్తులు కూడా చాలా నిశితంగా పనిచేయాల్సి వస్తుంది. అంతేకాక మౌఖిక వ్యవహారంలోని భాషా ప్రయోగాల్ని సృజనాత్మక రచనల్లో సహజరీతుల్లో కళాత్మకంగా మలిచే నేర్పుండాలి.''20

ఇవన్నీ వున్నప్పుడు మంచి మాండలిక రచన తయారవుతుంది. లేని పక్షంలో మాండలిక సాహిత్యం పాఠకులకి అర్థం కాకుండా పోయే ప్రమాదం, కృతకంగా తయారయ్యే అవకాశం వున్నాయి- అందుకు రచయితే బాధ్యత వహించాల్సి వుంటుంది.

రచయిత సంకుచిత పరిధిలో వున్న మాండలిక పదజాలాన్ని ఉపయోగించినప్పుడు కూడా రచన అర్థం కాకపోయే ప్రమాదం ఉంది. విశాల పరిధిలో వున్న మాండలికాన్ని వాడటం ద్వారా దాన్ని పరిహరించుకోవచ్చు.

మాండలికంలోని యాసని లిపిబద్ధం చేసే విషయకంగా కూడా రచయితలూ- పాఠకులూ ఇబ్బందిని ఎదుర్కొంటున్నారు. మాండలికాన్ని లిపిబద్ధం చేసే ప్రయత్నంలో రచయిత వాడిన ధ్వనిరూపం పాఠకుడికి తెలియకపోవచ్చు; లేదా రచయిత ఆ ధ్వనిని సరిగా సూచించకపోవచ్చు. వ్యవహారంలోని మాండలికాన్ని యథాతథంగా లేఖనంలో చూపాలనే ఆలోచన మంచిదేగాని, ఆ ప్రయత్నం లిఖిత ప్రామాణిక - వ్యవహృత మాండలికాల కృతకసమ్మిశ్రణానికీ, కృతక ఉచ్చారణకూ దారితీయవచ్చు. రచయిత ఏర్పరచుకొన్న ధ్వని సంకేతాలు నూటికి నూరుపాళ్ళు ఉచ్చారణ విశేషానికి ప్రాతినిధ్యం వహించకపోవచ్చు. లేఖనంలో కనిపించే 'యాస' తక్కిన ప్రాంతంవాళ్ళు 'విని' వుండకపోవడం వల్ల దానిలోని సహజత్వాన్ని అర్థం చేసుకోలేక అసహనానికి గురవుతారు. పాఠకుడికి శ్రమ కలిగించే లేఖన పద్ధతుల్ని రచయితలు వీలయినంతవరకు పరిహరించాలి.

నిజానికి వాగ్రూపంలోని భాషకూ, లిఖితరూపంలోని భాషకూ ఎప్పుడూ అంతరం వుంటుంది. నూటికి నూరుపాళ్ళూ ఉచ్చారణ విధేయంగా ఉండే లిపి ప్రపంచంలో ఏ భాషకూ లేదని చెప్పవచ్చు. ప్రామాణిక లిఖిత భాష కూడా ప్రామాణిక వ్యవహారానికి యథార్థ ప్రతిబింబం కాదు. కానీ ప్రామాణిక భాష విషయంలో పాఠశాలల్లో ఉపాధ్యాయుల, వ్యాకర్తల అడుగుజాడల్లో గతానుగతికమైన ఒక లేఖన సంప్రదాయం ఏర్పడి వుంటుంది. మాండలికం విషయంలో ఆచరణ - అనుభవం రెండూ లేని కారణంగా మాండలిక లేఖనం - పఠనం రెండూ కష్టమవుతాయి. రచయిత తనకు తోచిన విధంగా తాను రాసుకుంటూ పోతే పాఠకుడికి శ్రమ కలిగించిన వాడవుతాడు.

అందువల్ల మాండలికం అధిక సంఖ్యాకులకి అందుబాటులో ఉండాలని భావించినప్పుడు అది అనవసరంగా సాంప్రదాయిక వర్ణమాలకు భిన్నంగా వుండకూడదు. సంప్రదాయ లేఖన పద్ధతికి పూర్తిగా విరుద్ధంగా రాయడానికి ప్రయత్నించడం వల్ల రచన పాఠకుడికి దూరమయ్యే అవకాశం ఉంది. పాఠకుడికి అలవాటు కాని రాత 'కంటికి' కష్టం కలిగిస్తుంది. అలా అని మాండలికంలో ఉన్న సహజోచ్చారణని పూర్తిగా నిర్లిప్తంగా అలక్ష్యం చేయమని కూడా కాదు. సాధ్యమైనంత తక్కువ మార్పుతో సాంప్రదాయిక లేఖన పద్ధతికి దగ్గరగా వుండేలా రచయిత జాగ్రత్త తీసుకుంటే మాండలిక రచనలోని ఈ సంక్లిష్టతని తొలగించడానికి వీలవుతుంది.

తెలంగాణా మాండలిక రచయితలు మాండలికాన్ని లిపిబద్ధం చేసిన కారణంగా చదివేటప్పుడు వేరే ప్రాంత పాఠకులు ఎదుర్కొన్న ఇబ్బందుల గురించి కాళీపట్నం రామారావు చెప్పిన విషయాలు గమనించదగ్గవి.

''ఈ రచయితల్లో చాలామంది ప్రామాణిక భాషను సొంతం పక్కకుపెట్టి సంభాషణలకే కాక కథనానికి కూడా స్థానిక మాండలికాన్నీ, యాసనూ వాహికగా చేసుకున్నారు. స్థానికులు కానివారికి ఇబ్బంది కలిగించిన వాటిలో మొదటిది మాండలికం. ... ఏ మాండలికంలోనైనా పట్టుబట్టి పదిపేజీలు చదివితే మొదట కొంత కష్టంగా తోచినా క్రమక్రమంగా విడిపోతుంది. కొన్ని కథలు చదివేసరికి వీరి మాండలికమూ అలాగే విడిపోయింది.

''కాని యాసతో అలాకాదు. కాలేదు.''

''ఏ ప్రాంతపు జనం మాటలోనైనా యాస అక్షరానికతీతం. మాట అక్షరానికి లొంగుతుంది. ఈ రచయితలు జనం మాటతోపాటు వారి యాసను అక్షరబద్ధం చేయబోయారు. చదువుకోడంలో వాటితో ఏ కించిత్ పరిచయమూ లేని యితర ప్రాంతాల వారికా అక్షరం అనువదించుకోడంలో ఇబ్బందవుతుంది - అయ్యింది.''[21]

కాబట్టి మౌఖిక భాషకి లిఖితరూపాన్నిచ్చే క్రమంలో మాండలిక రచయిత చాలా శ్రద్ధ వహించాలి. రామకృష్ణారెడ్డి 'పెన్నేటి కతలు' రాస్తూ యాసని అక్షరంలోకి తర్జుమా చేయడంలో తానెదుర్కొన్న సమస్యలని ప్రస్తావించి 'పాఠకులు తప్పుగా చదువుకుంటారేమో' నన్న భయంతో ప్రామాణిక భాషని రాసే సంప్రదాయంలోనే మాండలిక శబ్దాల్ని రాశానని చెప్పుకున్నాడు.[22]

ఈ మాత్రం సావధానత మాండలిక రచయితలు కలిగి వుంటే మాండలిక సాహిత్యం అర్థం కాదన్న ఆరోపణలు తగ్గుముఖం పడతాయి. మాండలిక సాహిత్యం విస్తృతంగా వెలువడటం ద్వారా మాండలిక సాహిత్యానికుంటాయని చెప్పుకొనే పరిమితులు కూడా తొలగిపోతాయి.

ఈ చర్చ అంతా వేరే ప్రాంతాల్లో మాండలిక రచనలని అచ్చులో చదువుకునే పాఠకులని దృష్టిలో వుంచుకొని చేసేది. నెమ్మదిమీద భాషలో కొన్ని సామాన్య ధ్వని సంకేతాలని ఏర్పరచుకొని అచ్చులో చేర్చుకోవచ్చు. వంద సంవత్సరాల క్రితం గురజాడ ఇదే చిక్కుని ఎదుర్కొన్నాడు. వ్యావహారిక భాషలో అనేక ఉచ్చారణలు తెలుగు వర్ణమాలలో లేవనీ, అయితే వాడుక భాష మరింత విస్తృతంగా గుర్తింపు పొందిన తరువాత కొత్త సంకేతాలను సృష్టించడం, తెలుగు టైపులో వాటిని చేర్చడం జరగాలనీ గురజాడ సూచించాడు.[23] గానీ ఆ పని ఇంతవరకూ జరగలేదు. అందువల్లే మాండలిక రచయితలకూ, పాఠకులకూ ఈ ఇబ్బంది ఈనాడు ఎదురయ్యింది. అచ్చులో చదివేటప్పుడు ఎదురయ్యే ఈ ఇబ్బంది వాచికంగా వినిపించేటప్పుడు తొలగిపోతుంది. ఈనాడు ఆంధ్రదేశంలో మాండలిక రచనల వ్యాప్తి తెలుగులో మాండలికాలకున్న పరిమితుల్ని మాండలిక సాహిత్యం అధిగమించిందని చెబుతుంది. రాష్ట్రం నాలుగు ప్రాంతాల్లో వున్న ప్రజల సంస్కృతిని ఏకం చేసే లక్ష్యంలో మాండలిక సాహిత్యం ఎంతవరకూ ప్రయోజనం సాధించగలిగిందో కూడా పరిశీలించవలసి వుంది.

## లక్ష్యాలు - ప్రయోజనాలు

ప్రామాణిక సాహిత్య భాష ఒకటి ఏర్పడి వుండగా ఆ భాషని సాహిత్య సృజనకు స్వీకరించకుండా కవులు, రచయితలు మాండలిక భాషని సాహిత్య భాషగా వాడటంలో ప్రత్యేకమైన కారణాలుగానీ, లక్ష్యాలుగానీ వున్నాయా అని పరిశీలించినప్పుడు కొన్ని ఆసక్తి కలిగే విషయాలు వెల్లడవుతాయి.

గ్రాంథిక భాష సాహిత్య భాషగా రాజ్యమేలుతున్నప్పుడు ఉత్తర కోస్తా జిల్లా ప్రజల వాడుక భాషలో 'కన్యాశుల్కం' రాస్తూ ఆ భాష హాస్యానికీ, నాటకానికీ తగినదనీ, వాడుక భాషలో సాహిత్యం రైతుల్ని తట్టిలేపుతుందనీ గురజాడ ప్రకటించాడు.[24] గురజాడ ప్రకటించిన లక్ష్యాల్లో జనరంజకత్వం అన్నది పూర్తిగా నెరవేరినట్లేనని 'కన్యాశుల్కం' ప్రదర్శనకు నాటినుంచీ నేటివరకూ లభిస్తున్న విస్తృత జనాదరణ చెబుతుంది. జనరంజకత్వంతోపాటు గురజాడ ఆశించిన మరో ప్రయోజనం సంఘ సంస్కరణ. అందులో కూడా ఆయన సఫలమయ్యారనే భావించవచ్చు. వాడుక భాషలో సాహిత్యం రైతుల్ని తట్టిలేపుతుందన్న లక్ష్యం మాండలికంలో సాహిత్యం వెలువడిన తర్వాతగానీ సుసాధ్యం కాలేదు.

కింది తరగతి ప్రజల జీవితం సాహిత్యంలో వస్తువు అయినప్పుడు వారి మాటలు భావాలూ అనుభవాలూ వారి భాషలోనే చెప్పాలని రచయితలు అనుకొన్నప్పుడు, సహజత్వం కోసం, ఔచిత్యం కోసం మాండలిక భాషలో సాహిత్యం వెలువడింది. ఆ ఉద్దేశంతోనే మా గోఖలే మాండలికాన్ని ఎన్నుకున్నాడు. అట్టడుగు ప్రజల భాషలో వున్న సహజమైన కరకుతనం, లాలిత్యం గోఖలే కథన శైలికి ఒక ప్రత్యేకతని సంపాదించిపెట్టాయి.

సహజత్వం కోసం, ఔచిత్యం కోసమే తాను 'జానపద మాండలికాన్ని' నవలల్లో ప్రయోగించినట్లు పోరంకి దక్షిణామూర్తి పేర్కొన్నారు.[25]

మాండలిక రచనని చదువుతున్నప్పుడు కేవలం కథ చదువుతున్నట్టు గాక నాటకంలోలా పాత్రలు సజీవంగా కళ్లముందు నిలబడినట్లు ఒక విధమైన అనుభూతి పాఠకులకు కలిగే అవకాశం ఉంది. సజీవ వాస్తవికతని సాధించే శక్తి మాండలికానికి ఉంది. మాండలికానికి కొన్ని పరిమితులు ఉన్నప్పటికీ చెప్పదల్చుకొన్న భావాల్ని ఆ మాండలికం తెల్సిన పాఠకుడి హృదయానికి తాకేలా సరళంగా, సూటిగా చెప్పడానికి అది గొప్ప సాధనమని విమర్శకులందుకే అభిప్రాయపడ్డారు.[26]

రచనాశిల్పం దృష్ట్యా కాకుండా తమ ప్రాంతానికి చెందిన మాండలికాన్ని కాపాడాలనే లక్ష్యంతో మాండలిక కథా రచనకు పూనుకొన్నట్లు యశోదారెడ్డి చెప్పారు. తెలంగాణా తెలుగులో వున్న 'అమూల్యమైన పదబంధములు కాలగర్భంలో కలిసి పోకుండునట్లుగా గ్రామీణ జన వ్యవహారమందున్న పదములను కాపాడవలెననెడి తాపత్రయమే' తాను కథలు రాయడానికి కారణమనీ, 'కేవలం పదములే పట్టికవలె ఇచ్చిన విసువు జనింపజేయునను తలంపుతో కథలుగానల్లి చూపుటకు ప్రయత్నించినాన'ని ఆమె తెలిపారు.[27]

మాండలిక పదసంపదనీ విధంగా 'రికార్డు' చేయాలనే రచయిత్రి లక్ష్యం గొప్పదేగానీ కాలగర్భంలో కలిసిపోతున్న పదాలని కథల్లో కూర్చి చెప్పడం ద్వారా రక్షించడం సామాజిక భాషాశాస్త్ర దృష్టితో చూస్తే అసాధ్యమనే చెప్పాలి. నిరంతర పరిణామశీలమైన భాషలో ఎన్నో పదాలు కాలగతిలో జారిపోతుంటాయి. కొత్త పదాలు చేరుతూ వుంటాయి. అయితే మాండలిక పదాలని నిఘంటువులకెక్కించడం ద్వారా ఆ పదాలే కాదు - వాటి ప్రయోగాలూ, అర్థచ్ఛాయలు కూడా సరిగా తెలుస్తాయి. రచయిత కథనం కూడా మాండలికంలో వుంటే సంభాషణలకే మాండలికం పరిమితం చేసినప్పుడు లభించే పదాలకన్నా ఎక్కువ పదాలు ప్రయోగంలో లభిస్తాయి. ఇంతకుపూర్వం నిఘంటువుల్లో ఇచ్చిన అర్థాలతో సరిచూసుకొని తప్పుడు అర్థాలని సరిదిద్దుకోవడానికి కూడా ఆ ప్రయోగాలు ఉపయోగపడతాయి.

మాండలిక రచనల ఈ లక్ష్యం కొంతవరకు సఫలమైందనే భావించాలి. కొత్తగా తయారుచేసే మాండలిక నిఘంటువుల్లోకి ఇటీవలి కాలంలోని మాండలిక కథ, నవలలనుంచి సైతం ఎన్నో పదాలు ఎక్కాయి.

విసిరేసినట్లు సుదూర ప్రాంతాల్లో వున్న భిన్న మాండలికాల మధ్య సమన్వయం ఏర్పడటానికీ, భావసారూప్యం ద్వారా సామీప్యం సాధించడానికీ మాండలిక సాహిత్యం ఉపయోగపడుతుంది. ప్రామాణిక భాషని పరిపుష్టం చేయడానికి కూడా మాండలిక సాహిత్యం దోహదపడుతుందని చెప్పొచ్చు.

మాండలిక రచనలు జాతిని సాంస్కృతికంగా ఏకం చేస్తాయని కొడవటిగంటి కుటుంబరావు భావించారు. అఖండ సాహిత్యాన్ని ప్రాంతీయ రచనలతో పరిపుష్టం చేసుకుంటూ పోతే జాతీయ సమైక్యత సమకూరుతుందనీ, తెలుగు దేశంలో వున్న అన్ని ప్రాంతాల తెలుగులోను ఉత్తమ సాహిత్యం వచ్చి అఖండ సాహిత్యంలో చేరడం భవిష్యత్తుకు ఎంతో ఉపయోగం అనీ ఆయన అభిప్రాయపడ్డారు.[28]

తక్షణావసరాలకి - ప్రాంతీయ ప్రజలను చైతన్యవంతులను చేయడానికీ, వారి జీవితాన్ని, చైతన్యాన్ని సజీవంగా చిత్రించడానికీ మాండలిక సాహిత్యం ఉపయోగపడుతుంది. ఈనాడు మాండలిక సాహిత్యం రాకుంటే భవిష్యత్తులో జాతినంతటినీ కదిలించే ఉద్యమాలు వచ్చినప్పుడు నష్టం వాటిల్లుతుంది. 'జీవితంలో ఆకస్మిక పరివర్తనలు కలిగి వాటిని బలపరచడానికి తగిన పరిణతి అఖండ సాహిత్యంలో లేనప్పుడు, నూతన పరిణామాన్ని సూచించేటందుకు సృష్టి అయ్యే సాహిత్యం వేరువేరు ప్రాంతాలలో వేరువేరుగా వుండటం జరుగుతుంది' - కాబట్టి అఖండ సాహిత్యానికి జాతినంతటినీ ఉత్తేజపరిచే శక్తి సమకూరాలాంటే ఇప్పటినుంచే మాండలిక సాహిత్యంద్వారా అఖండ సాహిత్యానికి పుష్టి కలగజేయాలనీ కొ.కు ఉద్దేశం.

జాతీయోద్యమ కాలంలో తెలుగుదేశంలో ఇతర ప్రాంతాలలో సృష్టి అయిన పాటలూ, పదాలు తెలంగాణాలో పనికిరాకపోడానికి కారణం - ఆనాటి అఖండ సాహిత్యంలోకి తెలంగాణా మాండలికం ప్రవేశించి ఉండకపోవడమేననీ, అందుకే అవి ఆ ప్రజలని ఉత్తేజపరచలేకపోయాయనీ కొ.కు. భావించారు.[29]

సాంస్కృతికంగా తెలుగు ప్రజలనందరినీ ఒకటిగా కట్టి వుంచే ప్రామాణిక భాష ఏర్పడాలంటే రావిశాస్త్రి విశాఖ భాషే, కాళీపట్నం శ్రీకాకుళం భాషే, అల్లం రాజయ్య తెలంగాణా భాషే, నామిని రాయలసీమ భాషే సాహిత్యంలోకి ప్రవేశించాలి. ఈ సందర్భంగా కుటుంబరావే మరోచోట చెప్పిన మాటల్ని కూడా గమనించాలి.

''కనీసం సాహిత్యానికి సంబంధించినంతవరకైనా ప్రజలందరూ ఏకం కావాలంటే అన్ని ప్రాంతాల ప్రజల భాషే ఏకం కావాలి. కనీసం ప్రతి ప్రాంతీయ శబ్దజాలమూ, నుడికారమూ అన్ని ప్రాంతాల అందరికీ అర్థం కావాలి. అప్పుడే అభ్యుదయకర, పురోగామి సాహిత్యం అన్ని ప్రాంతాల అందరనీ చైతన్యవంతులను చేస్తుంది.''[30] అందుకు మాండలికంలో విస్తృతంగా సాహిత్యం వెలువడాలి. పత్రికలు అందుకు ఉదారంగా తోడ్పడాలి. ప్రాంతాల జనాభా నిష్పత్తిలో

కాకపోయినా పత్రికల 'సర్క్యులేషన్' నిష్పత్తిలోనయినా ఆయా ప్రాంతీయ మాండలిక రచనలని ప్రచురించడం ద్వారా ఈ పని సాధ్యం అవుతుంది. అప్పుడు నెమ్మదిమీద అన్ని ప్రాంతాల మాండలికాలూ అన్ని ప్రాంతాల వారికీ అర్థమయి తెలుగు భాషా సాహిత్యాలని సంపన్నం చేస్తాయని చెప్పడంలో అనౌచిత్యం లేదు.

గడచిన ఇరవై ఐదు సంవత్సరాలుగా మాండలికంలో సాహిత్యం రావడానికి విప్లవ - రాజకీయ భావజాల ప్రచారం ముఖ్యోద్దేశంగా కనిపిస్తుంది. మాండలికంలో సాహిత్యం అవసరాలూ, లక్ష్యాల గురించి విప్లవ కవులు / రచయితల్లోనే ఎక్కువ చర్చ జరిగింది. మాండలిక సాహిత్య రచన - వికాసానికి ఈ చర్చలు ఎంతో మేలు చేశాయి. సాహిత్యం లక్ష్యాలనూ - ప్రయోజనాలనూ వివేచించుకునే అవకాశాన్ని రచయితలకి ఈ చర్చలు కలగజేశాయి. 70ల ఉత్తరార్ధంలో ఉత్తర తెలంగాణా గ్రామాల్లో రాజకీయ - ఆర్థిక - సామాజిక రంగాల్లో వేగంగా సంభవించిన మార్పుల నేపథ్యంలో విప్లవ రచయితలు మాండలిక సాహిత్యానికి కొన్ని లక్ష్యాలని ఏర్పరచుకొన్నారు.

వాస్తవ జీవితాన్ని సజీవంగా చిత్రించడం మాత్రమే సాహిత్యం ఉద్దేశం కాదు. జీవితంలో ఉన్న వైరుధ్యాల్ని యథాతథంగా పేర్కొనడంతో రచయిత బాధ్యత తీరిపోదు. జీవితం ఇప్పుడున్న స్థితికంటే ఒక్కడుగు ముందుకు వేయాలంటే ఏంచేయాలో సాహిత్యం తెలియజేయాలి. అడుగడుగునా జీవితంమీద విరక్తి పుట్టడానికి కారణమైన పరిస్థితుల్ని విశ్లేషిస్తూనే వైరాగ్యాన్ని పోగొట్టి జీవితాన్ని సుఖమయం చేసుకోగలమన్న ఆశను, తపనను కలిగించాలి.[31] సమాజంలో వున్న వైరుధ్యాల్ని పరిష్కరించుకునే దారిని చూపించగలగాలి - అనే లక్ష్యాలతోనే ఉత్తర తెలంగాణా గ్రామాలనుంచి, బొగ్గు గనులనుంచీ, గిరిజన గూడేలనుంచి రచయితలు పుట్టుకొచ్చారు. మాండలిక సాహిత్యం - ముఖ్యంగా కథ, నవల - ఈ లక్ష్యాలని నెరవేర్చడంలో చాలావరకు సఫలమయింది. సాహిత్యం కింది తరగతి ప్రజలకు చేరాలన్న రచయిత ఉద్దేశం ఆ ప్రజల జీవితంతోనూ, సంస్కృతితోనూ ముడిపడివున్న భాషా ద్వారానే సాధ్యమయింది.

జానపద కళారూపాలనీ, గేయాలనీ అనుకరిస్తూ వాటిలోని గుణాంశాల్ని స్వీకరించి శివసాగర్, చెరబండరాజు, గద్దర్, వర్గీస్, భూపాల్, వంగపండు మొ॥ వారు రాసిన పాటలు ఆయా ప్రాంత ప్రజలనే గాక తెలుగుదేశంలో అన్ని ప్రాంతాల అట్టడుగు వర్గ ప్రజలని కదిలించాయి. మాండలికంలో కూర్చినప్పటికీ ఈ పాటలు ప్రాంతాల హద్దుల్ని అధిగమించగలిగాయి. సాహిత్యం అచ్చయి పాఠకుల్ని చేరే దశనుంచి మౌఖిక రూపంలో శ్రోతని చేరే పరిణామం ఈ కాలంలోనే జరిగింది. అంతేగాదు మధ్యతరగతి జీవితాలకు పరిమితమైన వస్తువు శ్రామిక జన జీవిత చిత్రణవైపు ప్రయాణం చేసింది. సాహిత్యం 'చదివే' దశనుంచి 'వినే' దశకు మళ్లింది. సాహిత్యానికి మౌఖిక ప్రచారం లభించినప్పుడు, అందునా అది కింది

తరగతి ప్రజల కోసమైనప్పుడు అందులో భాష ప్రజల భాషే అయితీరాలని ప్రజా ఉద్యమాల్లో భాగస్వాములైన కవులు / రచయితలు గుర్తించారు.

దృశ్య శ్రవ్య రూపాలైన నాటకం, పాటలతో బాటు చదువుకునే ప్రక్రియలైన ఆధునిక కథ, నవల కూడా మాండలికంలో వెలువడ్డాయి. కింది తరగతి ప్రజల భాషని అచ్చులో చదివే అలవాటు లేకపోవడంవల్ల, ప్రాంతీయ పదజాలంవల్ల మాండలిక సాహిత్యం అర్థం కాదనే వాదనలు బయలుదేరాయి. అయితే ఆ పరిమితులన్నీ, ఆక్షేపణలనీ అధిగమించి వచన ప్రక్రియలు సైతం - వచన కవిత, కథ, నవల కూడా - మౌఖికంగా ప్రచారం అయ్యాయి. గొంతెత్తి చదివి వినిపించడంద్వారా చదువుకోలేని శ్రోతల దగ్గరకు సైతం మాండలిక కథలు - నవలలు చేరువయ్యాయి. దాంతో 'మాండలికంలో రాసినవి మామూలు పాఠకులకు అర్థం కావు, మాండలికం మాట్లాడే వాళ్ళు పుస్తకాలు చదవలేని నిరక్షరాస్యులు; కాబట్టి మాండలిక సాహిత్యం ఏ ప్రయోజనాన్నీ సాధించలేదు' అన్న వాదనలు పరాస్తమయ్యాయి.

జానపద గేయం ప్రజా సంస్కృతినీ, ఉద్యమ స్ఫూర్తినీ జోడించడంతో విప్లవగేయం అయినట్టే జానపద కథ కూడా అదే దారిలో మాండలిక కథగా కొత్త రూపాన్ని పొందింది. అచ్చుయంత్రాల ప్రాబల్యంలో తన మూలతత్వమైన మౌఖికతని కోల్పోయి లిఖిత సాహిత్య ప్రక్రియగా చెలామణి అవుతున్న కథ మళ్లీ మౌఖికం అయి నోటినుండి రాతకు, రాతనుండి మళ్లీ నోటికి అన్న క్రమంలో మాండలిక భాష ద్వారా ప్రజలకు చేరువయింది.

సాహిత్యం సామాన్య పాఠక జనావళికి అందుబాటులోకి రావాలని వాడుక భాషోద్యమ రచయితలు భావించినట్టే, సాహిత్యం కలం కాగితాలకు దూరం వుండే కింది తరగతి నిరక్షరాస్య జనానికి దగ్గరవ్వాలని విప్లవ సాహిత్యోద్యమ రచయితలు పూనుకున్నారు. ఆ పూనికలో మాండలిక సాహిత్యం ఒక ప్రముఖ భాగం అయింది.

పల్లె ప్రజలని చైతన్యవంతులు చేయడానికీ, జ్ఞానవంతుల్ని చేయడానికీ వారి భాష అవసరం అని - మాండలిక భాష ద్వారా సాహిత్య ప్రయోజనాన్ని సాధించవచ్చు అన్న ఆలోచన ఈనాటిది కాదు. తెలంగాణా మాండలికంలో ఈ ప్రయోజనాన్ని ఆశించే మద్యపానానికి వ్యతిరేకంగా 'దయ్యాల పన్గడ' అనే నాటకం 1940లోనే వెలువడింది.[32] నిజాంకు వ్యతిరేకంగా జరిగిన తెలంగాణా రైతాంగ పోరాటం కాలంలో ప్రజల భాషలో ఉద్యమ భావజాలాన్ని ప్రచారం చేయడానికి ఎన్నో జానపద కళారూపాల్నీ, గేయాల్నీ కవులు / రచయితలు స్వీకరించారు - ప్రజల్ని ఉద్యమోన్ముఖుల్ని చేశారు. పోరాటంలో స్వయంగా పాల్గొన్న ప్రజల గళాలనుంచీ ఎన్నో పాటలు వెలువడ్డాయి. జాతీయోద్యమంలో కూడా అదే రీతిలో సాహిత్యం వచ్చింది. అయితే ఆనాటి ఆ సాహిత్యానికీ ఈనాటి ప్రజా సాహిత్యానికీ వస్తు - రూప - భాషా విషయకంగా వచ్చిన మార్పులు తెలుసుకోవాలంటే మాండలిక సాహిత్యం పొందిన పరిణామ క్రమాన్ని పరిశీలించాల్సి వుంది.

## పరిణామక్రమం

అచ్చుయంత్రాలు సాహిత్య రచన - ప్రచారాల్లో తెచ్చిన మార్పు వల్ల సాహిత్యానికున్న మౌలిక లక్షణమైన మౌఖిక సంప్రదాయం బాగా తగ్గుముఖం పట్టింది. సాహిత్య రచన - ప్రచారం అంతా లిఖితంగానే జరిగే పరిస్థితి ముద్రణ మొదలయ్యాకే ఏర్పడింది. సాహిత్యాన్ని వినే శ్రోతల బదులు చదువుకునే పాఠకులు తయారయ్యారు. కవిత్వానికున్న సామూహిక ధర్మం నశించి ఏకాంతంగా ఆస్వాదించే పెద్దమార్పు జరిగి నోటి సాహిత్యానికి - రాత సాహిత్యానికి గొప్ప అంతరం ఏర్పడసాగింది. సాహిత్య ప్రచారంలో ఎక్కువ భాగం రాతలోనే వుండేసరికి అక్షర జ్ఞానం లేని సామాన్యులకు సాహిత్యం అందుబాటులో లేకుండాపోయింది. వాళ్లను చైతన్యవంతులు చేసే సాహిత్య సృష్టి కొత్తగా జరగడం మానేసిందని చెప్పవచ్చు. పాత జానపద సాహిత్యం, కళారూపాలు తప్పితే వారికోసం నూతన కళా సాహిత్యాల సృజన జరగలేదని కూడా భావించాలి. పూర్వం లిఖితరూపంలో వున్న సాహిత్యాన్ని చదివి వినిపించే పౌరాణికుడి స్థానం కొత్త సాహిత్యంలో మాయమైంది.

అటువంటి దశలో సాహిత్యానికున్న మౌఖిక ధోరణిని తిరిగి నిలబెట్టడానికి గురజాడ ప్రయత్నించాడు. గురజాడ ముత్యాలసరాల సృష్టి అందులో భాగమే. అయితే గురజాడ ఎన్నుకొన్న 'ముత్యాలసరాలు' రూపం ఉన్నత కులాల వారి మౌఖిక సాహిత్యానికి చెందింది. అందులోని భాష కూడా శిష్టులదే.. కింది తరగతి వాళ్ల మౌఖిక సాహిత్య రీతులని స్వీకరించని కారణంగానే గురజాడ కవిత్వంలో కింది తరగతి ప్రజల భాష చోటుచేసుకోలేదు. అదీగాక గురజాడ స్వీకరించిన వస్తువు కూడా కింది తరగతి ప్రజల జీవితానికి సంబంధించింది కాదు. వస్తువు రూపం శిష్ట వర్గానికి చెందినవైన కారణంగా గురజాడ కవిత్వ భాష కూడా శిష్ట భాషే అయిందని చెప్పొచ్చు. కానీ ఆయన గ్రాంధిక భాషా శృంఖలాల నుంచి సాహిత్యానికి స్వేచ్ఛ కల్పించాడు. కొత్తగా పుట్టుకొచ్చిన మధ్యతరగతి ప్రజల, విద్యావంతుల అవసరాల నిమిత్తం, సంఘ సంస్కరణ భావజాల ప్రచారం కోసం వాడుక భాషని స్వీకరించి సాహిత్యంలోనూ, భాషలోనూ అభ్యుదయ దృక్పథాన్ని ప్రకటించాడాయన. పద్యానికి సమాంతరంగా పాటకి కూడా సాహిత్య గౌరవం కల్పించాడు.

## పాట

కవిత్వ భాషా విషయకంగా రకరకాల విమర్శల నెదుర్కొన్నప్పటికీ[33] కవిత్వాన్ని పాడితే 'వినే' దారిలోకి మళ్ళించింది గురజాడే. కవిత్వం పాడితే వినేదయినప్పుడు శ్రోతల్ని బట్టే భాష వుంటుంది. అన్ని వర్గాల వారినుద్దేశించి ప్రదర్శనోపయోగాన్ని దృష్టిలో

వుంచుకున్నందువల్ల నాటకాల్లోనూ, పాత్రోచిత భాషగా రచనాశిల్పం కాపాడటం కోసం కథల్లోనూ గురజాడ మాండలికం వాడారు - కానీ కవిత్వం విషయానికొచ్చేసరికి 'రైతుల్ని తట్టిలేపే' భాష వాడలేదు.

'వ్యావహారిక భాషా పదాలను సులువుగా యధేచ్ఛగా ఇముడ్చుకునే ఛందస్సులను మనం సృష్టించుకోవాలి'[34] అని గురజాడ భావించి కొత్త కవిత్వాన్ని రాస్తున్న తొలి రోజుల్లోనే మాండలికంలో ఒక పాట వెలువడింది.[35] ఆ పాట జానపద బాణీలో కట్టింది కాదు. ముత్యాలసరాలకిలా జానపద సంప్రదాయంలో దానికి మూలం ఉన్నట్టు కనిపించదు; కానీ పాడుకోటానికి అనువుగా ద్విపద మొదటి పాదగతిలో ఉంది. అంతేకాదు - పాడే తీరుని తెలుపుతూ హ్రస్వ-దీర్ఘాలని అచ్చులో యథాతథంగా చూపించడం కూడా గమనించగలం. పాట శీర్షిక 'మాలవాండ్ర పాట'. తమతోటి మానవాళికి తమను సమానంగా చూడమని చెప్పుకొనే పాటలో వాళ్ల భాషే ఉపయోగించదల్చుకుని కవి వర్గ మాండలికం వాడాడని భావించాలి. భాష వస్తువునీ రూపాన్నీ అనుసరించి వుంటుందనడానికి ఆ పాట మంచి ఉదాహరణ. అయితే అందులోని భాష అట్టడుగు వర్గాల భాషకి అనుకరణ మాత్రమే అని అనిపిస్తుంది. భాషావిషయకంగా నవ్యతని సాధించినప్పటికీ ఆ గేయం 'గణనకెక్కక' పోవడానికి కారణం 'కవితాగుణం లోపించుటయే, అని సి.నారాయణ రెడ్డి భావించారు. నిజానికి రూపం, వస్తువుల విషయంలో గురజాడ కవిత్వానికి అదేమీ తీసిపోదు; కానీ అందులో వాడిన భాష కారణంగానే దానికి ఆదరణ లభించలేదేమో అనుకోవాలి. ఆ తర్వాత రెండు దశాబ్దాలకి భావ కవిత్వోద్యమ కాలంలో వచ్చిన 'యెంకి పాట'ల్లోని భాష గురించే గాలి దుమారం రేగింది. 1910లోనే వచ్చిన మాలవాండ్ర పాట కూడా భాష కారణంగానే మరుగున పడిపోయిందని ఊహించడానికి అవకాశం ఉంది. అయితే ఈ పద్ధతిలో వచ్చిన గేయాలకి సాహిత్య గౌరవం కొంతయినా లభించడం స్వాతంత్ర్యోద్యమ కాలం నాటికి గమనించవచ్చు.

సాహిత్య సృజన శిష్ట వర్గాల నుండి గాక నిమ్నవర్గాలనుండి జరిగినప్పుడు నిజమైన ప్రజల జీవద్భాష సాహిత్యంలో ప్రవేశిస్తుందని స్వాతంత్ర్యోద్యమ సాహిత్యం, ఆ తర్వాత సామ్యవాదోద్యమ సాహిత్యం ఒకదానికన్న మరొకటి స్పష్టంగా నిరూపించాయి. కవిత్వం పాడుకునేదయి వుండాలని గురజాడ ఆశించిన ప్రయోజనాన్ని అనుసరించి తక్షణావసరాలకు అనుగుణంగా జాతీయోద్యమ కాలంనాడు సాహిత్యం వెలువడింది. జానపదగేయానుకరణతో ఉద్యమ గీతాలు వచ్చాయి. గరిమెళ్ల కట్టి ప్రచారం చేసిన పాటల్లో ప్రజలకు దగ్గరవడానికి కింది తరగతి ప్రజల భాష చోటుచేసుకొంది.

గురజాడ ఆశించిన సంస్కరణోద్యమం కన్నా విశాలమైన ప్రజా పునాది ఏర్పడ్డ ఉద్యమం జాతీయోద్యమం. అందువల్ల గురజాడ కవిత్వంలో కంటే ఎక్కువగా ప్రజల భాష స్వాతంత్ర్యోద్యమ గీతాల్లో అవసరమైంది. వాటిలో కూడా శిష్టవర్గాల పాటల్లో కంటే కింది

తరగతి వాళ్లు కట్టిన పాటల్లో ఆ పరిణతిని ఎక్కువ చూడవచ్చు. స్వాతంత్ర్యోద్యమ గీతాల్లో అచ్చులో దొరకుతున్న వాటిలో ఎక్కువ భాగం శిష్టవర్గ రచయితలు రాసినవే. కొండపల్లి జగన్నాథదాసు, నెల్లూరు వెంకట రామానాయుడు మొ॥వారు రాసిన పాటలు దాదాపు అన్నీ భజనలకీ, కీర్తనలకీ అనుకరణాలే. వాళ్ళు అనుకరించిన మూలరూపాలు కూడా శిష్ట వర్గానికి చెందినవే. వీళ్లలో గరిమెళ్లలాంటి వాళ్ళు మరికొంచెం ముందడుగు వేసి కింది తరగతి ప్రజల పాటల బాణీలని సైతం స్వీకరించారు. అందువలన భాషలో 'శిష్ట'త్వం తగ్గుముఖం పట్టి ప్రజల భాషకు పాటలో చోటు లభించింది. వాళ్ళు ఆచరణ రీత్యా, అవసరం రీత్యా శిష్ట ప్రవర్తనను- భాషలో, బాణీలో, వస్తువులోనూ-తగ్గించుకొనే ప్రయత్నం చేశారనీ, వాళ్లాదారిలో ప్రయత్నం చేశారు తప్పితే పూర్తి ఫలితాన్ని సాధించలేదనీ పరిశోధకులు భావించారు.[36]

ప్రేమ గీతాలు రాసిన బసవరాజు అప్పారావు లాంటివాళ్ళు కూడా భావ కవిత్వం ధోరణికి భిన్నంగా 'కాచి రచ్చించు గాంధీ మహాత్మా'' అని 'మాల మాదిగల మొర'ని వాళ్ల భాషలోనే పలికించడం గమనించవచ్చు.[37] పాత్రోచిత భాషగా కవిత్వంలో కిందితరగతి వాళ్ల భాష ఆ గేయంలో చోటుచేసుకుంది.

దీనికి భిన్నంగా గరిమెళ్ల ప్రజల్ని చైతన్యవంతులు చేయడం కోసం ఉద్యమావసరానికి అనుగుణంగా ప్రజల భాషనీ, బాణీలను స్వీకరించి ప్రజల్లో స్వాతంత్ర్యోద్యమ భావాలని ప్రచారం చేశారు. అందుకు 'దండలండోయ్'[38] లాంటి పాటల్ని ఉదాహరణగా పేర్కొనవచ్చు. అయితే తక్కిన కవుల విషయంలో ఈ ప్రయత్నం పూర్తిగా కొనసాగలేదు. అందువల్లే మధ్యతరగతి శిష్టవర్గ గీతాలే ఆ ఉద్యమ సాహిత్యంలో ఎక్కువ చ్చాయి. దీనికి భిన్నంగా మరింత విస్తృతమైన ప్రజా పునాదినుంచి సామ్యవాదోద్యమ ప్రభావంలో ప్రజల భాషలో సాహిత్యం వెలువడింది. తెలంగాణా రైతాంగ పోరాటం కాలంలో వెలువడ్డ పాటలు ఈనాటికీ ప్రజల నాలుకల మీద బతికి వున్నాయి.

నిజానికి ఆనాటి ఆ సాహిత్యం-వాటి భాష, రూపాల - ద్వారానే ఆ ఉద్యమాల స్వభావాన్ని కూడా అంచనా వేయవచ్చు. జాతీయ బూర్జువా వర్గ భావజాలం స్వాతంత్ర్యోద్యమ సాహిత్యంలోనూ, శ్రామికవర్గ చైతన్యం తెలంగాణా పోరాట పాటల్లోనూ చాలా స్పష్టంగా కనిపిస్తుంది. రెండు ఉద్యమాల్లోనూ పాటలు మౌఖికంగా ప్రచారం అయినప్పటికీ, వాటిని వినే శ్రోతృవర్గం వేరువేరుగా వున్న కారణంగా వాటిలో భాష వేరుగా కనిపిస్తుంది. తెలంగాణా రైతాంగ పోరాటానికి సానుభూతి చూపించిన ఆంధ్ర ప్రాంతం కవుల / రచయితల రచనలని మళ్లీ అందుకు మినహాయింపుగా తీసుకోవాలి. స్థానికంగా పోరాటంలో పాలుపంచుకున్న అనామక కవులు తక్షణావసరాల కోసం - పోరాటానికి సంబంధించిన భావజాల ప్రచారం కోసమూ, ఉద్యమస్ఫూర్తిని పెంచడానికీ - కట్టుకున్న పాటల్లో, కళారూపాల్లో

అనివార్యంగానూ సహజంగానూ ప్రజల భాష చోటుచేసుకుంది.[39] రెండురకాల పాటలూ మౌఖికంగానే ప్రచారమయినప్పటికీ భాషా విషయికంగా ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది.

పోరాటంలో పాల్గొన్న రైతాంగం నుంచేగాక గిరిజనులనుంచీ కూడా పాటలు వచ్చాయి. కోయలు పాడిన 'జోడు నిమ్మవాడ్తో'లాంటి పాటల్లో తెలుగు కోయభాషల సంమిశ్రిత మాండలికం పరిశీలించ తగింది.[40] ప్రజా ఉద్యమాలు ప్రజల భాషలో సాహిత్యం వెలువడటానికి కారణమవుతాయని ఈ పాటలు నిరూపిస్తాయి.

పోరాటంలో పాల్గొన్న రైతాంగం, గిరిజనులే కాకుండా జానపద వృత్తి కళాకారులైన శారదకాంద్రులాంటి వాళ్ళు కూడా ఆనాటి పోరాట పాటలను పాడి ప్రచారం చేశారు, ప్రజాకళారూపాలను ప్రదర్శించారు.

పోరాటానికి సంబంధించిన భావజాలాన్ని ప్రచారం చేయడానికి ఉద్యమంతో మమేకమైన కవి గాయకులనుండి వెలువడిన సాహిత్యం ఒక ఎత్తు; ఆనాటి పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన వీరుల గురించి, ప్రజా పీడకుల గురించి వచ్చిన జానపద సాహిత్యం మరొక ఎత్తు. స్త్రీలు నాట్లు, కలుపులు, కోతలు పనిచేస్తూనూ, రాత్రిళ్ళు చుట్టకాముడు వేస్తూనూ సామూహికంగా పాడుకున్న 'ఉయ్యాలపాటలు'[41] శ్రమజీవుల, శ్రామిక స్త్రీల భావాభివ్యక్తికీ, భాషకీ, యాసకీ అద్దం పడతాయి. వీరగాథల్ని గానం చేసే జానపద సాహిత్య సంప్రదాయాన్నీ, భాషనీ ఈ పాటల్లో ప్రతి పదంలోనూ చూడవచ్చు. తెలంగాణా ప్రాంత శ్రామికవర్గ మాండలికంలో వున్న ఈ పాటలకి ఆనాడు సాహిత్య గౌరవం లభించలేదు. కానీ ఈనాడు అదే ధోరణిని అనుసరించి వస్తున్న విప్లవ గీతాలకి సాహిత్య గౌరవం లభించడమే కాదు; పాఠ్య పుస్తకాల్లో సైతం స్థానం లభించింది. వస్తు విషయకంగా, భాషా విషయకంగా కూడా విప్లవ సంస్కృతిని జోడించడం ద్వారా ఈ పరిణామం సాధ్యమయింది. తెలంగాణా పోరాట కాలంలో 'చిలకమ్మ పాట' ఉయ్యాల పాటగా చాలా రూపాల్లో ప్రచారమైంది. పోలీసుల బారినుంచి తప్పుకునే మార్గం తెలియక నూతిలో పడి చచ్చిపోయింది చిలకమ్మ. అదే ధోరణిలో జానపద గేయ పద్ధతిలో శివసాగర్ రాసిన 'చంద్రమ్మపాట'లో చంద్రమ్మ భర్తను చంపిన భూస్వామిని చంపి ప్రతీకారం తీసుకుంది.[42] అభివ్యక్తి, వస్తు, భాషా విషయాల్లో తెలంగాణా పోరాట గీతాలనుంచి ఈనాటి విప్లవ గీతాల వరకూ వచ్చిన పరిణతిని చంద్రమ్మ పాట నిరూపిస్తుంది.

'తెలంగాణా పోరాట కాలంలో వెలువడిన సాహిత్యం మన విప్లవ సాహిత్యానికి దిద్దిన గుంట ఓనమాలు. అది మన రచనా రూపాలకూ, ప్రచార రూపాలకూ మొట్టమొదటి నమూనా''[43] అని కె.వి.రమణారెడ్డి చెప్పిన మాటలు ఈ పరిణతిని స్థూలంగా తెలియజేస్తున్నాయి.

స్వాతంత్ర్యోద్యమ గీతాలనుంచి తెలంగాణా పోరాట గీతాలూ, వాటినుంచి విప్లవ గీతాలు భాషనీ, భావాల్ని శ్రమజీవి నిజ జీవితంతో పెనవేయడంలో, జానపద సంప్రదాయాన్ని

ప్రజాస్వామిక సంస్కృతిలోకి తర్జువమా చేయడంలో, కళా సాహిత్య విలువల్ని పెంపొందించడంలో ఒకదాన్ని మించి మరొకటి ముందడుగు వేశాయి అనడంలో ఎలాంటి సందేహానికి తావులేదు.

అందుకే 'అందారు ఒక్కటై ఉందారి సక్కంగా' అని కలగన్న 'మాలవాండ్రు' తమ కలలు కల్లలైనప్పుడు వాస్తవ జీవితంలో ఎదురైన అణచివేతని తట్టుకోలేక 'కాచి రచ్చించు గాంధీమహాత్మా' అని మొరపెట్టుకునే స్థితిని దాటి 'భూమంతా భూస్వాముల / వలల ఉందిరన్నా/ వలను కూల్చేదాకా / కులం పోదురన్నా' అని గ్రహించి 'కమ్మని బతుకు కొరకు / కత్తినూరుకోరా'[43a] అని ఆయుధం ఎత్తి బాసచేసే స్థితికి ఎదిగారు. ప్రజల భాషలో వెలువడ్డ పాట వస్తు విషయకంగా సాధించిన పరిణతి ఇది.

విప్లవ సాహిత్యోద్యమంలో రాతలో అక్షరం ముక్కరాని పిల్లలు సైతం నోటిపాటలు కట్టారు. మౌఖికమూ, సామూహికమూ అయిన పాటల్లోని నుడికారం, నొక్కు, యాసల్ని అచ్చుయంత్రాలు పట్టుకోలేకపోయాయి. 'కవిత్వం జానపద ఆశుస్థాయి దాటి తాను బయలుదేరిన ప్రజల దగ్గరకు చేరి మౌఖిక సంప్రదాయాన్నే కాదు తన మౌలిక సంప్రదాయాన్ని అంటే సామూహిక స్వభావాన్ని సంతరించుకుంది.[44]

తెలుగు సాహిత్య చరిత్రలో ఈ పరిణతి ఉద్యమావసరాలకి అనుగుణంగానే చోటుచేసుకుంది. తక్కిన సాహిత్య ప్రక్రియలన్నిటికీ పాట సాధించిన ఈ పరిణామం మార్గదర్శకమైంది కూడా. అందుకే ప్రజల భాషలో పాట వెలువడిన కాలంలోనే వచన పద్యాలు కూడా మాండలికంలో వచ్చాయి.

## వచన కవిత

శ్రీకాకుళం గిరిజనరైతాంగ పోరాటంలో ఎంతోమంది గిరిజనులు, కవులు, కళాకారులు, మేధావులు ప్రాణాలు కోల్పోతున్న నేపథ్యంలో విశాఖలో 1970లో శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మానాలకు వ్యతిరేకంగా యువకవులు తీవ్రంగా ప్రతిస్పందించారు. 2-2-1970న ఆంధ్రా యూనివర్శిటీలో కాళోజీ అధ్యక్షతన జరిగిన సభలో రంధి సోమరాజు శ్రీశ్రీని ఉద్దేశిస్తూ 'పెద్దపెద్ద కబుర్లు' అన్న గేయం చదివాడు. 'నీతికి బతికే మా అలగా జనానికి / నీతులు చెప్పేటందుకోడికేనా యేడుంది బలం' అని పీడిత వర్గాలకి చెందిన కార్మికుడడిగినట్టు రాసిన ఆ కవిత[44a] పెద్ద సంచలనం రేకెత్తించింది. విశాఖ మాండలికంలో వచ్చినప్పటికీ 'పెద్దపెద్ద కబుర్లు' ఆంధ్రదేశమంతా తిరిగింది. దానిలోని విషయంపట్లా, భాషపట్లా అన్ని ప్రాంతాలనుంచీ కితాబులొచ్చాయి. సజీవమైన ప్రజల భాషలో కార్మిక కర్షకుల నుడికార నైపుణ్యంతో రంధి సోమరాజు చేసిన ప్రయోజనోద్దిష్టమైన ప్రయోగం సరికొత్తదని చాలామంది

భావించారు. 'వచన పద్యానికి అంతకుముందు మాండలికం వాడగా చూడలేదని కొనకళ్ల వెంకటరత్నం పేర్కొన్నారు.[45] అయితే 'గోదావరి పాటక జనం మాండలికం'లో వెలువడ్డ ఈ వచన కవితల్ని మెచ్చుకుంటూనే తానంతకుముందే తెలంగాణా మాండలికంలో రాశానని సి.నారాయణరెడ్డి చెప్పడాన్ని బట్టి సోమరాజు మాండలికంలో వచన పద్యం రాయడానికి ప్రథముడు కాడని తెలుస్తుంది.[46]

'సందేళ సలిజరం ఊర్కోపోదే, సందొచ్చిన

పిల్లోడు ఉలుకుతుండాడే! - అమ్మో పోయే మందెట్టుకురాయే' అంటూ మాండలికంలో వచన పద్యాన్ని 30ల్లోనే 'శిష్ట్లా' రాశాడు.[47] కానీ తర్వాతికాలంలో వచ్చిన మాండలిక వచన కవితల్ని ప్రభావితం చేసింది సోమరాజేనని చెప్పవచ్చు. సోమరాజు కవితే 'నిన్న విడిచిన పోరాటం నేడు అందుకోక తప్పద'ని సృజన చేత శ్రీశ్రీకి హెచ్చరిక చేయించింది![48] విరసం ఆవిర్భవించకముందే వచ్చిన ఈ కవిత తర్వాతి విరసం కవులమీద ప్రభావం చూపించడమే కాదు - ఎవర్ని ఎద్దేవా చేయడానికి వుద్దేశించిందో ఆ శ్రీశ్రీ చేతే మాండలికంలో వచన పద్యం రాయించింది. పెద్దపెద్ద కబుర్ల'తో పాటు మరో రెండు మాండలిక కవితల్ని జూన్ 70లో సోమరాజు 'ఎదగండి' సంపుటిలో ప్రచురించాడు. శ్రీశ్రీ 'నిన్నటి జట్కావాలా' అక్టోబరు సృజనలోనూ, 'ఝుంఝు'లోనూ వెలుడింది.[49] ఆ తర్వాత మాండలికంలో వచన పద్యాల్ని రాయడం సోమరాజు కొనసాగించాడు[50] గానీ శ్రీశ్రీ మానేశాడు. శ్రీశ్రీ మాండలికంలో పాట రాయడంవైపు దృష్టి సారించాడు. శ్రీశ్రీయేకాదు శివుడి 'నరుడో భాస్కరుడా' ప్రభావంతో విప్లవకవుల్లో చాలామంది పాటనే ప్రజల దగ్గరకు చేరువయ్యే సాహిత్య ప్రక్రియగా అంగీకరించారు. మాండలికంలో వున్నప్పటికీ వచన పద్యానికి ఆ శక్తి లేదనీ అది ప్రజాసాహిత్యం కాదని కూడా విప్లవ సాహిత్య విమర్శకులు భావించారు.[51]

మాండలికంలో వచన పద్య రచన తెలంగాణాలో కూడా ఇదే కాలంలో జరిగింది. పంచారెడ్డి లక్ష్మణ (ఇసిత్రం), దేవరాజు మహారాజు (గుడిసె-గుండె), భాను (ఊరోల్లు), కృష్ణమూర్తి యాదవ్ (తొక్కుడుబండ) వచన కవితల్ని మాండలికంలో రాశారు. వీళ్లంతా దాదాపు ఒకేకాలంలో ఈ కవిత్వం ప్రారంభించారు.[52] విశాఖ మాండలికంలో సోమరాజు వచన కవిత్వం రాసిన చాలా కొద్దినాళ్లకే తెలంగాణా మాండలికంలో కూడా వచన పద్యాలు రావడం చూస్తే[53] మధ్యతరగతి పాఠకులకీ - కవులకీ మాండలికం పెద్ద ఇబ్బంది కాలేదనీ ఆంధ్రదేశం ఆ చివర్నుంచీ యీ చివరకు ఈ ధోరణి చాలా వేగంగా ప్రయాణం చేసిందనీ అర్థమౌతుంది. అయితే పట్టణాలకు, నగరాలకు పరిమితమైన మధ్యతరగతి కవులకి గ్రామీణ ప్రజల జీవన సంస్కృతి, భాష ఎంతవరకు పట్టుబడ్డాయి అన్నది పరిశీలించాల్సిన అంశం.

మాండలిక భాష ఒక ప్రాంతానికి పరిమితమై ఉంటుందనీ, ఒక్కొక్కప్పుడు దానికి పరిధుల్ని అధిగమించే శక్తి ఉంటుందనీ, కానీ ఆ భాష ఏ ప్రాంతానికి సంబంధించి ఉంటుందో

ఆ ప్రాంతాల వారికర్థమైనంత బాగా ఇతర ప్రాంతాలకు అర్థం కాదనీ యీ కవుల్లోన్నే ఒకరిద్దరికీ సందేహాలుండటం[54] గమనించాల్సిన విషయం.

పాట విషయానికివస్తే యీ సందేహానికి తావులేదు. పాట ప్రదర్శన రూపం పొందుతున్న కారణంగా ఏ మాండలికంలో ఉన్నా అన్ని ప్రాంతాల ప్రజలకూ చేరువవుతుంది. శ్రవ్యరూపంలోని పాటకి మాండలికం అడ్డంకి కావడం లేదు. వచన కవిత కూడా ప్రదర్శన రూపం పొందినప్పుడు శ్రోతలకి చేరే అవకాశం ఉంది. వచన కవిత్వం ఏకాంతంగా కూర్చొని ఆస్వాదించే పాఠక వర్గాన్ని దృష్టిలో వుంచుకొనే ఎక్కువ వెలువడుతుంది. మాండలికంలోగానీ మామూలు పత్రికల భాషలోగానీ వచన కవితని కూడా జననాట్యమండలి లాంటి సంస్థలు ప్రచారం చేస్తే పాటతోపాటు వచన పద్యాలు కూడా అందరికీ అందుబాటులోకి రావొచ్చు.[55] నిజానికి పాట, వచనకవితల నిర్మాణ పద్ధతులు కూడా వేరు. మొదటిది శ్రోతల్ని ఉద్దేశించి కూర్చేదయితే, రెండోది పాఠకుల్ని దృష్టిలో వుంచుకొని రాసేది. ఆడియో కేసెట్లద్వారా పాటల్ని ప్రచారం చేస్తున్నట్టు వచన పద్యాల్ని కూడా కవుల సొంత గొంతుల్తో వినిపించి ప్రచారం చేసే ప్రయత్నాలు ఇటీవల మొదలయ్యాయి కానీ పాటలాగా ప్రజల్ని చేరడంలో ఇవి అంతగా సఫలం కాలేదనే చెప్పాలి. 1970-75ల మధ్యకాలంలోనే మాండలికంలో వచన కవిత్వ రచన ఎక్కువగా జరిగింది. తెలంగాణా, విశాఖ మాండలికాల్లో పాట, వచన కవిత్వం వచ్చినట్టు రాయలసీమ మాండలికంలో రాలేదు. ఇందుకు కారణాలు అన్వేషించాల్సి వుంది.

1969-70ల్లో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం చెలరేగిన నేపథ్యంలో మాండలిక వచన కవితలు తెలంగాణాలో ఎక్కువగా రావడం జరిగింది. ఆ ప్రాంతపు సాంస్కృతిక అస్తిత్వ చైతన్యం మాండలిక రచనలు రావడానికి కొంతవరకు కారణమైందని చెప్పవచ్చు. 75 తర్వాత ఆ ఉధృతి తగ్గింది. విప్లవ సాహిత్యంలోని పాట ఆధిపత్యం వహించడమే అందుకు కారణం. అదీగాక మధ్యతరగతి కవులు కొత్తదనం కోరుకునే క్రమంలోనో, గుర్తింపు ఆరాటంలో భాగంగానో మాండలిక వచన కవిత్వం వెలువడిందని భావించాలి. కొత్తగా కలల పట్టిన యువకవులు మాండలికంలో వచన కవిత్వం రాయడాన్ని గమనించవచ్చు. ప్రదర్శన రూపాన్ని పొందని కారణంగా కూడా మాండలిక వచన పద్యరచన తగ్గుముఖం పట్టి వుంటుంది.

పాటలాగే ప్రదర్శనోద్దిష్టాలైన నాటకం-నాటిక కళారూపాల విషయంలో మాండలికం వాటికి గుణాంశమే. ఆ ప్రక్రియల్లో కూడా భాషా వస్తు రూపాల్లో ఎంతో మార్పు వచ్చింది.

## నాటకం-నాటిక-ప్రజాకళారూపాలు

తెలుగులో 'కన్యాశుల్కం' నాటకమే తొలి మాండలిక రచన.[56] తెలుగు భాష నాటకాలకు తగింది కాదని ప్రజల్లో దురభిప్రాయం ఉన్న రోజుల్లో తెలుగువారికి తెలుగు నాటక ప్రదర్శనకు **అనువైన పరిస్థితులు** లేని రోజుల్లో ఉత్తర కోస్తా మాండలికంలో గురజాడ 'కన్యాశుల్కం'

రచించారు. అయితే కన్యాశుల్కం రెండో కూర్పు వెలువడ్డాకా కూడా అడపాదడపా సంస్కరణ భావాల ప్రచారం కోసం వుద్దేశించిన ప్రహసనాలు తప్పితే 1925 వరకూ తెలుగు నాటకాలూ, నాటికలూ పౌరాణిక-చారిత్రక ఇతివృత్తాలకీ, గ్రాంథిక భాషకీ, పద్యాలకీ అంకితమైన వుండటం చూస్తే తెలుగులో కవిత్వమే కాదు నాటకరంగం కూడా భాషా విషయకంగా కథ, నవలల కంటే వెనకబడి వుందని తెలుస్తుంది. 1920 తర్వాతే దామరాజు పుండరీరాక్షసుడు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి లాంటి వాళ్ళు స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతోనూ, కాళ్లకూరి నారాయణరావు లాంటివాళ్ళు సంఘసంస్కరణ ప్రచారం కోసమూ నాటక రచన చేపట్టారు. 1943లో ప్రజా నాట్యమండలి ఏర్పడేవరకూ నాటకాల్లో పద్యాలూ-సరళ గ్రాంథికమే ఆధిపత్యాన్ని వహించాయి. అయితే విస్తృత ప్రదర్శనల్ని పొందిన తిరుపతి వేంకటకవులు, చిలకమర్తి, బలిజేపల్లి లాంటివాళ్ళు నాటక పద్యాలు ప్రజల్లో బహుళ ప్రచారం పొందడం కూడా గమనించవచ్చు.

నాటికలు భాషా విషయంగా కొంచెం ముందున్నాయి. చలం, భమిడిపాటి కామేశ్వరరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మల్లాది విశ్వనాథ కవిరాజు లాంటి వాళ్ల నాటికల్లో వాడుక భాషా వ్యవహారాన్నీ ప్రాంతీయ భాషా శైలుల్నీ చూడవచ్చు. వీళ్లలో భమిడిపాటి, శ్రీపాద, విశ్వనాథ కవిరాజుల నాటికల్లో గోదావరి మాండలికం ప్రముఖంగా కనిపిస్తుంది.

విజయనగరానికి చెందిన మల్లాదివారి కుటుంబంలో నాటికా రచన విస్తృతంగా జరిగింది. ఉత్తర కోస్తా భాషని నాటికల్లో వీళ్లు విరివిగా వాడుకున్నారు. మల్లాది విశ్వనాథ కవిరాజు కొడుకు మల్లాది అవధాని తూర్పు మాండలికాన్ని ఉపయోగించి 'తూర్పుసావిత్రి', తూర్పు రామాయణం' రచించి ప్రదర్శింపజేశారని ప్రతీతి.[57] అయితే ఈ నాటికల పరమోద్దేశం హాస్యం మాత్రమే. ఇటీవల కేసెట్ల ( ఆడియో) ద్వారా వినిపిస్తున్న తెలంగాణా రామాయణం ఇటువంటిదే. అయితే ఈ హాస్యం ఒక ప్రాంతానికి చెందిన భాషని న్యూనపరిచే క్రమంలో వెలువడుతుందేమోనన్నది కళావేత్తలు ఆలోచించాలి. తెలంగాణా మాండలికాన్ని హాస్యానికీ-కౌర్యానికీ మాత్రం పరిమితం చేస్తూ వస్తున్న సినిమాలని కూడా ఆ దృష్టితో గమనించాలి.

1930 తర్వాత నాటికలూ, నాటకాల్లూ వాడుక భాషలో వెలువడినప్పటికీ మధ్యతరగతి జీవన పరిధుల్ని దాటి అవి బయటకు రాలేదు. అంతేకాదు- నాటక ప్రదర్శన నాలుగు గోడల మధ్యకు కుదించుకుపోయింది. తెలంగాణా రైతాంగ పోరాటం కాలంలోనే కింది తరగతి ప్రజల సాంఘిక జీవిత చిత్రణకీ, వాస్తవిక చైతన్యానికీ అద్దం పట్టే నాటక రచన జరిగింది. జానపద కళారూపాల్ని ప్రజా కళారూపాలుగా మార్చి ప్రదర్శనని వీధుల్లోకి తీసుకురావడానికి ప్రయత్నాలు మొదలయ్యాయి.

1940లో తెలంగాణా మాండలికంలో వెల్దుర్తి మాణిక్యరావు 'దయ్యాలపన్గడ' అన్న ఆరంకాల నాటకం రాశారు. టాల్‌స్టాయ్ 'ఫస్ట్ డిస్టిలర్'కి అనుకరణగా మద్యపాన నిషేధ ప్రచారం

కోసం రాసిన ఆ నాటకంలోని భాషని 'అచ్చమైన పచ్చి పల్లెటూరి భాష'గా పేర్కొన్నారు. 'పల్లె ప్రజలందరికీ తాగుడువల్ల కలిగే అనర్థాలని తెలియజెప్పాలనే ఉద్దేశంతో'[58] ఈ నాటక రచనకు పూర్తి మాండలికం వాడటం జరిగింది. ఈ నాటకంలో సంభాషణలే కాకుండా-నాటక ప్రయోగ సూచనలు కూడా మాండలికంలోనే వున్నాయి. నాటకాల్లో ప్రయోగ సూచనలు శిష్ట వ్యావహారికంలోనే ఉండటం ఆనాటి కన్యాశుల్కం నుంచి ఈనాటి ఆధునిక వీధి నాటకాల వరకూ కనిపిస్తుంది. అందుకు భిన్నంగా 'దయ్యాల పన్గడ'లో వెల్దుర్తి అచ్చమైన పచ్చిపల్లెటూరి భాష'నే ఆసాంతం వాడటం పేర్కొనదగ్గ ప్రత్యేకత. అయితే ప్రదర్శన విషయకంగా రచయిత ఉద్దేశించిన ప్రజల్ని చేరడంలో ఈ నాటకం 'కన్యాశుల్కం'లా సఫలమైన దాఖలాలు లేవు.

సజీవమైన వాడుక భాషలో సాహిత్యం రైతుల్ని తట్టి లేపుతుందన్న గురజాడ ఆశయం తెలంగాణా రైతాంగ ఉద్యమంలో మాత్రమే ఆచరణ రూపొందింది. 1943లో ఏర్పడ్డ ప్రజానాట్యమండలి మొదట్లో ఫాసిజానికీ, జమీందారీ పద్ధతికీ వ్యతిరేకంగానూ, బెంగాలు కరువు గురించీ ప్రదర్శనలిచ్చింది. 1946కల్లా తెలంగాణా రైతులు స్థానిక భూస్వాములకూ, నిజాం నిరంకుశ పాలనకూ వ్యతిరేకంగా సాయుధమైనప్పుడు పోరాట క్రమాన్ని తెలియజెప్పే నాటక ప్రదర్శనలకూ ప్రజా నాట్యమండలి పూనుకొంది. పాలక వర్గాలకి సైతం కంటనీరు పెట్టించేటట్లు రూపొందిన నాటకాలు - నాటికల్లో ఎక్కువ భాగం తెలంగాణా ప్రాంతేతరులు రాసినవే వుండటం వల్ల వాటిలోని తెలంగాణా మాండలికం విమర్శలకు గురయింది. ప్రజా నాట్యమండలి దళాలు వెయ్యికి పైగా ప్రదర్శనలిచ్చిన 'మాభూమి' నాటకభాష సజీవ మాండలికం కాదని ఆ రోజుల్లోనే విమర్శలు వచ్చాయి. తెలంగాణా పోరాట విరమణ తర్వాత వెలువడ్డ 'పోతుగడ్డ' (వాసిరెడ్డి), 'గెరిల్లా' (సుంకర) నాటకాల్లో కూడా రచయితలు తెలంగాణా మాండలికాన్ని సహజంగా ఉపయోగించలేకపోయారు.

అయితే ఇందుకు భిన్నంగా పోరాటకాలంలోనే పోరాట ప్రాంతంనుంచే స్థానిక రచయిత పొట్లపల్లి రామారావు రచించిన 'న్యాయం', 'సర్‌బరాహి', 'పగ' నాటికల్లో తెలంగాణా ప్రాంతపు సజీవ మాండలికం చోటుచేసుకుంది. ఈ మూడు నాటికలు మినహా తెలంగాణా పోరాటాన్ని చిత్రించిన తక్కిన నాటికలు కూడా ఆంధ్ర ప్రాంత రచయితలు రాసినవే.[59] అందువల్ల వాటిలో తెలంగాణా విమోచనోద్యమ చరిత్ర కనిపించేంతగా తెలంగాణా భాష కనిపించదు.

నిజానికి పోరాటంలో తలమునకలుగా వున్న దళాలు నిర్బంధాల కారణంగా, ఆర్థిక వనరుల కొరత కారణంగా, రిహార్సల్స్ వేసుకుని, రంగస్థలాలు ఏర్పాట్లు చూసుకునే వెసులుబాటు లేని కారణంగా- రంగస్థల ప్రదర్శనలకి అనువైన నాటకాల్ని- నాటికల్ని రచించడంగానీ, ప్రదర్శించడంగానీ చేయలేకపోయాయి.

అందువల్ల తెలంగాణా రైతాంగం సాంప్రదాయిక జానపద కళారూపాల్నే తక్షణ రాజకీయావసరాలకు, పోరాట పరిస్థితులకు అనుకూలంగా మలచుకొని ప్రదర్శించడం జరిగింది. ప్రజానాట్యమండలి దళాలు కూడా ఎక్కువ భాగం రంగస్థల నాటకానికి మొదటిస్థానం ఇవ్వడం గమనించవచ్చు. ప్రదర్శనలేని కారణంగానే తెలంగాణా మాండలికంలో వున్న పొట్లపల్లి నాటికల పట్ల ప్రజల ప్రతిస్పందనని తెలుసుకోలేకపోతున్నాం.

రంగస్థల ప్రదర్శన విషయానికొస్తే 1948 నుంచి భిన్న ప్రాంతాల మాండలికాల్లో వెలువడ్డ నాటకాలు పరిషత్తుల్లో, థియేటర్లలో నాటక భాషా విషయకంగా సంచలనం తీసుకొచ్చాయి. పులుగుండ్ల రామకృష్ణయ్య 'తుఫాను' (1948) వాటిలో మొదటిది. ఈ నాటిక దక్షిణ కోస్తా మాండలికంలో వున్నప్పటికీ రంగస్థలం మీద రక్తికట్టింది- ఇప్పటికీ నాటిక నాలుగు ముద్రణలు పొంది మాండలికం నాటక ప్రదర్శనకు ఆటంకం కాదని రుజువుచేసింది.

ఆ క్రమంలో రావిశాస్త్రి 'నిజం' 'విషాదం' విశాఖ మాండలికంలో నాటక రచన, ప్రదర్శనలకి ప్రోత్సాహాన్నిచ్చాయి. అయితే ప్రాంతీయ మాండలికం కూడా అట్టడుగు వర్గాలకు చెందినదయినప్పుడు ప్రదర్శనలు ప్రేక్షకుల్లో ఒకవిధమైన సంచలనం కలిగించడం గమనించవచ్చు. గణేష్‌పాత్రో 'కొడుకు పుట్టాలా', 'పావలా', 'లాభం', శ్రీకాకుళం మాండలికంలో, యండమూరి వీరేంద్రనాథ్ 'కుక్క' తెలంగాణా మాండలికంలో పరిషత్తు పోటీల్లో రంగస్థలం మీదకెక్కి ఆలోచనలు రేకెత్తించాయి. ఆ నాటికల్లో వాడిన భాష చర్చనీయాంశమైంది. ప్రాంతీయ, వర్గ మాండలికం తక్కిన ప్రాంతాల్లో ప్రదర్శన రక్తికట్టడానికి ఆటకంమయిందన్న ఫిర్యాదు వచ్చింది. కానీ రానురానూ పరిషత్తుల పోటీల్లో ప్రాంతీయ మాండలిక నాటకాల, నాటికల ప్రదర్శనలు ఎక్కువయ్యాయి. మధ్య తరగతి ప్రేక్షక వర్గం కింది తరగతి ప్రజల భాషకు అలవాటు పడటం జరిగింది. మాండలిక నాటకాలకు పోటీల్లో బహుమతులు రావడం ద్వారా లభించిన ప్రోత్సాహం కూడా మాండలికాల్లో నాటకాలు, నాటికలు రావడానికి కారణమైంది. అయితే ఈ ప్రదర్శనలన్నీ పరిషత్తుల వరకూ, థియేటర్ వరకే పరిమితమయ్యాయి.[59a] పోటీల్లో బహుమతుల కోసం ఆరాటంలో కృతక మాండలిక రచనలు కూడా వచ్చాయంటే అతిశయోక్తి కాదు.[60] అయితే ఆ క్రమంలో వచ్చిన నాటకాల్లో కొన్ని నాలుగు గోడల మధ్యే కాకుండా నాలుగు రోడ్ల కూడలిలో కూడా ప్రదర్శన పొందాయి. అత్తిలి కృష్ణారావు 'తూర్పు రేఖలు', 'టామీ టామీ' లాంటివి విశాఖ మాండలికంలో వుండటం అటుంచితే అవి రంగస్థలం మీదా, వీథుల్లో కూడా ఎన్నోసార్లు ప్రదర్శన పొందాయి.

ఒక ప్రాంత మాండలికంలో వుండటం ద్వారా తక్కిన ప్రాంతాల్లో ప్రదర్శన రక్తికట్టడం లేదన్న ఆరోపణలు వెలువడ్డ దరిమిలా ఒక ప్రాంతీయ మాండలికంలో రాసిన నాటకాల్ని మరో ప్రాంతంలో ప్రదర్శించేటప్పుడు ఆ ప్రాంత మాండలికంలోకి తర్జుమా చేయడం కూడా జరిగింది.[60a]

తెలంగాణా పోరాట కాలంలో నిర్బంధాల్ని సైతం తట్టుకొని నిలబడగలిగిన ప్రజా నాట్యమండలి కళాకారులూ, రచయితలూ పోరాట విరమణ తర్వాత ఏర్పడిన గందరగోళంలో సరైన సైద్ధాంతిక బలం ఇవ్వగలిగిన విమర్శ లేని కారణంగా సినిమా రంగానికి వెళ్లడం తటస్థించింది. పరిషత్తుల పోటీలు కూడా సినిమాలకు దారిగా మాత్రం మిగిలిపోయాయి. దాంతో ప్రజల దగ్గరకు చేరుకునే నాటకాలూ, నాటికలూ కొరవడ్డాయి.

అయితే రంగస్థల ప్రదర్శనలకంటే భిన్నంగా జానపద కళారూపాలకి రాజకీయ చైతన్యం జోడించి ప్రజా కళారూపాల్ని తయారుచేసి ప్రదర్శించడం తెలంగాణా పోరాట కాలంనుంచే మొదలైంది. అట్టడుగు వర్గ ప్రజల ఉద్యమంలో నిర్మాణాత్మక పాత్ర వహించిన కొద్దీ ఈ ప్రదర్శనలు ప్రచారంలో విస్తృతంగా ప్రముఖస్థానం వహించాయి. పాతవ్యవస్థలో బిచ్చమెత్తుకునే కళాకారులు ఉద్యమంలో రాజకీయ ప్రచారకులయ్యారు.[61]

'బైరూపురోళ్లు, శారదకాల్లు, పిట్టలదొరోల్లు, ఫకీరోల్లు, దాసరోల్లు, గంగిరెద్దులోల్లు, పిచ్చకుంటలోల్లు, ఎర్రగొల్లలు, బైండ్లోల్లు, వొగ్గోల్లు'- ఇలా రకరకాల సంచార భిక్షుక కళాకారులు ప్రదర్శించే జానపద కళారూపాలు, పనిపాటల సమయాల్లో, విరామ సమయాల్లో పాడుకొనే చుట్టకాముడు ఉయ్యాలపాటలు, ధూలా, కోలాటం, చెక్కభజన లాంటి మరెన్నో కళారూపాలు పోరాట సంస్కృతి- ప్రచారానికి అనువుగా మార్పుకి లోనయ్యాయి.

ప్రజల కోసం అంకితమైన ఆ కళారూపాల్లో భాష ప్రజల భాషే. ప్రజలే కళాకారులుగా మారడం వల్ల, కళారూపాలు పోరాట జీవితంలో ఒక భాగం కావడం వల్ల శ్రామిక సంస్కృతీ, దానికి వాహకమైన వారి భాష ఆ కళారూపాల్లో సహజంగా, అనివార్యంగా చోటుచుసుకున్నాయి.

అయితే మధ్యతరగతి నుంచి వచ్చిన సుద్దాల హన్మంతు, తిరునగరిలాంటి వాళ్ళు రాసిన గొల్లసుద్దులు, వీధిభాగోతం లాంటి వాటిల్లో భాష పూర్తిగా మాండలికం కాకపోవడాన్ని గమనించాలి. వీటికంటే భిన్నంగా వృత్తికళాకారులు ప్రదర్శించిన 'రేణికుంట పోరాటం' లాంటి శారద కథలు, పిట్టలదొర లాంటి కళారూపాల్లో భాష పూర్తిగా సజీవ మాండలికం కనిపిస్తుంది.[62] విస్తృతమైన రాజకీయ ప్రచారానికి ప్రజా ఉద్యమాల్లో, ఆనాటినుండి ఈనాటి వరకూ, ప్రజా కళారూపాలు పనిచేస్తూనే వున్నాయి.

శ్రీకాకుళం గిరిజనోద్యమ కాలంలో పాణిగ్రాహి సుబ్బారావు జముకుల కథ[63] తెలంగాణా పోరాట కాలంనాటి ప్రజా కళారూపాలకి కొనసాగింపే. ప్రజల దగ్గరకు పోవడానికి స్థానికమైన జానపద కళారూపాలే సరైన దారని తెలంగాణా రైతాంగ పోరాటం, శ్రీకాకుళం గిరిజనోద్యమం రెండూ నిరూపించాయి.

శ్రీకాకుళం స్ఫూర్తితోనే జననాట్యమండలి, అరుణోదయ, నవోదయ లాంటి సాంస్కృతిక సంస్థలు ఆవిర్భవించాయి. నాలుగు గోడల పరదాలు చీల్చుకొని ప్రదర్శనలు

ప్రజల మధ్యకు వచ్చాయి. ప్రజలనే ప్రదర్శనల్లో భాగస్వాములు చేయడం కూడా జరుగుతోంది. జనామం తరపున వంగపండు ప్రసాదరావు 'భూమి భాగోతం', అరుణోదయ 'ఎన్‌కౌంటర్', నవోదయ 'జనసేన కదిలింది', పసుపులేటి పూర్ణచంద్రరావు ప్రత్యేకంగా రూపొందించిన 'మన్నెంలో' లాంటి వీధి నాటకాలు పోరాటావసరాలకి అనుగుణంగా, ప్రజల భాష ప్రజాసాహిత్యంలో ఒక భాగం అనే అవగాహనతో సజీవ మాండలికంలో ఎన్నో ప్రదర్శనలు పొందాయి.

తెలంగాణ పోరాటం నాటి సాంస్కృతిక వారసత్వాన్నీ, పాణిగ్రహి అందించిపోయిన పాటనీ, కళారూపాల్నీ జనామం కొనసాగించింది. ప్రజలకర్థమయ్యే భాషలో రాసే స్థితినుంచి ప్రజలు మాట్లాడే సజీవ మాండలికాల్లోనే కళారూపాల్ని తయారుచేయడానికీ, ప్రదర్శించడానికీ జనామం మెరుగులు దిద్దింది. తెలంగాణా పోరాటకాలంనాటి గొల్లసుద్దులు, వీధి భాగోతాల్లోని భాష, పాణిగ్రాహి జముకుల కథ భాష, జనామం ప్రదర్శించే 'రైతుకూలీ విజయం' లాంటి ఒగ్గుకథ, తక్కిన కళారూపాల్లోని భాష క్రమంగా మారి ప్రజల భాషకి ఉత్తరోత్తర ప్రాధాన్యం లభించడం గమనించవచ్చు.[64] రైతుకూలీ విజయం', 'ఒగ్గుకథ' లో పాట, వచనం, సంవాదం అన్నీ ప్రజల భాషలోనే తెలంగాణా మాండలికంలోనే రావడంతో ప్రజల భాషకు సాహిత్య, కళారూపాల్లో పట్టం కట్టినట్టయింది. జానపద కళారూపాల్ని ప్రజా కళారూపాలుగా మార్చుకొనే క్రమంలో ప్రజల భాష ఆయా కాలాల కనుగుణంగా ప్రముఖ స్థానం పొందింది. అంతేకాదు, సాహిత్య కళారంగాల్లో మధ్యతరగతి మేధావులతోపాటు కిందతరగతి రచయితలూ, కళాకారులూ ఉద్యమ నేపథ్యంలో వెలుగులోకి రావడం జరిగింది. ఇంతకుముందు కిందితరగతి ప్రజల కష్టాలు కడగండ్ల గురించీ, వాళ్ళు నిర్వహించిన ఉద్యమాల గురించీ సానుభూతితో మధ్యతరగతి నుంచీ సాహిత్యం కళలూ తయారయితే - విప్లవ సాహిత్యోద్యమంలో అట్టడుగు వర్గానికి చెందిన ప్రజలు తమ సాహిత్యాన్ని తామే సృజించకోవడం జరిగింది.

అయితే ఇంతవరకూ చెప్పుకున్న పాట, నాటకం మొ॥ శ్రవ్య, దృశ్య రూపాలు కాబట్టి అవి ప్రజల కోసం ఉద్దిష్టమైనప్పుడు మాండలికంలో ఉండటం సహజంగానే జరిగింది. కానీ లిఖితంగా అచ్చులో మాత్రం కనిపించే వచన ప్రక్రియలైన కథ, నవలలు కూడా పూర్తి మాండలికంలో రావడం 1970ల నుంచి గణనీయంగా పెరిగింది. పాత్రోచిత భాషగా మాండలికంవ వాడటం దగ్గరనుంచి పూర్తి మాండలికంలో కథ రాసే స్థితి వరకూ మాండలిక కథ ఎదిగింది. ఆ క్రమంలో మాండలిక కథ పొందిన పరిణామాన్ని పరిశీలిస్తే భాషా, శిల్పం, వస్తువుల్లో అది సాధించిన ప్రగతి - ప్రయోజనాలు కూడా అర్థమవుతాయి.

## మాండలిక కథ

1910లోనే ఆధునిక కథకు 'దిద్దుబాటు' ద్వారా ఆద్యుడై వాడుకభాషకు ఒరవడిపెట్టి 'మీ పేరేమిటి?' లో పాత్రోచితంగా మాండలికం వాడి గురజాడ తెలుగు కథకి సరైన దారి చూపినప్పటికీ మరో 15, 20 సంవత్సరాల దాకా కథా రచయితలు ఆ దారిన నడవలేదు.

1919లో గిడుగు సంపాదకత్వంలో 'తెలుగు', సాహితీ సమితి ఆధ్వర్యంలో 'సాహితి' పత్రికలు వచ్చాకా వాడుక భాషలో కథా రచనకి ప్రోత్సాహం లభించింది. ఉన్నవ 'మాలపల్లి' పల్నాటిసీమ వాడుక భాష రచయితలకి ధైర్యాన్నిచ్చింది. ఆ క్రమంలో వాడుక భాషలో వెలువడ్డ కథల్లో మొదటివి చింతా దీక్షితులవి. 1925 వరకూ శ్రీపాద సైతం కథనం సరళ గ్రాంథికంలో నడుపుతూ సంభాషణలు వాడుక భాషలో రాసేవారు. అయినప్పటికీ సంభాషణల్లో పాత్రోచితంగా గోదావరీ తీర మాండలికం సహజంగా చోటుచేసుకుంది.[65] కథనంలో సైతం గ్రాంథికం నచ్చక ఆ తర్వాత శ్రీపాద ఉత్తమ పురుషలో కథ చెప్పడం లేదా కథంతా మొత్తం సంభాషణల్లో నడపటం చేశారు.[66] ఆ విధంగా తనకంటూ ఒక ప్రత్యేక కథన పద్ధతినీ, భాషాశైలినీ ఏర్పరచుకొన్నారు. గోదావరిజిల్లా పల్లెపట్టుల్లో, అగ్రహారాల్లో బ్రాహ్మణ కుటుంబాల నిత్య వ్యవహారంలో, ముఖ్యంగా స్త్రీల సంభాషణల్లో వినిపించే శబ్దజాలం, ఉచ్చారణ, కాకువు, వాక్యవిన్యాసం అంతా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కథల్లో చోటుచేసుకుంది. అదీగాక శ్రీపాద ఎన్నుకున్న ఇతివృత్తాలు, కథాస్థలాలు, పాత్రలు అన్నీ గోదావరి తీరానికే పరిమితమైనవి. అందువల్ల ఆయనకథలన్నీ గోదావరి మాండలికతకు అద్దం పడతాయి.

గురజాడ తర్వాత సృజనాత్మక రచనల్లో మాండలికత స్పష్టంగా కనిపించేది శ్రీపాద కథల్లోనే.

ఆ తర్వాత - కథ చదవగానే అందులోని భాష ఫలానా ప్రాంతానికి చెందింది అని స్ఫురించేలా రాసిన రచయిత కరుణకుమార. 1930 తర్వాతే చలం, మల్లాది రామకృష్ణశాస్త్రి, కరుణకుమార, కొడవటిగంటి కుటుంబరావు లాంటి రచయితలు కథారచనలో తమ సొంత బాణీ, శైలీ ఏర్పరచుకొని తెలుగు కథని పరిపుష్టం చేసి వాడుక భాషకొక సముచిత రూపాన్ని కలుగుజేసినప్పటికీ - ఒక ప్రత్యేక ప్రాంత మాండలికాన్నీ, అందునా అట్టడుగు వర్గాలవారి భాషనీ కథల్లో ఉపయోగించింది కరుణకుమారే.

భాషా విషయంగానే కాదు; వస్తు రీత్యా కూడా కరుణకుమార తెలుగు కథలో వైవిధ్యాన్ని తీసుకొచ్చారు. మధ్యతరగతి కుటుంబాల్లోని సాంఘిక దురాచారాల్ని ఖండిస్తూ, సంఘసంస్కరణ భావాలు ప్రచారం చేసిన శ్రీపాద, స్త్రీ పురుష సంబంధాల్లో అసమానతల్నీ, కుహనా విలువల్నీ ప్రశ్నించి స్త్రీ స్వేచ్ఛ కోరిన చెలం, కుటుంబ జీవితాల్లోని మానవీయ సంబంధాల్నీ, విలువల్నీ విడమర్చి చెప్పిన కొ.కు ల కంటే భిన్నంగా గ్రామాల్లో పెత్తందార్ల అణచివేతకు గురయ్యే బడుగు వర్గాల దైన్యాన్నీ, హైన్యాన్నీ చిత్రించిన మొదటి

తెలుగు కథా రచయిత కరుణ కుమార. అందుకే ఆయన కథల్లో సజీవమైన గ్రామీణుల భాష చోటుచేసుకుంది. కరుణ కుమార కథల్లో వాటిన భాష నెల్లూరు ప్రాంతానిది. రెవిన్యూ ఉద్యోగిగా ఆయన లోతట్టు గ్రామాల్లో తిరగడం వల్ల 'సన్నజీవాల' బతుకులోతుల్ని స్పృశించగలిగారు.

కరుణ కుమార స్వీకరించిన మాటలన్నీ 'రాయలసీమ వ్యావహారికంలో ఇంకా సజీవంగా వున్నవే. కానీ సాహిత్య ప్రపంచంలో మాత్రం రంగంపైన కానరాకుండా యివి నేపథ్యంలోకి వెళ్ళిపోయాయి, పల్లెలకు, పల్లెటూరి వాళ్లకు, పల్లె మాటలకు తన కథా సాహిత్యంలో ప్రాధాన్యం ఇచ్చి దరిద్ర నారాయణుల్నే దైవంగా ఉపాసించిన ప్రజా రచయిత 'కరుణ కుమార'[67]

కరుణకుమార నెల్లూరు మాండలికాన్ని కథల్లో ఉపయోగించడంలో ఎంతో నైపుణ్యాన్ని చూపించారు. ప్రజల జీవద్భాషని ఆయన మౌఖిక రూపంతో సహా పట్టుకొని కథల్లోకి తేగలిగారు. అందుకే 'కరుణ కుమార కథ పాఠకుడి కోసం వ్రాసినట్టుండదు- శ్రోతకోసం చెప్పినట్టుంటుంది', ఎత్తుగడ, కథనం, వాక్యవిన్యాసం, సంభాషణ మొదలైనవన్నీ అచ్చంగా జాతి సంప్రదాయంలోనుంచీ, జనజీవనంలోనుంచీ పుట్టుకొచ్చినట్టే వుంటాయి అని భావించారు.[68] ఆ విధంగా కథకు మౌలిక లక్షణమైన మౌఖికతని తెలుగు కథకి దూరం కాకుండా 'కరుణ కుమార' కొంతవరకు కాపాడగలిగారు.

దాదాపు అదేకాలంలో (30ల్లోనే) తెలంగాణా మాండలిక శబ్దజాలంతో, ఉర్దూ పారశీక భాషా పదాల గుబాళింపుతో సురవరం ప్రతాపరెడ్డి కథలు రాశారు. ఆ కథల్లోని భాష తెలంగాణా తెలుగుతో పరిచయం లేని తక్కిన ఆంధ్రప్రదేశంలోని రచయితల్లో ఆలోచన రేపింది. ' ఏ మండలము వారు ఆ మండలము తెలుగులో రచనలు చేసినప్పుడే భాష సజీవముగా ఉంటుంద'నీ 'నిజాం రాష్ట్ర జీవితము చిత్రించే కథలకు ఉర్దూ భాషా ప్రయోగము అలంకారముగానే ఉన్నద'ని రచయితలూ, పత్రికలూ రెడ్డిగారి భాషని ఆహ్వానించడం జరిగింది. [69]

అందరికీ అర్థమగు భాషలో అతి సులభశైలిలో పుస్తకాలు ప్రచురించాలన్న ఉద్దేశంతో 1939లో స్థాపితమైన అణాగ్రంథమాల 1940 ఏప్రిల్‌లో సాహిత్యానికి సంబంధించి 'అణాకథలు' ప్రచురించింది. ప్రచురణకర్తల లక్ష్యానుగుణంగా ఆ కథల్లో అందరికీ అర్థమయ్యే తెలంగాణా భాష చోటుచేసుకుంది. వీటిలో కాళోజీ నారాయణరావు రాసిన కథల్లో[70] తెలంగాణా పదజాలమే కాకుండా తెలంగాణా యాసని సైతం లిపిబద్ధం చేసే ప్రయత్నం జరిగింది. ఇదే పుస్తకంలో వెల్దుర్తి మాణిక్యరావు 'భారం' కథ తెలంగాణా ప్రాంతంలో పన్నుల భారాన్ని అన్యాపదేశంగా పేర్కొంది. అందులో తెలంగాణా బడుగు రైతు భాష చాలా సహజంగా కనిపిస్తుంది.

అదే సంవత్సరం జూలైలో ' ఆంధ్రకేసరి గ్రంథమాల' తమ మొదటి ప్రచురణగా 'కమ్మతెమ్మెరలు' కథల సంపుటి ప్రకటించింది. పది కథల సంపుటిలో నాలుగు కథలు

తెలంగాణా మాండలికంలో వున్నాయి. కథనం,సంభాషణ అనే తేడా లేకుండా కథనంతా పూర్తిగా ఒక ప్రాంత మాండలికం రచించడానికదే మొదలని భావించవచ్చు. జనసామాన్యానికి అర్థమయ్యేలా అక్కడక్కడ తెలంగాణా 'గ్రామ్యభాష' వాడి 'అఖిలాంధ్రులకీ మూలనున్న తెలుగు నుడికారమును, భాషను, ఆధునిక రేఖలతో తీర్చి ప్రదర్శించడం' తమ ఆశయమని సంపాదకులు పేర్కొన్నారు. నిజాం రాష్ట్రంలో ఆంధ్ర భాషా సంస్కృతులు నిరాదరణకు లోనవుతున్న నేపథ్యంలో ఈ కథలు తెలంగాణా భాషలో వెలువడ్డాయి. అయితే తెలంగాణా మధ్యతరగతి భాషే ఈ కథల్లో కనిపిస్తుంది. వీటిలో ' ఆడివాప' ( బోయినపల్లి రంగారావు) అప్పటి తెలంగాణా జమీందారీ వ్యవస్థలో హైన్యాన్ని అనుభవిస్తున్న దాసి జీవితాన్ని హృదయవిదారకంగా వర్ణిస్తుంది. తెలంగాణా పల్లెల్లో భూస్వామ్య వ్యవస్థలోని రెండు కోణాల్ని స్పృశించే 'భారం', ' ఆడివాప' కథలు ఒకే సంవత్సరం రావడం గమనించాల్సిన విషయం. నిజాం రాష్ట్రాంధ్రుల సాంస్కృతిక హక్కుల రక్షణ కోసం మొదట్లో పరిమితమైన ఆంధ్ర మహాసభ పన్నుల, లెవీల నిరాకరణ వెట్టి చాకిరీ వ్యతిరేకత లక్ష్యాలవైపు నడిచే నేపథ్యంలో ఈ కథలు వచ్చాయి.

ఈ కథల్లోని భాష మొదట్లో కొంచెం 'నట్టుతుందనీ', కానీ రెండు కథలు చదివేసరికి సుఖమవుతుందనీ, ఈ రీతిగా కవులూ, గ్రంథకర్తలూ ఆయా ప్రాంతీయ భాషలు చక్కగా వాడుక చేస్తూ గ్రంథాలు రచించి ప్రకటిస్తే ఆంధ్ర భాషా స్వరూపము బాగా తెలుస్తుందనీ తెలంగాణేతర పత్రికలు భావించాయి.[72] ఆనాటి నవ్యసాహిత్య పరిషత్పత్రిక - 'ప్రతిభ' తెలంగాణా రాయలసీమ రచయితలు తమ తమ మండలాల్లో ప్రచారంలో వున్న పత్రికలకే కాకుండా ఇతర ప్రాంతాల పత్రికలకు కూడా తమ నిత్య వ్యవహారంలో వున్న తెలుగులోనే రాయాలని కోరింది. అంతేకాదు- ఇతర ప్రాంతాలవారికి అర్థం కాదనుకుంటే మాండలిక పదాలకు అర్థం పుట అడుగున వివరించమనీ చెప్పింది. తద్వారా కొంతకాలానికి భాషలో వున్న మాండలిక భేదాలు చాలావరకు అంతరించి ఆంధ్రదేశమంతటా తెలుగు ' ఇంచుమించు ఏక రూపం'గా ఏర్పడవచ్చునీ మాండలికాలని శాస్త్రీయ దృష్టితో విశ్లేషించింది.[73]

నెల్లూరి మాండలికంలో 'కరుణకుమార' అట్టడుగు వాళ్ల జీవితాల్ని దయనీయంగా చిత్రించినప్పటికీ, పాత్రోచిత భాషగా కింది తరగతివాళ్ళ భాష సైతం సాహిత్యంలో చోటుచేసుకున్నప్పటికీ వీటికంటే భిన్నంగా కింది తరగతి ప్రజల జీవితాన్నీ, సంస్కృతినీ గ్రామీణ నేపథ్యంలో యథాతథంగా వాళ్ల భాషలోనే కథలుగా మల్చి సాహిత్య లోకంలో సంచలనం సృష్టించినవాడు మాగోఖలే.

1941లో ఆంధ్రపత్రికలో ప్రజల జీవనశైలిలో భాగంగా వారి జీవద్భాషలోనే కథనంతా రాసి మాగోఖలే ప్రచురించినప్పుడు వ్యతిరేకంగానూ, అనుకూలంగానూ రెండు రకాల ప్రతిస్పందనలు వచ్చాయి. గోఖలే వినిపించిన 'మూగజీవాల' ఘోష కొందరికి సాహిత్యంగా

అనిపించలేదు. కింది తరగతి ప్రజల్లాగానే వాళ్ల బతుకూ, భాషా యియాసడింపులకీ, ఎక్కిరింతలకూ గురయ్యాయి.

వాళ్ల నోటిమాటలు వాళ్ల భాషలో ఉండొచ్చు కానీ కథనం కూడా అదే భాషలో ఏమిటని కొందరు ఉదారవాదులు పాత్రోచిత భాష వరకూ అంగీకరించారు. కథకుడు మధ్యతరగతి వాడైవుండి కథనంలో 'అలాగా' వాళ్ల ప్రతినిధిగా వాళ్ల భాష వాడటం వీళ్లకు అభ్యంతరమైంది. పల్లెల్లో రెక్కల కష్టం మీద బతికేవాళ్ల జీవితాల్లో ఎదురయ్యే నిత్య సమస్యల గురించీ, భూకామందుల, పెత్తందార్ల నిరంతర దౌర్జన్యాలూ దోపిడీల గురించీ, వూరే పల్లెపట్టులో జరుగుబాటులేక తిరుగుబాటుకు ఉద్యుక్తులవుతున్న ఉడుకునెత్తుర్ల గురించీ సరైన అవగాహన ఉన్నవాళ్ళు మాత్రం గోఖలే కథల్ని- వస్తువు, భాషలపట్ల అభిరుచితో - ఉత్తమ సాహిత్యంగా స్వీకరించారు.

గోఖలే చిత్రకారుడు కూడా అయిన కారణంగా పల్లె ప్రజల జీవితాన్ని యథాతథంగా చిత్రించడంలో ఎంతో సఫలమయ్యాడు. గ్రామీణుల నిష్కల్మష ప్రకృతిని చిత్రించే కథల్నే మొదట్లో ఆయన ఎక్కువ రాశారు. పొద్దస్తమానం రెక్కలు ముక్కలు చేసుకునే ప్రజల జీవితంలో ఏడాదికోసారి వచ్చే తిరుణాళ్ళూ, సంబరాలూ, శ్రమనుంచి స్వాంతననిచ్చే బొమ్మలాటలూ వంటి వినోదాలపట్ల వాళ్ల ఆలోచన్లు తెలియజెప్పే కథలు (కోటయకొండకు, శివరేత్రి తిరుణాలకు, శివరేత్రి సంబరం, పాలెంలో బొమ్మలాట), బాల్యంలోంచీ కౌమారంలోకి అడుగుపెట్టే సెలయేల్లలా తుళ్లిపడే పల్లెపిల్లల మానసిక ప్రవృత్తిని వర్ణించే కథలు (పెళ్లి, పాలపిట్ట గూడుపెట్టింది, నిదరకలత) గోఖలేని సాహిత్య చిత్రకారుడిగా నిలబెడతాయి.

కష్టపడినా కడుపునిండక - కనపడని ఆర్థిక, సామాజిక దోపిడీకి గురయ్యే మూగజీవాల వేదనని, వాళ్ల దైనందిన సమస్యలనీ దయనీయంగా వర్ణించడంలో (మూగజీవాలు, పిప్పిదండ్లు, ముత్తాయికూతురు మొ॥) మా గోఖలేని కేవలం మానవ ప్రవృతి చిత్రకారుడిగానే కాక సామాజిక భాష్యకారుడిగా కూడా చూడవచ్చు.

మారేపల్లెపట్టుల్లో దోపిడీకి గురవుతున్న ప్రజానీకం లోలోపల ఎక్కడో అణిగివున్న అసంతృప్తిని, అలజడిని వ్యక్తం చేస్తూ చిన్నపాటి నిరసనని తెలియజెప్పడం (గూడెం పోకడ, రాయిమడుసులు), ఆ నిరసన మరింత పెల్లుబికి దొరలకు దేహశుద్ధి చేయడం (పంట సేలు, మునుసుబు కచేరీలో మనిషి) లాంటి సంఘటనల్ని కథలుగా మల్చడంలో గోఖలే అభ్యుదయ దృష్టిలోని క్రమ పరిణతి అర్థమవుతుంది.

ఇవేగాక కట్నం సమస్యలు, సినిమా జాదాలు, రాజకీయ నాయకుల అజ్ఞానహంకారం కూడా గోఖలే కథల్లో దర్శనమిస్తాయి. అయితే వాటికి వాడిన భాష మాత్రం మధ్యతరగతి పట్టణ భాషే అయి వుండటం గమనించాలి. గోఖలే కథల పేర్లద్వారానే ఒక కథ మాండలికమా కాదా అని కూడా తెలిసిపోతుంది.

వస్తు స్వీకార విషయంలో గోఖలే సాధించిన ప్రగతికి ఆయన సంభాషణా శైలి చక్కటి వన్నెతెచ్చింది. కళామర్మజ్ఞుడు కాబట్టి పొందికైన పొట్టి పొట్టి మాటల్లో లోతైన భావాన్ని ధ్వనింపజేశాడు. ప్రకృతి వర్ణనకూ కథ నడపడానికీ తప్ప కథలో రచయిత జోక్యం చాలా తక్కువ. పాత్రల ప్రవృత్తి అంతా సంభాషణల ద్వారా వ్యక్తం కావలసిందే తప్పరచయిత వ్యాఖ్యానించడు. అందువల్ల సంభాషణ ముఖతః భాషకున్న మౌఖిక రూపం గోఖలే కథల్లో తెలుస్తుంది.

అయితే మాగోఖలే వాడిన గుంటూరు జిల్లా భాష ఆ జిల్లా వాళ్లకే 'పట్టిచ్చిందని' ఫిర్యాదు ఉంది. 'మన సాహిత్యాభిమానులూ, అభిలాషులు వెయ్యేళ్లనాటి సాహిత్యాన్ని అర్థం చేసుకోగలరు కానీ తమ చుట్టూవున్న ప్రజల భాషనీ, సమాజంలో అధిక సంఖ్యాకుల భాషనీ అర్థం చేసుకోలేరా' అని ప్రతి విమర్శకులు జవాబిచ్చారు.[74] నిజానికి మౌఖిక భాషలోని యాసని కూడా రాతలో చూపించడానికి రచయిత చేసిన ప్రయత్నం వల్ల ఒకరకమైన ఇబ్బంది కలిగిందని భావించవచ్చు.

ఏది ఏమైనా గురజాడ వేసిన దారిలో- ఉన్నవ, కరుణకుమారలతో పాటు నడిచి, వారికంటే మరో అడుగు ముందుకేసి తన తర్వాతి తరాల మాండలిక రచయితలకి మాగోఖలే ఆదర్శమయ్యాడు.[75]

గోఖలే రాస్తున్న రోజుల్లోనే చాసో కూడా కళింగ మాండలికతని జోడించి కథలు రాయడం ప్రారంభించారు.[76] 1946 చివరనుంచి అభ్యుదయ పత్రిక మాండలిక కథల్ని ప్రచురించడం మొదలెట్టింది.[76a] తెలీని మాండలిక పదాలకి పాదసూచికల్లో అర్థ వివరణలు ఇవ్వడం కూడా 'అభ్యుదయ' ప్రచురించిన కథల్లో కనిపిస్తుంది.

ఆ కాలంలో తెలంగాణా రైతాంగోద్యమం నేపథ్యంలో ఎన్నోకథలు వచ్చాయి. వాటిలో ఎక్కువ భాగం ఆంధ్ర ప్రాంత రచయితలు రాసినవి కావడం వల్ల మాండలికత అంతగా చోటుచేసుకోలేదు. ఉద్యమకాలంలో వెలువడ్డ నవలల్లో కూడా ఇదే పరిస్థితి చూస్తాం. అయితే ఉద్యమాన్ని దగ్గరగా చూసిన స్థానిక రచయితలైన పొట్లపల్లి రామారావు, కాంచనపల్లి చినవెంకట రామారావు, పి.వెంకటేశ్వరరావు లాంటి రచయితల కథల్లో పాత్రోచిత భాషగా తెలంగాణా మాండలికం కనపడుతుంది.[77] పూర్తి మాండలికంలో తెలంగాణా ఉద్యమాన్ని వివరించిన కథలు రాలేదనే చెప్పాలి.

నిజాం పాలన అంతమొందాక, హైదరాబాదు ఆంధ్ర రాష్ట్రాలు ఐక్యంగా విశాలాంధ్ర ఏర్పడాలనే ఉద్యమ నేపథ్యంలోనూ, విశాలాంధ్ర ఏర్పడ్డాకా- భాషా విషయంగా రెండు ప్రాంతాల మధ్య ఏకరూపత సాధించడానికీ, సాంస్కృతికావగాహనకీ తెలంగాణా మాండలికంలో కొందరు రచయితలు కథలు రాశారు. జి.సురమౌళి - రక్తపూజ, అంగుడుపొద్దు, మోసపోయిన మల్లమ్మ, మంకు, ఇప్పసారా, నర్సుల జీవితం;[78] ఇరివెంటి

కృష్ణమూర్తి రంగులరంగయ్య పట్నుపోల్లు; పంచాయతీ నెంబరు గూడూరి సీతారాం మారాజు ఆ నేపథ్యంలోనే వచ్చాయి. ఇరివెంటి 'పంచయతీ నెంబరు' కథలో తెలియని పదాలకి అర్థాలు పాదసూచికల్లో ఇచ్చారు, కానీ మాండలిక కథలో ఈ అర్థం వివరణలు కథాగమనానికి భంగం కలిగిస్తాయనీ, తెలంగాణా మాండలికంలో కథని ఆనాడే అన్ని ప్రాంతాలవాళ్ళూ ఆదరించారనీ సురమౌళి పేర్కొన్నారు.[79]

కథాగేయాల్లో తప్పితే మామూలు పాటల్లో జీవిత చిత్రణకి అవకాశం తక్కువ. వచన ప్రక్రియల్లోనే మానవ ప్రకృతి వివరణకిగానీ, సామాజిక సంబంధాల విశ్లేషణకిగానీ అవకాశం ఎక్కువ ఉంటుంది. నాటకాల్లో ఇది సంభాషణల ద్వారా వ్యక్తమవుతుంది. కానీ కథ, నవలల్లో రచయిత దృక్పథాన్ని వివరించడానికి వీలుంటుంది. సంఘటన ప్రధానమైన కథలో కంటే నవలలో ఇది మరీ ఎక్కువ. ఆ కారణంగా మాండలిక కథలాగానే మాండలిక నవల సైతం వెలువడింది.

పోరంకి దక్షిణామూర్తి మూడు మాండలికాల్లో మొట్టమొదటిసారిగా తానే నవలలు రాశానని భావించినప్పటికీ[80] వాటిని 'జానపద మాండలికం'లో రచయిత చేసిన ప్రయోగాలు గానే పేర్కొవాలి. కథలో కూడా వర్గానుగుణంగా సంభాషణల మధ్య కథనాన్ని ఆయా వర్గ మాండలికాల్లో నడిపే ప్రయోగం కూడా పోరంకి చేశారు. సన్నివేశోచితమైన మాండలిక ప్రయోగంగా రచయిత దాన్ని పేర్కొన్నారు.[81]

మాదిరెడ్డి సులోచన 'తరం మారంది' నవలని పూర్తిగా తెలంగాణా మాండలికంలో రాయడం వ్యాపార నవలా రచయితల దృష్టి కూడా మాండలిక సాహిత్య రచనవైపు పడిందని తెలియజేస్తుంది.

తెలంగాణా పోరాట విరమణ తర్వాత ఉద్యమ చరిత్రని వర్ణిస్తూ తెలంగాణా రచయితలు రాసిన నవలల్లో తెలంగాణా మాండలికం విస్తృతంగా చోటుచేసుకుంది. వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజలమనిషి' (1955), 'గంగు'(1968) నవలల్ని వాటిలో ముఖ్యంగా పేర్కోవాలి. 'జైలులోపల' (1952) కథల్లో వాడిన భాషకంటే భిన్నంగా ఆళ్వారుస్వామి 'ప్రజలమనిషి'లో జనజీవన చిత్రణకి తెలంగాణా మాండలికాన్ని అత్యంత సహజంగా, సముచితంగా ఉపయోగించారు.

అళ్వారుస్వామి తర్వాత తెలంగాణా మాండలికాన్ని అంత సమర్థవంతంగా కథల్లో, నవలల్లో ఉపయోగించిన రచయిత దాశరథి రంగాచార్యే. వీళ్ళిద్దరి రచనల్లోనూ తెలంగాణా మాండలికం పాత్రోచిత భాషగా మాత్రమే చోటుచేసుకున్నప్పటికీ- కథనంలో సైతం సహజమైన ప్రాంతీయత తప్పకుండా కనిపిస్తుంది.

కరుణకుమార, గోఖలే కథల్లోని నెల్లూరు, గుంటూరు జిల్లాల మాండలికం, అళ్వారుస్వామి, రంగాచార్య తెలంగాణా మాండలికం, పోరంకి ప్రయోగంగా చేసిన మూడు

ప్రాంతాల మాండలికాలు - ఎక్కువ భాగం గ్రామీణ జనజీవితానికి సంబంధించినవే. కానీ పట్టణాల్లోని అట్టడుగు వర్గ ప్రజల భాషని అతి ఒడుపుగా పట్టుకొని భాషా విషయకంగా తనకంటూ ప్రత్యేకమైన శైలిని ఏర్పరచుకొన్న ప్రతిభావంతుడైన రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి. ఆయన ఎన్నుకొన్న శైలి కేవలం చమత్కారం కోసమో శిల్పం కోసమో కాకుండా బడుగు వర్గాల జీవితంలో అనునిత్యం ఎదురయ్యేరాజ్యాహింసనీ, అణచివేతనీ విడమర్చి చెప్పడానికి ఎంతగానో ఉపయోగపడింది.

ప్రజాస్వామ్యంలో రాజ్యస్వభావాన్నీ, న్యాయవ్యవస్థ ఉన్నత వర్గాలకే ఉపయోగపడే వైనాన్నీ లోతుగా విశ్లేషించి సాహిత్యంగా మలచిన మొదటి రచయిత రావిశాస్త్రి అని చెప్పడం తప్పుకాదు. పట్టణాల్లోని కింది తరగతి, లంపెన్ వర్గ ప్రజల దయనీయ, దుర్భర పరిస్థితుల్ని విశాఖ భాషలో యాసలో రావిశాస్త్రి కథలు కళ్లముందు నిలబెడతాయి. 60ల్లో రాసిన ' ఆరుసారా కథ'ల్లో సంభాషణ రూపంలో మొదలైన విశాఖ మాండలికం 'గోవులొస్తున్నాయి జాగ్రత్త 'తో విశ్వరూపం ధరించింది. కథల్లో పేజీల తరబడి ప్రవహించిన సంభాషణలూ, ఆత్మాశ్రయ రీతిలో సాగిన కథనాలూ నవలంతా పూర్తి మాండలికంలోనే నడిచే క్రమంలోకి పరిణమించాయి.

న్యాయం కోసం కడుపు చేత్తో బట్టుకుని అలమటించే ముత్తేలమ్మలూ ('మాయ' - ఆరు సారా కథలు), దోపిడీ వర్గానికి కొమ్ముకాస్తూ బడుగుజీవుల రక్తం జలగల్లా పీల్చే గంగరాజెడ్డు (రత్తాలు-రాంబాబు) సూర్రావెడ్డులు (మూడు కథల బంగారం) రావిశాస్త్రికి ముందు తెలుగు సాహిత్యంలో లేరు. మారుమూల గ్రామాల్లో జీవితపు చీకటి లోతుల్ని చూపించిన రచయితలున్నారుగానీ పట్టణాల్లో నడిబజారుల్లో పట్టపగలే జరిగే నిరంతర దోపిడీని రావిశాస్త్రిలా నగ్నంగా ప్రదర్శించిన వాళ్ళు లేరు.

భాషా వస్తు విషయాల్లో రాచకొండ విశ్వనాథశాస్త్రి తెచ్చిన అపూర్వమైన మార్పు ఆయన కథలకి కొత్త శైలిని సాధించింది. రావిశాస్త్రీయమైన ఆ శైలి 'రాజు-మహిషి', 'రత్తాలు-రాంబాబు', లతో శిఖరాగ్రానికి చేరుకుంది. 'గోవులొస్తున్నాయి జాగ్రత్త', 'సొమ్ములు-పోనాయండి' అందులో కూడా ప్రత్యేకతని సంతరించుకున్నాయి. రెండూ ఆత్మాశ్రయ రీతిలో సాగిన కథా వస్తువులు. మొదటిది చదువుకున్న దోపిడీ వర్గానికి ప్రతినిధి 'ముఖతః' వెలువడింది. రెండోది పల్లెలో 'పెసిడెంటు' చేతిలో సర్వనాశనమై గత్యంతరం లేక భూమి కోసం తిరగబడ్డ 'బోడిరాములు' నోటిభాషలో వచ్చింది. రెండు వేర్వేరు వర్గాల 'మౌఖిక భాష'కి ఈ రెండు రచనలూ చక్కటి ఉదాహరణలు. వీటిలో 'సొమ్ములు పోనాయండి' భాష మరింత విలక్షణమైంది. జైలుగోడల వెనకనుంచి ఆవేశంతో దూకుడుగా జలపాతంలా ఊపిరి తీసుకోడానిక్కూడా ఆగకుండా 'ఏకదమ్మున' చెప్పిన కథ ఇది.

వస్తు విషయకంగా కూడా 'సొమ్ములు పోనాయండి' రావిశాస్త్రి రచనల్లో వైవిధ్యమున్న కథ. మధ్యతరగతి జీవుల సామాజిక విలువల విశ్లేషణ నుంచీ, పట్టణాల కింద తరగతి జీవితాలతో విడదీయరాని సంబంధమున్న రాజ్యహింస నుంచీ పల్లెవైపు, పల్లెలోని రైతుకూలీల జీవితాలతో విడదీయరాని సంబంధమున్న మౌలికమైన భూమి సమస్యవైపు ఆలోచనలు మళ్లించే కథ ఇది. శ్రీకాకుళం గిరిజనోద్యమ ప్రభావం 'సొమ్ములు పోనాయండి' మీద స్పష్టంగా కనిపిస్తుంది. కథంతా ఒక వ్యక్తి చుట్టూ తిరిగినట్టే కనిపించినప్పటికీ చివరికొచ్చేసరికి ఊరంతా కల్సి అన్యాయానికి ఎదురుతిరగడంతో సామూహిక చైతన్యానికి సరైన స్థానం ఇవ్వడంతో విప్లవ సాహిత్యంలో దీనికో ప్రత్యేక స్థానం లభించింది. రావిశాస్త్రి ఎన్నుకున్న ఆత్మాశ్రయ రీతి, మౌఖిక భాష ఇవన్నీ కలిసి కథ ఎవరో చెప్తుగా విన్నట్టుంటుంది. తప్పితే చదువుతున్నట్టుండదు.

రావిశాస్త్రి కంటే ముందునుంచే శ్రీకాకుళం మాండలికంలో పూర్తినిడివి కథలు రాసిన పదహారణాల తెలుగు రచయిత చా.సో.గుంటూరు నుంచి మా గోఖలే, తెలంగాణా నుంచి మొదటి తరం మాండలిక రచయితలు రాస్తోన్న రోజుల్లో చా.సో 'మొక్కుబడి' (1949) కథ రాశాడు. తర్వాతి రోజుల్లో చా.సో రాసిన 'ఆ(వె(త' (1951(?)) లాంటి కథలు[81a] మాండలిక సాహిత్యంలో ఉత్తమ రచనలుగా పది కాలాలు గుర్తుంచుకోతగ్గవి.

చేసిన అప్పులు తీర్చడానికి బతుకు తెరువు నెతుక్కుంటూ ధనమాంద్యం కాలంలో భర్త రంగూనెళ్ళినపుడు ఊళ్ళో కాకుల మధ్య వయసులో ఉన్న చాకిత ఎదొర్కొన్న వెతే 'ఆ(వె(త' కథ. కథంతా ఆత్మాశ్రయ రీతిలో సాగడం వల్ల అట్టడుగు వర్గానికి చెందిన స్త్రీ హృదయఘోషని చా.సో. ఆమె భాషలోనే పలికించాడు.

ఉత్తర కోస్తా నుంచే శ్రీకాకుళం గ్రామీణ భాషని సమర్థవంతంగా వాడిన మరో రచయిత కాళీపట్నం రామారావు. శ్రీకాకుళం భాషకి రామారావుగారి 'యజ్ఞం' కథ (1964-66) మొదటి ఉదాహరణ. స్వాతంత్ర్యం రాకముందు గ్రామాల్లో వ్యవసాయం-తదనుబంధ వృత్తుల్లో వచ్చిన మార్పుల గురించి ప్రత్యేకంగానూ, మొత్తం ఉత్పత్తి సంబంధాల్లో వేగంగా చోటుచేసుకున్న మార్పుల గురించి స్థూలంగానూ, స్వాతంత్ర్యం వచ్చాక గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి వెలుగునీడల గురించి అద్భుతంగా చెప్పిన కథ యజ్ఞం. ఆ సమాచారం అంతా 'అప్పలరాముడి' నోటిద్వారా చెప్పించడం వల్ల 'యజ్ఞం'లో శ్రీకాకుళం జిల్లా గ్రామీణ మాండలికానికి విస్తృతంగా చోటు లభించింది. ఆ సుదీర్ఘ కథనం- దాదాపు ఇరవై పేజీలు సాగి - ఒక ప్రత్యేక కథలా ఉంటుంది. రామారావుగారి తర్వాతి కథలన్నీ ఒక ఎత్తు - యజ్ఞం కథ ఒక్కటే ఎత్తు. విషయ విశ్లేషణ, ముగింపుల గురించి ఈ కథమీద జరిగినన్ని వాద వివాదాలు తెలుగు సాహిత్యంలో మరే కథ గురించి జరగలేదు. సామాజిక అభివృద్ధిలో వున్న వైరుధ్యాల్ని వివరించే క్రమంలో కథలోనే వైరుధ్యాలు చోటుచేసుకున్నట్టు కనిపించాయి. శ్రీకాకుళోద్యమ బీజాలు ఈ కథలో కనిపించడం అసంకల్పితంగానే జరిగింది.

70ల్లో ఉత్తరాంధ్రనుంచి ఎందరో రచయితలు వెలుగులోకి వచ్చారు. బీనాదేవి, భూషణం, శ్రీరంగం రాజేశ్వరరావు, దాట్ల, పూసపాటి కృష్ణంరాజు, అర్నాద్, పతంజలి లాంటి చేవున్న రచయితలు ఈ ప్రాంతంనుంచే ఎంతో వైవిధ్యం వున్న కథల్ని రాశారు. వీళ్లందరి కథల్లోనూ ఈ ప్రాంతపు మాండలికత స్పష్టంగా కనిపిస్తుంది.

రావిశాస్త్రి వారసత్వాన్ని బీనాదేవి, కాళీపట్నం వారసత్వాన్ని భూషణం అందుకున్నారని తోస్తుంది. రావిశాస్త్రీయమైన శైలికి బీనాదేవి వారసత్వం వహిస్తే యజ్ఞం కథకి భూషణం వారసుడయ్యాని చెప్పవచ్చు. శ్రీకాకుళం గిరిజనోద్యమంలో రాటుతేలిన రచయిత భూషణం, 'కొండగాలి' నవల, ' అటవంటుకుంది' కథలు ఉద్యమ చరిత్రనీ, సంఘటనల్నీ రికార్డు చేశాయి. తెలంగాణా పోరాట సాహిత్యం తర్వాత మళ్లీ అన్నీ సాహిత్య ప్రక్రియల్లో సాహిత్యానికి ఉద్యమ నేపథ్యం ఏర్పడటం శ్రీకాకుళం గిరిజనోద్యమంలోనే జరిగింది. అయితే ఉద్యమంతో దగ్గర పరిచయం, సంబంధం ఉన్న స్థానికులనుండే కథలు వెలువడ్డాయి. తెలంగాణా పోరాట కథలనుంచి శ్రీకాకుళం గిరిజోద్యమ కథల వరకు వచ్చిన గుణాత్మకమైన మార్పు ఇది. అంతేకాదు వస్తు. భాషా, నిర్మితుల్లో కూడా శ్రీకాకుళం కథలు ఆనాటి తెలంగాణా కథలకన్నా ఎంతో ప్రగతిని సాధించాయి. 'శిల్పరీత్యా ఇవి న్నత శ్రేణికి చెందినవి కాకపోవచ్చన్న తెలంగాణా కథల విషయంలో వచ్చిన విమర్శని భూషణం కథలు ఎదుర్కోలేదు. శ్రీకాకుళం భాష భూషణం 'చెప్పుచేతల్లో' ఉంది. ఆ 'పనిముట్టు'తో అతను 'పనివాడితనం' చూపించాడు.[82]

1970-75 మధ్యకాలంలో రాసిన భూషణం కథల్లో కంబారీలమీద బుగతల దౌర్జన్యాలు (తీర్పు), మైదాన ప్రాంతాలనుంచి వచ్చి గిరిజనుల రక్తాన్ని పీల్చి భూములు కాజేసిన సావుకారుల పన్నాగాలు (అడవంటుకుంది, కొండగాలి), సావుకారుల దుర్మార్గాల నుంచి రక్షిస్తామని చెప్పి వెలసిన గిరిజన కార్పొలేషన్ల నిలువుదోపిడీ (పులుసు, ఉద్ధరింపు) కళ్లకు కట్టినట్లు చిత్రించడం జరిగింది. అయితే వాటన్నిటిమీదా గిరిజన రైతాంగం చేసే తిరుగుబాటు భూషణం కథలని విప్లవ సాహిత్యోద్యమంలో మంచి రచనలుగా నిలబెట్టడానికి కారణమవుతుంది.

50ల్లో మాగోఖలే రాసిన కథల్లో కూడా షావుకారుల దురాగతాల్ని వర్ణించడం జరిగింది. కానీ భూషణం కథలకి వాటికీ మౌలికంగా తేడా కనిపిస్తుంది. గోఖలే 'దేవుడిచ్చిన సొమ్ము' (1957)లో కొండయ్య చనగపిండి గురవయ్య సావుకారు మీద తిరుగుబాటుగా వాడి దుకాణంముందే బజ్జీల కొట్టు తెరుస్తానంటాడు. భూషణం ' అడివంటుకుంది' లో మంగులు వదిలిన గండ్రగొడ్డలి తీసుకుని అతని తండ్రి సత్తియ్య షావుకారి మీదకు వెళ్తాడు.

రెండు దశాబ్దాల్లోనూ వస్తుపరంగా వచ్చిన మార్పు యిది. గోఖలే కథని 'అభ్యుదయ' కథగానూ భూషణం కథని 'విప్లవ'కథగానూ పేర్కొనడం తప్పుకాదు. భూషణం ఆ విధంగా కొత్త వారసత్వానికి మొదటివాడయ్యాడు.[83] ఆ కొత్త వారస్తవమే ఆదిలాబాదు, కరీంనగర్

జిల్లాల్లో గిరిజనుల, రైతులకూలీల, బొగ్గు కార్మికుల పోరాటాల్లోనూ, పోరాట సాహిత్యంలోనూ వికసించింది.

భూమికోసం, భుక్తికోసం, విముక్తికోసం జరిగే ఈ పోరాటానికి ప్రాథమిక రూపాన్ని నలభైలనాటి తెలంగాణా రైతాంగ పోరాటంలో చూడవచ్చు. పోరాటం ఎత్తుగడల లోనూ, ఉద్యమ నిర్మాణంలోనూ వచ్చిన మార్పులు సాహిత్యంలోని మార్పులకి కూడా కారణమయ్యాయి. తెలంగాణా పోరాట కథల్లో భూమి సమస్య ప్రధానంగా చిత్రించిన కథలు తక్కువ. పోరాటంలో ప్రాణాలొడ్డిన వీరులు, మానాలు కోల్పోయిన స్త్రీలు, తెగువచూపి తిరగబడ్డ మగువలు, దళచర్యలు, గెరిల్లా పోరాట సంఘటనల గురించి వర్ణించడం కథల్లో ముఖ్య వస్తువుగా కనపడుతుంది. కానీ శ్రీకాకుళం గిరిజనోద్యమ సాహిత్యంలో, ఉత్తర తెలంగాణా రైతాంగ పోరాట సాహిత్యంలో - అందునా కథల్లో - భూమి సమస్య ప్రధాన వస్తువైంది.

వెట్టి, దండుగలు, జరిమానాలు, సాంఘిక దౌర్జన్యాలు వంటి సమస్యలన్నీ కీలకమైన భూమి సమస్యనే చుట్టుకొని వుంటాయి. ఉత్పత్తి సాధనాలూ- ఉత్పత్తి శక్తి పరాయీకరణకు లోనయినప్పుడు రైతాంగాన్ని సంఘటితం చేయగల శక్తి భూమికి వుంది. అందుకు కావలసిన నైతిక -మానసిక బలాన్ని 'సంఘం' కల్పించడంతో నిరసనలతో మొదలయ్యే పోరాటం- సంఘ నిర్మాణం, సంఘర్షణ, నిర్బంధం, ప్రతిఘటనల క్రమంలో ముందుకు సాగుతుంది. ఈ క్రమాన్నంతటినీ ఈనాటి విప్లవ సాహిత్యోద్యమంలో వచ్చిన కథల్లో చూడవచ్చు.

అంతేకాదు- పోరాటంతో ప్రత్యక్ష సంబంధం లేకుండా కేవలం వినుకలివల్ల రచయితలు జరిగిన సంఘటనలకి సాహిత్య రూపం ఇవ్వడంలో ఆనాటి కథల్లో కాల్పనికత పాలు ఎక్కువైంది. (శారద - 'కొత్తవార్త', 'గెరిల్లా గోవిందు'; తెన్నేటి సూరి - 'సంధిలేదు' మొ॥). కానీ నిజాం తెలంగాణానుండి శ్రీకాకుళం మీదుగా - మళ్లీ తెలంగాణాకి చరిత్ర పునరావృతమైనప్పుడు పోరాటంతో ప్రత్యక్ష సంబంధం వున్న ప్రజల్లోంచే కొత్త రచయితలు పుట్టుకొచ్చారు. కథాశిల్పం- వస్తువు రెండూ కలిసి ఎదిగాయి. జనజీవన పోరాట చిత్రణలో సహజత్వం - విప్లవ కాల్పనికత సమపాళ్లలో ఒదిగాయి. అన్నిటికన్నా మించి 'ప్రజల భాష' పోరాట కథలో ప్రధానాంశమైంది.

సాహిత్యమంటే నాజూకు భాష అన్న భయం తొలగిపోయి తమ దైనందిన వ్యవహారంలోని నోటి భాషలోనే సాహిత్య సృజన చేయవచ్చనే ధైర్యం చరిత్ర నిర్మాతలైన ప్రజల్లోంచి కొత్తగా పుట్టుకొచ్చిన రచయితలకు కలిగింది. వీరంతా తమ మాతృభాషలో జీవన పోరాటాన్నీ, విజయాన్నీ, సంఘటనల్నీ, అనుభవాలనీ రికార్డు చేశారు. తెలంగాణా ప్రజల గుండె వెతని 1973లో కరీంనగర్ ఉద్యమ సాహితి 'బద్‌లా'గా ప్రకటించింది. ప్రజల భాషలో ఆ సంప్రదాయాన్ని కొనసాగించడానికి అల్లం రాజయ్య, చుక్కా, సాహు, కిరణ్, పుప్పల

నరసింహం, బి. ఎస్. రాములు, తుమ్మేటి రఘోత్తంరెడ్డి, కార్మిక, పి. చందు, కాలువ మల్లయ్య-ఇలా ఎందరో అంతకుముందు ఊరూపేరూ లేని వాళ్లంతా పూనుకున్నారు.

తెలంగాణా పల్లెపట్టుల్లో కొత్త ఫ్యూడల్ వ్యవస్థలో దొరల నిరంతర దోపిడీకి గురవుతున్న సన్నకారు రైతాంగం, వ్యవసాయ కూలీల జీవితాల్ని యథాతథంగా వర్ణించడంతో ఆగకుండా సంఘటిత శక్తితో తిరగబడ్డ రైతాంగం చైతన్యానికి అక్షర రూపం ఇచ్చి దాన్ని వారికే వారి భాషలోనే వినిపించడానికీ రచయితల్లో కొందరు పూనుకున్నారు.

వీళ్లలో అల్లం రాజయ్య ముందుగా పేర్కొదగినవాడు. కరీంనగర్ జిల్లా, మంథెన తాలూకా, గాజుల పల్లి గ్రామంలోని ప్రజల భాషలో రాజయ్య 'బద్‌లా' కోసం రాసిన కథ 'ఎదురుతిరిగితే...' పేరున సృజనలో టీకాటిప్పణిలతో వెలువడింది. 1973లోనే రాజయ్య ఈ కథ రాసినప్పటికీ ఎమర్జెన్సీ తొలగేవరకూ వెలుగు చూడలేదు.[84] ఇందులో వర్ణితమైన సంక్లిష్ట జీవితం, పత్రికల భాషకి అలవాటుపడ్డ పాఠకులు అందుకోలేని ప్రజల భాష ఆలోచనీయాలయ్యాయి. కథలోని పాత్రలు, సంఘటనలు కేవలం కల్పితాలని రచయిత - సాహిత్య వ్యవస్థ అలవాటు చేసిన సంప్రదాయం కోసం చెప్పాడుగానీ ' ఒక యదార్థ సంఘటనను అట్లాగే రాసిన' అని మళ్ళీ నిజాన్ని ప్రకటించడంలో చొరవ చూపించాడు.[85]

భూమికోసం దొరమీద ఎదురుతిరగడం లాంటి వైయక్తిక చైతన్యాన్ని చిత్రించడంతో మొదలైన కథలు కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో చెలరేగిన రైతుకూలీ ఉద్యమాల ప్రతి దశనీ వర్ణించాయి. ప్రజలంతా సంఘబలంతో ఒక్కటై సామూహికంగా దొరల తరతరాల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక దోపిడీని అరికట్టడం ( రఘోత్తంరెడ్డి- ' ఒక్కటైతే....', రాజయ్య 'గోడ', చుక్క 'ఎత్తుఁని పిడికిళ్లు') మాత్రమే కాక తమ సమస్యలకు మౌలిక పరిష్కారాన్ని వెతుక్కుంటూ దొర కాజేసిన భూముల్ని స్వాధీనపరుచుకోవడం, అందుకు ప్రాణాలొడ్డి పోరాడటం ( రాజయ్య-పుడమి పుత్రులు, మట్టిమనిషి, దున్నేవానిదే భూమి మొ॥), సాంఘికంగా బహిష్కారానికి గురయిన దొరలు ఊరువిడిచి పారిపోవడం, పోలీసులు అండతో తిరిగి వచ్చి 'మనుషుల వేట' (కిరణ్) సాగించడం, ప్రజలు నిర్బంధాన్ని ఎదుర్కోవడం వంటి పోరాటంలో సంఘటనలు తెలంగాణా మాండలిక కథలకి వస్తువులయ్యాయి. 1978 అక్టోబరు నాటికి ప్రభుత్వం నిర్బంధంలో భాగంగా కరీంనగర్ జిల్లా సిరిసిల్లా, జగిత్యాల తాలూకాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించింది. అందుకు దారితీసిన నేపథ్యాన్ని వర్ణిస్తూ అల్లం రాజయ్య 'కొలిమంటుకొన్నది' నవల సృజనలో సీరియల్‌గా ( 1978 నవంబర్ - 1979 జూలై ) వెలువడింది.

విప్లవ సాహిత్యోద్యమంలో 'కొలిమంటుకొన్నది'కి పాఠక వర్గంనుంచి భిన్నమైన ప్రతిస్పందనలు వచ్చాయి. అందులోని వస్తువు ఎక్కువమంది పాఠకుల్ని చదవటానికి ప్రేరేపించింది. కానీ రాజయ్య వాడిన తెలంగాణా మాండలికం అడ్డంకయిందని ఆరోపణ

వచ్చింది. మాండలికంలో వస్తున్న విప్లవ సాహిత్యంగురించి చర్చ మొదలైంది. అంతకుముందు 1974లో యశోదారెడ్డి 'మావూరి ముచ్చట్లు' చెప్పినప్పుడూ, దేవరాజు మహారాజు 'కడుపుకోత' (1975) లాంటి కథలు రాసినప్పుడూ రాని కొత్త చర్చ రాజయ్య కథలూ, నవలలూ పూర్తి మాండలికంలో రాసినప్పుడు వచ్చింది. 1973లో జీవనాడి పత్రికలో వచ్చిన మాండలిక కథల భాష గురించి కొన్ని అభ్యంతరాలు వెలువడ్డాయగానీ విస్తృతంగా చర్చ జరగలేదు. పాత్రోచిత భాషగా మాండలికం వాడిన కథల గురించి కంటే పూర్తిగా కథనం కూడా మాండలికంలో వున్నకథల గురించి - అందునా తెలంగాణా ప్రాంతంనుంచి ఉద్యమ నేపథ్యంలో వచ్చిన కథల గురించి చర్చ జరిగింది.[86] కింద తరగతి మాండలిక కథ వ్యవస్థీకృతమైన లిఖిత కథా సంప్రదాయాన్ని కొంతవరకు ఛేదించగలిగింది. మధ్య తరగతి పాఠకవర్గం నుంచి చదువుకోలేని శ్రామికవర్గం దగ్గరికి సాహిత్యాన్ని తీసుకుపోయి ఉద్యమంలో భాగస్వామ్యం వహించే ప్రజల్ని మరింత ఉత్తేజితుల్ని చేసే క్రమంలో కథని ప్రజలకు 'వినిపించాలని' మాండలిక రచయితలు ఆశించారు. తరతరాలుగా మానవ సమాజంలోమౌఖికంగా ప్రదర్శితమైన కథని - కొత్తగా ఏర్పడ్డ లిఖితరూపాన్ని అధిగమించి - మళ్లీ మౌఖికంగా ప్రచారం చేసే ప్రయత్నం మాండలిక కథ ద్వారా జరిగింది.

తమ జీవిత పోరాటాల్నే చెప్పే ఈ కథలని ప్రజలు పాటల్లా, బుర్రకథల్లా పాడుకుంటున్నారు.[87] శ్రోతల అవసరాన్నీ, స్థాయినీ బట్టి ఉద్యమావసరాలకు అనుగుణంగా కథ మౌఖికం కావడం, ఆ కారణంగానే మాండలికం కావడం అనివార్యమైంది. అంతేకాదు- శ్రామిక జన జీవితం ప్రధానేతివృత్తమైన ఈ కథల్లో సంస్కృతి వాహకంగా వారి భాషేవుండటం సహజంగానే జరిగింది. దీన్ని పాటల్లో లాగానే కథల్లో సైతం చూడవచ్చు. జీవిత చిత్రణ కథలో మరింత ఎక్కువ కాబట్టి ప్రజల భాష ప్రజా సాహిత్యంలో అనివార్యంగా ఒక భాగమయింది.

వీరశైవ వాఙ్మయం దగ్గర్నుంచీ నేటివరకూ సాహిత్యం ఏదైనా ప్రచారం కోసం పూనుకున్నప్పుడు, ప్రజలకు చేరువ కావాలని అనుకొన్నప్పుడూ మౌఖిక రూపాన్నే ఆశ్రయించడం, అందుకు ప్రజల భాషనే సాధనంగా ఎన్నుకోవడం సాహిత్య చారిత్రక సత్యం.

విప్లవోద్యమాన్ని తెలియజేస్తూ, తెలంగాణా మాండలికంలో కథలు, నవల 70ల ఉత్తరార్థం నుంచే మొదలైనప్పటికీ 80ల్లోనే అవి ఉధృతంగా వెలువడ్డాయి.[87a] 1980 నుంచి పోరాటరంగం కూడా విస్తృతమైంది. పోరాట ప్రాంతాలు పెరగడమే కాకుండా రైతాంగ ఉద్యమ చైతన్యం తక్కిన శ్రామికవర్గాలకు సైతం వ్యాపించింది. అడవుల్లో గిరిజనులు మైదాన ప్రాంతాలనుంచి వచ్చిన షావుకార్ల, కాంట్రాక్టర్ల నిలువు దోపిడీలకు, ఫారెస్టు అధికారుల జులుంకు వ్యతిరేకంగా ఉద్యమించారు. అడవిమీద హక్కు కోసం గొంతెత్తారు.

కూటికోసం పల్లెలు వదిలి 'బొగ్గుబాయిల' మీదకు వలస వెళ్లిన వ్యవసాయ కూలీలు గని కార్మికులుగా మారినప్పటికీ బతుకులు బాగుపడలేదు. రూపం వేరుగానీ శ్రమదోపిడీ అంతా ఒకటేనని గ్రహించారు. పోరుమార్గం చేపట్టారు. యాజమాన్యంతో కుమ్మక్కయ్యే ట్రేడ్ యూనియన్ నాయకత్వాన్ని సైతం ఎండగట్టారు. బీడీ కార్మికులు కూడా అస్తిత్వం కోసం ఈ దారినే నడిచారు.

కొమురం భీం పోరాట వారసత్వంలో తెలంగాణా గిరిజన రైతాంగం తమ సమస్యల్ని చర్చించుకోవడానికి 1981 ఏప్రిల్ 20న ఇంద్రవెల్లిలో సమావేశం కావాలని నిర్ణయించుకొంది. ప్రభుత్వం సభ జరగకుండా అడ్డుకుంది. గిరిజనులమీద పోలీసులు కాల్పులు జరిపారు. అనేకమంది ఆదివాసులు మరణించారు. ఇంద్రవెల్లి సంఘటనతో తెలుగు సాహిత్యంలో గిరిజనుడి జీవితం - పోరాటం కథా వస్తువులయ్యాయి. 81 నుంచి 85 దాకా - సాహు, గోదావరి, తొడసం జంగు, బి. ఎస్. రాములు మొ॥ రచయితలు '' అడవిలో వెన్నెల'' లాంటి గిరిజన పోరాటానికి కథారూపం ఇచ్చారు. గిరిజన భాషా సంస్కృతులకి కథా సాహిత్యంలో సహజంగా అనివార్యంగా స్థానం లభించింది.

బతుకుతెరువు కోసం 'బొగ్గుబాయిల్లో' చేరిన కార్మికులు ఆర్థిక దోపిడీతో పాటు సాంస్కృతికంగా పరాయీకరణకు గురవుతున్న విధాన్నీ, కొత్త జీవితంలో ఎదురయ్యే సామాజిక వైరుధ్యాల్ని ఎదుర్కొనే క్రమంలో పోరాటం తప్ప మరో మార్గం లేక సంఘటిత శక్తితో గని కార్మికులు, కార్మిక కుటుంబాలు సమ్మెలకీ, ధర్నాలకీ దిగే పరిస్థితుల్ని, ఆ సందర్భాల్లో ట్రేడ్ యూనియన్ నాయకత్వం చేసే ద్రోహాలకు వ్యతిరేకంగా అసంఘటిత కార్మికులు పోరాడటం వంటి ఎన్నో విషయాల్ని రఘోత్తంరెడ్డి, కార్మిక, పవన్‌కుమార్ మరికొందరు యువ రచయితలు కార్మిక కథలుగా మలిచారు.[88] తెలంగాణా మాండలిక కథా సాహిత్యంలో గిరిజనకథలకీ, కార్మిక కథలకీ ప్రముఖ స్థానం లభించింది. సాహిత్యంలో కొత్త వస్తువుకి ఈ కథలు ప్రాణం పోశాయి.

గిరిజన పోరాట కథలు (అడవిలో వెన్నెల), సింగరేణి కార్మిక కథలు పుస్తక రూపంలో వచ్చినప్పుడు ఆ కథల రచయితలు మౌఖిక సాహిత్య లక్షణాల్లో ఒకటైన సామూహిక కర్తృత్వ సంప్రదాయాన్ని స్వీకరించారు. ఆ విధంగా మాండలిక కథా రచయితలు కథకి వున్న మౌలిక లక్షణాల్ని - మౌఖికత్వం- సామూహికత్వం అనే రెండు కోణాల్ని గుర్తించి మాండలిక కథని ప్రజాసాహిత్యంగా మలిచారు. అంతకుముందు జనామం పాటల విషయంలో చూపిన దారిలోనే కథా రచయితలు నడిచారు. అయితే జానపద కథాశైలిని సైతం అనుసరిస్తూ మాండలిక కథని జానపద కథాగేయాల్లా ప్రచారం చేయాలని పుప్పల నరసింహం 'ముద్ర' పేరున కథలు రాశాడుగానీ రచయిత ఆశించిన ప్రయోజనం లభించలేదు. వాటిని మౌఖికంగా ప్రదర్శించిన [illegible] లేవు.

ఏదిమైనా మాండలిక కథని మరోసారి మౌఖికం చేసే దారిలో ప్రయాణం చేసిన మాట నిజం. ఇదంతా 70ల ఉత్తరార్ధం నుంచి 80ల్లోకి జరిగిన మార్పు. 80ల్లోనే తెలంగాణాతోపాటు తక్కిన ప్రాంతాల్లోనూ మాండలిక కథలు రావడం ఎక్కువైంది.

తెలంగాణాలాగానే విలక్షణమైన భాషా సంస్కృతులకు నిలయం రాయలసీమ. అధికారుల నిర్లక్ష్యానికీ, ప్రకృతి దుర్మార్గానికీ గురయ్యి వెనుకబడ్డ ప్రాంతంలో ప్రజల జీవిత విధానం తక్కిన ప్రాంతాలకంటే భిన్నమైంది. కరువు కాటకాలతో ఎదురుదెబ్బలు తిని జీవితంలో రాటుతేలిప్పటికీ ఆకాశంకేసి వర్షపు చుక్క కోసం ఆశతో ఎదురుచూడటం అక్కడి రైతాంగం నిత్య జీవితంలో భాగమైపోయింది. కరువుతోపాటు రాజకీయ విద్వేషాలతో గ్రామాలు అల్లకల్లోలం కావడానికీ, రాజకీయ నాయకుల హింసా సంస్కృతికీ రాయలసీమ మారుపేరయింది.ఫాక్షనిజం బడుగుప్రజల జీవితాన్ని అతలాకుతలం చేసింది.

రాయలసీమ జీవితాన్ని మాండలికతల్నీ ప్రతిబింబిస్తూ ఈ మధ్య 'సీమ కథలు' ఎన్నో వచ్చాయిగానీ మొదట్నుంచీ రాయలసీమ సంస్కృతిని జోడించి కథలు నవలలు రాసిన రచయితలు మధురాంతరకం రాజారాం, కేశవరెడ్డి, కేతు విశ్వనాథరెడ్డి, మధ్యతరగతి ప్రజల జీవితం రాజారాం కథల్లో ఎక్కువ చోటుచేసుకుంటే, కింది తరగతి ప్రజల దైన్యం-జీవిత పోరాటం కేశరెడ్డి రచనల్లో కనిపిస్తుంది. కేశవరెడ్డి నవలల్లో ఎక్కువ భాగం పెద్ద కథల్లాంటివి. వాటిలో చిత్రితమైన జీవితం ఆర్థికంగా సామాజికంగా అణచివేతకు గురైన దళిత బహుజనులది (మూగ వాని పిల్లంగోవి- మినహాయించి). పాత్రోచిత్ర భాషగా చిత్తూరుజిల్లా బఠటిల్లు గ్రామపరిసరాల్లోని అట్టడుగు జనుల జీవద్భాష ఆ కథలకు ఆయువు పట్టుగా కనిపిస్తుంది. భారతీయ వ్యావసాయిక సంస్కృతిలో భాగమైన మౌఖిక కథన సంప్రదాయాన్ని పాటించడం వల్ల కేశవరెడ్డి భాష మిగతాయిద్దరి కన్నా విలక్షణమైంది.

మధ్యతరగతి-కింది తరగతి ప్రజల జీవిత సమస్యల్ని చిత్రించడం మాత్రమేకాక సమస్యలకి కారణమైన వైరుధ్యాల్ని నిశితంగా పరిశీలించి, ఆ సమస్యల-వైరుధ్యాల సాలెగూడులో చిక్కిఅయోమయం అయిపోయే వాళ్ల జీవితాలకి ఒక్కోసారి పరిష్కారాలు సూచిస్తూ-మరోసారి పరిష్కారాలని పాఠకులకే వదిలేస్తూ పాఠకులకే వదిలేస్తూ రాయలసీమ భాషను విరివిగా వాడుతూ కథలు రాసిన కేతు విశ్వనాథరెడ్డి మిగతా ఇద్దరికన్నా ఎక్కువగా మాండలిక రచయితగా గుర్తింపు పొందారు.

నిజానికి వీళ్ల ముగ్గురి రచనల్లోనూ కనిపించే రాయలసీమ మాండలికత వారి శైలిలో అంతర్భాగమే. శిల్పం రీత్యా కథల ఎత్తుగడల్లోనూ, ముగింపులోనూ, కథ నడిపే తీరులోనూ ముగ్గరిలో ఎవరి ప్రత్యేకత వారికున్నా రాయలసీమ మాండలికతకు ముగ్గరి రచనలూ దర్పణం పడతాయి. అయితే ఇవేవీ పూర్తి మాండలిక రచనలు కావు.

ఇందుకు భిన్నంగా పేదరికం వొడిలో కాపురం చేస్తూ రెక్కల కష్టంతో కలోగంజో తాగి కడుపు నింపుకుంటూ పల్లెల్లో జీవించే సన్నకారు రైతు కుటుంబ జీవితాన్ని స్వీయచరిత్రలా చిత్తూరు మాండలికంలో అద్భుతమైన శైలిలో నామిని సుబ్రహ్మణ్యం నాయుడు మాండలిక రచనలకున్నాయనుకున్న హద్దుల్ని చెరిపేస్తూ 'పచ్చనాకు సాక్షిగా' ( ఉదయం దినపత్రికలో) ఫీచర్ నిర్వహించాడు. తెలంగాణా మాండలిక రచనలకి లభించని అపూర్వ పాఠకాదరణ నామిని 'పచ్చనాకు సాక్షిగా'కి లభించింది. తమిళం వాసన అంతగా సోకని చిత్తూరు మాండలికం అది. బాల్యంలో తల్లి ఒడిలో పొందిన అవ్యక్తానుభూతులూ, ఇల్లు - ఇంటి చుట్టుపక్కల 'పిల్లకాయల్తో' ఆడిన చమత్కారపు ఆటలూ, బడిలో ' అయ్యోరి' దెబ్బలు- ఆకలి చదువులూ, అమ్మతో పొలం పనిపాటులు- 'పచ్చనాకు....' లో వస్తువులు. వీటిలోని భాషే, రైతు కుటుంబాల సంస్కృతీ సామాజిక వాస్తవికతకి దగ్గరగా వున్న కారణంగానూ, సంఘటనలకి ఆ ప్రాంతపు వాగ్ధోరణకి సమాజం అన్నట్లు కనిపించే హాస్యాన్ని జోడించిన కారణంగానూ ఆంధ్రదేశం అన్ని మూలలనుంచి పాఠకలోకం నామినిని ఆత్మీయంగా ఆహ్వానించింది.

ఇడ్లీకోసం మారాంచేసి, చద్దన్నం మాత్రమే తినగల్గి ' ఊపిరిపోయిన ఊదోడి' కథ, నాలుగిడ్లీ తిని రాని కారణంగా 'కట్టె ఇస్కూల్లో మనసు బంకచేనులో...' చింతకాయలు ఏరే బడి పిలకాయల కథ, నారెక్కలున్నంత కాలం...' బిడ్డకి రక్తాన్ని రంగరించి పోషిస్తాననే వాత్సల్యమూర్తి తల్లి కథ- నవ్వు పుట్టిస్తూనే కళ్లలో నీళ్లు తెప్పిస్తాయి. ఇటువంటి 'రసన'ని రావిశాస్త్రి కథల్లో శ్రీశ్రీ గమనించాడు. మళ్లీ దాన్ని నామిని సాధించాడు.

నామిని బాల్యం ఇంటిని దాటి ' ఎంగటాపురం' బడిలో చేసిన కౌమారం చమత్కారాలు 'సినబ్బకతల'య్యాయి. 'పచ్చనాకు...'లో అంతర్వాహినిగా పాఠకులకి చక్కలిగింతలు పెట్టిన హాస్యం ఎగతాళిగా మారి సినబ్బకతల్లో ప్రముఖ స్థానం ఆక్రమించుకొంది. 'పచ్చనాకు సాక్షిగా'లో కష్టపడినా కడుపునాలే మూగజీవుల బతుకుల్ని శాసించే ఆర్థిక సంబంధాల్ని అదృశ్యంగా చిత్రీకరించే ప్రయత్నం జరిగింది - సినబ్బకతల్లో అది అదృశ్యమైపోయింది. సామాజిక వైరుధ్యాల్ని మరింత నైపుణ్యంతో చిత్రించాల్సింది పోయి కుచ్రేష్టలకి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. అందుకే 'నామిని సినబ్బకతలు గాలిలో కలం జాడిపులే' అని విమర్శలు ఎదురయ్యాయి.[89]

పచ్చనాకు సాక్షిగా మంచి సినబ్బ కతల వరకూ నామిని పొందిన మార్పుని గురించి విశ్లేషణలు జరుగుతూ వుండగానే తల్లి వొడినీ, ఇంటినీ, బడినీ, బడిలో ఆడపిల్లకాయల్తో ఆటలనీ దాటి యౌవనంలో ఒక యింటివాడయి ప్రభావతితో కాపురం చేస్తూ ఊళ్లోవాళ్ల కతల్ని ఏకరువు పెడ్తూ నామిని 'మిట్టూరోడి కతలు' రాశాడు. మిట్టూరోడి కతల్లో నామిని స్త్రీల విషయంలో వాడిన భాష కూడా విమర్శకులకు గురైంది. బూతు కూడా ప్రజాసాహిత్యంలో, ప్రజల భాషలో ఒక భాగం అవి ఆ కథల్లోనే పాత్రల ద్వారా నామిని సమర్థించుకున్నాడు.

గద్దర్‌లాంటి వాళ్ళ పాటల్లో ఈ దోపిడీ వ్యవస్థ మీద కోపంతో ఒకరకమైన కసితో అక్కడక్కడా బూతుపదాల ఉపయోగం జరిగింది గానీ నామిని ఏ అవసరం లేకుండానే బూతును ఉపయోగించి దాన్నే ప్రజల భాషగా నమ్మబలికాడు.[90]

ప్రారంభదశలో సామాజిక వైరుధ్యాల్ని అవగాహన చేసుకునే దారినుంచి మిట్టూరోడి కతల నాటికి క్రమంగా పక్కకు మళ్లాడని తోస్తుంది. అయితే మధ్యలో వచ్చిన 'మునికన్నడి సేద్యం' నవల మాత్రం సామాజిక వాస్తవికతకి అద్దం పట్టే సీరియస్ రచన. అనవసరమైన ఎగతాళి, కొక్కిరింతలు మానుకొని గ్రామీణ జనజీవిత వైరుధ్యాల్నీ, ఆర్థిక సంబంధాల్ని నామిని సహజంగా చిత్రించగలడని 'మునికన్నడి సేద్యం' భరోసానిస్తుంది.

రాయలసీమ గ్రామీణ నేపథ్యంలోనే పులికంటి కృష్ణారెడ్డి 'నాలుగ్గాళ్ళ మండపం' శీర్షికని ఆంధ్రప్రభ దినపత్రికలో నిర్వహించాడుగానీ నామినికి లభించిన ఆదరణ, ప్రచారం దానికి లభించలేదు.

'మాండలికంలో ఎందుకు రాయాలనో, మాండలికం రచనల వల్ల ప్రయోజనం మరీ పరిమితమై పోతుందనో వాదనలకిప్పుడు సమాధానం ఇవ్వాల్సిన అవసరం లేదు' అని భావిస్తూ [91] రాయలసీమ మాండలికంలో కరువుసీమ రైతుల సమస్యల్ని చిత్రించడానికీ, తద్వారా ఆ సమస్యల్ని పరిష్కరించే దారుల్ని వెతుక్కోడానికీ పూనుకున్న మరో రచయిత రామకృష్ణారెడ్డి. 'రక్తం కదలికలో, జీవితానుభవాల్లో, మెదడు పొరల్లో కలిసిపోయి వుంటూ వచ్చినకథల్ని రామకృష్ణారెడ్డి 'పెన్నేటి కతలు'గా రికార్డు చేశాడు. అయితే రాయలసీమ మాండలికానికున్న ప్రత్యేకమైన పదోచ్చారణని (ప్యాడ=పేడ, వత్సాను=వస్తాను మొ॥) లిపిబద్ధం చేయడంలో తనుకొన్ని ఇబ్బందుల్ని ఎదుర్కొన్నట్టు రచయిత పేర్కొనడం బట్టి తెలుగులో వివిధ మాండలికాలకు అనుగుణమైన వర్ణ సముచ్చయాన్నీ, లిపి సంకేతాల్ని ఏర్పరచుకోవాల్సిన అవసరం ఇంకా అట్లాగే వుందని తెలుస్తుంది.

పెన్నేటికతలు తర్వాత- అనంతపురం జిల్లా గ్రామీణ మాండలికంలో వెలువడ్డ దస్తగిరి కథలు (అపద్దమాడరాదు), భూమి సమస్యతో ముడిపడ్డ రైత్వారీ సమస్యలనీ, వ్యాపార సంస్కృతి వ్యవసాయ రంగాన్ని ఏలుతూ రైతు జీవితాన్ని కుంగదీస్తున్న వైనాన్నీ వర్ణిస్తూ అందుకు పరిష్కారాల కోసంలోచనలు రేకెత్తించే సింగంనేని నారాయణ కథలు మాండలిక కథా సాహిత్యంలో ప్రత్యేకంగా గుర్తించదగ్గవి.

అనంతపురం మాండలికంలోనే ఇటీవల స్వామి రాస్తున్నకథలు (వానరాలే, చావుకూడు, నీళ్ళు మొ॥) మాండలిక కథా రచనలో తెలంగాణా రచయితల తర్వాత రాయలసీమ రచయితల యుగం మొదలైందని అనిపించేలా చక్కని పలుకుబడికి నిదర్శనలుగా ఉన్నాయి. స్వామి ఇటీవల రాసిన 'గద్ద లాడతాండాయి' నవల రాయలసీమ భాషా సంస్కృతులకు నిలువెత్తు అద్దం పడుతుంది. (జానపదకథన పద్ధతి ననుసరించి చిత్తూరు మాండలికంలో అద్భుతమైన కథలు

రాస్తున్న గోపిని కరుణాకర్ (దుత్తలో చెందమామ, బారతంబొమ్మలు) ప్రత్యేకంగా పేర్కోవాలి. కథకున్న మౌలికమైన మౌఖికతను గోపిని కథల్లో గమనించవచ్చు.)

అదేవిధంగా తెలంగాణా మాండలికతతో పాక్షికంగా పాత్రోచితంగా తెలంగాణా మాండలికం వాడుతూ బోయ జంగయ్య కథలు, నవల, ఉత్తర తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాన్నీ, దళ జీవితాన్ని వర్ణిస్తూ పులి ఆనందమోహన్ 'వసంత గీతం' నవల, సాధన 'సరిహద్దు' నవల, భూషణం దారిలోనే శ్రీకాకుళం గిరిజనుల 'పోడు - పోరు- దారి' వర్ణించిన అప్పల్నాయుడి కథలు కూడా 1980 తర్వాతే వెలువడ్డాయి.

స్థానిక రచయితలు తమ ప్రాంత సమస్యల్నీ, జీవితాల్నీ చిత్రించే చోట పూర్తి మాండలికంలో గానీ పాక్షికంగాగానీ సాహిత్య సృజన చేయడం (అన్ని ప్రక్రియల్లోనూ) ఎక్కువైంది. పత్రికలు అందుకు విశేషంగా తోడ్పడుతున్నాయి. అందువల్ల మాండలిక రచనలకున్న పరిమితులు తగ్గుముఖం పట్టి వ్యాప్తి ఎక్కువైంది. (ఆ క్రమాన్ని కూడా పరిశీలిస్తే ఈనాడు మాండలిక రచనలకున్న స్థానాన్ని అంచాన చేయవచ్చు).

## వ్యాప్తి

భూస్వామ్య విధానం నుంచి సమాజం పెట్టుబడిదారీ వ్యవస్థలోకి మారుతున్న దశలో ఏర్పడ్డ మధ్యతరగతి - మేధావి వర్గం చేతిలో అన్ని కళారంగాల్లోనూ, పత్రికల్లో. సాహిత్య ప్రక్రియల్లో ఒక విధమైన ప్రామాణిక భాష అభివృద్ధి చెందిన దరిమిలా తద్భిన్నమైన ప్రాంతీయ వర్గ భాషల్ని ఒక్కోసారి చిన్నచూపు చూసే ప్రమాదం ఏర్పడటంతో సాంస్కృతిక అస్తిత్వ చైతన్యంతో తెలుగులో ప్రాంతీయ వర్గ మాండలికాల్లో సాహిత్య సృజన మొదలైంది. జీవద్భాషలోని జవాన్నీ, జీవాన్నీ కాపాడుకోవాలని కూడా మాండలిక సాహిత్య రచన జరిగింది. ఈనాటికి అన్ని సాహిత్య ప్రక్రియలూ ప్రామాణిక భాషకు సమాంతరంగా మాండలికంలో వెలువడుతున్నాయి. మాండలిక భాషా సాహిత్యాల వ్యాప్తి ఎక్కువైంది. మాండలిక రచనలపట్ల అక్షేపణలు- ప్రశ్నలు అక్కడక్కడా వినవస్తున్నా ఆ గొంతుల్లో మునుపటంతటి బలం లేదు.

మాండలిక రచనలని ఆదరిస్తూ పాఠకులనుంచి మాండలికంలోనే ప్రతిస్పందనలు వస్తున్నాయి. మాండలికంలో పాట, కథ, నవల, వచన కవిత, నాటకం, జానపద కళారూపాల్లాంటి ప్రక్రియలతోపాటు వ్యంగ్యచిత్రాలు సైతం (బులేనా మొ॥ ఆంధ్రప్రభ, వార) వెలువడటం మాండలిక రచనల వ్యాప్తిని తెలియజేస్తున్నాయి.

ప్రాచీన కవుల మాండలిక పద ప్రయోగాలతోపాటు ఆధునిక మాండలిక రచయితల సాహిత్యంనుంచి సైతం మాండలిక పదాలనీ, ప్రయోగాలనీ నిఘంటువుల కెక్కించడం జరిగింది. [92]

ప్రామాణిక భాషలో సాహిత్య సృజన చేయడంలో ఏర్పడే బిడియాన్ని తొలగించి, తమ మాతృభాషల్లో తమ వర్గ - ప్రాంత భాషలో - సైతం రచనలు చేయవచ్చనే ధైర్యాన్నీ, వెసులుబాటునీ కొత్త రచయితలకు మాండలిక సాహిత్యం కలిగించింది. ఆ రచయితలకి పత్రికలు ప్రముఖంగా చేయూతనిచ్చాయి.

ప్రత్యేక పాఠకవర్గం కలిగిన సృజన, అరుణతార, జీవనాడి, ప్రజాసాహితి లాంటి సాహిత్య పత్రికల్లో వచ్చిన మాండలిక రచనలని పక్కనుంచితే, పాపులర్ సాహిత్యాన్నందించే దిన, వార, పక్ష మాస పత్రికలు మాండలికంలో ప్రత్యేకంగా శీర్షికలు నిర్వహిస్తున్నాయి. స్థానికంగా వున్న చిన్న పత్రికల్లో మాండలిక సాహిత్యం సహజంగానే వచ్చింది. పెద్ద పత్రికలు సైతం జిల్లాలవారీగా సర్క్యులేషన్ని పటిష్టం చేసుకోవడానికి కూడా మాండలిక రచనలని ప్రోత్సహించాయి.

నామిని, భానుమూర్తి పుప్పల, పులికంటి, గోపయ్య, పతంజలి, కాలువ మల్లయ్య, రామకృష్ణారెడ్డి, యశోదారెడ్డి, అల్లం నారాయణ, కయితికాల పోశెట్టి, మహమ్మద్ ఖదీర్‌బాబు లాంటి రచయితలు దిన, వార పత్రికల్లో, సారస్వతానుబంధాల్లో శీర్షికలు[3] నిర్వహించడం చూస్తే మాండలిక సాహిత్యంలో ఎక్కువ భాగం పత్రికాముఖంగానే వెలువడిందని చెప్పడం తప్పుకాదు. వీటిలో తెలిదేవర భానుమూర్తి తెలంగాణా మాండలికంలో రాసిన రాజకీయ వ్యంగ్య రచన 'పలుకుబడి' దాదాపు ఆరుసంవత్సరాల పాటు 'ఉదయం' దినపత్రికలో శీర్షికగా వెలువడింది. తర్వాత 'వార్త' (దిన)లో ఈ శీర్షిక వెలువడుతుంది. ఒక దినపత్రికలో అంతకాలం నిరాఘాటంగా శీర్షిక నడవడం- అదీ మాండలికంలో అద్భుతమైతే- దాన్ని అన్ని ప్రాంతాలవారు సమంగా ఆదరించడం అక్షర సత్యం.

మాండలికంలో పత్రికల ఫీచర్సు ఏ ప్రాంతానికి చెందినవైనప్పటికీ అన్ని ప్రాంతాల పాఠకులూ వాటిని ఆదరించడం చూస్తే మాండలిక రచనలకున్న పరిధి విస్తరించిందనీ-పరిమితులు తొలగి పోతున్నాయనీ స్పష్టమవుతుంది.

కయితికాల పోశెట్టి 'జనపదం' స్థానికమైన చిన్నపత్రిక కోల్‌బెల్ట్ వీక్లీలో మొదలై రాష్ట్రస్థాయి ఉదయం వారపత్రికకు చేసిన ప్రయాణం, ఎదిగిన తీరు గమనించాల్సిన విశేషాలుగా చెప్పాలి. అలాగే తెలంగాణా మాండలికంలో వచ్చిన పుప్పల నరసింహం 'ముద్ర'కు మధురాంతకం రాజారాం రాయలసీమ మాండలికంలో ముందుమాట రాయడం కూడా పేర్కొనదగ్గ అంశమే. దేవరయాంజాలకు (పుప్పల) దామల్‌చెరువుకు (మధురాంతకం) మధ్యనున్న దూరం చెరిగిపోయేంతగా మాండలిక కథ వ్యాపించింది.

ఇలా అన్ని ప్రాంతాలనుంచీ మాండలికం రచనలు వెలువడి వాటి వ్యాప్తి ఎక్కువవుతున్నప్పటికీ మాగోఖలే తరువాత మధ్యాంధ్ర ప్రాంతంనుంచీ ప్రత్యేకంగా మాండలిక రచనలు రాలేదు. ఆ ప్రాంతపు భాష ప్రామాణిక మాండలికం (Standard Dialect) అయి

అదొక ప్రత్యేక మాండలికంగా గుర్తింపు పొందకపోవడం అందుకు కారణం అనవచ్చు. అయినప్పటికీ అక్కడి కింది తరగతి ప్రజల భాషలో సాహిత్యం రావాల్సిన అవసరం వుంది.

భాష విషయంలో పూర్వం వున్న అపోహలు తొలగిపోతున్నాయి అని చెప్పానే కొన్ని రకాల ప్రక్రియల్లోనే కొన్ని ప్రాంతాల మాండలికాలు ప్రచారమవుతున్నాయని విమర్శకులు భావిస్తున్నారు.[94] అన్ని మాండలికాల్లోనూ మాండలిక సాహిత్య రచన- ప్రచురణ మరింత ఎక్కువైనప్పుడు అన్ని ప్రక్రియలూ అన్ని ప్రాంతాల వారికీ అందుతాయి. పత్రికలు మాండలిక సాహిత్యాన్ని సమాంతర సాహిత్యంగా మాత్రమే గాక ప్రధాన స్రవంతిలోని సాహిత్యంగా సైతం గుర్తించి దాని ప్రచారానికి మరింత తోడ్పడాలి.[95] మాండలిక సాహిత్య రచన- ప్రచురణల్ని ఒక ఉద్యమంలా నడిపినా తప్పులేదు. అప్పుడు - సంప్రదాయాల సంకెళ్ళు తెంచుకొని కొత్త సాహిత్య భాష ఏర్పడాలని ఆశించిన ఆనాటి గురజాడ కలలు పండుతాయి. మాండలిక రచనలద్వారా అఖండ భాషా సాహిత్యాలు ఏర్పడి తెలుగుసాహిత్యాన్ని పరిపుష్టం చేస్తాయని శాస్త్రీయంగా విశ్లేషించిన నిన్నటి కొ.కు ఆశయం నెరవేరుతుంది. అన్ని ప్రాంతాలవారినీ, అంతస్తులవారినీ, వృత్తులవారినీ, సంస్కారాల వారినీ ఎన్నో తరహాల పదజాలాలు మన సాహిత్యానికి మూలధనం అనీ, క్రమక్రమంగా రూపొందుతున్న అఖిలాంధ్ర భాషకువాటి మేలు కలయిక ప్రాతిపదిక అవతుందన్న నేటి విమర్శకుల కోరిక[96] సఫలమౌతుంది.

1980 నుంచి అన్ని ప్రాంతాల మాండలికాల్లోనూ పోటాపోటీగా సాహిత్యం వస్తున్నప్పటికీ రచయితల సంఖ్యలోనూ, రచనల రాశిలోనూ వాసిలోనూ తెలంగాణాదే అగ్రస్థానం. తెలంగాణా మాండలికంలో వచన కవిత, కథ, నవల, నాటకం, అన్నిటికన్నా మించి పాట- అన్ని ప్రక్రియలూ వచ్చాయి. పాటలతో సమంగా కథలు కూడా అసంఖ్యాకంగా వచ్చాయి. తెలంగాణా మాండలిక కథకు తక్కిన ప్రాంతాల కథలకన్నా భిన్నంగా కొన్ని ప్రత్యేకతలు ఉన్నాయి. తెలంగాణా ప్రాంతపు సామాజిక, ఆర్థిక, రాజకీయ నేపథ్యం తెలంగాణా మాండలిక కథకు విశిష్టతను సాధించి పెట్టింది.

# నాలుగో అధ్యాయం

# తెలంగాణా మాండలిక కథ

*తెలంగాణాకు ఏనాడు రాజకీయ ప్రతిపత్తి లేదు. తెలంగాణాకు పోరాట ప్రతిపత్తి ఉంది. ఉద్యమ ప్రతిపత్తి ఉంది విప్లవ ప్రతిపత్తి ఉంది. అంతర్జాతీయంగా తెలంగాణ విదితం అయింది ప్రజాపోరాటం ద్వారానే.*

- దాశరథి రంగాచార్య

# తెలంగాణా మాండలిక కథ

తెలంగాణా భాషా సాహిత్యాలకి తెలుగులో ఒక ప్రత్యేకత ఉంది. భౌగోళిక పరిస్థితులు రాజకీయ పరిస్థితులు తెలంగాణా భాషా సాహిత్యాలకి ఆవిశిష్టతని సంతరించిపెట్టాయి. తెలంగాణా మాండలిక కథని గురించి ఆలోచించే ముందు తెలంగాణా భాషా సాహిత్యాలకి ప్రత్యేకత ఏర్పడటానికి దారితీసిన కారణాల్ని పరిశీలించాల్సి వుంది.

## తెలంగాణా భాషా - సాహిత్యాలు - ప్రత్యేకత

పడమటి కనుమల్లో పుట్టి దక్కను పీఠభూమి మీదుగా తూర్పుకు ప్రవహిస్తున్న కృష్ణానది తెలంగాణాని దక్షిణాన వున్న రాయలసీమనుంచి వేరుచేస్తుంది. కృష్ణానది ప్రవహిస్తున్న నల్లమల గుట్టల వరుస (వీటికి అమ్రాబాదు గుట్టలని పేరు) దాన్నుంచి విడివడి నల్లగొండనుండి ఖమ్మంలోని కందికల్ గుట్టల వరకూ వ్యాపించిన మరో గుట్టల వరుస కూడా తక్కిన ఆంధ్రదేశంనుంచి తెలంగాణాని వేరుచేస్తున్నాయి. భౌగోళికంగా తెలుగు భాషలో తెలంగాణా మాండలికం ప్రత్యేకతని సంతరించుకోవడానికి ఇదొక కారణం.

పడమటి దిక్కున కర్నాటక, మహారాష్ట్రలు, ఉత్తరాన మహారాష్ట్రలున్న విదర్భ, తూర్పున కొంతవరకూ మధ్యప్రదేశ్‌లు సరిహద్దులుగా వున్న కారణంగా సరిహద్దు జిల్లాల్లో ఆయా భాషల సంపర్కంవల్ల కూడా తక్కిన ప్రాంతాల్లో లేని విశిష్టత తెలంగాణా భాషకేర్పడింది.

పెద్దపెద్ద పర్వతశ్రేణులు లేకపోయినప్పటికీ, విశాలాంధ్రలోకెల్లా ఎత్తైన గుట్టలు తెలంగాణాలోనే వున్నాయి. వాటిచుట్టూ అడవులు - లోయలు, వాటిలో ప్రవహించే వాగులు తెలంగాణాకు భౌగోళికంగా అందం తీసుకురావడం ఎలా వున్నా ఈ కొండల్లో అడవుల్లో గోండులు, కొలాములు, కోయలు, లంబాడీలు, కొండరెడ్లు, చెంచులు, భిల్లులు లాంటి కొండ జాతులు నివసించడంవల్ల - సాంస్కృతికంగా కూడా తెలంగాణాకు ప్రత్యేకత ఏర్పడింది. సరిహద్దు రాష్ట్ర ప్రజల సంస్కృతి ప్రభావం కూడా తక్కువేం కాదు. సరిహద్దుల్లో కూడా కన్నడిగులతో పొత్తు ఎక్కువ కాబట్టి ఒకే భాషా కుటుంబానికి చెందడంవల్ల కన్నడ భాషా సంస్కృతులకీ తెలంగాణా భాషా సంస్కృతులకీ దగ్గర సంబంధం కనిపిస్తుంది.

రాజకీయపు సరిహద్దులు కూడా తెలంగాణాని తక్కిన ఆంధ్రరాష్ట్రంనుంచి వేరుచేయడంవల్ల ప్రత్యేక భాషా మండలం ఏర్పడింది. కాకతీయుల కాలం వరకూ దాదాపు ఆంధ్ర దేశమంతా ఒకే గొడుగు కింద వున్నప్పటికీ 1336లో కాకతీయుల పతనం తర్వాత తెలంగాణా మహమ్మదీయుల ఏలుబడిలోకి పోయింది. అప్పట్నుంచి 1948 వరకూ -

ఆరువందల సంవత్సరాలకు పైగా రాజకీయ సాంస్కృతిక రంగాల్లో తెలంగాణా తక్కిన ఆంధ్రదేశం నుండి దూరంగా వుంది. బ్రిటిష్ వాళ్ళ వలస సంస్కృతి ప్రభావం ప్రత్యక్షంగా ఈ ప్రాంతంమీద పడలేదు. విద్య, వైజ్ఞానిక రంగాల్లో శరవేగంతో మార్పులు రాలేదు. అందువల్ల కూడా ప్రాచీన తెలుగు సంస్కృతి తెలంగాణాలో నిలిచివుంది. ఫ్యూడల్ సంస్కృతి ఎక్కువగా కనిపించడానికి కూడా యిదే కారణం.

పటిష్టమైన గ్రామీణ పునాది వున్నందున సైనిక రెవిన్యూ శాఖలకి సంబంధించిన వ్యవహారంలో తప్ప ఉర్దూ కూడా అంత లోతుగా భాషలో పాతుకుపోలేదు. కానీ ఉర్దూ పారశీలు రాజభాషలయిన తర్వాత నిత్య వ్యవహారంలో ఉర్దూ ప్రభావం ఎక్కువయింది. పల్లెపట్టుల్లో వ్యావసాయక సంస్కృతిలో జీవించే ప్రజల్లో మాత్రం అచ్చమయిన తెలుగు పలుకుబడి మిగిలిపోయింది. శిష్టానుకరణగా తక్కిన ఆంధ్రదేశంలో ప్రగాఢమైన ప్రభావం చూపిన సంస్కృతచ్ఛాయ తెలంగాణా భాషమీద ఎక్కువ సోకలేదు.

ఈ ప్రాంతపు శిష్టవర్గంనుంచి తెలుగులో సాహిత్య సృజన తగ్గిన కారణంగా పల్లెల్లో జానపద సాహిత్యమొక్కటే ప్రచారంలో వుంది. అందువలన కూడా అర్వాచీన కావ్య / సాహిత్య భాషా సంపర్కం లేని ఒక ప్రత్యేకమైన భాష తెలంగాణాలో మిగిలిపోయింది. దాన్ని ఆరువందల సంవత్సరాలనాటి పాత తెలుగుగా పేర్కొనవచ్చు. అటువంటి ప్రాచీన భాషారూపాలున్న ప్రాంతాల్ని - పురాతన వ్యవహార ప్రాంతాలు (**relic area**) గా భాషా శాస్త్రం పేర్కొంటుంది. అటువంటి ప్రాంతాలు తెలంగాణాలో ఎక్కువ. వ్యవహారిక భాషోద్యమం కాలంలో కూడా తెలంగాణా రాజకీయంగా సాంస్కృతికంగా వేరుగా ఉన్న కారణంగా తెలంగాణా భాష పరిగణనలోకి రాలేదు. తెలుగులో శిష్టవ్యావహారికం కోస్తా సర్కారు రాయలసీమ, దత్త మండలాల్లో సాహిత్య భాషగా రూపొందించుకుంటున్న తరుణంలో దూరంగా వున్నందున తెలంగాణా భాష విశాలాంధ్ర ఏర్పడ్డాకా తక్కిన ప్రాంతాల వారికి వింతగా ధ్వనించింది. ఆ విధంగా భాషా సంస్కృతుల్లో ఏర్పడ్డ వైవిధ్యమే తెలంగాణా సాహిత్యానికి కూడా ప్రత్యేకతని సంపాదించి పెట్టింది.

తెలంగాణా ప్రజాసాహిత్యానికి పాదు. లిఖిత సంప్రదాయంలో సాహిత్యం తరతరాల మౌఖిక సంప్రదాయానికీ, ప్రజల భాషా సంస్కృతులకీ దూరమై పండిత వర్గానికే పరిమితమైనప్పుడు దేశీయచ్ఛందో రీతుల్లో, ప్రజల భాషలో సాహిత్య సృజన చేసిన పాల్కురికి సోమన తెలంగాణా ప్రజా సాహిత్య సంప్రదాయానికి చెందిన కవుల్లో మొదటివాడు. చేసింది మత ప్రచారమే కావచ్చు, చెప్పింది భక్తిమార్గమే కావచ్చు. కానీ వైదిక మతంలో వున్న చాతుర్వర్ణ్య వ్యవస్థని తీవ్రంగా నిరసించాడు. కులంచేత కాకుండా గుణంచేత మానవుల అర్హతలని నిర్ణయించే బసవణ్ణ ప్రబోధాన్ననుసరించి కింది తరగతి ప్రజల్ని సాహిత్య పాత్రలుగా మలచి ఆనాటి లిఖిత సాహిత్యానికి ఎదురొడ్డి నిలిచిన ప్రజా సాహిత్యంగా సోమన ద్విపదని పేర్కొనవచ్చు.

పాలుకురిది మౌఖిక సంప్రదాయం. అంతేగాదు - 'ఆరూఢగద్య పద్యాది ప్రబంధాల్లో సంస్కృత భూయిష్ట రచన' సర్వసామాన్యం కాదుగాబట్టి, జాను తెలుగులో ప్రసన్నత వున్నందువల్ల, గద్యపద్యోదాత్త కృతులకు ద్విపద సమానమేనని భావించి పాలుకురికి స్వీకరించిన భాష, రూపం కూడా నాటి తెలంగాణా ప్రజలవే. సాహిత్య భాషలో ప్రసన్నత అనే గుణం ప్రజల దైనందిన జీవితంలోని భాషకు దగ్గరగా వున్నప్పుడే సాధ్యమవుతుంది. అయితే ఆనాడు ఆ భాష తెలంగాణా వరకే పరిమితమైనది కాకపోవచ్చు.

800 ఏళ్ల క్రితం పాల్కూరికి ప్రజా సాహిత్యానికి పెట్టిన ఒరవడి తెలంగాణాలో తర్వాతి కవులకు వారసత్వంగా సంక్రమించింది. గోన బుద్ధారెడ్డి రంగనాథ రామాయణం ఆ క్రమంలోనే వచ్చింది. ప్రజల భాష, సాహిత్య రూపాలతోపాటు స్థానికంగా ప్రచారంలో వున్న అవాల్మీకాంశాలెన్నో బుద్ధారెడ్డి రామాయణంలో చోటుచేసుకోవడంతో. ఆనాటినుంచి ఈనాటివరకూ జానపదుల నోటిపాటగా మిగిలిపోగలిగింది. జానపద వృత్తి కళాకారులకి పాఠ్యమైంది.

భాష, రూపాల్లో లిఖిత సంప్రదాయాన్ని స్వీకరించినప్పటికీ కథనంలో మౌఖిక తత్వాన్ని యిముడ్చుకున్న పోతన భాగవతం కూడా ప్రజలకు దగ్గరయింది. రాజుల ఆశ్రయాన్ని నిరాకరించి పోతన కవిగా కన్నా భక్తుడిగా ప్రజలకి ఆరాధ్యుడయ్యాడు. అందుకే కవిత్రయానికి లేని ఆదరణ ప్రజల్లో పోతనకుంది. అరకబట్టి పొలం దున్నిన పోతన తమ వర్గం వాడని ప్రజలు భావించి వుండవచ్చు. మౌఖిక సంప్రదాయానికి చెందిన పుట్టుకవిత్వ సహజపాండిత్యధోరణి వుంది గాబట్టే పోతన కవిత్వం ప్రజలకు దగ్గరయింది.[1]

గౌరన రచించిన హరిశ్చంద్రోపాఖ్యానం ద్విపదలోనే వెలువడటం తెలంగాణాలో ప్రజాసాహిత్య రూపాల కొనసాగింపునకు దృష్టాంతంగా భావించాలి. తరతరాలుగా మౌఖికంగా ప్రచారమైన జానపద సాహిత్యం, కళారూపాలే తెలంగాణా ప్రజలకు వారసత్వంగా సంక్రమించాయి. జానపద వాఙ్మయానికి తెలంగాణా ఆటపట్టు అయింది. అందుకే తెలంగాణాలో లభించినంత జానపద సాహిత్యం తక్కిన తెలుగు ప్రాంతాల్లో లభించదు. ఆ జానపద సాహిత్య సంప్రదాయంలోనే కంచెర్ల గోపన్నలాంటి వాళ్ల కీర్తనలు వెలువడ్డాయి. జైలుగోడల మధ్య సాహిత్యం మౌఖికంగానే జీవించగలిగింది. తెలంగాణాకున్న ప్రత్యేక రాజకీయ, భౌగోళిక పరిస్థితులే ఆ భాషే సంస్కృతి సాహిత్యాలని సంస్కృతీకరణకి(Sanskritization) గురికాకుండా చేశాయి. అందువల్లే కట్టుబొట్టు దగ్గర్నుంచీ తెలంగాణా ప్రజల జీవిత విధానం అంతటా తెలుగుదనం కొట్టొచ్చినట్టు కనపడుతుంది.

తెలుగు సాహిత్యరంగంలో భాషా విషయకంగా, ప్రక్రియా విషయకంగా వచ్చిన మార్పులకి ముస్లిం పాలనలోని తెలంగాణా దూరంగా వుండిపోయింది. అందువల్లే ప్రాచీన కావ్యాల్లోని

పదాలు కొన్ని యీనాటికీ తెలంగాణా భాషలో కనిపిస్తాయి. సంస్కరణ పొందని ప్రాచీన పదాంశాలూ, ప్రత్యయాలు కూడా తెలంగాణా తెలుగులో కనిపిస్తాయి.[2]

కుతుబ్‌షాహీలు గోలుకొండ రాజులైన తర్వాత పారశీకంతో పాటు ఉర్దూకూడా సాహిత్య భాషగా గౌరవాన్ని పొందింది. మొదటి సుల్తాను కులీకుతుబ్‌షా (1512-1543) తప్ప తక్కిన కుతుబ్‌షాహి రాజులంతా అంతో యింతో ఉర్దూ కవితా వ్యాసంగం చేసిన వాళ్ళే.

ఉర్దూతోపాటు తెలుగు సాహిత్యాన్ని కూడా ఆదరించినవాడు మూడో సుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షా. కొంతకాలం విజయనగర రాజుల పంచన ఆశ్రయం పొందిన కారణంగా తెలుగు భాషా సారస్వతాలపై అతనికి అభిమానం కల్గింది. ఏ ప్రాంతంవాడో తెలియదుగానీ అద్దంకి గంగాధరకవి 'తపతీ సంవరణోపాఖ్యానం' అనే ప్రబంధాన్ని ఇబ్రహీం కుతుబ్‌షాకి అంకితం చేశాడు. రాములందరికన్నా గొప్ప రాముడనీ, మహాదాతనీ పేరుపొందిన ఇభరాముడితో పాటు (ఇబ్రహీం) విజయనగరంనుంచి ప్రబంధ ప్రక్రియ గోలకొండకు దిగుమతి అయ్యింది. అయితే సుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షా తర్వాత అతనిలా తెలుగు సాహిత్యాన్ని పోషించిన సుల్తాను లేని కారణంగా తెలంగాణాలో ప్రబంధ రచన వ్యాపించలేదు.

సుల్తానుల పాలన తెలంగాణా వరకే పరిమితం కాలేదు. విజయనగరం పతనం తర్వాత ఆంధ్రదేశంలోని విశాల భూభాగం వారి అధీనంలో వుండేది. మహమ్మదీయుల పాలనలో ఉర్దూ పారశీక భాషల ప్రభావం తెలుగు భాషా సాహిత్యాల మీద విశేషంగా పడింది. రాజభాషగా వున్న పారశీ ప్రభావం పాలనా వ్యవహారాలద్వారా, వ్యాపార వాణిజ్య రంగాలద్వారా దైనందిన జీవితంమీదా, సాహిత్య భాషగా వున్న ఉర్దూ ప్రభావం సాహిత్యభాషమీద విస్తృతంగా వుండటాన్ని గమనించవచ్చు.[3]

ఉర్దూ పారశీక భాషల ప్రభావం తెలుగు సాహిత్యంమీద పడ్డ ఈ కాలంలో జరిగిన అద్భుతం - అచ్చతెలుగు కావ్యరచన. తెలుగులో మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యరచన మూడో సుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షా కాలంలోనే జరిగింది. అది పొన్నగంటి తెలగనార్యుడు సుల్తాను సైన్యాధికారి అమీన్‌ఖాన్‌కి అంకితంగా యిచ్చిన 'యయాతి చరిత్రము'. పేరులో తెలంగాణని యిముడ్చుకున్న కవి అచ్చతెనుగు కావ్యానికి ఆద్యుడై తర్వాతి అచ్చతెనుగు కవులకి ప్రేరణ అయ్యాడు.

అయిదో సుల్తాను మహమ్మద్‌షా ఆశ్రయంలో సారంగు తమ్మయ్య 'వైజయంతీ విలాసం' రచించాడు. అబుల్ హసన్ తాన్‌షా కాలంలో కంచెర్ల గోపన్న దాశరథీ శతకం రాశాడు. ఎన్నో కీర్తనలు కూర్చాడు. మహమ్మదీయులు తెలుగునాడు ఆక్రమించుకోకముందు తెలంగాణా తెలుగు కవులు ప్రజల భాషకీ, సాహిత్య రూపాలకీ ప్రాధాన్యం ఇస్తే, ఆ తర్వాత కుతుబ్‌షాహీల కాలంలో వచ్చిన కవులు కొత్త సాహిత్య రూపాన్ని ఎన్నుకున్నారు. ఈ రెండు యుగాల కవుల భాషలో సారూప్య వైరూప్యాల్ని కూడా పరిశోధించాలి.

గోలకొండ పతనం తర్వాత హైదరాబాదు అసఫ్ జాహీల అధీనంలోకి వచ్చాక కుతుబ్‌షాహీల కాలంలో తెలుగు సాహిత్యంలో లభించిన కొద్దిపాటి ఆదరణ కూడా పూర్తిగా నశించింది. ఆరవ నిజాం మహమ్మదలీఖాన్ హయాంలో (1869-1911) ఉర్దూ రాజభాష అయింది. అతని కాలంలోనే ఉర్దూ మీడియం పాఠశాలలు నెలకొన్నాయి (1883). వాటిలో తెలుగుకు స్థానం లేదు. తెలంగాణా తెలుగువారికి మాతృభాష నేర్చుకొనే అవకాశం కూడా లభించలేదు. ఆరవ ఏడవ నిజాంల కాలంలో తెలుగువారు భాషా సాంస్కృతిక రంగాలలో అణచివేతకు గురయ్యారు.

తెలుగువారి సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం ప్రయత్నాలు మొదలయ్యాయి.

## తెలంగాణాలో సాంస్కృతిక పునరుజ్జీవన సాహిత్యం - మాండలికత

చివరి నిజాంల సాంస్కృతిక శోషణకి వ్యతిరేకంగా 20వ శతాబ్దం ఆరంభంనుంచి నిజాం రాష్ట్రాంధ్రులు ఎన్నో విధాలుగా నిరసన తెలపడానికి పూనుకున్నారు. నిజాం పాలన పట్ల వున్న అసహనం భాషా సాంస్కృతిక రంగాల్లో వెలికి వచ్చింది. శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం (1910 సెప్టెంబరు 1) స్థాపన దానికి నాంది. కొమర్రాజు చూపిన బాటలో మాడపాటి, సురవరం, ఆదిరాజు లాంటి ప్రముఖులంతా సాంస్కృతిక సేనానులై ముందు నడిచారు. గ్రంథాలయ స్థాపన, గ్రంథ ప్రచురణ, పత్రికా నిర్వహణ - దేనికదే ప్రత్యేక ఉద్యమంగా ముప్పేటగా ఒకే లక్ష్యంతో దాదాపు ఏకకాలంలోనే ప్రారంభమయ్యాయి.

నిజాం రాష్ట్రాంధ్రులందరినీ ఏకం చేయడానికి ఆంధ్ర జన సంఘం (1921) ఆంధ్ర జన సంఘ కేంద్రంగా (1923 ఏప్రిల్ 1) రూపుదిద్దుకుంది. మొదటి గ్రంథాలయ మహాసభలు (1926) సూర్యాపేటలో జరగడంతో ఈ సాంస్కృతికోద్యమం ఎటు దారితీస్తుందోననే భయం పాలకవర్గంలో పుట్టింది. వాక్‌సభా స్వాతంత్ర్యాలని హరించే గస్తీనిషాన్ (Circular : 53-1926 లోనే) జారీచేసింది. అదే సంవత్సరం 'గోలకొండ' పత్రిక రావడం విశేషం.

'గోలకొండ' తెలంగాణా ప్రజల గొంతయింది. ఆంధ్ర భాషాసేవ, ఆంధ్రుల సత్వరాభివృద్ధి[4] అనే రెండంశాల కార్యక్రమంతో గోలకొండ నిజాం రాజుల సాంస్కృతిక పీడనకి గుండె ఎదురొడ్డి నిలిచింది. నిజాం రాష్ట్రాంధ్రుల సమస్యలపట్ల ఏ ప్రతిస్పందనా లేక తెలంగాణాని ఏకాకిని (isolated) చేసిన బ్రిటిష్ 'ఆంధ్ర సోదరుల' ప్రవర్తనపట్ల ఆవేదన వెలిబుచ్చింది. తెలంగాణాకి సాహిత్య చరిత్రే లేదన్నట్లు కిందిచూపు చూసిన ఆంధ్ర సోదరులకి 'గోలకొండ కవుల సంచిక' జవాబిచ్చింది. పత్రికల్లాంటి ఆధునిక ప్రచార సాధనాలు సైతం నిజాం - బ్రిటిష్ రాష్ట్రాంధ్రుల మధ్య వున్న సాంస్కృతిక దూరాన్ని పూరించలేదు. గోలకొండ కవుల సంచిక మీద కూడా కొంతమంది తీరాంధ్రులనుండి వ్యతిరేకత వ్యక్తమయింది.

వీటన్నింటిపట్ల ఆవేదన గోలకొండ సంపాదకీయాల్లో ప్రస్ఫుటమవుతుంది. తెలంగాణాలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి గోలకొండ ఒక ప్రతీక మాత్రమే. సారస్వత పరిషత్తు, సాధన సమితి లాంటి ఎన్నో సంస్థలు అంకితభావంతో పనిచేశాయి.

ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టుల నాయకత్వం కిందికి వెళ్ళేవరకూ అదికూడా భాషా సాంస్కృతిక విషయాల వరకే పరిమితమైంది. 1901-1945 మధ్యకాలాన్ని తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవన యుగంగా పరిగణించవచ్చు. ఆ కాలంలో తెలంగాణా కథా సాహిత్యంలో కనిపించే ప్రత్యేకతనీ, మాండలికతనీ పరిశీలించాలి.

తెలంగాణాలో మొదటి తరం రచయితలు చరిత్ర - సంస్కృతి గ్రంథాలతోపాటు కథల రచన కూడా చేపట్టారు. సుజాత, గోలకొండ పత్రికలు కథల ప్రచురణకు అగ్రపీఠం వేశాయి. తెలంగాణాలో - తొలితరం రచయితల్లో ఒకరైన మాడపాటి హనుమంతరావు రాసిన కథల్లో సరళ గ్రాంథికమే చోటుచేసుకుంది. అంతేకాదు మాడపాటి కథల్లో ప్రేమచంద్ అనువాదాలు ముఖ్యంగా పేర్కొనదగ్గవి. అవి అనువాద కథలైన కారణంగా వాటిలో తెలంగాణా సంస్కృతి ప్రత్యేక మాండలికతగా కనిపించదు. తెలంగాణాదనంతో భాషా సంస్కృతుల్లో ప్రత్యేకతతో వెలువడ్డ కథలు సురవరం ప్రతాపరెడ్డిగారివే. సాధన సమితి, ఆంధ్రకేసరి గ్రంథమాల, అణాగ్రంథమాల, తెలంగాణా గ్రంథమాల, దేశోద్ధారక గ్రంథమాల మొ॥ సాహితీ సంస్థల తరపున యువ రచయితలు ఎన్నో కథాసంపుటాలు వేసినప్పటికీ - తెలంగాణా మాండలికతతో ముందుగా కథలు రాసింది ప్రతాపరెడ్డిగారే.

సరిహద్దుల్లో వున్న కన్నడ - మరాఠీల మూలంగా కచేరీ భాష అయిన ఉర్దూ మూలానా తెలంగాణా ప్రజల భాష చాలా 'సంకరం' అయిపోతుందని వేదన వెలిబుచ్చిన ప్రతాపరెడ్డిగారు సృజనాత్మక రచనలయిన కథలకి ఉర్దూ మిళితమైన భాషనే వుపయోగించడం గమనించాల్సిన విషయం. ప్రతాపరెడ్డిగారి మొగలాయి కథల్లో దీన్ని మరింత ఎక్కువగా చూడవచ్చు. మొగలాయి కథలకి రాజకీయాంతరార్థాలని కల్పించవద్దని రెడ్డిగారు పేర్కొన్నప్పటికీ సుల్తాను క్రౌర్యం, నిరంకుశత్వం లాంటి కొన్ని గుణాలు, వాళ్ళ కొలువుల్లో రాజాశ్రితులు, అధికార మదోన్మత్తులు ప్రజల్ని ఏవిధంగా పీడించేవారో అన్యాపదేశంగా వివరించారు. ఆనాటి నిజాం పాలనలోని ప్రజల నిస్సహాయతనీ- అమాయకతని కూడా రెడ్డిగారు మొగలాయి కథల్లో వర్ణించారు.[8]

నిజాం రాష్ట్రంలో ప్రజలకడగండ్లని అన్యాపదేశంగా వర్ణించి నిజాం రాజరికంపట్ల తమ వ్యతిరేకతని వ్యక్తం చేయడం కాళోజీ కథల్లోనూ, వెల్దుర్తి మాణిక్యరావు కథల్లోనూ చూడొచ్చు.

తమ మంచీ చెడ్డ చూడ్డానికి ఒక సంఘమన్నా వుందనీ తమకంటే హీనంగా బతికే కోట్లకొద్దీ ప్రజలనుద్ధరించడానికి ఏ సంఘాలూ లేవనీ మనుషులకంటే 'మనమే నయం' (కాళోజీ) అని రెండు ఎడ్లు మాట్లాడుకునే కథ జంతువుల్ని పాత్రలు చేసి - తెలంగాణా ప్రజలనుభవించే

హైన్యాస్న పరోక్షంగా ఎత్తిచూపితే, వ్యవసాయ పన్నుల బాధపడలేక వూరొదిలి పారిపోయే రైతుల పన్ను'భారం' కథని వెల్దుర్తి మాణిక్యరావు ఎక్కడో వుత్తర హిందూస్థానంలో గోకులపురంలో జరిగినట్లు పేర్కొనడం జరిగింది. నిజానికాకథ ఆనాడు తెలంగాణాలో ప్రతిపూర్లో రైతులూ ఎదుర్కొంటున్న బాధే.[9] రెండుకథల్లోనూ - అందునా భారం కథలో ఎక్కువగా తెలంగాణా భాషని చూడొచ్చు.

వాక్సభా స్వాతంత్ర్యాలు హరించే గస్తీనిషాన్ 53 వున్న రోజుల్లో నిజాం నిరంకుశత్వాన్నీ ప్రజల కడగండ్లనీ అన్యాపదేశంగానే పేర్కొనవలసి వచ్చింది. తెలంగాణాలో వున్న సాంస్కృతిక నిర్బంధాన్ని వివరించే ఇటువంటి పుస్తకాలని ప్రచురించే సాహితీ సంస్థలు ఆనాడు బ్రిటిష్ రెసిడెన్సీ అయిన సికిందరాబాదు లేదా త్రూపుబజారు నుంచి పనిచేసివి. అయినా కొన్ని పుస్తకాలు నిషేధాన్ని, కొన్నిసంస్థలు నిర్బంధాన్ని ఎదుర్కొన్నాయి.

ప్రతాపరెడ్డిగారి 'సంఘాల పంతులు' కథ గస్తీ 53ని పోలీసులు ప్రజల్ని పీడించడానికి ఆయుధంగా ఎలా వుపయోగించుకుంటున్నారో అన్యాపదేశంగా గాక ప్రత్యక్షంగానే వర్ణించింది. ప్రజలంతా పోలీసు ఠాణామీద దాడిచేసి వాళ్లకి దేహశుద్ధి చేయడం, చివరికి ఠాణా ఎత్తివేయడం ఈ కథకి కొసమెరుపు. నిజాం ఫర్మానాలకి వ్యతిరేకంగా 'వర్తక సంఘాలు' ఏర్పడ్డ నేపథ్యంలో యీ కథ వెలువడింది. ఇవేగాక దొంగస్వాముల మోసానికి బలయి, తర్వాత ఉదారుడైన ఒక ముస్లిం యువకుణ్ని పెళ్లాడి యిద్దరు బిడ్డల తల్లయిన బాలవింతంతువు 'హుసేన్‌బీ' కథ, డాంబిక వేషభాషలతో ప్రజల్ని మోసగించి వాళ్ల చేతుల్లోనే శిక్ష అనుభవించిన 'వకీలు యెంకయ్య' కథ, ఇంగ్లీషు చదువులు చదివి భ్రష్టుపట్టి మళ్ళీ బుద్ధితెచ్చుకుని భార్యనేలుకున్న 'బారిస్టర్ గోపాల్ కిషన్‌రావు' కథ, ముస్లిం యువకుణ్ని ప్రేమించి విఫలమై వేశ్యాగృహానికి జీవితాన్ని బలివేసుకున్న 'మెహ్బూబేగం' కన్నీటి కథ, కరీంనగర్ జిల్లా మారుమూల గ్రామంలో కాపురం చేసుకుంటూ ఒక దుర్మార్గుడి మోసానికి గురయి కాశీలో సొంత తల్లిదండ్రులే వదిలేస్తే వేశ్యగా జీవితం గడిపే స్త్రీ దయనీయగాథ ( అపరాధం) ఇలా ప్రతాపరెడ్డి గారి కథల్లో వర్ణించిన జీవితం తెలంగాణా ప్రాంత ప్రత్యేకతతో కూడినది. మొగలాయి కథల్లోలాగా యీ కథల్లో ఉర్దూ భాషా పదాల వాడుక అంత ఎక్కువ లేదు - కానీ తెలంగాణా సంస్కృతి మాత్రం యథాతథంగా చోటుచేసుకుంది.

ప్రతాపరెడ్డి కథలన్నిటిలోనూ ప్రత్యేకంగా పేర్కొనదగింది 'వింత విడాకులు'. తెలంగాణా గ్రామీణ ప్రజల మీద సైతం గోలకొండ పత్రిక సాంస్కృతికంగా ఎంత ప్రభావం చూపిందో తెలియజెప్పే 35 పేజీల పెద్ద కథ ఇది. విడాకుల కవకాశం లేని హిందూ కులంలో దాంపత్య జీవనానికి పనికిరాని వృద్ధుడికిచ్చి కమలమ్మ అనే యువతిని పెళ్ళి చేశాకా ఆమెను ముస్లిం మతంలోకి మార్చి విడాకులు యిప్పించి, మళ్లీ మరో చదువుతున్న యువకుడికొచ్చి పెళ్ళిచేయడం యిందులోని ముఖ్యవస్తువు. గోలకొండ పత్రికలో వచ్చిన వార్త చుట్టూ అల్లిన

కథ యిది. తెలంగాణా గ్రామీణ సాంస్కృతిక నేపథ్యాన్ని చక్కగా ప్రతిబింబించిన ఈ కథని ప్రతాపరెడ్డి గారి కథల్లో తెలంగాణా మాండలికతకు చక్కని ఉదాహరణగా పేర్కొనవచ్చు. మానవ సంబంధాలని శాసించే డబ్బు, మతం కుటుంబ జీవితంలో ఎలాంటి మార్పుని తేగలవో నిరూపించిన కథ యిది.

ఈ విధంగా తెలంగాణా ప్రజల జీవితాన్ని వస్తువుగా, భాషని సాహిత్య భాషగా స్వీకరించిన ప్రతాపరెడ్డిని తెలంగాణా కథకు ఆద్యుడుగా పేర్కొనవచ్చు. ఆ కథలో భాషే వస్తు విషయకంగా మాండలికతని సాధించడం రెడ్డిగారి ప్రత్యేకత. తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంలో భాగంగా కథారచన జరిగిన కారణంగా సురవరం ప్రతాపరెడ్డిగారా ప్రత్యేకతని సాధించగలిగారు.

బూర్గుల రంగనాథరావు (వాహ్యాళి), ధరణికోట శ్రీనివాసరావు (మాయింట్లో) లాంటి రచయితలు, సాధన సమితి లాంటి సంస్థలు ప్రచురించిన కథల సంపుటాలు (సాధన, పాలవెల్లి, రంగవల్లి) తెలంగాణాలో కథాసాహిత్యం విస్తృతంగా వెలువడిందని - మిగతా సాహిత్య ప్రక్రియలకన్నా కథకే ఎక్కువ పాఠకాదరణ లభించిందనీ వెల్లడిస్తున్నాయి. అయితే ఈ క్రమంలో వెలువడ్డ కథల సంపుటాల్లో ఆంధ్రకేసరి గ్రంథమాల ప్రకటించిన 'కమ్మతెమ్మరలు' ప్రత్యేకంగా పేర్కొనదగింది.

సంభాషణలే కాకుండా కథనం కూడా పూర్తి మాండలికంలోనే వుండటం ఈ సంపుటిలో నాలుగు కథల్లో కనిపిస్తుంది. తెలంగాణా ప్రాంతీయ గ్రామీణ భాషని సంపాదకులు కూడా గ్రామ్యభాషని పేర్కొన్నారు. అఖిలాంధ్రులకీ మూలమూలకున్న తెలుగు నుడికారం, భాష ఆధునిక రేఖలతో తీర్చి ప్రదర్శిస్తున్నామనీ విమర్శకులే గాక భాషాశాస్త్రవేత్తలు కూడా తమ ప్రయత్నానికి చేయూత నివ్వాలనీ సంపాదకులు 'స్వవిషయం'లో పేర్కొన్నారు. భాషావిషయకంగా తెలంగాణాలో ఆ రచయితలు చేసిన ప్రథమ ప్రయత్నంగా దాన్ని భావించాలి. వెల్దుర్తి మాణిక్యరావు అంతకు కొద్ది ముందుగా 'దెయ్యాల పన్గడ' నాటకాన్ని 'అచ్చమైన పచ్చి పల్లెటూరు' తెలంగాణా భాషలో రచించారు. ఆ పద్ధతిని కథల్లో కూడా తీసుకువచ్చే ప్రయత్నంగా 'కమ్మతెమ్మరలు' సంపుటిని పేర్కొనాలి. ఈ కథల్లో వున్న పది కథల్లో నాలుగు 'ఆడివాప' (బోయినపల్లి రంగారావు), 'కోవిల్లో' (చరకుపల్లి రఘోత్తమరావు), 'పల్లెబడి' (చరకుపల్లి హరికృష్ణారావు), 'ఎందుకు?' (బూర్గుల రంగనాథరావు) కథలు మాండలిక భాషలో వున్నాయి. వీళ్లల్లో బూర్గుల రంగనాథరావు తప్ప తక్కినవాళ్ళు అంతపేరున్న రచయితలు కారు. కథాశిల్పం దృష్ట్యా యీ కథలు ఏమంత గొప్పవి కూడా కాదు. కానీ తరతరాలుగా తెలంగాణాలో భూస్వామ్య జమీందారీ వ్యవస్థలో పాతుకుపోయిన దురాచారానికి బలయిన 'ఆడివాప' కథ సహజత్వానికి దగ్గరగా వుంది. చదువరులకి వ్యధ మిగిల్చిపోతుంది. ఇందులో కథ ఎక్కువ భాగం సంభాషణల రూపంలో సాగుతుంది - రచయిత జోక్యం చాలా తక్కువవడంవల్ల తెలంగాణా ప్రాంతపు దురాచారమైతే తెలుస్తుందిగానీ గ్రామీణ వాతావరణాన్ని

యీ కథ పట్టుకోలేకపోయింది. 'కోవిల్లో', 'పల్లెబడి' ఆ లోటు తీర్చాయి. తెలంగాణా పల్లెపట్టుల్లోని వీధిబడిని చక్కగా కళ్లముందు నిలబెట్టిన 'పల్లెబడి' చాలా మంచికథ. నాలుగు కథల్లోనూ భాషతోపాటు తెలంగాణా మాండలికత ఎక్కువగా 'పల్లెబడి'లోనే కనిపిస్తుంది.

మా గోఖలే గుంటూరు గ్రామీణ మాండలికంలో రాయడం మొదలుపెట్టకముందే యీ కథలు తెలంగాణాలో వచ్చాయి. ఒకవిధంగా తెలుగులో మొదటి మాండలిక కథలు యివేనని కూడా చెప్పొచ్చు. ఈ కథల సంకలనం రాకముందు 'తెలుగుతల్లి' పత్రికలో ఎం.బి.సీతారామారావు రాసిన 'గరీబోణ్ణి'[10] కథ తెలంగాణా మాండలికంలో వచ్చింది. తండ్రి చేసిన అప్పు తీర్చడానికి 'పుట్టిన గడియసందీ' దొరలకు వెట్టిచాకిరీ చేసే గరీబోడి కథ యిది. తెలంగాణా పల్లెల్లో భూస్వామ్య వ్యవస్థనీ కథ కళ్ళముందుంచుతుంది. దొరకచ్చడం ముందు పరిగెత్తడం, చేసిన అప్పులు - తరతరాలు చాకిరీ చేసినా తీరకపోవడం, వెట్టిలోనే పుట్టి, వెట్టిలోనే చచ్చే - బడుగుజీవుల వేదన యీ కథలో చోటుచేసుకున్నాయి. అయితే యీ కథ ఆత్మాశ్రయ రీతిలో వుంది.

'పల్లెబడి'లాంటి కథలు అందుకు భిన్నంగా సాహిత్యానికొక ప్రయోజనాన్ని ఆశించి పూర్తి మాండలికంలో వెలువడ్డాయి. 'ఎందుకు?' కథలో రచయిత పాత్రధారై సాహిత్యం ప్రజల దగ్గరకు చేరాలంటే ప్రజల భాషలో ప్రజల జీవితాన్ని రాయాల్సిన అవసరం గురించి పేర్కొన్నాడు.

భాషా విషయకంగా ఈ రచయితలు వేసిన కొత్త మార్గాన్ని నవ్య సాహిత్య పరిషత్తు పత్రిక 'ప్రతిభ'[11] కొనియాడింది. వస్తు విషయకంగా కూడా 'ఆడివాప' కథ తెలంగాణా ప్రాంతానికి మాత్రం చెందిన ఒక దుష్ట భూస్వామ్య సంస్కృతిని చిత్రించి తెలంగాణా మాండలికతకి కథా సాహిత్యంలో మచ్చుగా మిగిలింది. తెలంగాణాలో తరతరాలుగా అమలవుతున్న దురాచారం మీద పాఠకుల్లో వ్యతిరేకత కల్గించడంలో కూడా 'ఆడివాప' కథ సఫలమయింది.

గ్రామీణ ఫ్యూడల్ సమాజంలోని సాంస్కృతిక పీడనకీ, అణచివేతకీ వ్యతిరేకంగా వచ్చిన మొట్టమొదటి కథలు మాండలికంలోనే వుండటం గమనించాల్సిన అంశం.

తెలంగాణా భూస్వామ్య సంస్కృతిలోని దుర్మార్గాల్ని ప్రత్యక్షంగా ఎత్తిచూపే కథలు (గరీబోణ్ణి, ఆడివాపలాంటి ఒకటి రెండు తప్పితే) ఈ కాలంలో ఎక్కువగా రాలేదు. ఆంధ్ర మహాసభ 1930లో ఏర్పడినప్పటికీ 1940 వరకూ సాంస్కృతికోద్యమానికి మాత్రమే పరిమితమైంది. గ్రామీణ రైతాంగానికి సంబంధించినసమస్యల్ని పట్టించుకోలేదు. 1941లో చిలుకూరులో ఎనిమిదవ ఆంధ్ర మహాసభ రావి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగింది. 1939లో ఏర్పాటైన 'కామ్రేడ్స్ అసోసియేషన్'లో చురుగ్గా పాల్గొన్న యువకుల ప్రాబల్యం ఆంధ్రమహాసభలో నెమ్మదిగా స్థిరపడింది. కానీ 1944 వరకూ మితవాదుల నాయకత్వం కిందే వుంది. 1944లో 11వ ఆంధ్రమహాసభ రైతాంగ ప్రజా సమస్యల్ని చర్చించింది.

మితవాదులకిది నచ్చక పోటీ ఆంధ్రమహాసభ ఏర్పాటుచేశారుగానీ - చివరికి అంతకుముందున్న ప్రజా సమస్యల పట్ల సానుభూతిని కూడా పక్కకుపెట్టి భూస్వాములకు ఊడిగం చేయడంతో - పోటీ ఆంధ్రమహాసభ నామరూపాలు లేకుండా పోయింది.[12]

1945 నాటికి ఆంధ్రమహాసభ నాయకత్వంలో - సంగం జెండాకింద ప్రజలు ఐక్యమై గ్రామాల్లో భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా పోరాటం చేశారు. 1945నుంచీ తెలంగాణా రైతాంగం భూమి సమస్యను ప్రధానం చేసుకుని అక్రమ లెవీలకు, వెట్టిచాకిరీకి, 'బేదఖలీ'కి వ్యతిరేకంగా కలిసికట్టుగా తిరగబడ్డారు.

దొరగడీల్లో అనునిత్యం జరిగే వెట్టిని, పెళ్ళి పేరంటాలకు తీసుకునే నిర్బంధ వసూళ్లనీ, దొరాలకు వచ్చే అధికారులకు చేసే వెట్టి దావతులనీ, వ్యతిరేకిస్తూ ప్రజలు ఒక్కటయ్యారు. తరతరాలుగా వస్తున్న దోపిడీని 'బందు' చేయాలని నిశ్చయించుకున్నారు. సంగం ప్రజలకు అండగా నిలిచి పోరాట స్ఫూర్తిని పంచి యిచ్చింది. దొరల దోపిడీకి వ్యతిరేకంగా ప్రజలు చేపట్టిన పోరాటానికి కవులు రచయితలు సాహిత్యరూపం యిచ్చారు. పాటలు కట్టారు, కథలు రాశారు.

తెలంగాణా పోరాటం నేపథ్యంగా కథలు రావడం 1945లోనే మొదలైంది. ఆ కథలు వాస్తవ పరిస్థితికి అద్దం పట్టాయి. యథార్థ సంఘటనలకి అక్షర రూపం యిచ్చాయి. పోరాటాల్ని రికార్డు చేశాయి. తెలంగాణా రైతాంగం పోరాట సంస్కృతికి ఈ కథలు ప్రత్యక్ష వ్యాఖ్యానాలుగా నిలిచాయి. అందువల్ల ఆ కథల్లో తెలంగాణా మాండలికత పరిశీలనార్హం. అయితే ఉద్యమ ప్రచారానికి అనుగుణంగా కథంతా మాండలికంలో వెలువడటం యీ కాలంలో జరగలేదు. మాండలికం పాత్రోచిత భాషవరకే పరిమితమైంది. తెలంగాణా రచయితల కథల్లో మాత్రం కథనంలో సైతం మాండలికత చోటుచేసుకుంది.

## తెలంగాణా పోరాట కథ - మాండలికం

తెలంగాణా పోరాట కథల్ని రెండుగా విడదీయవచ్చు. పోరాటంతో ప్రత్యక్ష సంబంధం కలిగి పోరాట ప్రాంతంనుంచి వచ్చిన రచయితలు రాసినవి, పోరాట సంఘటనల్ని విని, పత్రికలద్వారా తెల్సుకుని ఉత్తేజితులైన ఆంధ్రరచయితలు రాసినవి. రాసిలో ఆంధ్ర రచయితలు రాసినవే ఎక్కువ. తెలంగాణా రచయితలు రాసిన కథల్లో యథార్థ సంఘటనలు, వాస్తవికత ముఖ్యంగా కనిపిస్తే, ఆంధ్ర రచయితల కథల్లో కాల్పనికత, అవాస్తవాలు సైతం చోటుచేసుకోవడం గమనించవచ్చు. దొరుకుతున్న కథల్లో ఎక్కువ భాగం అడవి బాపిరాజుగారి సంపాదకత్వంలో వెలువడిన 'మీజాన్' దినపత్రికలోనూ, అభ్యుదయ రచయితల సంఘ మాసపత్రిక 'అభ్యుదయ'లోనూ వచ్చాయి. ఆ తర్వాతి స్థానం మద్రాసునుంచి సెట్టి

ఈశ్వరరావుగారి సంపాదకత్వంలో వచ్చిన విశాలాంధ్ర (మాస/పక్ష) పత్రికదీ. 'గోలకొండ', 'శోభ, 'నవోదయ', 'ప్రజాశక్తి', లాంటి పత్రికల్లోనూ చెదురుమదురుగా ఒకటి రెండు కథలు వచ్చాయి.

స్థానికమైన- 'మిజాన్' దినపత్రికలో తెలంగాణా రచయితల కథలు, తెలంగాణా ప్రాంతం బయటినుంచి వచ్చిన 'అభ్యుదయ', 'విశాలాంధ్ర'ల్లో ఆంధ్రరచయితల కథలు రావడం గమనించాల్సిన విషయం.

'గోలకొండ', 'శోభ', పత్రికలు తెలంగాణానుంచే వచ్చాయిగానీ తెలంగాణా సాంస్కృతికోద్యమానికి మాత్రమే మద్దతు యిచ్చిన ఈ పత్రికల్లో సాయుధ రైతాంగ పోరాట కథలు స్థానం పొందలేకపోయాయి. మితవాద రాజకీయాలకు, సాహిత్యానికీ మాత్రం పరిమితమయ్యాయి. ఈ పత్రికలు చేయని / చేయలేని పని బాపిరాజుగారి 'మిజాన్' చేసింది.

భాస్కరభట్ల కృష్ణారావు, వట్టికోట ఆళ్వారుస్వామి, వేనేపల్లి ఆంజనేయులు, ఆవుల పిచ్చయ్య, సింగరాజు లింగమూర్తి, పినిశెట్టి వెంకటేశ్వరరావు, గిడుతూరి సూర్యంలాంటి రచయితల కథలు 'మీజాన్'లో వెలువడ్డాయి.[13] పొట్లపల్లి రామారావు 'జైలు' (1946) కథల సంపుటి ఆ కాలంలోనే వచ్చింది. కాంచనపల్లి చినవెంకట రామారావు పోరాట కాలంలో రాసిన కథలు - మరికొన్ని కథలు కలిసి 'మనవూళ్ళో కూడానా... ' సంపుటంగా తర్వాత (1973) వెలువడింది.

ఈ రచయితల కథల్లో మాత్రమే తెలంగాణా మాండలికతని చూడగలుగుతాం. ఆంధ్ర రచయితల కథల్లో అత్యుత్సాహం, అతిశయోక్తులు, అతివేలమైన కల్పన, ఒక్కోసారి అవాస్తవాలు కూడా కనిపిస్తాయి.

సాయుధ పోరాటం మొదలైన సంవత్సరంన్నరకి గానీ అభ్యుదయ, అరసం పోరాట కథని పట్టించుకోలేదు. 'మీజాన్'లో వచ్చిన కథల్లో 90 శాతం 1946 సంచికల్లోనే వుండటాన్ని - అలాగే 'అభ్యుదయ', 'విశాలాంధ్ర'ల్లో 1948 సంచికల్లో ఎక్కువ భాగం వెలువడటాన్ని గమనించాలి. 1946 డిసెంబర్ 9న నిజాం ప్రభుత్వం ఆంధ్ర మహాసభ, స్టేట్ కమ్యూనిస్టు పార్టీలపై నిషేధం విధించాకా 'మీజాన్'లో పోరాట కథలురాలేదు. అందువల్లతెలంగాణా రచయితలు రాసిన కథల ద్వారా 1946 డిసెంబర్ నాటికి ముందున్న పరిస్థితుల్ని మాత్రమే తెలుసుకోగలుగుతున్నాం.

1948 వరకూ అభ్యుదయ, అరసంలు తెలంగాణా పోరాట కథని పట్టించుకోకపోవడం వల్ల రెండు నష్టాలు జరిగాయి. ఒకటి : పోరాటాన్ని కథగా మలచిన రచయితలకు సరైన ప్రోత్సాహం, మార్గదర్శకత్వం, సైద్ధాంతిక బలం లభించకపోవడం. రెండు : పోరాట సంఘటనల్ని అప్పటికప్పుడు కళారూపంలో భద్రపరచుకోలేకపోవడం. తర్వాత 'అభ్యుదయ'లో వచ్చిన కథలైనా వినుకలిద్వారానో ఊహాపోహాల ద్వాగానో రచించినవి కాబట్టి

తెలంగాణా పోరాట కథ రైతాంగ పోరాటాన్ని పూర్తిగా నమోదు చెయ్యలేకపోయింది. సజీవ మాండలికతని ప్రతిబింబించలేకపోయింది. తెలంగాణా రైతాంగం సాయుధమై చేసిన పోరాటం అందులో ఒడిదుడుకులూ, త్యాగాలూ, గెరిల్లా యుద్ధవ్యూహాలూ, విజయాలూ, గ్రామ రాజ్యాలూ, ప్రజాకోర్టులు - ఇదంతా ఆ తర్వాత కాలంలో వెలువడ్డ నవలలద్వారానే తెలుసుకోగలుగుతున్నాం. అందుకే వట్టికోట, దాశరథి రంగాచార్య లాంటి వాళ్ల నవలల్లో కనిపించినంతగా తెలంగాణా మాండలికత కథల్లో కనిపించదు.

పోలీసు చర్యకి సంబంధించిన వివరాలు తెలిపే కథలయితే అస్సలు రానే లేదు. (ఎం.వెంకటరావు రచించిన 'జీవకారుణ్య చర్య' లాంటి ఒకటి రెండు మినహాయించి). పోలీసు చర్యకి వ్యతిరేకంగానూ కాంగ్రెస్ అరాచకీయాలకి వ్యతిరేకంగా ఎన్నో పాటలు వచ్చాయి. అవి కింది తరగతి నుంచి వచ్చినవి. కథా రచయితలు నిజాం యూనియన్‌లో కలిసిపోవడంతో కథ సుఖాంతమై పోయిందని అనుకుని వుండాలి. లేదా పోరాటంతో జీవన పరిస్థితుల్ని ఎంతో కొంత మెరుగుపరుచుకోగల్గిన మధ్య తరగతికి ప్రతినిధులైన రచయితలు 48 నుంచి 51 వరకూ జరిగిన పోరాటానికి కథారూపం ఇవ్వడంలో అనాసక్తులైనా అయివుండాలి. దొరుకుతున్నంత వరకు పొట్లపల్లి రామారావు 'జైలు', కాంచనపల్లి చినవెంకట రామారావు 'మనవూళ్లో కూడానా' కథల సంకలనాల్లో పాత్రోచితంగా మాండలికం కనిపిస్తుంది. మొదటి దశలో వచ్చిన కథలు దొర దౌర్జన్యాలకు బలయిన వ్యక్తుల జీవితాన్ని వర్ణిస్తే, తర్వాత దశలో కథలు సంగం బలంతో ప్రజలు వైయక్తికంగానూ, సామూహికంగానూ దొరల, అధికారుల దుర్మార్గాన్ని ఎదిరించడాన్ని చిత్రీకరించాయి.

''ఇజ్జత్' (భాస్కరభట్ల కృష్ణారావు), 'రహీంబాయి' (పి.వెంకటేశ్వరరావు), 'న్యాయం' (పొట్లపల్లి రామారావు) కథలు మొదటి కోవకు చెందుతాయి. 'మనవూళ్లోకూడానా' (కాంచపల్లి చినవెంకటరామారావు), 'సంఘం చిట్టీ', 'దావతు' (పి.వెంకటేశ్వరరావు) రెండో కోవకి చెందిన కథలు.

రెండో కోవకు చెందిన కథల్లో తెలంగాణా మాండలికత విస్తృతంగా కనిపిస్తుంది. 'దావతు' కథ ఊరికి దౌరా వచ్చిన గిర్దావరు (రెవిన్యూ ఇన్స్పెక్టరు)కి కుమ్మరోండ్లు చాకలోండ్లు వెట్టిబందు చేయడం, కోమట్లు పైసలివ్వందే సామానివ్వమని నిరాకరించడం చివరికి గిర్దావరు ఆకలికి అలమటిస్తుంటే దొర తనగడీకి తీసుకుపోవడం - ప్రజల్లో వస్తున్న పోరాట చైతన్యాన్ని కాంచపల్లి చినవెంకటరామారావు చాలా సహజంగా చిత్రించారు. రెవిన్యూ పదాలనేకం ఈ కథలో కనిపిస్తాయి. 'జిందగీభార్' ఎన్నడూ ఎవరికీ పైసలిచ్చి తిండి తినని గిర్దావరుకు 'మాన్‌షామస్లా' (పరువు సమస్య) కలిగించిన 'దావతు' (విందు) కథ తెలంగాణా గ్రామాల్లో సంగం తీసుకొచ్చిన మార్పుని వ్యక్తం చేస్తుంది.

భాషా విషయకంగా మరొక ముందడుగు వేసి ప్రజలకు దగ్గరయ్యే భాషలో పి.వెంకటేశ్వరరావు 'సంఘం చిట్టీ' కథలో దొరవారి కచ్చడం ముందు సరిగెత్తే మైసడు సంగం పంతులు యిచ్చిన ఆంధ్రమహాసభ సభ్యత్వంతో దొరకు ఎదురుతిరగడాన్ని ఎంతో ప్రతిభావంతంగా చూపించాడు. రచయిత కథనంలో కూడా తెలంగాణా మాండలికం ఈ కథలో కనిపిస్తుంది.

ఏది ఏమయినా ప్రజల భాషలో వెలువడ్డ కథల సంఖ్య స్వల్పమే. తెలంగాణా మాండలికతని సజీవంగా ప్రదర్శించగలిగిన కథలు వేళ్లమీద లెక్కపెట్టదగినన్ని మాత్రమే వచ్చాయి. అందుకు కారణాలు కొన్ని ఊహించవచ్చు.

1. ఈ కథల రచయితలు మధ్యతరగతి నుంచి వచ్చారు. అందువల్ల కింది తరగతి వాళ్ల భాషను సజీవంగా పట్టుకోలేకపోయారు.

2. పాట, నాటకం, జానపద కళారూపాల్లాగా కథని ప్రచారం కోసం ఎన్నుకొని ప్రజల దగ్గరకు తీసుకుపోవాలనే ఆలోచన లేని కారణంగా ప్రచారానుగుణమైన భాష చోటుచేసుకోలేదు.

3. కథకున్న లిఖిత సంప్రదాయ ధోరణిని బద్దలుకొట్టి ప్రజా సాహిత్యానికి ప్రజల భాష ప్రముఖమైన అంగం అన్న సైద్ధాంతిక అవగాహన కలిగించగలిగిన అరసం అందుకు పూనుకోలేదు.

4. అక్షరాస్యతా శాతం చాలా తక్కువగా వున్న కారణంగా పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న అట్టడుగు వర్గానికి చెందిన ప్రజానీకంనుండి కథా రచయితలు వచ్చే అవకాశం కలగలేదు. అందువల్ల వారి భాష సాహిత్యంలోకి రావలసినంతగా రాలేదు.

5. పోరాటంలో తలమునకలైన రచయితలు ఉద్యమ తక్షణావసరాలకి పాటలమీద దృష్టి పెట్టినంతగా కథమీద పెట్టలేదు.

6. ప్రభుత్వ నిర్బంధాన్ని ఎదుర్కొంటూ, నిషేధానికి గురైన సంఘ కార్యకర్తలకి సావకాశంగా కథరాసే తీరుబడి లభించలేదు. ప్రచురణావకాశం తక్కువైన కారణంగా సంఘటనలు మౌఖిక కథాగేయాలుగా మాత్రమే మారాయి. లిఖిత కథగా పరిణమించలేదు.

7. పాటలు, కథాగేయాలూ మౌఖికంగా ప్రచారమయ్యాయి. అవి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న చదువులేని కార్యకర్తలనుంచీ, మిలిటెంట్లనుంచి కూడా వెలువడ్డాయి కాబట్టి మాండలికంలో వెలువడ్డాయి.

అయితే పత్రికల్లో వెలువడ్డ లిఖిత కథకంటే భిన్నంగా పాటల్లాగే ఎన్నో కథలుకూడా మౌఖికంగా ప్రచారమయ్యాయి. మూడువేల గ్రామాల్లో పదిలక్షల ఎకరాల్ని పంచుకొని లక్షలాదిమంది ప్రజలు ఎన్నో విజయాలను సాధించారు. కొన్ని పరాజయాల్ని చవిచూశారు.

గుణపాఠాలు నేర్చుకొన్నారు. వందలాదిమంది ప్రాణాలు కోల్పోయిన పోరాటంలో వ్యక్తుల సమూహాల విజయాల్ని - పోరాట సన్నివేశాల్ని ఒక గ్రామం గురించి మరో గ్రామంలోనూ, ఒక దళం గురించి మరో దళంలోనూ కథలుగా చెప్పుకున్నారు. అమరవీరుల త్యాగాల్ని వీరగాథలుగా పాటలు కట్టుకోవడమే గాక కథలుగా చెప్పుకున్నారు. పోరాటానుభవాల్ని ఒక తరంనుండి మరో తరానికి సాంస్కృతిక వారసత్వంగా కథల రూపంలో అందించుకోవడం అనివార్యంగా జరుగుతుంది.

భూస్వాములనుండి భూములు లాక్కోవడం, గడిలమీద దాడిచేసి సంగం జెండా ఎగరవేయడం, అప్పుపత్రాలు తగలపెట్టి దాస్యవిముక్తులు కావడం, దొరల్ని ఊరునుంచి తరమడం, రజాకార్లనుండి, సైనికులనుండి కాపాడుకుంటూ గెరిల్లా యుద్ధ వ్యూహాల్ని అమలుపర్చడం, వారి దాడుల్ని సమైక్యంగా తిప్పికొట్టడం వంటి ఎన్నో పోరాట సంఘటనలు, విజయాలు వీర రసాత్మకంగా ప్రజల నాలుకల మీద కథలుగా రూపుదిద్దుకున్నాయి.[14]

పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన వీరుల గురించి, మానం కోల్పోయిన స్త్రీల గురించి - ప్రాణ, మాన రక్షణ కోసం వాళ్ళు చేసిన సాహస కృత్యాలు గురించి కథలు మౌఖికంగా ప్రచారమయ్యాయి. పుచ్చలపల్లి సుందరయ్య 'వీర తెలంగాణా విప్లవ పోరాటం' లో అలాంటి సంఘటనల నెన్నింటినో పేర్కొన్నారు. అవన్నీ ప్రజల నోళ్ళల్లో కథలుగా నానినవే. ఈ కథల్ని వారి భాషలోనే నమోదుచేస్తే మౌఖిక చరిత్ర నిర్మాణానికి ఎంతగానో తోడ్పడతాయి.

ఆ కథల్లో కొన్ని పాటల రూపంలో లభిస్తున్నాయి. కానీ, పాటకన్నా జీవిత వాస్తవికతని వర్ణించడానికి విస్తృతమైన పరిధి వున్న కథలు చరిత్ర నిర్మాణానికి ఆకరాలు (**Source**)గా మరింత ఎక్కువగా వుపయోగపడతాయి. ఈ పని స్త్రీ శక్తి సంఘటన, హైదరాబాదు వాళ్ళు చేశారు. తెలంగాణా పోరాటంలో పాల్గొన్న స్త్రీలని ఎంతోమందిని కలిసి అనుభవాలని రికార్డు చేశారు. దళంలో పనిచేసిన వాళ్ళనీ, గ్రామాల్లో భూస్వాములకు వ్యతిరేకంగా ప్రత్యక్షంగా పోరాడిన సామాన్య స్త్రీలనీ కలిసి - వాళ్ల కథల్ని వారి భాషలోనే చెప్పించి 'మనకు తెలియని మన చరిత్ర'గా ప్రచురించారు. ఇది తెలుగు సాహిత్యంలో జరిగిన అపూర్వ సంఘటన. మౌఖిక చరిత్ర నిర్మాణంలో తెలుగులో జరిగిన మొదటి ప్రయత్నం. అయితే యిది స్త్రీల నుండి మాత్రమే సేకరించిన సమాచారం. ఆ విధంగా పోరాటంలో పాల్గొన్న అన్ని వర్గాల నుండీ కథల్నీ చరిత్రనీ సేకరించాల్సిన అవసరం వుంది. అంతకుముందు నాయకుల ముఖతఃనే అనుభవాలూ గుణపాఠాలూ తెలుసుకున్నాం. కానీ ప్రజల ముఖతః ప్రజల పోరాటాన్ని చరిత్రనీ తెలుసుకునే అవకాశం కలిగింది.

చరిత్రకారులూ, సామాజిక శాస్త్రవేత్తలూ, ఫెమినిస్టులూ, రాజనీతి శాస్త్రజ్ఞులతోపాటు ఈ పుస్తకం సాహిత్య విమర్శకులకీ, భాషా శాస్త్రవేత్తలకి కూడా ఎన్నో విధాలుగా ఉపయోగపడుతుంది.

సేకరించిన మౌఖిక కథనాలని యథాతథంగా ధ్వనిముద్రణ నుంచి అక్షర ముద్రణలోకి తేవడంతో తెలంగాణ మాండలికానికి చెందిన ఎన్నో విశేషాలు తెలుసుకోవడానికి వీలవుతుంది.

చాకలి ఐలమ్మ, దూడల సాలమ్మ, కమలమ్మ, కొండమ్మ, వజ్రమ్మ, గజ్జెల బాలమ్మ, సైదమ్మ, గొల్ల మల్కమ్మ, ప్రియంవద, అచ్చమాంబ, పెసర సత్తెమ్మ - వీళ్లంతా తెలంగాణాలో వేరువేరు ప్రాంతాలకి చెందిన గ్రామీణ రైతు స్త్రీలు. వాళ్లమాటల్లో వినిపించిన కథనాలన్నీ కథలే. ఒక్కొక్క కథనం కొన్ని కథలు. వీటిద్వారా ఆనాటి పోరాటంలో స్త్రీల సాంస్కృతిక జీవితాన్ని ప్రత్యేకంగానూ, తెలంగాణా సంస్కృతిని మొత్తంగానూ తెలుసుకోవడానికి వీలవుతుంది. కింది తరగతి ప్రజల భాష - అందునా స్త్రీల భాష స్వరూపాన్ని విశ్లేషించడానికి పైన పేర్కొన్న స్త్రీల కథనాలు ఎంతో వుపయోగపడతాయి.

అయితే వీళ్ల అనుభవాలని 40 సంవత్సరాల తర్వాత సేకరించడం జరిగింది. అనుభవాలు నెమరువేసుకుని పుస్తకాలు రాసిన నాయకులు కూడా పోరాటం జరిగిన పాతిక సంవత్సరాల తర్వాత మాత్రమే ఆ పని చేశారు.

పోరాటం జరుగుతున్న రోజుల్లోనే ప్రజలనుండి వచ్చిన రచయితలు, కళాకారులు ఆ పోరాటానికి సాహిత్య కళారూపాల్నివ్వడంలో ప్రముఖ పాత్ర వహిస్తారు. పోరాటాన్ని మరింత స్పష్టంగా వివరించగలుగుతారు. నైజాం సర్కారుకు, భూస్వాములకు, ఇండియన్ యూనియన్ సైన్యాలకి వ్యతిరేకంగా సాగిన రైతాంగ పోరాటంలో ప్రజలనుండి కథా రచయితలు రావడం తక్కువైన కారణంగా మిగతా సాహిత్య ప్రక్రియల ముందు కథ చిన్నదిగా కనిపిస్తుంది. అయితే మళ్లీ ఇరవై సంవత్సరాల తర్వాత తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం వారసత్వంలో ఉత్తర తెలంగాణా జిల్లాల్లో తిరిగి పాతుకున్న భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటంలో ఆ లోటు ఏర్పడలేదు. పోరాటంలో ప్రత్యక్షంగా పాలుపంచుకొనే ప్రజలనుంచే రచయితలు పుట్టుకొచ్చారు. ఆ రచయితలు తెలుగు కథని మరో మలుపుతిప్పారు. తెలంగాణా మాండలికానికి సాహిత్య గౌరవం కల్పించారు. రెండు పోరాటాల్లో గుణాత్మకమైన మార్పు సాహిత్యంలో సైతం ప్రతిఫలించింది. ఆ తీరును పరిశీలించే ముందు రెండు ఉద్యమాల మధ్యకాలంలో అడపాదడపా వచ్చిన తెలంగాణా మాండలిక కథల్ని కూడా తడమాల్సిన అవసరం వుంది.

## పోరాట విరమణ నుంచి విప్లవోద్యమం వరకు

1951 అక్టోబర్ 20న కమ్యూనిస్టు పార్టీ తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటాన్ని విరమించినట్లు ప్రకటించింది. పార్టీ పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానాన్ని స్వీకరించి ఎన్నికల్లో పాల్గొంది. పోరాట విరమణ తర్వాత అనుభవాల్ని నెమరేసుకుంటూనో చరిత్రను రికార్డు

చేస్తూనో నవలలు వచ్చాయి. నవలలు వచ్చినంత విస్తృతంగా ఆ తర్వాత కథలు రాలేదు. వచ్చిన వాటిలో భూమి సమస్య చుట్టూ అల్లిన బి. ఎన్.రెడ్డి ' ఆయువుపట్టు' పేర్కొనదగింది. ఇందులో పాత్రోచితంగా తెలంగాణా మాండలికం చోటుచేసుకుంది. వస్తురీత్యా తెలంగాణాకు చెందిన యీ కథలో ప్రాంతీయత ఎక్కువగా కనిపిస్తుంది. భూస్వాముల దగ్గర్నుంచీ స్వాధీనం చేసుకున్న భూమిని భూమిలేని పేదలకు పంచిపెట్టడం యీ కథలో ముఖ్య వస్తువు. రచయిత స్వయంగా ఆనాటి ఉద్యమంలో పాల్గొన్న కారణంగా కొన్ని ముఖ్య సంఘటనల్ని రికార్డు చేయగలిగారు. ఆ తర్వాత కథ నవలగా మారింది.[15]

పోరాటంలో న్యాయం తరపున నిలబడినందుకు సొంత అన్న దురాగతానికే బలయిన బండోల్ల తిరుమలయ్య కథని - జి. సురమౌళి 'రక్తపూజ' కథగా మలిచారు.[16]

గొడ్డండ్లు నూరినారూ గొంగట్ల బెట్టినారు
నీపానం దీసిరి నాయనో బండల్ల తిరుమలయ్య ॥నీ॥
కారీన రక్తమంత కడవల్ల నింపినారు ॥నీ॥
చిల్లీన రక్తమంతా సీసల్ల నింపినారు ॥నీ॥

- అన్న పాటతో మొదలయ్యే యీ కథ అదే పాటతో అంతమవుతుంది. ఈ కథంతా సురమౌళి పూర్తి మాండలకంలోనే రాశారు. తెలంగాణా పోరాటానికి సంబంధించినంత వరకూ పూర్తి మాండలికంలో వచ్చిన కథ యిదొక్కటేనేమో! అని చెప్పవచ్చు. అయితే దీన్ని ప్రచురించిన పత్రిక (నినాదం) ఈ భాషని మాండలికమనలేదు. జానపద కథగా పేర్కొన్నారు. రైతాంగ పోరాటంలో సంఘటనని జానపద కథగా మలచిన తీరు చాలా బావుంది. కథలో భాష మాండలికం కావడంద్వారా వస్తువులో 'నేటివిటీ'ని సంపాదించవచ్చని సురమౌళి భావించారు. అందరికన్న భిన్నంగా కొత్తదనం కోసం సురమౌళి కథనంతటినీ మాండలికంలో నడిపారు తప్పితే మాండలికంలో కథ రాయడానికి ప్రత్యేకించి సురమౌళికి కారణాలేం లేవు. వ్యావసాయిక కుటుంబంనుంచి వచ్చి, సోషలిస్టు సిద్ధాంతంతో ప్రభావితుడైన సురమౌళికి తెలంగాణా మాండలికంమీద మంచి పట్టుందని ఆయన రాసిన మాండలిక కథలద్వారా కూడా తెలుస్తుంది. 70వ దశకంలో 'జీవనాడి' పత్రికకూ, 'బదిలా' కథా సంకలనంకూ రాసిన రచయితలు ఒక ప్రత్యేకమైన లక్ష్యంతో కథారచనకు తెలంగాణా మాండలికాన్ని ఎన్నుకున్నారు. (వట్టికోట ఆళ్వారుస్వామి 'జైలులోపల' కథాసంకలనం 50ల్లోనే వెలువడిందిగానీ ఆ కథల్లో మాండలికత వస్తువు రీత్యా, భాషా రీత్యా కూడా తక్కువే.)

1951లో తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట విరమణ తర్వాత 70వ దశకంలో శ్రీకాకుళం గిరిజన రైతాంగోద్యమ ప్రభావంతో ఉత్తర తెలంగాణాలో కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో పీడిత రైతాంగం భూస్వామ్య వ్యవస్థమీద నెమ్మదిగా తిరుగుబాటు మొదలుపెట్టింది.

ఆ ఉద్యమంతో సంబంధమున్న రచయితలు గ్రామాల్లో వస్తున్న మార్పుల్ని కథలుగా మలిచే క్రమంలో మాండలికం ఉపయోగించారు. అంతకుముందు కొందరు రచయితలు తెలంగాణా మాండలికంలో అడపా దడపా కథలు రాశారు. వారిలో - జి.సురమౌళి, ఇరివెంటి కృష్ణమూర్తి, పి.యశోదారెడ్డి ప్రముఖంగా పేర్కొనదగ్గవారు. వట్టికోట ఆళ్వారుస్వామి సంకలనం చేసిన 'పరిసరాలు' (1956)లో తెలంగాణా మాండలికంలో సురమౌళి 'అంగుడుపొద్దు' (మొదటి భాగం) ఇరివెంటి కృష్ణమూర్తి 'రంగులంగయ్య' (రెండవ భాగం) కథలు చోటుచేసుకున్నాయి.

ఈ రెండు కథలు పూర్తిగా మాండలికంలో వున్నాయన్న విశేషం తప్పితే కథావస్తువులో గానీ శైలిలోగానీ ఏ ప్రత్యేకతా లేదు.

పేదరికం రూపుమాపాలి, పేదల నాదరించాలి అని నాయకులు, చదువుకున్నవాళ్ళ సభల్లో కరతాళధ్వనుల కోసం చెప్పడం తప్పితే వీసమెత్తు కూడా దాన్ని ఆచరణలో పెట్టరని ఒక పేద రైతు స్వానుభవంతో తెలుసుకున్న రీతి 'అంగుడుపొద్దు'లో వస్తువు. 'రంగులంగయ్య' కంటే యిది మెరుగైన కథ.

సురమౌళి రాసిన కథల్లో ఎక్కువ భాగం మాండలిక కథలు.[17] సురమౌళి కథల్లో దోపిడీకి మోసానికీ గురయ్యే బడుగు జీవులు, అమాయకులు ఎక్కువ కనిపిస్తారు. 'ఇప్పసారా' (పాలికేక) 'మోసపోయిన మల్లమ్మ' (జనధర్మ?), 'మంకు' (ఆంధ్ర సచిత్ర వారపత్రిక?), కథలు అందుకు తార్కాణం. 'కమ్మతెమ్మెరలు' కథా సంకలనంలోని మాండలిక కథల్లో తెలంగాణా మధ్యతరగతి ప్రజల మాండలికం ఎక్కువ కనిపిస్తుంది. సురమౌళి కథలు గ్రామీణ నేపథ్యంలో కింది తరగతి ప్రజల జీవితానికి దగ్గరగా తెలంగాణా లోతట్టు 'ఊరోల్ల' భాషలోవుండి తెలంగాణా మాండలిక కథ - పరిణామంలో రెండో దశని సూచిస్తాయి.

మాగోఖలే గుంటూరు మాండలికంలా సురమౌళి తెలంగాణా మాండలికం కూడా రైతులది. తెలంగాణా పల్లెటూరి భాషలో మొత్తం కథంతా నడిపిన సురమౌళి తర్వాతి మాండలిక కథా రచయితలకి మార్గదర్శకుడయ్యాడు. సురమౌళి మాండలిక కథలు రాస్తున్న రోజులలోనే ఇరివెంటి కృష్ణమూర్తి మహబూబ్‌నగర్, కరీంనగర్ జిల్లాల మాండలికంలో 'పట్నపోల్లు', 'పంచాయతి నెంబరు' అని మరో రెండు కథలు రాశారు.[18]

హైదరాబాదు ఆంధ్ర రాష్ట్రాలు కలిసి విశాలాంధ్రగా ఏర్పడ్డాకా తెలంగాణా ప్రజల సాంస్కృతిక జీవితాన్ని వాళ్ళ భాషలోనే తక్కిన ప్రాంతాల వారికి తెలియజెప్పడానికి సురమౌళి, ఇరివెంటి కథలు మాండలికంలో వెలువడ్డాయని భావించవచ్చు.

మంచిబతుకు దొరుకుతుందని పొట్ట చేత పట్టుకుని పల్లెనుంచి పట్నం పోయి పండుగనాడు పల్లెకు తిరిగొచ్చి పట్టణ జీవితంలోని కృత్రిమత్వాన్ని, డొల్లతనాన్ని పల్లెలోని నిసర్గ జీవితంతో పోల్చి చూసుకుని మళ్ళీ పల్లెలోనే స్థిరపడే రిక్షా కార్మికుడి ఆలోచనా స్రవంతి 'పట్నపోల్లు'

కథా వస్తువు. పల్లె - పట్టణ జీవితాల్లోని సాంస్కృతిక వైరుధ్యాల్ని మాత్రమే ఈ కథ చిత్రించింది. ఆర్థిక సామాజిక రంగాల్లో పల్లెల్లో తక్కువ కులాల వారిమీద జరిగే దోపిడీని యీ కథ పట్టించుకోలేదు - కానీ 'పంచాయతీ నెంబరు' ఆ లోటు పూర్తిచేస్తుంది.

హరిజనులకి ప్రజాస్వామ్యంలో అధికారపీఠం ఇవ్వాలని 'కానూన'యితే వచ్చిందిగానీ ఆచరణలో అది ఎంత అపహాస్యం పాలవుతుందో కళాత్మకంగా చెప్పి కథ 'పంచాయతీ నెంబరు'. 'రంగులంగయ్య' (1956), 'పట్నపోల్లు' (1957), 'పంచాయతి నెంబరు' (1960) కథలు వరుసగా ఇరివెంటి కథా రచనలో సాధించిన పరిణతిని సూచిస్తాయి.

రిజర్వేషన్ల చట్టం ప్రకారం పంచాయతీ నెంబరయినప్పటికీ తన సామాజిక స్థాయి ఏమాత్రం పెరగక సొంత మనుషులకు సైతం దూరమయి పేరుకు పంచాయతీ నిర్వహణలో పాలుపంచుకుంటూ నలుగురిలో చిన్నచూపుకి గురయ్యే అమాయక హరిజనుడి కథలో మన సామాజిక ద్వంద్వ నీతుల్ని, ప్రజాస్వామ్య ప్రహసనాన్ని ఇరివెంటి కళ్లకు కట్టించారు. అంతేకాదు - ఉన్నత కులాల వారి రెండు నాలుకల ధోరణిని కూడా ఎండగట్టారు.

సంగం నాయకత్వంలో సాయుధ రైతాంగోద్యమాన్ని నీరుగార్చటానికి ఆనాటి కేంద్ర ప్రభుత్వం వినోబాబావేని రంగంలోకి దించిందని వుద్యమ కార్యకర్తలు భావించారు.

'బూములిస్తమంటని వినోబ ముంగల అన్నళ్ళ శానామంది బూమియ్యలే.

కొందరేమో జగడాలున్న బూములిచ్చిౣ్రను. కొందరేమో రాల్లు తుప్పలు వున్న బూములిచ్చిౣ్రను. ముసలి ముతక ఆవును దానం జేసినట్లు'[19]

వినోబా భూదానోద్యమం అసలు గుట్టు 'పంచాయతీ నెంబరు'కు బాగా అవగతమయ్యింది.

ఊరికి సర్పంచయి వున్న వ్యూళ్ళో చివరికి పనికూడా పుట్టక పట్టణానికి పారిపోయి (పారకల బయలునుంచి చిత్తూరుకి) 'అజ్ఞాతవాసం' చేసిన హరిజనుడి కష్టాలని మధురాంతకం రాజారాం కూడా కథగా మలిచారు.[20] ఇరివెంటి 'పంచాయతి నెంబరు' తెలంగాణా మాండలికంలో, రాజారాం 'అజ్ఞాతవాసం' రాయలసీమ మాండలికంలో వున్నాయన్న తేడాయేగానీ రెండు ప్రాంతాల్లోనూ వెనకబడిన కులాలవారి సామాజిక దుస్థితి ఏ కాలంలోనైనా ఒకటేనన్న సత్యాన్ని అవి చాటి చెపుతున్నాయి.

ఇరివెంటి మూడు మాండలిక కథల్నీ పాత్రలపరంగా ఉత్తమ పురుషలో రచించారు. 1939లోనే వెలువడ్డ 'గరీబోణ్ణి' కథ యీ విధమైన శైలికి మొదటి ఉదాహరణ. కథ చెప్పిన పాత్రలు తెలంగాణా గ్రామీణ ప్రాంతాల్లోని కింది తరగతి ప్రజలకు చెందనవి. అందువల్ల ఆ కథల్లో తెలంగాణా గ్రామీణ మాండలికం చోటుచేసుకుంది. రచయిత మధ్యతరతి నుండి

వచ్చినప్పటికీ కొంతమేరకు 'డీక్లాస్' అయి రచించిన కథలివి. పరిసరాలు మొదటి భాగంలో 'కొత్తనాగలి' (పి.వెంకటరావమూరావు), 'నౌకరి' (పైడిమర్రి వెంకటసుబ్బారావు), 'సర్కారుకిస్తు' (మంద రామారెడ్డి) కథల్లో తెలంగాణా మాండలికాన్ని విస్తృతంగా పాత్రోచిత భాషగా వాడిన రచయితలు ఆ ప్రాంతపు నుడికారాన్ని, భాషా సౌందర్యాన్ని యితర ప్రాంతాలకు తెలియజేశారు. 1957 ప్రాంతాల్లోనే గూడూరి సీతారాం కూడా కథనంతా పూర్తి మాండలికంలో రచించడం మొదలుపెట్టారు. తెలంగాణాలో మారుమూల పల్లె నుంచి బొంబాయిపోయి అష్టకష్టాలు పడి 'పోలీసుల చేతిలో తన్నులుతిని' 'జరంపడి 'తిరిగొచ్చిన యెర్రిబాగులోడు' రంగడి కథ -'మాండలిక కథా రచయితగా సీతారాం ప్రతిభను తెలియజేస్తుంది.[20a] అప్పటికే వట్టికోట ఆళ్వారుస్వామి 'ప్రజల మనిషి' లాంటి నవలలద్వారా, రైతాంగ పోరాట కథల ద్వారా, 'మాభూమి' వంటి నాటకాలద్వారా తెలంగాణా మాట, యాస తక్కిన ప్రాంతాల వారికి కొంత పరిచయమై వుంది. కానీ సాహిత్య భాషగా తెలంగాణా మాండలికానికి ప్రత్యేకమైన గుర్తింపు రాలేదు.

సురవరం, ఇరివెంటిల తర్వాత యశోదారెడ్డి తెలంగాణా మాండలికంలో 'అపురూపములై, సాహిత్యవేత్తల కామెతలు వెట్టునట్టి పద ప్రయోగములు' 'కాలగర్భంలో కలిసిపోకుండునట్లుగ' 'గ్రామీణ జనవ్యవహారంలో' మాత్రం మిగిలివున్న వాటిని కాపాడాలనే 'తాపత్రయం'తో కథా రచనకుపక్రమించారు.[21] తెలంగాణా గ్రామీణ సంస్కృతికి అద్దంపడ్తూ యశోదారెడ్డి తెలంగాణా మాండలికంలో వున్న అసంఖ్యాకమైన సామెతల్ని, నుడికారాన్ని, పదబంధాల్ని, జాతీయాల్ని అర్థ వివరణలతో సహా చక్కని కథల్లో చొప్పించి 'మా ఊరి ముచ్చట్లు' ప్రచురించారు. యశోదారెడ్డి కథల ద్వారా తెలంగాణా మాండలికానికి సాహిత్యలోకంలో విస్తృత ప్రచారం లభించింది. భాషాశాస్త్రవేత్తలు, పండితులు యీ కథల్ని బాగా ఆదరించారు. తెలంగాణా మాండలిక సౌందర్యం తక్కిన ప్రాంతాల వారికి ఆశ్చర్యం గొలిపింది. మరుగున పడ్డ అనేక ప్రాచీన పద ప్రయోగాలు నలుగురికీ తెలిశాయి. ఆర్థిక రాజకీయ రంగాల్లోనే గాక భాషా సాంస్కృతిక రంగాల్లో కూడా చిన్నచూపుకు గురై తెలంగాణా ప్రజలు ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతూ ఉద్యమించిన తర్వాత యీ కథలు వెలువడ్డాయి.

రాజకీయార్థిక రంగాల్లో అసమానాభివృద్ధి ప్రాంతీయ విభేదాలకు కారణమయింది. భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాకా కోస్తా ఆంధ్ర ప్రాంతంనుండి తెలంగాణాకు వలసలు ఎక్కువయ్యాయి. విద్యా ఉపాధి అవకాశాలు స్థానికులకు దక్కని పరిస్థితి ఏర్పడింది. అన్ని రంగాల్లోనూ ఆంధ్రుల ఆధిపత్యం అడుగడుగునా యువకుల్ని అసహనానికీ, అసంతృప్తికీ, నిరాశా నిస్పృహలకీ గురిచేసింది. ప్రత్యేక తెలంగాణా ఉద్యమం రాజకీయ నాయకుల స్వార్థంలోంచి పుట్టిందని అప్పట్లో కొందరు భావించినా - ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక

రంగాల్లో అణచివేతనుంచే జాతుల సమస్యలో భాగంగా ఇటువంటి ఉద్యమాలు చెలరేగుతాయని మరువకూడదు.

ఈ సమస్య లోతులోకి వెళ్లకపోయినా యశోదారెడ్డి 'మాపంతులు' కథ ఉపరితలంలో కనిపించే పీడనకు అద్దం పట్టింది. పల్లెబడిని 'అప్‌గ్రేడ్' చేయడంతో ఉద్యోగం కోల్పోయిన బడిపంతులు 'పైనిండ కండ్లు వెట్టుకోండి లేకుంటే మీ చేతుల రొట్టె గద్దలు దన్నుకపోతవి'[22] అని చెప్పిన మాటల్లో అంతరార్థం 'ఏరవతలోడి' అణచివేత పట్ల జాగరూకులై ఉండమనే. యశోదారెడ్డి 'మా ఊరి ముచ్చట్లు' సంకలనంలో కనిపించే తెలంగాణా గ్రామీణ సంస్కృతి, భాష మధ్యతరగతి, ఉన్నత మధ్య తరగతులకు చెందిన రైతు కుటుంబాలది. యశోదారెడ్డి తమ పెరిగిన వాతావరణాన్ని కళ్లకు కట్టినట్లు చిత్రించడంలో సఫలమయ్యారు. కానీ తెలంగాణా పల్లెల్లోని అట్టడుగు వర్గాల భాషా సంస్కృతులకు, జీవిత సంఘర్షణలకు సాహిత్య రూపమివ్వడం- జీవనాడి, విద్యుల్లత, కేకలు పత్రికల్లో ప్రముఖంగా జరిగింది.

జీవనాడిలో పాత్రోచిత భాషగా తెలంగాణా మాండలికం వాడుతూ వచ్చిన కథలతో పాటు పూర్తి మాండలికంలో కూడా కథలు వచ్చాయి. గ్రామాల్లో పట్టణాల్లో అట్టడుగు వర్గాల జీవితం గురించి వచ్చిన కథల్లో, వారి భాషసంస్కృతి అనివార్య వాస్తవికతా చిత్రణ రూపంలో చోటుచేసుకున్నాయి. గ్రామాల్లో దొరతనం మీద జరిగే తిరుగుబాటు ఇంకా సామూహిక రూపం తీసుకోని దశలో వైయుక్తికంగా ప్రతీకారం తీర్చుకునే కథలు మొదట్లో వచ్చాయి. ఆత్మాశ్రయరీతిలో పూర్తి మాండలికంలో వచ్చిన 'నక్కలు' (వెంకట్రావు) కథ[23] అందుకు ఉదాహరణ.

పోలీసు యంత్రాంగం దొరల సంక్షేమానికే కాపలా వుంటుందని చెప్పి ఈ కథ తెలంగాణాలో జరగబోయే రాజ్యహింసకు సూచననిచ్చింది.

జీవనాడి రెండో సంవత్సరంలోకి అడుగుపెట్టాకా తెలంగాణా మాండలికంలో కథలు రావడం ఎక్కువయింది. ఇతర ప్రాంతాలకు తెలియని పదాలకు పాదసూచికలో వివరణలు యిస్తూ సంభాషణలో మాండలికం నుంచి కథనంలో కూడా మాండలికం వాడే పరిణామం 1974 సంచికల్లో కనిపిస్తుంది.[24]

పత్రికల్లో తెలంగాణా మాండలిక కథలు ఎక్కువయిన దరిమిలా భాష గురించి కొంత చర్చ జరిగింది. రచయిత్రి రంగనాయకమ్మ జీవనాడి భాష గురించి అభిప్రాయం చెప్తూ ఇలా అన్నారు.

'..... కథల్లో భాష దాదాపు అంతటా తెలంగాణా మాండలికం వల్ల యితర ప్రాంతాల పాఠకులు చదవడానికి చాలా యిబ్బందయ్యే ప్రమాదం ఉంది. ఈ ప్రాంతీయ పదాల్నీ, చెప్పే విధాన్నీ మార్చడం కొంతయినా అవసరమనిపించింది'[25]

కోస్తా పాఠకుల నుంచి కూడా యిటువంటి స్పందనే వచ్చింది.[26] కథలు నాటకాల విషయంలో మార్పుని కోరిన రంగనాయకమ్మ, కవితలు, పాటలు పూర్తిగా ప్రాంతీయంగానే వుండాలనీ, పాడుకొన్నప్పుడు సజీవంగా వుంటాయనీ పేర్కోవడం గమనించాలి. జీవనాడి నడిపిన నవోదయ సాహితీ సాంస్కృతిక సంస్థ రెండో మహాసభలలో పై అభిప్రాయాన్ని చర్చించింది. పట్టణాల్లో అందరికీ అర్థమయ్యే సామాన్య భాష వుంటుందనీ ఆ జీవిత చిత్రణకు మాండలికం వాడనక్కరలేదనీ పల్లెల్లో మాట్లాడుకునే ప్రజల భాషను ప్రదర్శనా రూపాల్లో వాడితే అవి సజీవంగా ప్రజలకు బాగా అర్థమవుతాయని 'ప్రజలు - సాంస్కృతికోద్యమం' అన్న ప్రసంగ వ్యాసంలో ప్రసాద్ చెప్పారు.[27]

కథల విషయంలో కూడా - తాము వాడుతున్న భాష కొంత ఇబ్బంది కలగజేసిన మాట వాస్తవమేనని ఒప్పుకుంటూ ప్రజల భాషను సాధ్యమైనంత ఎక్కువగా ప్రచారంలోకి తేవాలనే వుద్దేశంతో మాండలిక కథల్ని కావాలనే వేస్తున్నట్టు సంస్థ పేర్కొంది. రచనల్లోకి మాండలిక భాషను (తెలంగాణా మాత్రమే కాదు - వేరువేరు ప్రాంతాల మాండలికాలు) తీసుకురావడం వల్ల వాటికి జీవలక్షణం వాస్తవికత పెరిగి శక్తివంతంగ్గా రూపొందుతాయనీ, తెలుగు ప్రజలందరికీ సామాన్యంగా వుండే ప్రజాభాష రూపుదిద్దుకోవాలంటే వివిధ ప్రాంతాల మాండలిక భాషలు విస్తృతంగా ప్రచారంలోకి తేవడం అవసరమనీ, దానివల్ల ఒక ప్రాంత ప్రజల భాషలోని అందాలు, సజీవ లక్షణాలు మరొక ప్రాంత ప్రజలకు తెలుస్తాయనీ ఆ క్రమంలో సామాన్య ప్రజా భాష ఏర్పడటానికి వీలుంటుందనీ - సంస్థ ఒక దీర్ఘకాలిక ఆశయాన్ని వెలిబుచ్చింది. మాండలికం పూర్తిగా అర్థమయ్యే వరకూ వేరే ప్రాంతాలవారు యిబ్బంది పడకుండా జాగ్రత్త వహించాల్సిన అవసరాన్ని కూడా తెలియజెప్పింది. తెలంగాణా మాండలికంలోనే కథలు ప్రచురించడానికి కారణం - అక్కడినుంచి మెరుగైన కథలు వెలికిరావడమే తప్ప మరేదీ కాదని పేర్కొంది.[28]

ఆ కాలంలో తెలంగాణానుంచే మెరుగైన రచనలు రావడానికి కారణం - శ్రీకాకుళం గిరిజన రైతాంగోద్యమంతో స్ఫూర్తి పొందిన ఉత్తర తెలంగాణా రైతాంగం గ్రామాల్లో భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా పెనుగులాడటం మొదలైంది. ఆ పురిటినొప్పుల చప్పుడును యీ కథలు ముందుగానే వినగల్గాయి. అంతకుముందు విద్యుల్లత (అక్టోబరు, నవంబరు 1970) లో తాడిగిరి పోతరాజు కథ 'ఎర్రబుట్ట' ని ప్రచురించడంతో పత్రిక నిషేధానికి గురైంది. ప్రభుత్వం విద్యుల్లత పత్రికని నిషేధించిందిగానీ 'ఎర్రబుట్ట' తెలంగాణాలో యువ రచయితలందరికీ గొప్ప స్ఫూర్తినిచ్చింది.

జీవనాడిలో వచ్చిన తెలంగాణా మాండలిక కథల ప్రభావంతో ఆ తర్వాత దేవరాజు మహారాజు రాసిన మాండలిక కథలు 'కేకలు' (1975) వారపత్రికలో వచ్చాయి. అయితే **మహారాజు** రాసిన మాండలిక కథలు స్థానిక సాహిత్యపత్రికలకే పరిమితం కాకుండా జయశ్రీ,

ఆంధ్రజ్యోతి లాంటి వ్యాపార, పాపులర్ పత్రికలకు కూడా వ్యాపించాయి.[29] - తెలంగాణా మాండలికాన్ని తక్కిన ప్రాంతాలకు రుచి చూపించాయి. మహారాజు అంతకుముందే మాండలికంలో కవిత్వం రాసి నలుగురితో ఔననిపించుకున్నాడు - దాన్నే కథల్లో కొనసాగించాడు. మహారాజు కథలకు ఎన్నుకున్న వస్తువు సమాజంలోని అట్టడుగు ప్రజల జీవితమే. వారి జీవితాన్ని కథగా మలవడానికి రచయిత మాండలికం సరైన సాధనం అని భావించాడు.

నిజానికి తెలంగాణా ప్రజల కడుపు సొదని కొత్తగొంతుకల్తో వినిపించింది- 'బద్‌లా' కథల పుస్తకం. తెలంగాణా పల్లెల్లో పుట్టిన నిప్పుని సైతం ముందుగా గ్రహించింది 'బద్‌లా' రచయితలే. ప్రజా సాహిత్యాన్ని రచించడానికి ప్రజలనుండే రచయితలు పుట్టుకొస్తారని ఉద్యమ సాహితి, కరీంనగర్ వేసిన 'బద్‌లా' సంకలనం నిరూపించింది. ఈ కథల రచయితలంతా (ఒక్క తాడిగిరి పోతరాజు తప్ప) కొత్తవాళ్ళే.

కరీంనగర్ జిల్లాలో గ్రామాల్లో రైతాంగంలో రగులుతున్న అసంతృప్తినీ, వాటికి కారణమైన పరిస్థితుల్నీ ప్రత్యక్షంగా తెలుసుకొని అనుభవించిన యీ రచయితలు ఉత్తర తెలంగాణా రైతాంగ పోరాట సాహిత్యానికి ఆద్యులు.

'బద్‌లా' కథా సంకలనం వెలువడ్డ నేపథ్యంలోంచే ఉత్తర తెలంగాణా రైతాంగ పోరాట కథల్ని అంచనా వేయాలి.

## విప్లవోద్యమం - రైతాంగ పోరాట కథ

నైజాం ప్రభుత్వం పతనానంతరం ప్రజల విజయోత్సాహం నిలవలేదు. పోలీసు చర్య పేరున తెలంగాణాలో ప్రవేశించిన యూనియన్ సైన్యాలు కొత్త పాలక వర్గంలో భాగస్వాములైన భూస్వాములకు అండగా నిలిచాయి. అంతకుముందు ప్రజల సంఘటిత శక్తికి భయపడి గ్రామాలు వదిలి పారిపోయిన భూస్వాములు మళ్లీ తమ అధికారాల్ని స్థిరపరచుకున్నారు. భూస్వాముల క్రూరమైన దోపిడీ యథాపూర్వంగా తిరిగి పడగ విప్పింది.[30] 1951లో ఆనాటి భారత కమ్యూనిస్టు పార్టీ పోరాట విరమణకు తీసుకున్న నిర్ణయం తెలంగాణా ప్రజల జీవితాల్ని మెరుగుపరచలేకపోయింది.

భూసంస్కరణలు, కౌల్దారీ చట్టాలు ఎన్ని వచ్చినా భూకేంద్రీకరణ నిరాటంకంగా కొనసాగింది. చట్టాలు ఆచరణలో విఫలమయ్యాయి. శ్రమ దోపిడీ భూస్వాముల పీడన తెలంగాణా రైతాంగాన్ని మరింత దుర్భర పరిస్థితులకు నెట్టివేశాయి.

అయితే దేశవ్యాప్తంగా భూమికోసం రైతాంగం చేసే పోరాటాలు తెలంగాణాకు మరోసారి స్ఫూర్తినిచ్చాయి. ఆంధ్రదేశంలో శ్రీకాకుళం కొండల్లో చెలరేగిన గిరిజన రైతాంగ ఉద్యమం 'ఆదిలాబాదు అడవుల్లో, కరీంనగర్ మైదానాల్లో, కరీంనగర్ పల్లెల్లో, ఆదిలాబాద్ గుట్టల్లో, గోదావరి అలల్లో ఒళ్ళు విరుచుకుని కళ్ళు తెరిచింది.[31] చరిత్ర నేర్పిన గుణపాఠాల్లోంచి ఉద్యమ స్వరూప స్వభావాల్లో మార్పు వచ్చింది. పీడిత రైతాంగాన్ని కూడగట్టడానికి అనాటి ఆంధ్రమహాసభ కమ్యూనిస్టు పార్టీలాగా - విప్లవవాద కమ్యూనిస్టు పార్టీలు రైతుకూలీ సంఘాల్ని ఏర్పాటుచేశాయి. సంఘం నాయకత్వంలో ఉత్తర తెలంగాణాలో రైతుకూలీలు భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా మరోసారి తిరగబడ్డారు.

దొరల సాంఘిక పెత్తనాన్ని ప్రశ్నించడంతో మొదలైన తిరుగుబాటు వెట్టి పనులు బంద్ చేయడం, ప్రజా పంచాయితీలు నిర్వహించి దొరలు అంతకుముందు తీసుకున్న దండుగలు, జరిమానాలు తిరిగి యిప్పించడం, రైతుకూలీ సంఘాన్ని ధిక్కరించిన దొరలను సాంఘికంగా బహిష్కరించడం వంటి సాంఘిక దోపిడీని వ్యతిరేకించడంతో ఆగకుండా కూలీరేట్లు, పాలేర్ల జీతాల పెరుగుదల వంటి ఆర్థిక సమస్యలతో బాటు రైతాంగానికి, రైతుకూలీ సంఘానికి ప్రధాన సమస్య అయిన భూసమస్య మీద దృష్టి సారించింది. రైతుకూలీ సంఘాలు బంజరు భూముల్ని ఆక్రమించడంతోపాటు భూస్వాముల మిగులు భూములు స్వాధీనం చేసుకునే భూసంస్కరణలని స్వయంగా చేపట్టాయి.[31a]

ఆ క్రమంలో ఎదురైన భూస్వాముల అణచివేతను, ప్రభుత్వ నిర్బంధాలను పోలీసుల అక్రమ కేసులను దౌర్జన్యాలని ప్రతిఘటించి పీడిత వర్గం నిలదొక్కుకుని, పార్టీనీ, పార్టీ నాయకత్వాన్ని కాపాడుకుంటూ వీరోచితంగా పోరాడుతుంది.

రైతాంగంలో రగిలిన ఈ చిచ్చు గని కార్మికులకు, గిరిజన గూడేలకు వ్యాపించింది. కార్మిక - కర్షక- గిరిజన వర్గాలు సమైక్యంగా విముక్తి కోసం ఏకోన్ముఖంగా చేస్తున్న యీ పోరాటానికి 20 సంవత్సరాలకు పైగా రాజకీయ చరిత్ర వుంది. ఈ ఇరవై ఐదు సంవత్సరాల్లోనూ అటు కేంద్రంలో, ఇటు రాష్ట్రంలో పాలక వర్గంలో పార్టీలు మారాయి - వ్యక్తులు మారారు - కానీ అణచివేతలో మార్పులేదు. ప్రజా జీవితం మరింత నరకప్రాయమైంది. ప్రభుత్వాల వ్యక్తుల మార్పిడులు - నిర్బంధాలు, సడలింపులు, నిషేధాల మధ్య తెలంగాణా రైతాంగం - కార్మికులు - గిరిజనులు తమ హక్కుల కోసం - భూమికోసం- విముక్తి కోసం పోరాటాలు నిర్వహిస్తూనే వున్నారు.

ఉద్యమంలో చోటుచేసుకున్న ఆటుపోట్లు అటుంచితే ఉద్యమంలో ప్రజల చారిత్రక పాత్రని కళారూపాలుగా ప్రతిఫలించడంలో, ఉద్యమ చైతన్యాన్ని అభివృద్ధి పరచడంలో విప్లవోద్యమ సాహిత్యం-పాట, కథ, నవల, కవిత, నాటకం తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించాయి.

అయితే యీ సాహిత్యం తెలుగులో యింతకుముందు వచ్చిన సాహిత్యంకంటే విలక్షణమైంది. మిగతా సాహిత్య ప్రక్రియలకన్నా ఎక్కువ వైలక్షణ్యం కథల్లో కనిపిస్తుంది. పాటలాగా కథకూడా మౌఖికంగా మారే క్రమంలో ప్రయాణించింది. ప్రజల భాష ప్రజా సాహిత్యానికి పునాదన్న గ్రహింపు కథారచయితల కేర్పడింది.[32] సాహిత్యంపైనుంచి కిందికి కాకుండా కిందినుంచి పైకి అన్న పరిణామాన్ని తెలంగాణా మాండలిక కథ సాధించింది. మధ్యతరగతి మేధావుల వరకే పరిమితమైన సాహిత్య సృజన - సమాజంలో ఆర్థికంగానూ, సాంఘికంగానూ, రాజకీయంగానూ అణచివేతకు గురయిన ప్రజానీకం చేతుల్లోకి మారింది. విద్యావకాశాలు గ్రామాల్లోని కిందికులాల వాళ్లకూ, పేదలకూ అందుబాటులోకి వచ్చి 'చదువు' ఎంతో కొంత లభించింది. గానీ అది సామాజిక అసమానతలని తొలగించడంలో తోడ్పడలేదని తెలుసుకోవడానికి విద్యార్థులకు ఎంతోకాలం పట్టలేదు. పాలకవర్గాల ద్వంద్వనీతుల బండారాన్ని కూడా వీళ్ళు గ్రహించగలిగారు. తమ చుట్టూ వున్న సమాజంలో బతుకుతో అనుక్షణం పెనుగులాడే పీడిత ప్రజల వేదనని అర్థం చేసుకోగలిగారు. ఈ సంక్షుభిత లోకంలో తామెక్కడున్నామో - ఎటువుండాలో సరిగానే తెలుసుకోగలిగారు.

'రచయితాలారా మీరెటువైపు?' అని విశాఖ విద్యార్థులు వేసిన ప్రశ్న వీరి గుండెల్ని తాకింది. అలాంటి విద్యార్థులు కరీంనగర్‌లో ఉద్యమ సాహితితో వరంగల్ 'సాహితీ మిత్రుల' తోపాటు ఎదిగారు.[33]

ఈ యువకులు గ్రామాల్లో భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలతో మమేకమయ్యారు. రైతుకూలీ సంఘాలకు చేదోడువాదోడుగా నిలిచారు. 'ప్రజాయుద్ధ పంథా'లో భాగస్వాములయ్యారు. ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న వీళ్లనుంచీ, ఉద్యమాలకు సాక్షీభూతులుగా వున్నవాళ్లనుంచి రచయితలు పుట్టుకొచ్చారు. చివరకు సాహిత్యం పోరాటం కలగలసిపోయాయి. సాహిత్య రచన ఒక సామాజిక ఆచరణగా పరిణమించింది. ఉద్యమావసరాల కనుగుణంగా రచయితలు కథారచనని చేపట్టారు. ప్రజల కోసం ప్రజలనుండి ప్రజల్లోకి అన్న ప్రజాసాహిత్య లక్షణాలన్నీ యీనాడు వెలువడుతున్న కథలు పుణికి పుచ్చుకున్నాయి. కథారచన వైయక్తిక సృజన కాకుండా సమిష్టి ఆచరణగా రూపొందింది. నోటికథ మధ్యతరగతి పాఠక వర్గానికే పరిమితం కాకుండా చదువుకోలేని శ్రోతృ వర్గానికి చేరువయింది. లిఖిత కథ మౌఖిక రూపాన్ని ధరించాల్సిన అవసరాన్ని ఉద్యమమే కల్పించింది. ఈ మార్పుని అల్లం రాజయ్య యిలా పేర్కొన్నాడు.

'పోరాటపు ఊపును, మలుపులను రచయితలు వీలైనంత మేరకు చిత్రించడానికి ప్రయత్నం చేశారు. కథలు పోరాటాలు కలగలసిపోయాయి. రచయిత ఒక్కడే గదిలో కూర్చుండి తనకు తోచింది రాయకుండా - కథ సమిష్టి ఆచరణనుండి ఆలోచననుండి రూపొందడం

ప్రారంభమైంది. ఘటనలు ఒకరు వేరొకరికి చెప్పడంద్వారా కథ రాస్తున్న పద్ధతినుంచి చెప్పే పద్ధతి (మౌఖికం)కి మారాల్సి వచ్చింది.'[34]

తమ జీవితంనుంచి, శ్రమనుంచి పుట్టిన జీవభాషలోనే కథలు రాయొచ్చనే భరోసానీ, సైద్ధాంతిక బలాన్నీ 'విప్లవ రచయితల సంఘం' వీరికి కల్పించింది. తమ దైనందిన భాష సాహిత్య భాషకు తీసిపోదనీ - ప్రజా జీవితాన్ని వర్ణించడానికదే సరైన భాషనీ, అందులో రచనలు చేసే హక్కు తమకున్నదనీ రచయితలు భావించారు. ఇన్నాళ్ళూ సాహిత్య వ్యవస్థలో చిన్నచూపుకూ, నిరాదరణకూ గురయిన తెలంగాణా అట్టడుగు ప్రజల మాండలికం సాహిత్య భాషగా రూపొందడమే గాక అత్యున్నత ప్రమాణాలున్న సాహిత్యాన్ని మాండలికంలో రాయొచ్చనే భావనని సైతం ఈ కథలు కలగజేశాయనడంలో సందేహం లేదు.

సాహిత్య రచనకు తెలంగాణా మాండలికం వాడటం తమ న్యాయసమ్మతమైన మౌలిక హక్కు అనీ అది సాంస్కృతిక పోరాటంలో జాతుల పోరాటంలో ఒక అంశమని రచయితలు భావించారు.[35] ఉద్యమంలో ఒక భాగంగా పుట్టిన తెలంగాణా మాండలిక కథ ఉద్యమంతోపాటు ఎదిగిన పరిణామక్రమాన్ని పరిశీలించాల్సి వుంది.

ఉద్యమాన్ని నేపథ్యంగా చేసుకొని వచ్చిన మాండలిక కథల్ని స్థూలంగా మూడు విధాలుగా విభజించవచ్చు. 1. పోరాటాన్ని చిత్రించినవి. 2. నిర్బంధాన్ని చిత్రించినవి. 3. ప్రతిఘటనని చిత్రించినవి. ఈ మూడు విభాగాల్లోని వివిధ దశల్నీ కోణాల్నీ సంఘటనలనీ మానవ సంబంధాలనీ, ప్రజల సంఘటిత శక్తినీ, ఉత్పత్తి సంబంధాలతో ముడివడి వున్న ప్రజాజీవితాన్ని - సంఘర్షణనీ, ఉద్యమ విజయాల్ని అనేక కథలు చిత్రించాయి.

1972-73 ముందునుంచే ఉద్యమం, ఉద్యమకథ మొదలైనప్పటికీ ఎమర్జెన్సీ ఎత్తివేశాక 1977 జూలై ఆగస్టులనుండి రైతుకూలీ సంఘాల బహిరంగ కార్యక్రమాలు ఉధృతమయ్యాకా పోరాట కథలు విస్తృతంగా రావడం జరిగింది.

అంతకుముందు రైతాంగ పోరాటానికి సంబంధించిన ప్రాథమిక దశని వర్ణించిన కథలు 'బద్లా' సంకలనంలో వచ్చాయి. అవన్నీ కరీంనగర్ రచయితలు కరీంనగర్ భాషనే ప్రధానం చేసుకుని రాసినవి. దొరకు వెట్టిచాకిరీ చేస్తూ, దొర చేతిలో తన్నులూ గుద్దులూ తింటూ తను - తల్లి - తండ్రి, భార్య, చెల్లెలు, కొడుకు, కూతురూ - ఇలా కుటుంబం సమస్తం బతుకులు కాల్చుకున్నా కడుపులు నిండని 'లింగడు' మంచి బతుకు కోసం ఆలోచించడం మొదలుపెట్టిన మార్పుని ఎం.శరత్‌కుమార్ 'రేపటి ఉదయం' చిత్రిస్తే, అధికార బలంతో భూమిని ఆక్రమించుకున్న దొరకు వ్యతిరేకంగా పోరాడటానికి 'రాయలింగు' అతని నేస్తగాండ్లు సిద్ధమవడాన్నీ - 'ఆ వార్తవిన్న దొర వ్యవసాయం సేరిదారుకూ ఇంటి పంతులుకూ చెప్పి తన మకాం పట్నానికి మార్చిండా' న్నీ ఎం.వి. తిరుపతిరావు 'న్యాయం' కథ చిత్రించింది.[36] కరీంనగర్ జిల్లా గ్రామాల్లో వస్తున్న మార్పు కథారూపం పొందిందనడానికి మొదటి ఉదాహరణ యిది.

1973లోనే 'బద్‌లా' కోసం అల్లం రాజయ్య రాసిన కథ 1977 వరకూ ప్రచురణకు నోచుకోలేదు. దొర దోపిడీకి బలయిన ఒక హరిజన నీరటికాడు పోరంబోకును సాగుచేసుకుంటే, దాన్నికూడా ఆక్రమించుకోవడానికి వచ్చిన దొరమీదగొడ్డలితో తిరగబడటం కథలో వస్తువు. 'ఎదురు తిరిగితే దొరలంతే కాయితం పులులే... కానీ... కొంరడు ఒక్కడే ఎదురుతిరిగితే ఏం లాభం?' అంటూ ముగిసిన ఈ కథ వ్యక్తి తిరుగుబాటుకు సంబంధించిందే అయినా - వ్యక్తులు సమూహంగా మారాల్సిన అవసరాన్ని సూచించింది. అంతేకాదు - కరీంనగర్ జిల్లా, మంథెన తాలూకా, గాజులపల్లి గ్రామ ప్రజల భాషలో వెలువడ్డ యీ కథ ఉత్తర తెలంగాణా పోరాట నేపథ్యంలో వచ్చిన మొట్టమొదటి మాండలిక కథ.

ప్రజా జీవితంనుంచి ప్రజల భాషలో వచ్చిన యీ కథని నిరక్షరాస్యులైన ప్రజలు బుర్రకథలా చదివి వినిపించుకున్నారు - మాండలిక కథ మౌఖిక రూపంలో ఎదగడానికి ఇదొక ప్రారంభం. కథ చదువుకునే పాఠకులకు మాత్రమే కాదు - వినే శ్రోతల కోసం కూడాననే స్పృహ[37] - పోరాటాన్ని కళగా మలచి ప్రజలకు అందించి వాళ్లని చైతన్యవంతుల్ని చేయడమే ఉద్యమ సాహిత్య ప్రధానోద్దేశం అన్న సైద్ధాంతిక దృక్పథాన్ని యువ రచయితలకు కలగజేయడంలో యీ కథ ప్రముఖ స్థానాన్ని ఆక్రమించుకొంది.

కావలి ముత్యాలు వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా తిరగబడటం వుప్పల నరసింహం 'తిరగబడ్డ భూమి'కి కథావస్తువైంది. పోరాటంలో మొదటి దశని చిత్రించిన ఈ కథల్లో - వ్యక్తులు ఒంటరిగా తిరగబడినప్పటికీ 'సంగం'లో భాగస్వామ్యం పొందాల్సిన అవసరాన్ని గుర్తించడం కూడా స్పష్టంగా కనపడుతుంది.[38]

జనం అంతా 'ఒక్కటైతే'నే సమస్యలకి పరిష్కారం లభిస్తుందనీ, దొరల సాంఘిక దౌర్జన్యాన్ని సంఘటితంగానే ఎదుర్కోగలమనే ఆలోచన సామాజికఆచరణకు దారితీస్తుంది - గ్రామాల్లో ప్రజలు, గ్రామాలు కలసికట్టుగా నిలబడితే తరతరాల సాంఘిక దాస్యం తొలగిపోతుందనీ - భూమి సమస్యతో ముడివడివున్న సాంఘిక దోపిడీ పోవాలంటే దొరలు అక్రమంగా ఆక్రమించుకున్న భూమి కోసం పోరాడక తప్పదని తెలుసుకుంటారు.

భూమి తగాదాల పరిష్కారాలకు మొదటి దశలో ప్రజలు సాయుధం కాలేదు. ప్రజలంతా సంఘీభావంతో ఏకమై పంచాయతీల ద్వారానే పరిష్కరించుకున్నారు. అయితే పంచాయతీలు యింతకుముందులా దొరగడీలోకాక పొలంలోనే జరిగాయి. పంచాయతీలకు దండుగలు దడావతులు కట్టాల్సిన అవసరం లేదు. ఇన్నాళ్లు దోపిడీ వర్గానికి కొమ్ము కాసిన పెద్దలు 'తీర్పు పెద్దలు' కాదు - 'సబ్బండ వర్నాలు; మాదుగులు, మిన్నేలు, కాపులు, పెర్కలు, గొల్ల, కుర్మ, సాకల్లు, మంగల్లు, కుమ్మర్లు, కమ్మర్లూనూ'. ఈ పంచాయతీకి దొర వెళ్లాల్సిన అవసరం ఏర్పడింది. సుంకరోల్లు, వంతగాల్లు వెంటలేరు. దొరలకిదంతా 'తలకిందుల వ్యవహారం'.

దొంగ అప్పులు, వడ్డీల కింద దొర ఆక్రమించుకోవాలని చూసిన భూమిని దున్నేవాడికే ఇవ్వాలని పంచాయతీలు తీర్మానించాయి.[39] అల్లం రాజయ్య 'సంఘం' కథలో చెప్పిన యీ విషయం ఒక ఊరిది కాదు. ఎన్నో గ్రామాల్లో సంఘాలేర్పడ్డాయి. పోరాటపు మొదటి దశ వెట్టి మానేయడం, పంచాయతీలను న్యాయాధికారాలను దొరనుండి తప్పించడం అయితే - దొర అంతకుముందు పంచాయతీల పేర్న తీసుకున్న దండుగలు, జరిమానాలు తిరిగి వసూలు చేయడం - దొరకు కట్టే దండుగలు మానేయడం తర్వాతి దశ.[39a]

వుప్పల నరసింహం 'తొలికోడి కూసింది' కథలో దొరనుండి దండుగలు వసూలు చేయడమేగాక శ్రామిక స్త్రీని కొట్టినందుకు ప్రజలంతా కలిసి దొరతో క్షమాపణ కూడా చెప్పిస్తారు.

దొరల సాంఘిక ఆర్థిక దౌర్జన్యాలమీద నిరసన వ్యక్తీకరించడమేగాక తరతరాలుగా దొరలకు చేస్తున్న సాంస్కృతిక దాస్యాన్ని తొలగించుకునే పోరాటం కూడా కథల్లో చోటుచేసుకుంది.[40]

మద్దునూరులో భూస్వామికి వ్యతిరేకంగా పాలేర్లు, వ్యవసాయ కూలీలు, జీతాల కూలీరేట్ల పెంపుదల కోసం జూన్ 17, 1978న సమ్మె ప్రారంభించారు.[41] వెట్టి పనులు బంద్ అయ్యాయి. పశువులకి గడ్డీ గాదం చూసేవాళ్ళు కూడా లేకుండా పోయారు. దొరల్ని 'సాంఘికంగా బహిష్కరించడం' అనే పోరాటపు ఎత్తుగడకిది ప్రారంభం. సాంఘిక బహిష్కరణ అనేది ఒకప్పుడు గ్రామ ప్రజల్ని పీడించడానికి దొరలు ఎన్నుకున్న పీడనలో భాగం. అదే ఇప్పుడు ప్రజల చేతిలో ఆయుధమైంది. సాంఘిక బహిష్కరణకు లోనయిన మద్దునూరి దొర వూళ్ళో పూట గడవక వూరొదిలి వెళ్లిపోయాడు. దొరలాగే ఊరిమీద పడి బతకనేర్చిన దొర ఆబోతు కూడా గడ్డిలేక చిక్కిశల్యమై చచ్చిపోయింది.

అల్లం రాజయ్య దొరకు ప్రతీకయిన ఆబోతు కథని 'మార్పు'[42] కథగా అద్భుతంగా మలచాడు. గోపీ దీన్నే 'దొరగారి కుక్క'[43]గా రాశాడు. భూస్వామ్య వ్యవస్థ వినాశాన్నీ రెండు కథలు ప్రతీకాత్మకంగా చెప్పాయిగానీ శిల్పరీత్యా 'మార్పు' కథ ఉత్తర తెలంగాణా పోరాట కథలకి తలమానికం.

దొరగారి ఆబోతుకథ ఊరూరా ప్రచారమైంది. ప్రజలకి రచయిత యీ కథని ఎన్నోసార్లు వినిపించాడు. మద్దునూరు దొర సాంఘిక బహిష్కరణ - ఆబోతు చావు ప్రజలకి గొప్ప ఉత్తేజాన్నిచ్చింది. పాటలాగా కథ కూడా ప్రజలకు మౌఖికంగా చేరువవుతుందని 'మార్పు' కథ నిరూపించింది. కథకున్న మౌలికమైన మౌఖిక సంప్రదాయాన్ని స్వీకరించి విప్లవ రాజకీయాల్ని ప్రచారం చేయటానికి పాటతీరుగా కథని నడపడం ద్వారా అల్లం రాజయ్య పోరాట కథ, మాండలిక కథల్లోనే కాకుండా తెలుగు కథలోనే ఒక మార్పు తెచ్చాడు.

సంఘటనలు కథాకళగా మారే క్రమంలో జానపద కథ విప్లవ కథగానూ జానపద వృత్తి గాయకులు విప్లవ గాయకులుగానూ మారుతారు. తెలంగాణాలో వీరగాథల్ని ఊరూరా పాడుకుంటూ బిచ్చమెత్తుకునే వృత్తి గాయకులు (సంచార బిక్షుక గాయకులు) పాత కథలు చెప్పి పొట్ట నింపుకోవడం కష్టమై జనం కథలు చెప్పి ప్రజల్లో పోరాట చైతన్యం నింపుతారు.[44] సాంస్కృతిక కళారంగాల్లో విప్లవోద్యమం తీసుకువచ్చిన యీ మార్పు గణనీయమైంది. సంఘబలాన్ని చూసి దొరల గుండెల్లో గుబులు మొదలయింది. దొరల్ని గడగడలాడించే సంఘంపట్ల రైతాంగం నమ్మకాన్ని పెంచుకుంటుంది. ఈ రెండు కోణాల్ని స్పృశిస్తూ తుమ్మేటి రఘోత్తంరెడ్డి 'సవారీ' కథ రాశాడు.[44a] సంగం జెండాకింద దొరలపైన ప్రజలు అమలుచేసిన 'సాంఘిక బహిష్కరణోద్యమం' పోరాటంలో బలమైన ఆయుధంగా రూపుదిద్దుకుంది.

ప్రజల సంఘటిత శక్తినీ స్థైర్యాన్నీ దెబ్బతీయడానికి చినమెట్‌పల్లి భూస్వామి[45] 1978 సెప్టెంబర్ 15న రైతాంగంమీద కాల్పులు జరిపాడు. ఆ కాల్పుల్లో 19మంది రైతులు తీవ్రంగా గాయపడ్డారు. కోరుట్లనుండి తన బలగంతో వచ్చిన పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ని కాల్పులు జరిపే దొర దగ్గర్నుండి తుపాకీ స్వాధీనం చేసుకోమని ప్రజలు డిమాండ్ చేశారు. 'దొర అట్లా కాలుస్తవుంటే చూస్తావేమయ్య అరెస్టు చేయక; గ బట్టలు నాకియ్యి, తుపాకీ నా సేతికియ్యి - ఆన్ని అరెస్టు సేత్తా' అని ఒక స్త్రీ ఎస్.ఐని నిలదీసింది. పోలీసు యంత్రాంగం ప్రజల మీద కాల్పులు జరిపిన దొరనేం చెయ్యలేదు. సరిగదా అతని యింట్లోనే క్యాంపు పెట్టింది.

ఈ సంఘటన ప్రజానీకాన్ని ఒక్క కుదుపు కుదిపింది. భూస్వామి, పోలీసులు కుమ్మక్కై చేసిన హత్యాకాండని విద్యార్థి సంఘాలు నిరసించాయి. ఈ సంఘటన కవుల్నీ రచయితల్నీ బాగా కదిలించింది. ప్రజల వీరోచిత పోరాటాల్ని వర్ణిస్తూ భూస్వామి దమననీతిని ఖండిస్తూ పాటలు, కథలు వచ్చాయి.

అందుగల వెుుండయ్య 'కుంపటి' కథా వస్తువైన యీ ఘటన రాజయ్య 'కొలిమంటుకొన్నది' నవలకి ముగింపయింది. పోలీసుని తుపాకీ అడిగిన స్త్రీ మాటలు సృజన సంపాదకీయమయ్యాయి.[47] అల్లం రాజయ్య 'భూమి' కథలో కూడా ఈ సంఘటనని తడిమాడు. ఇదే సంఘటన ప్రజలపై ప్రభుత్వ నిర్బంధాన్ని ఎక్కువ చేసింది. ప్రభుత్వం 1978 అక్టోబర్లో జగిత్యాల సిరిసిల్లా తాలూకాల్ని కల్లోల ప్రాంతాలుగా ప్రకటించింది.

అప్పటివరకూ పోరాటంలో ప్రజలదే పైచేయిగా వుండింది. సాంఘిక బహిష్కరణతోపాటు బంజర్లు ఆక్రమించుకోవడం, భూస్వాముల అధీనంలో వున్న మిగులు భూముల్ని స్వాధీనం చేసుకోవడం పోరాటంలో ముందుకొచ్చాయి. ఈ పోరాటాల్ని తెలంగాణా మాండలిక కథలు ప్రముఖంగా చిత్రించాయి.[48]

అయితే ప్రజలు భూమిని సొంతం చేసుకున్న క్రమంలో ఎంతో నిర్బంధాన్ని ఎదుర్కొన్నారు. భూస్వాములు రాజ్యాంగ యంత్రాంగాన్ని అండగా తెచ్చుకున్నారు. అనివార్యంగా సంఘర్షణ మొదలైంది. ఊళ్ళ పోలీసు కేంద్రాలయ్యాయి. రైతులక్రమంగా అరెస్టయ్యారు. భూస్వాముల భవంతులే పోలీసులి నాకాలయ్యాయి. ప్రజలు చిత్రహింసలకు గురయ్యారు. దొరల అధికారాన్ని నిలపడానికి పోలీసు కాల్పులు జరిగాయి. ప్రజలు మరణించారు.[49]

నిర్బంధాన్ని ఎదిరించి ఎన్ని కష్టాలు వచ్చినా భూమిని సాగు చేయక మానేది లేదన్న రైతు పట్టుదల ముందు సమస్తలోకం తలవొంచాల్సిందే. రాజయ్య 'భూమి' కథలో గంగన్న తాత మాటలు అందుకు ఋజువు.

'నన్ను బట్టుకపోతే నా బిడ్డా, కోడలు దుంతరు...'

'నీ కోడలును బిడ్డను జేల్లకు పట్టుకపోతరు...'

'అయితే మా ముసల్ది నాగలి బడుతది...'

'నా మనుమలు దున్నతరు?'

'నీ మనుమల పట్టుకపోతరు'

'దున్నపోతులే నాగలి దున్నతయి'

'దున్నపోతుల బందెల దొడ్లె బెడుతరు....'

'నాగలి దానికదె దున్నతది....'

'నాగలికి కొత్త జేల్లు కట్టిత్తరు....'

'అప్పుడు భూమి సెరొసెర ముక్కలయిద్ది.... ఇంటున్నవా? అంతవర దనుక మేం సేతులు ముంగట బెట్టుకుని కూసుంటామా?''[50] ఇది రైతు భూమికోసం చేసే పోరాటానికి పరాకాష్ఠ. ఈ పోరాటం నాడిని తెలంగాణా మాండలిక కథ మాత్రమే పట్టుకోగలిగింది.

ఉద్యమాన్ని అణిచివేసే క్రమంలో దాన్ని హింసాత్మక చర్యగా ప్రభుత్వ యంత్రాంగం ప్రచారం చేస్తుంది. భుక్తికోసం, భూమి కోసం పీడితజనం చేసే పోరుని దేశ విద్రోహంగా పరిగణిస్తుంది. దొంగకేసులు బనాయిస్తుంది. గ్రామాల్లో 'సర్వనాశిడం' సృష్టించిన భూస్వామినీ వాడి దోపిడీని ఎదిరించడం చట్టరీత్యా నేరమౌతుంది. న్యాయవ్యవస్థ సైతం భూస్వాముల కొమ్ము కాస్తుంది. ప్రజల్ని హంతకులు గానూ, ప్రజా ద్రోహుల్ని అమాయకులుగానూ చిత్రిస్తుంది. ఊళ్ళో పంటలను ఉద్యమకారులు నాశనం చేస్తున్నారన్న ఆరోపణ చేస్తుంది. ఈ ఆరోపణని ఖండిస్తూ అల్లం రాజయ్య రాసిన 'సృష్టికర్తలు'లో బర్ల ఓదేలు యిలా అంటాడు.

'' మా నెత్తురును మేం సంపుకోం. కానీ యింకొకడు సంపుతాంటే యిక సూడందొరా, మేము అన్ని చీజ్‌ల తయజేసేటోల్లం, మిమ్మల్ని మీ బంగళాల అన్ని..... అన్ని- అన్ని మేమే తయారుచేసినం. ఆయన్ని నాశనం చేత్తే మేం ఊకోము....

మా నెత్తురు, మా మాంసం, మా బొక్కలు, మా మూలుగు, మా బతుకు, మా సుఖం-కట్టం, చెమట, కన్నీల్లు మేం నాశిడం జేసుకుంటామురా?''

పోరాటం స్పందనని- తెలంగాణా మాండలికంతో ముడివేసి కథగా మడలవడంలో అల్లం రాజయ్య సాధించిన పరిణతిని 'సృష్టికర్తలు' నిరూపిస్తుంది. జరిగిన సంఘటనే కావచ్చు - సహజ చలనాన్ని సరైన రీతిలో సాహిత్య కళగా తీర్చిదిద్దడంలో రాజయ్య చూపిన నేర్పు ప్రశంసనీయం. ఒక దశలో తెలంగాణా మాండలిక కథకు అల్లం రాజయ్య మారుపేరయ్యాడు. 'సృజనంత అల్లం వాసనేస్తుందని, తెలంగాణా పత్రికయిపోయిందని' విమర్శలు వచ్చేంతగా [52] రాజయ్య ఉత్తర తెలంగాణా రైతాంగ పోరాటంలోని వివిధ దశల్ని భిన్న కోణాల్నీ కథలుగా మలిచాడు. తక్కిన కథారచయితలు ఒక్కొక్కరూ ఒక్కో సంఘటనకి ప్రతిస్పందిస్తే రాజయ్య ఒక్కడూ పోరాటాన్నంతా కథలుగా నవలలుగా ఆంధ్రదేశ ప్రజానీకం ముందట సమగ్రంగా వుంచగలిగాడు.

నిర్బంధం ఎక్కువైన కొద్దీ సంఘం బహిరంగ కార్యక్రమాల్ని తగ్గించుకోవలసి వచ్చింది. పోరాటం సాయుధ రూపం తీసుకోవల్సి వచ్చింది. ఈ అవసరాల్ని గుర్తిస్తూ 'శత్రువు నేర్పిన పాఠం', 'సత్యం', 'అడవి మనిషి'లాంటి కథలు వచ్చాయి.[53]

పోరాటంలోని వివిధ దశలు వర్ణిస్తూ ప్రజల భాషలో పోరాట కథలు ఉధృతంగా వస్తున్న రోజుల్లోనే భాషగురించి చర్చ మొదలైంది. రచయితల తెలంగాణా మాండలికం చారిత్రాత్మకమైన పోరాట స్వరూపాన్ని గమనాన్ని తెలుసుకోవడంలో ఆటంకమవుతుందనీ, మాండలికంలో వున్నందువల్ల యీ కథలు విశాలతను కోల్పోయే ప్రమాదం వుందనీ తద్వారా విప్లవం విశాల ప్రజానీకం కోసం కాకుండా ఒక మండలానికీ సంకుచితమై పోతుందనీ అభిప్రాయాలు వెలువడ్డాయి.[54]

సృజన, నూతన లాంటి పత్రికల్లో మాండలికం గురించి జరిగిన చర్చ ప్రజా సాహిత్యంలో ప్రజల భాష - అనే సైద్ధాంతిక దృక్పథాన్ని మెరుగుపరచుకోవడానికీ, ప్రజల భాషలో రాసే రచయితలకి రచనా విషయకంగా కొన్ని మార్గదర్శక సూత్రాల్ని అందించడంలోనూ ఎంతో తోడ్పడింది.[55]

చర్చలు - వాదోపవాదాలు ఎన్ని వచ్చినా మాండలిక కథలు జనజీవన పోరాటాన్నీ సంస్కృతినీ చిత్రించడం నిరాఘాటంగా కొనసాగింది.

ప్రజల చెమటనుండి, శ్రమనుంచి, ఉత్పత్తి క్రమంలో జీవితానుభవం నుంచి పుట్టిన ప్రజల భాష (మాండలికం)ని వదిలేసి వేరే విధంగా కథలు రాయడం చేతకాదని రచయితలు నిర్ద్వంద్వంగా ప్రకటించారు. ప్రజల భాషలో రచన చేయడం సాహిత్య ప్రమాణాలను తగ్గించడం కాదనే భరోసా యువ రచయితలకు కలగడంద్వారా మాండలిక రచనలు విస్తృతంగా వెలువడి మాండలికం ప్రామాణిక భాషతో కలిసి తెల్గుగు భాష మరింత సుసంపన్నమవుతుందని భాషా విషయకంగా ఒక అవగాహన ఏర్పడింది. అంతేకాదు ఉద్యమ స్ఫూర్తికి ప్రయోజనం ప్రాంతీయంగా పరిమితమయినా - మాండలిక రచనలు అవసరమని రచయితలు నిర్ధారించుకొన్నారు.[56]

తెలంగాణా మాండలికంలోనే కాకుండా తక్కిన ప్రాంత మాండలికాల్లో సైతం రచనలు రావడంతో మాండలిక రచనల పరిమితులను గురించి వాదాలు తగ్గుముఖం పట్టాయి. పత్రికల్లో వివిధ మాండలికాలకు ప్రోత్సాహం లభించడంతో మధ్యతరగతి పాఠకులు కూడా భిన్న ప్రాంతాల మాండలికాలకు అలవాటుపడ్డారు.

సిరిసిల్లా, జగిత్యాల తాలూకాలను కల్లోల ప్రాంతాలుగా ప్రకటించి ఉత్తర తెలంగాణాలో తక్కిన భాగాలను అప్రకటిత కల్లోల ప్రాంతాలుగా పరిగణించి ప్రభుత్వ యంత్రాంగం ఎన్ని నిర్బంధాలను అమలుపర్చినా ఉద్యమం నీరుగారలేదు. ఉద్యమ కథలు రావడం మానలేదు.

స్త్రీ పురుష భేదం, బాల వృద్ధ విచక్షణ లేకుండా ప్రజలపైన భూస్వామ్య అనుకూల ప్రభుత్వం దమననీతిని అమలుపరిచింది. గ్రామాల్లో సంఘటితం కావడాన్ని విమల 'కలిసే పోదాం యెన్నీయలో...'[57] చిత్రిస్తే, (కొందరు పాకలో రాజవ్వపై భూస్వామి వెంకట్రావు చేయించిన అత్యాచారం (29-10-78) ఈ కథలో వస్తువు) సంఘటిత స్త్రీ శక్తిని కాలరాచడానికి పోలీసు యంత్రాంగం లైంగిక అత్యాచారాలకు పూనుకోవడాన్ని సాహు 'పోలీసు దాడి'[58] వివరించింది. అల్లం రాజయ్య 'సత్యం' కథ పిల్లలు కూడా ఉద్యమంలో పాలుపంచుకోవడం, వాళ్లని సైతం పోలీసులు జైలుపాలు చేయడం - నిర్బంధాన్ని సాయుధంగా మాత్రమే ఎదుర్కోవడం సాధ్యమనీ తెలియజేస్తుంది.

సాయుధ పోరాటంలో ఒక్కోసారి శత్రువుది పైచేయి కావచ్చు. అలాంటి సందర్భంలో కార్యకర్తలు నిరాశకు లోనుకావచ్చు. అందుగుల మొండయ్య 'పంట'[58a] కథలో అలా నిరాశకు లోనైన కార్యకర్తను ఒక రైతు స్త్రీ ఉత్తేజపరుస్తుంది. భూమి దున్ని విత్తుపెట్టిన దగ్గర్నుంచి పంట చేతికొచ్చే దాకా రైతు ఎన్నో కష్టనష్టాల్ని ఎదుర్కొంటాడు. ఒక్కోసారి చేతిదాకా వచ్చిన పంట నోటికి దక్కకపోవచ్చు. కానీ మళ్ళీ మరో ప్రయత్నం చేయకమానడు. విప్లవాచరణలో కూడా అటువంటి ఆటుపోట్లు తప్పవు. పంట కోసం భూమిని నమ్ముకున్న రైతులాగే ధైర్యం

కోల్పోకుండా వుండాలన్న సందేశాన్ని 'పంట' కథ అందిస్తుంది. కార్యకర్తలు ప్రజలనుంచి నేర్చుకోవలసిందెంతో వుందనడానికి యీ కథ మంచి ఉదాహరణ.

గ్రామాల్లో రైతాంగం మీద అణచివేత ఎక్కువైన కాలంలోనే ఉద్యమం, గనుల్లోకి అడవుల్లోకి వ్యాపించింది. సింగరేణి గనుల్లోని బొగ్గుపని కార్మికులు, ఆదిలాబాద్ అడవుల్లో గిరిజనులు సమస్యల పరిష్కారం కోసం, భూమిమీద హక్కు కోసం సంఘటితం కావడం మొదలైంది. రైతాంగ, కార్మిక, గిరిజన పోరాటాలు ఏకోన్ముఖంగా కొనసాగాయి. 1981నుంచీ రైతాంగ పోరాట కథలతోపాటు, కార్మికోద్యమాన్ని, గిరిజన పోరాటాన్నీ చిత్రించే కథలు విస్తృతంగా వచ్చాయి. సంఖ్యాపరంగా 1981-82ల్లో కార్మిక - గిరిజన పోరాట కథలే ఎక్కువ వచ్చాయి.

నిర్బంధంలో సైతం పోరాటాన్ని కొనసాగించడానికి రైతాంగ కార్యకర్తలు భార్యాబిడ్డల్ని - కొంపాగోడు వదిలేసి రహస్య జీవితంలోకి వెళ్లవలసి వచ్చింది. రైతు కుటుంబాల్లోంచి పార్టీలోకి పూర్తికాలం (Full time) కార్యకర్తగా మారే క్రమంలో కుటుంబంలో ఎంతో సంఘర్షణ జరగడం సహజం. బిడ్డల్ని వుదిలి వుండలేని తల్లులు పడే మనోవేదనని - గోపి 'తల్లిచేప',[59] రాజయ్య 'తుఫాను'[60] వ్యక్తంచేస్తే - ప్రజలందరి విముక్తి పోరాటంలో భాగస్వామ్యం వహించడానికి బిడ్డల్ని దీవించి పంపే వీరమాత గుండె నిబ్బరాన్ని బి.ఎస్.రాములు 'మమకారం'[61], కర్షక 'షురూ'[62] కథలు చిత్రించాయి.

పోరాటం - నిర్బంధం - ప్రతిఘటన - వర్గ సంఘర్షణలో అనివార్యంగా ఏర్పడే దశల్ని పేర్కోవడంతో ఆగిపోకుండా మానవ సంబంధంల లోతుల్లకి, రక్తసంబంధాల - ఆత్మీయతల జీవిత వాస్తవాల్లో యీ రచయితలు తొంగిచూశారు. మానవ సహజమైన ప్రేమలూ, మమకారాలూ, భయాలూ, భ్రమలూ సందేహాలు వంటి ఎన్నో సహజాతాల్ని ఆవిష్కరించగలిగారు. బాహ్యప్రపంచంలోని సహజ చలనాన్ని మాత్రమే కాకుండా మానసిక ప్రపంచంలోని అంతశ్చేతనని సైతం గుర్తించగలిగారు. ఉత్తమ కళా సృజన జీవితంనుంచే పుడుతుందని నిరూపించారు.

1983లో రాష్ట్రంలో మొదటిసారిగా కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడింది. కానీ తెలంగాణా గ్రామాల్లో పరిస్థితులేమాత్రం మారలేదు. అధికారంలోకి ఏ పార్టీ వచ్చినా అణచివేత తీరు మారదని తెలియజేస్తూ - పి.చంద్ 'ఒరిగిన అన్నల కెన్నీయలో...'[63] కథ రాశాడు. ఈ కథలో రాజ్యహింస మరింత పెరిగినట్లు తెలియజేస్తుంది. నిర్బంధం ఎక్కువయినప్పటికీ పార్టీ రహస్య కార్యక్రమాల్ని ఆచరించింది తప్పితే ఉద్యమం ఆగిపోలేదు. చాపకింద నీరులా పనిచేసే కార్యకర్తల గురించి ఎవరైనా స్వార్థంతో పోలీసులకు సమాచారం చేరవేస్తే పార్టీ నాయకత్వం క్షమించినా ప్రజలు 'ప్రజాకోర్టు' నిర్వహించి శిక్ష విధిస్తారని చెప్పిన కథ బి.ఎస్.రాములు 'దొంగ గొడ్డుకు లొటారం'.[64] ఇదే ఇతివృత్తానికి స్త్రీవాద దృక్పథం జోడించిన కథ అల్లం రాజయ్య 'నీల'.[64a]

1985 నాటికి అణచివేత మరింత ఎక్కువయింది. గ్రామాలకు గ్రామాలు ధ్వంసమయ్యాయి. అణచివేతలో భాగంగా బూటకపు ఎన్‌కౌంటర్లు నిత్యకృత్యమయ్యాయి. పౌరహక్కుల నాయకులు కూడా పోలీసుల దాడికి లక్ష్యాలయ్యారు. రాజ్యహింసకు వ్యతిరేకంగా గెరిల్లా దళాల నిర్మాణం - దాడులు ముమ్మరమయ్యాయి. గ్రామాలన్నీ అతలాకుతలమయ్యాయి. నిర్బంధం కారణంగానే 'సృజన' లాంటి పత్రికలు ఆగిపోయాయి. ఉద్యమ సాహిత్యాన్ని ప్రచురించినా - ప్రచారం చేసినా నేరమైపోయింది. గెరిల్లా దళాలు అడవి లోతట్టు ప్రాంతాల్లో సంచరిస్తూ గ్రామ ప్రజలతో సంబంధాలు పెట్టుకునేవి. రచన సామాజికాచరణ అయినందువల్ల రచయితలు కూడా స్వయంగా ఉద్యమాల్లో పాలు పంచుకున్నందువల్ల వాళ్లుకూడా రహస్య జీవితంలోకి వెళ్లిపోయారు. మారుపేర్లతో అడపా తడపా కొన్ని కథలు వచ్చాయి. అవి కూడా దళాల కార్యక్రమాల్ని - ప్రజలు దళాల్ని దళ నాయకుల్ని రక్షించుకునే క్రమాన్ని తెలియజేశాయి తప్పితే[65] - సంఘర్షణలో జనించే వైరుధ్యాల్ని, వేదనలనీ అంతగా చిత్రించలేకపోయాయి. మాండలిక కథ పోరాట కథకి మారుపేరయిందిగానీ - కథా రచన విషయంలో ఒకరమైన స్తబ్దత ఏర్పడినట్లు తోస్తుందిగాని ప్రజా జీవితంలోని సంఘర్షణ[66] కుటుంబాల్లో, వ్యక్తుల జీవితాల్లో జరిగిన విధ్వంసం[67] గురించి తెలిపే ఉత్తమ కథలు వెలువడ్డాయి.

పోరాటలో వివిధ దశల్ని చిత్రించిన కొన్ని కథల్ని మాత్రమే యిందులో స్పృశించడం జరిగింది. మైదాన ప్రాంతాల రైతాంగ పోరాట స్ఫూర్తిని అందుకుని కార్మిక గిరిజనోద్యమాలు చెలరేగిన దరిమిలా ఆ పోరాటాన్ని సజీవంగా చిత్రిస్తూ కార్మిక - గిరిజన రచయితలు మాండలిక కథలు రాశారు. ఆ కథల పరిశీలనద్వారా తెలంగాణా మాండలిక కథా సాహిత్యాన్ని సమగ్రంగా అంచనా వేయడానికి వీలుంటుంది.

## కార్మిక కథలు

గ్రామాల్లో భూస్వాముల ఫ్యూడల్ దోపిడీని తట్టుకోలేక, ఉన్న భూమిని కోల్పోయి కడుపు చేత పట్టుకుని బతుకుతెరువు కోసం 'కాలేరు' (కాలరీ) కి వెళ్లి ఎందరో రైతులు, రైతుకూలీలు బొగ్గుగనుల్లో కార్మికులుగా చేరారు. వున్నూరునూ, కన్నతల్లినీ, నమ్ముకున్న నేలనూ వదిలిపెట్టి సింగరేణి బొగ్గు గనుల్లో చేరిన శ్రామికులకు శ్రమరూపం, దోపిడీరూపం మారింది తప్పితే కష్టాలు కన్నీళ్లు తప్పలేదు. పల్లెల్లో గాలీ, వెలుతురు, నీరన్నా స్వేచ్ఛగా లభించేవి. కానీ భూమి కడుపులో పుట్లకొద్దీ బండకింద బతుకుల్లో అవి కూడా కరువయ్యాయి. ఊళ్లో తమ కష్టాలకు కారణమయిన 'దొరోడు' ప్రత్యక్షంగా కనిపించేవాడు గానీ గనిలో తమ రక్తాన్నీ, ఎముకల్లో మూలుగునీ పీల్చివేసే శత్రువెవరో కూడా గుర్తించలేని పెనుగులాటని సైతం ఎదుర్కొంటారు.

చివరకు మంచి బతుకు కోసం పోరాటం చెయ్యక తప్పదని తెలుసుకుంటారు. రైతుకూలీ కార్మికుడిగా మారిన క్రమం దగ్గరనుంచీ చేనయినా గనయినా, పల్లె అయినా పట్నమయినా పోరాడందే బతుకు బాగుపడదని గ్రహించే వరకూ జరిగిన కార్మికుల జీవిత సంఘర్షణ నంతటినీ తమతోటి ప్రజానీకానికి తెలియజెప్పాలని కార్మిక రచయితలు పుట్టుకొచ్చారు. ఇంతకుముందులేని విధంగా కార్మిక జీవితం సాహిత్య వస్తువయింది.

కార్మిక పోరాటం వస్తువుగా అన్ని సాహిత్య ప్రక్రియలూ వచ్చినప్పటికీ కథలు మిగతా వాటికన్నా ఎక్కువ విస్తృతంగా వెలువడ్డాయి. వాస్తవ జీవితం కళగా, కథగా మారింది. తెలుగులో తక్కిన కథలకన్నా ఈ కథలు విలక్షణమైనవి. విశిష్టమైనవి:

1. ఈ కథల రచయితలు గనిలో బొగ్గులో బొగ్గయిన కార్మికులే. అందువల్ల ఈ కథల్లో కార్మికవర్గ చైతన్యాన్ని ప్రత్యక్షంగా చూడవచ్చు.

2. ఈ కథలు సింగరేణి కార్మికుల పోరాటాల వివిధ దశల్ని చిత్రించే చారిత్రక వాస్తవాలు. వీటిద్వారా సింగరేణి కార్మికోద్యమ చరిత్రని సైతం నిర్మించవచ్చు.

3. సాహిత్యం మధ్యతరగతి రచయితల నుంచి, పెటీబూర్జువా మేధావి వర్గంనుంచి కాక అచ్చమైన కార్మిక వర్గంనుంచీ వెలువడ్డ కారణంగా ఈ కథల్లో 'కల్పన(Fiction)కు తావులేదు. సామాజిక వాస్తవికత కళారూపంగా మారి కార్మికుల్లో పోరాట చైతన్యాన్ని కలిగించడానికీ, దాన్ని ఆరిపోకుండా నిలపడానికి యివెంతగానో ఉపయోగపడ్డాయి.

4. రైతాంగ పోరాట కథల్లానే యివికూడా చదువులేని కార్మికులు వినడానికి వుద్దేశించి రాసినవి. అందువల్ల వీటిలో భాష మౌఖిక భాషకి దగ్గరగా వుంటుంది. కార్మిక జీవితంలోంచి వచ్చిన 'మాండలిక' భాష యిది. తెలంగాణాలో ఏ ప్రాంతంనుంచి వచ్చినా దాదాపుగా కార్మికులందరికీ కాలరీల్లో ఒక సామాన్యమైన కార్మిక భాష ఏర్పడే అవకాశం వుందని ఈ కథలద్వారా తెలుస్తుంది.

బొగ్గు కని కార్మికుల్నుంచి వచ్చిన కథల్లో 'కార్మిక' రాసినవే ఎక్కువ. ఇవన్నీ 1981 ఏప్రిల్ తర్వాతే వెలువడటం గమనించాల్సిన విషయం. 1981 ఏప్రిల్‌లో మొదలై జూన్‌దాకా సింగరేణి కాలరీల్లో 56 రోజులపాటు అపూర్వమైన దీర్ఘకాలిక సమ్మె జరిగింది. అంతకుముందు కూడా బావులమీద సమ్మెలు జరిగాయి.[68] కానీ కార్మికులకు తమ శ్రమశక్తి దేశాన్ని - రైళ్ళు - పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి లాంటి ప్రముఖ రంగాలన్నిటినీ నడిపిస్తుందని తెలిసింది. తాము సంఘటితంగా వుంటేనే సమస్యలు పరిష్కారం అవుతాయనీ, దేశంలోని యావత్తు కార్మికవర్గం తమ వెనుక వుందనీ తమ సమస్యలు విడిగా లేవనీ అశేష పీడిత ప్రజానీకంతో ముడివడి వున్నాయనీ తెలుసుకున్నారు. పోరాటానికి సంబంధించిన ఈ వివరాలన్నీ కథల ద్వారానే తెలుస్తాయి.

సింగరేణి కార్మికుల కోసం పాటలానే కథ కూడా సాహిత్య రంగంలోకి ఆలస్యంగా వచ్చింది.[69] కరీంనగర్, ఆదిలాబాదు జిల్లాల్లో రైతాంగంలో భూస్వాములకు వ్యతిరేకంగా

వచ్చిన కదలికని కథా ఒచయితలు 1973లోనే చిత్రించారు. గాలి లేక, నీళ్లు లేక, సరైన నివాసం లేక సమస్యల వలయంలో చిక్కుకున్న బొగ్గుగని కార్మికుల జీవితాన్ని చిత్రించే కథ 1978కి గానీ వెలువడలేదు. అల్లం రాజయ్య రాసిన 'రాజీ' జూన్ 78 సృజనలో వచ్చింది.

కార్మికులకు నీళ్లు దొరకని పరిస్థితుల్లో ఆఫీసర్లు స్విమ్మింగ్ పూల్స్‌లో ఈతలు కొట్టే అసమానతలనీ, ట్రేడ్ యూనియన్ నాయకులు మేనేజిమెంట్‌తో చేతులు కలిపి కార్మికుల నోళ్లలో మన్నుకొట్టే దురాగతాలనీ, కార్మికులకు కనీసావసరాలు తీరక నీళ్ల కోసం, నీడ కోసం యూనియన్ల ప్రమేయం లేకుండానే సమ్మె చేయక తప్పని పరిస్థితుల్నీ 'రాజీ' కథ స్థూలంగా చిత్రించింది.

'బొగ్గు బాయిల దిగేటోని ముంగట నాగలి దున్నేటోడు దివిటీ ముంగట దీపమై పోయిండు' అని కొత్త జీవితాన్ని కోరుకుంటూ వున్న వూరినీ, కన్నతల్లినీ వదులుకుని నమ్ముకున్న భూమిని తెగనమ్ముకొని బొగ్గు కుప్పల్లోకి వచ్చిపడే రైతుబిడ్డలు కాలరీలో అడుగుపెట్టడంతోనే దోపిడీకి గురవుతారు.[70]

భవిష్యత్తుమీద ఎన్నో ఆశలతో కాలరీల కొచ్చి అడుగడుగునా లంచాలు యిచ్చుకుని[71] కొనుక్కున్న 'బండకింది బతుకు'లో వీసమెత్తు సుఖానికి కూడా నోచుకోలేక కార్మికుడు నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. ఉండటానికి సరైన వసతి ఉండదు. పిల్లలకు చదువుండదు. తాగడానికి నీళ్లుండవు. పనిలో ఆనందం వుండదు. ఇళ్లనుంచి కాలరీకి మైళ్లకొద్దీ దూరం. బావిలోకి దిగాకా 'పేసీ' (వర్కింగ్ ప్లేస్)కి వెళ్లటానికి సరైన దారులుండవు. పనికి కావాల్సిన సరైన పనిముట్లుండవు. బొగ్గు పొరల కింద గాలీ వెలుతురు వుండవు. ఈ పరిస్థితిని బావి కార్మికుడి నోటిమాట ద్వారానే వినాలి.

''... తెల్లారకముందే లేసి ఉడికీ వుడకని కూడు బుక్కెడు తిని పొద్దుపోయిందని 'పిరోపిరో' అంట ఈడ్సుకుంటీడ్సుకుంట ఎగపోసోకుంట ఎండనక వాననక మైల్లకు మైళ్ళురికి ఎక్కడికో పాతాళం బోయినట్టు అరువైడెబ్బై పాయలు జారుట్ల బూరుట్ల దిగెటాళ్లకే కాళ్లన్నీ రిళ్లలు వారె, యిగ పనికి తాడికి పోయే వారకె... బట్టలు తడిసె, యిగ ఏ పొద్దుకో ఖాళీటబ్బులిత్తె పొట్టనరాలు తెగంగ పేసీలకు దొబ్బుకపోయి, వశంగాని పొగల, కుమ్ముల పెట్టి వుడకుబెట్టినట్టు వుండె గరిమి పేసులనుంచి రేసులెక్కి, డీబులు దిగి పొగకు వస్కు వస్కున దగ్గుకుంట, ఆ గరిమికి మాంసమంత వుడుకంగా, పుట్టెడు బండ కింద సచ్చిన సావెరుగక బతికిన బతుకెరుగక నెత్తురు సెవుట జేసి, బొగ్గు దిని బొగ్గేరిగి, యిచ్చిన టబ్బు నింపి, కడుపుల పేగులు తెగంగ మళ్ల భర్తి దొబ్బి ఆడుకు అందిచ్చి పంపుకాడ తానం జేసి, మళ్ళ మోకాళ్ళు మోచేతులు పట్టుకుంట అరువై డెబ్బై పాయలు ఎక్కటాళ్లకు అయ్యో! ఇద్దరీడ్సి ముగ్గురు తన్నినట్టు పెయ్యంత పచ్చి పుండోలిగె ఆయె. మల్ల ఎక్కన్నో కాలిపెయిన గుడిసెకు నడిసిపోవన్నన్న

సైకిల్ తొక్కొన్నన్న యాష్టచ్చె. అదే పాయె సచ్చిబతికి యింటికి వోతె ఆడేవన్న 'సౌలత్' వుంటుందా మన్నా. గుడిసెల్ల వుడుకపోత, బడిబంధం సక్కగలేక పోరగాండ్ల లొల్లి, మురుగు వాసన...''[72]

ఈ కష్టాలకి అంతులేదు. 'నిద్రపోతున్న పులిగుహ' లోకి పోయినట్టు బావిలోకి వెళ్తే మళ్ళీ తిరిగొచ్చేదాకా నమ్మకం లేదు. అత్యంత ప్రమాదభరితమైన 'డిపిల్లరింగ్ డిస్ట్రిక్ట్' లో సైతం కార్మికుల భద్రతకు సదుపాయాలుండవు. పైనుంచి బండపడకుండా సపోర్ట్ చేయడానికి దాట్లుండవు, దిమ్మెలుండవు, వాటిని కట్టడానికి తుంటలుండవు. 'సేసెటోళ్ళు యిద్దరు, సూసెటోళ్ళు ముగ్గురు.' సేఫ్టీవీక్‌లు, కమిటీ మీటింగులే గానీ నిజమైన సేఫ్టీ వుండదు. కార్మికుడి ప్రాణాలకు విలువుండదు. లాభాలవేటలో మేనేజిమెంటుకు ఉత్పత్తుల మీదున్న శ్రద్ధ, ఆసక్తి కార్మికుల ప్రాణాలమీద వుండదు.[73] భద్రత కోసం మాత్రమే కాదు. పనిముట్ల కోసం కూడా సమ్మె చేసే పరిస్థితిని కార్మికులకు యాజమాన్యమే కల్పిస్తుంది.[74]

'సంవత్సరాలుగా చీకటి గుయ్యారాల్లో బొగ్గు తవ్వీ తవ్వీ బొక్కలు తేలిన శరీరాల వాళ్ళు, ఎండిపోయిన ముఖాలవాళ్ళు, లొట్ల కండ్లవాళ్ళు, చప్పిదవడల వాళ్ళు భగభగ మండుతున్నరు.'[75]

కార్మికుల్లో వచ్చే ఈ చైతన్యాన్ని రఘోత్తంరెడ్డి 'బొగ్గు పొరల్లో' కథ ఎంతో సహజంగా చిత్రించింది. ప్రమాదాలకు లోనై కార్మికులు కాలో చెయ్యో విరిగి రక్తమోడుతూ 'దవాకాండ్ల' కు వస్తే వైద్య సదుపాయం సరిగా వుండదు. కష్టపడి భూమి కడుపులో దొరబడి ప్రాణాలమీద ఆశ వదలి నల్లబంగారాన్ని బయటికి తీసి కోట్లకొలది లాభాలు సంపాదించిపెట్టే కార్మికులకు లేని ఆదరణా, వైద్య సదుపాయం పై అధికారులకు లభిస్తుంది.[76]

డాక్టర్లు ఒక్కోసారి కార్మికుడి గాయాలు మానకుండానే మళ్ళీ 'ఫిట్' చేసి పనుల్లోకి పొమ్మనే అవకాశం వుంది. అటువంటి సంఘటనే 1981 ఏప్రిల్‌లో సమ్మెకు దారితీసింది. ఒకరోజు సమ్మెలో పాల్గొన్న కార్మికులకి మస్టర్ కోత విధిస్తూ యాజమాన్యం నోటీసులిచ్చిన దరిమిలా దీర్ఘకాలిక సమ్మె జరిగింది.[77]

గ్రామాల్లో భూస్వాములకండగా వచ్చిన పోలీసుల నిర్బంధం ఎక్కువైన కారణంగా, ప్రభుత్వం కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాన్ని అణచివేసేందుకు సిరిసిల్లా జగిత్యాల తాలూకాలను కల్లోల ప్రాంతాలుగా ప్రకటించినందువల్ల, మరికొన్ని అప్రకటిత కల్లోల ప్రాంతాల్లో జీవితాలకు భద్రత లేనందువల్ల రైతుకూలీలు గనుల్లో పనిచేసే బంధువుల దగ్గరకు రావడం, కొందరు గనుల్లో కార్మికులుగా చేరడం జరిగింది.

ఆ నేపథ్యంలో గ్రామీణ రైతాంగంనుండి పొందిన పోరాట స్ఫూర్తితో[78] మస్టర్ల కోత చట్టానికి వ్యతిరేకంగా సమ్మె మొదలైంది. కార్మికుల సమ్మె హక్కుని కూడా హరించే ఈ

చట్టం విషయంలో యాజమాన్యం, ట్రేడ్ యూనియన్లు, ప్రభుత్వం భిన్న వైఖరుల నవలంబించారు. పరస్పర విరుద్ధ ప్రకటనలనిచ్చారు. 56 రోజులపాటు జరిగిన ఈ దీర్ఘకాలిక సమ్మెలో ట్రేడ్ యూనియన్ నాయకులు ద్వంద్వ వైఖరి అవలంబించారు. యూనియన్ నాయకులు యాజమాన్యంతో 'మిలాఖతు' అయి కార్మిక సంక్షేమానికి వ్యతిరేకంగా పనిచేశారు. కార్మికులపై అమలుపర్చిన నిర్బంధానికి సహాయం చేశారు.

8 మస్టర్ల కోతతో మొదలైన నల్లచట్టాలు కార్మికుల్ని ఉద్యోగంనుండి తొలగించేవరకూ పరిణమించాయి. ట్రేడ్ యూనియన్ల నాయకత్వాన్ని కాదని కార్మికులు 'సింగరేణి కార్మిక సమాఖ్య'గా సంఘటితమయ్యారు. మందమర్రి కె.కె.2 బావిమీద పనిచేసే కార్మికులతో మొదలైన సమ్మె నిర్బంధంలో మరింత విస్తరించింది. గోదావరిఖని, రామకృష్ణాపురం మొ॥ తక్కిన బావులనుంచి 30వేలమందికి పైగా కార్మికులు నల్లచట్టాలకు వ్యతిరేకంగా పోరాడారు. నిర్బంధాలకు తట్టుకొని ఎదిరించి నిలబడ్డారు. చివరికి మస్టర్ల కోతని తొలగిస్తూ ప్రభుత్వం - సమ్మెచేయని యూనియన్లతో సమ్మె విరమణ ఒప్పందం చేసుకుంది.

సింగరేణి కార్మికుల యీ పోరాటం చరిత్రనంతా 'కార్మిక' సింగరేణి కార్మిక కథలుగా రికార్డు చేశాడు.[79] కార్మిక ఒక వ్యక్తి కాదు. సింగరేణి కార్మికుల వందలాది గొంతులు కలిపి 'కార్మిక'గా ప్రభవించడం జరిగింది. సాహిత్య కళ కూడా వైయక్తిక ఆస్తిగా మారిన ఆధునిక పెట్టుబడిదారీ యుగంలో కథకున్న మౌలికమైన సామూహిక కర్తృత్వానికి 'కార్మిక' పేరు ప్రతీకగా నిలిచింది. అందుకే కార్మికులు ఎదుర్కొనే ప్రతి సమస్య, సమస్యకు పరిష్కారాలు వెదికే దారులు - ఆ క్రమంలో ఎదురయ్యే అణచివేత - అంతిమ విజయాలవైపు చెదరని దృష్టి - కార్మిక కథల్లో వస్తువులయ్యాయి.

కార్మికుల విముక్తి పోరాటంలో ట్రేడ్ యూనియన్ నాయకుల ద్రోహాల్ని ఎండగట్టడం, యూనియన్ల పట్ల కార్మికుల్లో పెరుగుతున్న అసహనం, నిరసనల్ని వర్ణించడం కార్మిక కథల్లో ప్రముఖంగా కనిపిస్తాయి. బొగ్గుబావుల మీద పోలీసులు బలప్రయోగం చేసి కార్మికుల్ని పనిలోకి దించే దౌర్జన్యాన్ని 'ఇంధనం', 'కొత్త ఎత్తు' కథల్లో కార్మిక ఎంతో బలంగా చిత్రించాడు.[80] మేనేజిమెంటు, దొంగ ట్రేడ్ యూనియన్లు, ప్రభుత్వం, పోలీసులకు వ్యతిరేకంగా కార్మికులు సంఘటితమై కార్మిక రాజ్యం వచ్చేవరకూ దీర్ఘకాలిక పోరాటాలకు సన్నద్ధమై వుండాలన్న సైద్ధాంతిక దృక్పథం 'కార్మిక' కథల్లో స్పష్టంగా కనిపిస్తుంది.

బట్టలమిల్లు కార్మికుడికి కట్టుకోవడానికి బట్టలుండవు, మందుల ఫ్యాక్టరీ కార్మికుడికి రోగమొస్తే మందులుండవు - తన శ్రమ శక్తి ద్వారా ఉత్పత్తయిన వస్తువు కార్మికుడికి దక్కదు. బొగ్గు పని కార్మికుడికి వంట చేసుకోడానికి బొగ్గు వుండదు. కార్మికులు తమకవసరమైన **బొగ్గు తెచ్చు**కుంటే 'దొంగలవు'తారు. జైలుపాలవుతారు.[81]

కార్మికుడి కనీసావసరాలు తీర్చాలన్న బాధ్యతని యాజమాన్యం నిర్లక్ష్యం చేస్తుంది. నీళ్లకోసం, నీడకోసం సైతం పోరాడక తప్పదు. బొగ్గు గని కార్మికుల భార్యలు సమ్మెచేసి కార్మిక వాడకు నీళ్ళ పంపులు సాధించుకొనే ఉత్తేజకరమైన కథ తుమ్మేటి రఘోత్తంరెడ్డి రాసిన 'నీళ్లతగువు' రఘోత్తంరెడ్డి రాసిందే మరోకథ - 'ఇల్లు'.[82] పెట్టుబడీదారుడి లాభాల వేట మానవ సంబంధాలని శాసిస్తుంది - మానవతా విలువల్ని మంటగలుపుతుంది. భర్తలనుంచి భార్యల్ని, తండ్రుల్ని నుంచి కొడుకుల్ని వీడదీస్తుంది. కోల్‌ఫిల్లర్ కడుపున బదిలీ ఫిల్లరు పుడతాడనేది బొగ్గు జీవితాల్లో చమత్కారం కాదు - నిజమే. తండ్రీకొడుకులిద్దరూ బొగ్గు బావికే జీవితాన్ని అంకితం చేసినా - సరైన వసతిగల యిల్లుండదు. వసతిలేక కట్టుకున్న భార్యకు దూరమైన నారాయణలు - కొడుకు బాధ చూడలేని వీరయ్యలు ఒకటై నీడ కోసం - కంపెనీ వాళ్ళ ఖాళీ జాగాలో ఇళ్ళు కట్టుకుంటారు. కానీ యాజమాన్యం పోలీసుల అండతో బలప్రయోగం చేసి కట్టుకున్న ఇళ్లని కూల్చివేస్తుంది. అయినా కార్మికుల పోరాట స్ఫూర్తి అడుగంటదు. ఎత్తుకు పైఎత్తుగడతో మొక్కవోని ధైర్యంతో కంపెనీ కార్యాలయం ఆవరణలోనే సంసారాలు పెట్టి పోరాటాన్ని ముందుకు తీసుకున్నారు.

'నీళ్ళ తగవు', 'నీడకోసం' (ఇల్లు) కథలు పరిశ్రమల బయట కూడా కార్మికులు సంఘటిత శక్తితో జీవితాల్ని మెరుగుపరుచుకోడానికి చైతన్యవంతులు కావలసిన అవసరాన్ని అద్భుతంగా చిత్రించాయి. సింగరేణి కార్మికుల కథల్లో వీటికి ప్రత్యేక స్థానముంది.

అయితే కార్మికుల్లో యీ చైతన్యం తీసుకురావడానికి ఒక నిరంతర సంఘర్షణ ఉంది. అనివార్యంగా జీవితాల్లో చోటుచేసుకున్న పెనుగులాటలో ఈ చైతన్యం ఉద్భవించింది. పంటచేలనుంచి, నల్లరేగళ్లనుంచి, నాగేటిచాళ్లనుంచి, అడవిలో వెన్నెలనుంచీ, చల్లని పైరగాలినుంచి గర్మీపేసుల రాకాసి బొగ్గు పొరల్లోని ఊపిరి సలపనివ్వని యంత్రాల్లోకి, మురికి కూపాల్లోకి బతుకు ప్రయాణించి అస్తిత్వం కోసం పోరాటం చేసిన పరిణామంలో ఒక క్రమం వుంది. శ్రమ బతుకులో భాగంగా, శ్రమే బతుకుగా, శ్రమ లాభాలుగా మారితే ఆ దోపిడీ నుంచి విముక్తి పొందాలనే ప్రయత్నం వుంది.

కానీ కార్మికుల్లో కలిగే యీ చైతన్యాన్ని నిరోధించేందుకు అనుక్షణం సాంస్కృతికమైన దాడి జరుగుతూనే వుంటుంది. మరుగుదొడ్ల కోసం మంచినీళ్ల కోసం పోరాడే కార్మిక స్త్రీలకు పాలిస్టర్ చీరల మీద వ్యామోహం కలగజేయడానికీ, హక్కుల కోసం పోరాడే కార్మికులకు సారా దుకాణం తెరవడానికీ, చక్కగా చదువుకొని ఎదగాల్సిన కార్మికుల బిడ్డలకి అశ్లీల సినిమాలు, వ్యాపార నాగరికతకు బానిసలను చేసే టీవీ కార్యక్రమాలు అందించడానికి పాలక వర్గం ఒక పద్ధతి ప్రకారం పనిచేస్తూనే వుంటుంది.[83] ఈ వ్యాపార నాగరికతకు కార్మికవర్గం బలయ్యే ప్రమాదం వుంది. దాన్నుంచీ బయటపడేయగల సాంస్కృతిక యుద్ధం చేరుగలిగింది

మంచి సాహిత్యం మాత్రమే. అటువంటి సాహిత్యాన్ని అందించగలిగింది వర్గ చైతన్యం కలిగిన కార్మిక రచయితలు మాత్రమే.

సింగరేణి కార్మికులనుంచి రచయితలు సాంస్కృతిక సైనికులుగా ఉద్యమావసరాల కనుగుణంగా 'బండకింద బతుకులు' గురించి కథలు రాయడానికి పూనుకున్నారు. 'కోల్‌బెల్ట్' వారపత్రిక అందుకు ఎంతో ప్రోత్సాహం యిచ్చింది. దాని ప్రచురణ సంస్థ అబంపి ప్రచురణలు (గోదావరిఖని), కోల్‌బెల్ట్ కథల్ని సంకలనంగా తీసుకొచ్చింది. అంతకుముందు పవన్‌కుమార్ రాసిన మాండలిక నవల సింగరేణి కార్మిక జీవితాన్ని ప్రతిబింబిస్తూ 'నల్లవజ్రం' (1987)గా యీ సంస్థ నుంచే వెలువడింది.

'సాహిత్యం గొప్పవాళ్ల మనో సృష్టి, సాహిత్యం గొప్పవాళ్ళ సంపద అనే రివాజుకు భిన్నంగా కష్టపడి చెమటోడ్చే కార్మికులు కూడా సాహిత్యం చదవగలరని, చదువురానివారు ఎవరైనా చదివితే వినగలరని'[84] నల్లవజ్రం నిరూపించింది. మళ్లీ అలాగే కార్మికుల కోసం కార్మికులనుండే రచయితలు తయారై 'నల్లకలువలు' 1988) సృష్టించారు. చదువుకున్న పాఠకుల్నే కాక చదువురాని శ్రోతల్ని కూడా ఉద్దేశించిన కథలివి. వీటిలో ఎక్కువ భాగం సింగరేణి కార్మికుల మాండలికంలోనే వున్నాయి. ఈ కథలు కార్మికుల జీవితాన్ని యథాతథంగా వర్ణించడంతో ఆగలేదు. - ఆ జీవితాల్ని శాసిస్తున్న ప్రత్యక్ష పరోక్ష శక్తుల్ని గుర్తించడం - ఆ శక్తుల ప్రభావాన్ని అంచనావేయడం, వాటికి వ్యతిరేకంగా పోరాడటం, అందులో సాధక బాధలు, ఆంక్షలూ నిర్బంధాలూ, మళ్లీ అణచివేతకు వ్యతిరేకంగా పోరాడటం - ఈ క్రమాన్నంతా చిత్రించాయి. ఈ కథా రచయితల్ని - 'వీడియో క్యాసెట్ల విన్యాసాలు; కాన్వెంటు చదువులు విసిరే చిరునవ్వు తళుకు బెళుకులు, వెర్రితలలు వేస్తున్న నేటి వ్యాపార నాగరికతా వ్యామోహం మభ్యపెట్టడం లేదు. పైగా ఈ సుఖాలన్నిటినీ హాయిగా అనుభవిస్తున్నామనుకుని మురిసే అధికారుల జీవితాల్లోని యాంత్రికతని, ఉద్రిక్తతని, తడబాటుని, శూన్యతని గుర్తించి తమ కథల్లో చిత్రిస్తున్నారు. రేడియో టీవీలు వెదజల్లుతున్న క్రికెట్ హోరు, వార్తాపత్రికలు ప్రముఖంగా ప్రచురించే రాజకీయ పంచాంగాలు, సినిమాల్లో చూపించే అసభ్య అశ్లీల సంస్కృతీ విన్యాసాలు కూడా యీ రచయితలకు చరిత్రతో వున్న పేగు సంబంధాన్ని తెంపలేకపోతున్నాయి. అందుచేతనే ప్రతి కథలోనూ, భూతంలాంటి గతం గురించిన విశ్లేషణ, వక్రిస్తున్న వర్తమానంపట్ల అసహనం, పెనువెల్లువలా ముంచుకువస్తున్న భవిష్యత్తు గురించి వ్యగ్రమైన మౌనం కనబడతాయి'.[85] 'జీతం' చాలని జీవితాలు, బొగ్గుబావుల్లో 'ప్రమాదం' లాంటి విషయాలే కాకుండా కాలరీ ప్రాంతాల్లో కార్మికుల్ని ఆర్థికంగా మరింత నిర్వీర్యుల్ని చేసే ఆర్భాటపు చిట్టీలు, లక్కీస్కీములు, లాటరీలు[86] గురించి కూడా అన్ని కోణాల్ని యీ **రచయితలు** లోతుగా విశ్లేషించారు.

కార్మికుడి బాహ్య ప్రపంచం, ఆంతరంగిక ప్రపంచం సర్వస్వం పరాయీకరణకు లోనయ్యే విధాన్ని అద్భుతంగా చిత్రించిన 'శత్రువు' కథ[87] ఈ సంకలనానికి కలికితురాయి. కార్మికుడి శ్రమ పరాయీకరణకు గురై అసంతృప్తికి లోనయ్యే క్రమంలో జీవితం అంతా శూన్యంతో నిండిపోతుంది. దాంతో అతని వైయక్తిక అనుభవాలు, ప్రేమ కరుణ లాంటి సున్నితమైన భావాలన్నీ నశించి పోతాయి. ఈ పరాయీకరణ భార్యాభర్తలమధ్య పెనుభూతమవుతుంది. దాంపత్య సంబంధాల్ని సైతం శాసిస్తుంది. జీవితం చిక్కుబడ్డ దారపువుండలా అస్తవ్యస్తమై - అర్థం కాకుండా పోతుంది.

కార్మికుడి భార్య కూడా దాదాపు యిదే పరిస్థితిని ఎదుర్కొంటుంది. శూన్యమైన బతుకు నీడ్చే భర్తనుంచి ప్రేమతో కూడిన ఒక మాటా - పలుకూ నోచుకోలేని ఆమె జీవితం వెలితిని ఎదుర్కొంటుంది. భర్త కష్టసుఖాల్లో పాలుపంచుకోలేని యంత్రమవుతుంది. నాలుగు గోడలమధ్య బందీ అవుతుంది. పల్లెల్లో భర్తనుండి లభించిన ప్రేమకూ, ఇప్పటి నిరాదరణకూ, అనాసక్తతకూ పొంతన కుదుర్చుకోలేక అసంతృప్తికి లోనవుతుంది.

భార్యాభర్తల మధ్య పూడ్చలేని ఈ అగాధానికి కారణం ఎవరో యిద్దరికీ తెలియదు. పరస్పరం కారణం అనుకుంటూ ద్వేషించుకుంటారు. వాళ్లిద్దరి ఉమ్మడి శత్రువుని గుర్తించలేరు. ఈ సంక్షోభాన్నంతా అత్యంత ప్రతిభతో 'శత్రువు' కథగా మలిచాడు. ఎన్.ఆర్.పవన్‌కుమార్. కార్మిక, రఘోత్తంరెడ్డి సింగరేణి కార్మిక పోరాటానికి సాహిత్య రూపం ఇస్తే, ఆ పోరాటాల వెనుక వున్న తాత్త్విక నేపథ్యాన్ని పవన్‌కుమార్ విశ్లేషించాడు.[87a] కార్మిక జీవితాల్ని శాసించే వ్యక్తుల్నీ - కార్యాచరణ సంబంధాల్నీ, అంతస్సంఘర్షణనీ పరిశోధించిన 'శత్రువు' కథ సింగరేణి కార్మిక కథల్లో అగ్రభాగాన నిలుస్తుంది. వందేళ్ల తెలుగు కథా సాహిత్య చరిత్రలో కార్మిక జీవితాన్ని యింతలోతుగా విశ్లేషించిన కథ యిదొక్కటే అని చెప్పినా తప్పులేదు.

ఇదేవిధంగా తండ్రీకొడుకుల మధ్య రేగే మౌన సంక్షోభాన్ని చిత్రించే కథలు - 'రాక్షసులు' (ఎం.ప్రదీప్), 'దారులు' (మొగురం గట్టయ్య) నల్లకలువలు సంకలనంలో చోటు చేసుకున్నాయి.

నల్లకలువలు కథా రచయితలెవరూ పేరున్న రచయితలు కారు. కొందరు మొదటిసారిగా కలం పట్టిన వాళ్లుకూడా కావచ్చు. కానీ జీవితాన్ని కథగా మలచడంలో ఈ కార్మిక రచయితలు పేరున్న రచయితలెవరికీ తీసిపోరు.

గోదావరిఖని ప్రాంతంలో 'నల్లకలువలు' వికసిస్తున్న కాలంలోనే ఇల్లెందు గనుల్లో సింగరేణి కార్మిక సమాఖ్య స్థాపనలో ముఖ్యపాత్ర వహించిన కార్మిక నాయకుడు వి.ఎస్[88] కథారచయితగా తోటి కార్మికుల్లో చైతన్యాన్ని నింపడానికి పూనుకున్నాడు.

'ఈసారినుండి మేం మీకు చందాలు గట్టం. ఎవ్వరైతే మాకోసం నిజాయితీగా పనిజేస్తరో వాళ్లకు గడ్తం' అని తమ కోసం పనిచేయని ట్రేడ్ యూనియన్లకు చందాలు గట్టడం మానేసిన కార్మికుల వర్గ చైతన్యాన్ని వివరించే 'ఐక్యత - ఘర్షణ' కథ, సమైక్యంగా నిలబడి తోటి కార్మిక సోదరులనందర్నీ కూడగట్టడం ద్వారానే సమస్యల్ని పరిష్కరించుకోవచ్చునని తెలియజేసే 'గుణపాఠం' కథ, వి.ఎస్. కున్న సైద్ధాంతిక దృక్పథాన్ని స్పష్టపరుస్తాయి. కార్మికులంతా ఏకమై పోరాడాలన్న పిలుపునిచ్చిన యీ కథలు కార్మిక నాయకుడిగానేగాక మాండలిక కథా రచయితగా కూడా వి.ఎస్. కున్న సాహిత్య నిబద్ధతని తెలియజేస్తున్నాయి. బతికుంటే వి.ఎస్. మరిన్ని మంచి కథలురాసి వుండేవాడన్న బాధని కలగజేస్తాయి.

సింగరేణి కార్మిక జీవితాల్లోని వివిధ కోణాల్ని విశ్లేషిస్తూ 'బండకింది బతుకులు' పేర్న మాండలిక శీర్షిక 'కోల్‌బెల్ట్' వారపత్రికలో వచ్చింది. దీని రచయిత కయితికాల పోశెట్టి. 'కార్మిక' లాగా కయితికాల పోశెట్టి కూడా ఒక వ్యక్తికాదు. 'గుక్క తిరక్కుండా' చెప్పిన మాట చెప్పకుండా చిత్రమైన విషయాలను చెప్పుకొచ్చేవాడిని ఉత్తర తెలంగాణా మాండలిక భాషలో కయితికాల మనిషి అని అంటారు'.[89] పోశెట్టి కూడా అలాంటి కయితికాల మనిషే. హరిత విప్లవపు వేడికన్నా బొగ్గు బావి వేడే నయమనుకొని పల్లెనంచి కాలేరుకు చేరుకున్న పల్లెటూరు మనిషి పోశెట్టి. బొగ్గుగనుల్లోని లక్షలమంది కార్మికులకు యితను ప్రతీక. సింగరేణి కార్మికలోకాన్నంతా స్వగతాలుగా మనకళ్లముందుంచిన 'కాలం కథ' లివి.[90]

కార్మికుల జీవితాలతో పరిహాసమాడే వేజిబోర్డులు, కార్మిక సంక్షేమ వేదాలు వల్లించే ట్రేడ్ యూనియన్ లీడర్లు, చెవులు కోసి చెవిపోగులు చేతికిచ్చే ఘరానా దొంగ రాజకీయ నాయకులు, దున్నపోతు ఈనింది అంటే దూడను కట్టేయమనే పెత్తనాల పేనులు కంపెనీ అధికారులూ వీళ్లంతా పోశెట్టి వాగ్దాటి ముందు తలు నేలకేసి నిలబడాల్సిందే. పోశెట్టివి వీళ్ళ విషయంలో స్వగతాలు కావు శాపాలు. అందుకు అతను ఎన్నుకున్న భాష శుద్ధమైన మాండలికం. కయితికాల పోశెట్టి వాడిన భాషగురించి యు.ఉమామహేశ్వరరావు ముందుమాటలో యిలా అంటాడు.

'గ్రాంధిక భాషే ప్రామాణిక భాష అయిన ఆ కాలంలో ప్రజాకవి వేమన వ్యావహారికాన్ని ఆశ్రయించాడు. ఇది రూపసారూప్యం వల్లకాదు. వస్తు సామీప్యం వల్లనే. వస్తువు అట్టడుగు వర్గాల ప్రజలది. దానిని రసీకరించి తిరిగి వాళ్లపరం చేయడం'.[91]

ఈ మాటలు మాండలికంలో వస్తున్న రైతాంగ, కార్మిక, గిరిజన కథలన్నిటికీ వర్తిస్తాయి. అట్టడుగు వర్గ ప్రజల జీవితం - పోరాటం కథా వస్తువు అయినప్పుడు, కథలు వారిని చేరాలనే వుద్దేశంతో చెప్పినప్పుడు వాటిలో భాష అనివార్యంగా మాండలికమయి తీరుతుంది.

'మనసు కలకలమున్నప్పుడో, దుఃఖమొచ్చినప్పుడో, కోపమొచ్చినప్పుడో లడలడమొత్తుకున్న'[92] కయితికాల పోశెట్టి మాండలిక భాష 'కార్మిక' కథల్లోని భాషకన్నా కొంచెం విలక్షణమైన - పల్లెటూరి మాండలికం(**Rural dialect**) అని చెప్పవచ్చు.

అల్లం రాజయ్య దగ్గర్నుంచీ కయితికాల పోశెట్టి వరకూ సింగరేణి కార్మిక జీవితంలోని వివిధ కోణాల్ని తెలుగులో మాండలిక కథ చిత్రించింది. కార్మిక జీవితాన్ని యింత సమగ్రంగా, సూక్ష్మంగా యింతకుముందు తెలుగులోనే కాదు, మరే ఇతర భారతీయ భాషలోనూ ప్రజాసాహిత్యంగా రూపొందించిన దాఖలాలు లేవనడం అతిశయోక్తి కాదు. తెలుగు సాహిత్యాన్ని యీ కార్మిక కథలు పరిపుష్టం చేయడం అటుంచితే భాషా విషయకంగా కూడా తెలంగాణా మాండలికం ఒక సమర్థవంతమైన సాహిత్య భాషగా ఎదిగిన క్రమం కూడా వీటిద్వారా వ్యక్తమవుతుంది. సింగరేణి కార్మిక జీవితాన్నే కాకుండా తెలంగాణాలో తక్కిన పరిశ్రమల్లోని కార్మికుల గురించి చెప్పిన కథలు కూడా తెలంగాణా మాండలికంలో వెలువడ్డాయి.

తెలంగాణా బొగ్గు పరిశ్రమకంటే పెద్దది బీడీ పరిశ్రమ. దాదాపు నాలుగు లక్షలమంది కార్మికులు ఈ పరిశ్రమని నడుపుతున్నారు. నిజామాబాదు, ఆదిలాబాదు, మెదక్, కరీంనగర్ జిల్లాల్లో ఈ పరిశ్రమ వ్యాపించి వుంది. బీడీ కార్మికుల్లో ఎక్కువమంది స్త్రీలు. వాళ్లకు సెలవు, బోనసు లాంటి కార్మికులకు లభించే సౌకర్యాల మాటేమోగానీ ప్రభుత్వం నిర్ణయించిన కనీస జీతాలు సైతం దక్కటం లేదు. బీడీ కార్మికుల యూనియన్లుకూడా యీ స్త్రీ కార్మకుల గురించి పట్టించుకోవు. ఈ కార్మికులకున్న మరో ప్రత్యేక సమస్య - యజమానితో ప్రత్యక్ష సంబంధం లేకపోవడం. యజమానులు ఏజెంట్లద్వారా లాభాలు గుంజుకుంటారు. అన్నిటికన్నా పైన యీ స్త్రీల మీద లైంగిక దోపిడి - పెట్టుబడీదారి సమాజంలో పురుషాధిక్యతకు లజ్జారహితమైన తార్కాణంగా బహిరంగంగా జరుగుతోంది.

బీడీ పరిశ్రమలో స్త్రీ కార్మికులు కనీస జీతం, బోనసు, సెలవులాంటి హక్కుల కోసమేగాక లైంగిక దోపిడీకి వ్యతిరేకంగా కూడా పోరాటం చేయక తప్పని పరిస్థితుల్లో సంఘటిత శక్తిగా రూపొందిన క్రమాన్ని చిత్రించే సాహిత్యం తెలుగులో వచ్చింది కానీ - తక్కువ. ఎన్నార్. భోలా రాసిన 'ఆకలి తీర్మానం' కథ, బి.ఎస్.రాములు 'బతుకుపోరు' నవల బీడీ కార్మికుల జీవితంలోని సంఘర్షణని బలంగా చిత్రించాయి. హక్కుల కోసం దోపిడీకి వ్యతిరేకంగా పోరాడక తప్పదని చాటిచెప్పాయి. రెండూ స్త్రీల పరంగానే రావడం యాదృచ్ఛికం కాదు. బీడీ కార్మికుల పోరాటంలోనే స్త్రీవిముక్తి కూడా వుంటుంది అని ప్రత్యక్షంగానే యివి తెలియజేస్తున్నాయి. వరంగల్లులోని కాశీబుగ్గ బీడీ కార్ఖానాలో పనిచేసే స్త్రీ స్వగతంగా సాగిన కథ ఎన్నార్. 'భోలా' రాసిన 'ఆకలి తీర్మానం'[93] తమ కష్టాలు, కన్నీళ్ళు, ఆకలి తీరాలంటే తమమీద ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, శారీరకంగానూ, మానసికంగానూ జరుగుతున్న దోపిడీని, పీడనని నాశనం చెయ్యాలంటే బీడీ ఆకులు కత్తిరించే కత్తెర్లనే ఆయుధాలుగా చేసుకోక తప్పదనే గ్రహింపుతో యీ కథ అంతమవుతుంది.

ఎన్నార్ 'భోలా' రచించిందే మరో కథ 'నూలుపోగు' జంపుకాన్లు తయారుచేసే కూలీల జీవితాన్ని చిత్రించే యీ కథా , బట్టలమిల్లు కార్మికుల భద్రతలేని జీవితం గురించి ఎన్నారెస్

రాసిన 'బంధం'[94] కథ తెలంగాణాలో కార్మిక పోరాటంలో భాగంగానే వెలువడ్డాయి. ఏ పరిశ్రమలోనైనా కార్మికుల జీవితం దోపిడీకి గురవుతుందనీ, దోపిడీ తొలగిపోవాలంటే పోరుదారి తప్ప వేరేదారి లేదని కార్మికులు గ్రహించిన వైనాన్ని యీ కథలన్నీ చిత్రిస్తున్నాయి. అయితే యీ కథా రచయితలు ఒడ్డున వుండి వింత చూసి రాస్తున్న వాళ్ళు కాదు - పోరాటరంగంలో వున్నవాళ్ళే.

సాహిత్యంలోకి గనులనుంచి పరిశ్రమలనుంచి కార్మికుడు వచ్చినట్టేఅడవినుంచి గిరిజనుడు కూడా ప్రవేశించాడు. రైతాంగ, కార్మిక, గిరిజనులందరూ ఒకే సైద్ధాంతిక దృక్పథంతో పీడనకు వ్యతిరేకంగా ఏకమయ్యే క్రమం తెలంగాణాలో 70, 80ల్లో ముప్పేటగా జరిగింది. రైతాంగ కార్మిక జీవితాన్ని సాహిత్య రూపాలుగా రైతాంగ కార్మిక రచయితలు తీర్చిదిద్దినట్టే గిరిజన జీవితాన్ని పోరాటాన్ని సాహిత్యంగా మలిచే బాధ్యతని గిరిజనుడే స్వీకరించాడు.

## గిరిజన పోరాట కథలు

భారతదేశంలో గిరిజనుడిని అడవినుంచీ, భూమినుంచీ వేరుచేసే పీడన బ్రిటిష్‌వాళ్ళు 1920లో అడవి చట్టాలను అమలుపరచే క్రమంలో మొదలైంది. అడవి సంరక్షణ పేర్న అడవినుంచి లాభాలు పిండుకోవడానికి ఈ చట్టాల్ని వలసపాలకులు అమలులోకి తెచ్చారు. దరిమిలా అడవీ, అడవిలోని గిరిజనుడు ప్రత్యక్షంగా దోపిడీకి గురవడం జరిగింది. దాంతో దేశంలో అన్నిచోట్లా గిరిజనులు బ్రిటిష్ సామ్రాజ్యాధికారాన్ని ప్రశ్నిస్తూ తిరుగుబాట్లు చేశారు. ఉత్తర భారతంలో సంథాలుల తిరుగుబాటు, తెబాగా ఉద్యమం, ఆంధ్రదేశంలో మన్నెం తిరుగుబాటు, రంపపితూరీలు ఇంచుమించు ఒకే కాలంలో జరిగాయి. ఇవన్నీ బ్రిటిష్‌వాడి సైనిక అణచివేతకి గురయినా - గిరిజనుల పోరాట పటిమకు తార్కాణంగా భావితరాల గిరిజన పోరాటాలకు స్ఫూర్తిగా నిలిచిపోతాయి.

అడవిమీద రాబడిని మరింతగా పెంచుకోవడానికి నైజాం సర్కారు 1925-26 ప్రాంతంలో ఆదిలాబాదు గిరిజన ప్రాంతాల్లోకి ఇంగ్లీషు వాళ్ల అటవీ చట్టాలని దించింది.

అంతకుముందు 1885లోనే ఆదిలాబాదులోనే ఉట్నూరు తాలూకా గోండులు బ్రిటిష్ సామ్రాజ్యాధికారానికి వ్యతిరేకంగా యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో దాదాపు 300మంది గోండులు బ్రిటిష్ దమనకాండకు బలయ్యారు. ఆ యుద్ధానికి నాయకత్వం వహించిన రాంజీ గోండుని ఇంగ్లీషువాళ్ళు నిర్మల్‌లో (తర్వాత ఇది ఉరులమర్రిగా పేరొందింది.) ఉరితీశారు. అప్పటినుండి వలసవాదుల పాలనలో గిరిజనులకీ పాలకులకీ మధ్య ఘర్షణలు జరుగుతూనే వున్నాయి.

నిజాం కొత్తగా అమల్లోకి తెచ్చిన అటవీ చట్టాల ఫలితంగా గిరిజనులు అడవినుంచీ వేరుకావడం లేదా సాగుయోగ్యం చేసుకున్న భూముల్ని కోల్పోయి కొత్త 'పోడు' కోసం అడవి లోతట్టు ప్రాంతాలకి తరలిపోవడం జరిగింది. ఫారెస్టు అధికారుల, భూస్వాముల తుపాకీ బలంముందు గిరిజనులు భూములు కోల్పోవడం భారతదేశం అంతటా దాదాపు ఒకేలా జరిగింది. భారతదేశపు మిగతా రైతాంగం భూముల్ని కోల్పోయినట్లే గిరిజనుడు కూడా కోల్పోయాడు. కాకపోతే అడవి చట్టాలు యీ దోపిడీకి అధికార ముద్రవేశాయి.

ఈ చట్టాలకు వ్యతిరేకంగా ఆదిలాబాదు అడవుల్లో గోండు కోలాముల పెనుగులాట కొమురం భీము కాలం నాటికి ఒక రూపం తీసుకుంది. గిరిజనుల భూముల్ని సాగుయోగ్యం చేస్తే, భూస్వాములు వాటికి పట్టాలు సృష్టించి తమ పేర్న దాఖలా పర్చుకోవడం, మైదాన ప్రాంతాలనుంచీ వచ్చిన షావుకార్లు వడ్డీ వ్యాపారంలో భూముల్ని లాక్కోవడం, ఫారెస్టు అధికారుల పీడన - ఇవన్నీ కొమురం భీం నాయకత్వంలో గిరిజనులు సంఘటిత మయ్యేందుకు కారణమయ్యాయి. గిరిజనులు భూమినుంచీ, అడవినుంచీ వేరుకాకుండా వుండాలంటే ఎవరి ప్రమేయం లేని 'రాజ్యాధికారం' కావాలని - భీం గ్రహించాడు. తాము పొందించుకున్న పన్నెండు గిరిజన గ్రామాల్ని - నైజాం సర్కారునుంచీ, భూస్వాములనుంచీ, ఫారెస్టు అధికారులనుంచీ రక్షించుకోవడానికి 1939లో బాబే ఝురీ కొండల్లో గిరిజనులు భీం నాయకత్వంలో సాయుధులయ్యారు. కానీ బాబేఝురీ - జోడెన్ ఘాట్ పోరాటాన్ని 1940 సెప్టెంబర్ 1న నిజాం సైనిక బలం రాక్షసంగా అణచివేసింది. రాంజీగోండు వారసత్వంలో కొమురం భీం చేసిన యీ పోరాటానికి దారితీసిన పరిస్థితుల గురించి అంచనా వేయటానికి నిజాం హేమన్ డార్ఫ్‌ని పంపించాడు. డార్ఫ్ గిరిజనుల జీవితాన్ని మెరుగుపరచడం కోసం కొన్ని సంస్కరణలు ప్రతిపాదించాడు.

డార్ఫ్ సంస్కరణల ఫలితంగా ఆదిలాబాద్ గిరిజనులకి భూములకు పట్టాలు దొరికాయి. కానీ అవి భూస్వాములు గిరిజనుల దగ్గర్నుంచీ కాజేసిన భూములు కాదు. అడవి లోతట్టు భూములకి పట్టాలిచ్చిన కారణంగా అడవిలోకి బలవంతంగా చొచ్చుకువచ్చిన భూస్వామ్యం చెక్కుచెదరలేదు. ఆ కారణంగానే మళ్ళీ గిరిజనుల భూముల్ని భూస్వాములు చేజిక్కించుకున్నారు. 1977లో హేమన్ డార్ఫ్ ఆదిలాబాదులో 1942 నాటి పరిస్థితినే మళ్ళీ చూశాడు.[95]

బ్రతుకుతెరువు వెతుక్కుంటూ మైదాన ప్రాంతాల్నుంచీ వచ్చిన షావుకార్లు గిరిజనుల అమాయకత్వాన్నీ, అవిద్యనీ ఆసరా చేసుకుని దోపిడీని నిరాఘాటంగా కొనసాగించారు:

1. జొన్నలు, అవిశెలు, కందులు, పెసలు, ఆముదాలు లాంటి వ్యవసాయోత్పత్తుల్నీ బంక, పిప్పపూవు, సారెపప్పులాంటి అటవీ వుత్పత్తుల్నీ అతి చౌకధరకి గిరిజనులనుంచి కాజేయడం.

2. పొగాకు, ఉప్పు, మిరపకాయలు లాంటి వస్తువుల్ని - కొన్ని రకాల అలంకరణ సామగ్రిని గిరిజనులకి అధిక ధరలకి అమ్మడం.

3. గిరిజనుల దగ్గర్నుంచీ వస్తువుల్ని కుదువబెట్టుకుని వడ్డీలకు చక్రవడ్డీలు కట్టి వస్తువుల్ని సొంతం చేసుకోవడం.

4. పండించిన పంటలని షావుకారి యింటికి ఏళ్ళ తరబడి తోలినా అప్పు తీరలేదని చివరికి పశువుల్నీ, భూముల్నీ స్వాధీనం చేసుకోవడం.

5. గిరిజనులకు పంటల సమయంలో నాగు / మిత్తి యిచ్చేటప్పుడు చిన్నకొలతల పాత్రల్ని వాడి, వాళ్లనుంచి తీసుకొనేటప్పుడు పెద్ద కొలతల పాత్రలు వాడటం.

6. తెల్లకాగితాలమీద వేలిముద్రలు వేయించుకుని - తమ యిష్టానుసారంగా వాడుకోవడం.

7. అప్పుకింద జప్తు చేసుకున్న పశువుల్ని మళ్లీ గిరిజనులకే యిచ్చి వాటి పోషణ భారం వాళ్లకే వదిలేసి, ఆ పశువుల్ని వ్యవసాయానికి వాడుకున్నందుకు - మళ్లీ జొన్నలో, అవిశలో వసూలు చేయడం.

8. పద్దు పుస్తకాల్లో దొంగ లెక్కలు రాసి దౌర్జన్యంగా భూములు స్వాధీన పర్చుకోవడం.

9. ఇచ్చిన దొంగలెక్కల అప్పులకి కోర్టులనుండి డిక్రీలు పొంది ఆస్తుల్ని - ముఖ్యంగా భూముల్ని, బంగారాన్ని కాజేయడం.

షావుకార్ల దోపిడీకి యివి కొన్ని ఉదాహరణలు మాత్రమే.[96] గిరిజనుల్ని దోచుకోవడంలో దుర్మార్గపు ఎత్తుగడలన్నిటికీ షావుకార్లు సంపాదించిన వందలాది ఎకరాలు, లక్షలాది రూపాయల ఆస్తులే ఉదాహరణ.

వీళ్లకుతోడు ప్రభుత్వ వ్యవస్థలోని భాగాలైన గిరిజన కోఆపరేటివ్ కార్పొరేషన్, రాష్ట్ర ఫారెస్టు డెవలప్‌మెంట్ కార్పొరేషన్, రాష్ట్ర ప్రభుత్వ అటవీ శాఖ గిరిజనుల్ని నిరంతరం చట్టబద్ధంగా అధికార దౌర్జన్యంతో దోచుకుంటూనే వుంటారు. అడవిలోంచి కట్టెలు తెస్తే జరిమానాలు, శిక్షల బెదిరింపులతో నిర్బంధ వసూళ్ళు, పశువుల్ని మేపితే పుల్లరి, గుడిసె వేసుకుంటే లంచాలూ, దొంగకేసులు యివన్నీ అటవీ శాఖాధికారుల (జంగ్లాతోళ్ళ) దోపిడీలో కొన్ని భాగాలు. ఫారెస్టు డెవలప్‌మెంట్, గిరిజన కోపరేటివ్ కార్పొరేషన్లు పగటి దోపిడీకి ప్రతిరూపాలు. నిర్ణయించిన కూలీకంటే తక్కువ కూలీకి పనిచేయించుకోవడం, లాభాల కోసం సబ్ కాంట్రాక్టులకిచ్చి కంట్రాక్టర్‌కి దోపిడీలో సహాయపడటం, అటవీ ఉత్పత్తుల్ని తమ దగ్గరే అమ్మాలనీ - అదీ సరైన ధర ఇవ్వకుండా నిర్బంధించడం ఇలా ప్రభుత్వ ముద్రతో ఈ రెండు కార్పొరేషన్లు గిరిజనుల శ్రమశక్తినీ అటవీ వుత్పత్తుల్నీ దోచుకుంటాయి.

వీటన్నిటికారణంగా అడవి తల్లి బిడ్డల ఆర్థిక పరిస్థితి అధ్వాన్నమైపోయింది. దాంతో తెలంగాణాలో మళ్లీ గిరిజనోద్యమాలు ప్రారంభమయ్యాయి. కొమురం భీం వారసత్వం

అందిపుచ్చుకుని, కరీంనగర్ రైతాంగ పోరాట స్ఫూర్తితో పారకల పార్టీ నాయకత్వంలో గిరిజనులు సంఘటితమయ్యారు. భూమి సమస్యను ప్రధానం చేసుకుని షావుకార్ల దోపిడీకీ, ఫారెస్టు అధికారుల నిరంకుశ చట్టాలకీ, సాగుభూముల్లో పిచ్చితుమ్మలు నాటే ప్లాంటేషన్లకీ వ్యతిరేకంగా గిరిజనులు తిరగబడ్డారు. పిప్పల్‌ధరిలో ప్రభుత్వ దురాక్రమణకు గురైన వంద ఎకరాల ప్లాంటేషన్‌ను నరికి సాగుచేసుకోవడంతో ఆదిలాబాద్ ఆదివాసుల పోరాటం ప్రారంభమైంది.[97] ఉట్నూరు తాలూకాలో మొదలైన ఈ పోరాటం ఆసిఫాబాద్, సిర్పూరు, ఆదిలాబాద్ తాలూకాల్లో భూస్వాములు అక్రమంగా ఆక్రమించుకున్న భూముల్ని గిరిజనులు తిరిగి స్వాధీనం చేసుకునేవరకు ఎదిగింది. కొన్ని ప్రాంతాల్లో అడవి నరికి కొత్త భూమిని సాగులోకి తెచ్చుకున్నారు. 1980 నాటికీ ఉద్యమం చెన్నూరు ఖానాపూరు తాలూకాలకి పాకింది.

భూమిమీద, అడవిమీద హక్కు కోసం గిరిజన రైతుకూలీ సంఘం జెండాకింద ఒకటయ్యారు. పోరాటం సరిహద్దు రాష్ట్రాలకి సైతం పాకింది. ప్రభుత్వంనుంచి అణచివేత ఎక్కువైంది. గిరిజన గ్రామాల్లో పోలీసు క్యాంపులు ఏర్పాటయ్యాయి. అక్రమ కేసులు ఎక్కువయ్యాయి.[98] ఈ నిర్బంధానికి వ్యతిరేకంగా ఆదిలాబాద్ జిల్లా గిరిజన రైతుకూలీ సంఘం ఇంద్రవెల్లిలో 1981 ఏప్రిల్ 20న మొదటి మహాసభ జరపడానికి తలపెట్టింది. సభ జరగకుండా అడ్డుకోవడానికి సభకు వస్తున్న జనంమీద పోలీసులు కాల్పులు జరిపారు. ఎంతోమంది గిరిజనులు మరణించారు. ఇంద్రవెల్లి సంఘటన గిరిజనుల్ని మరింత సంఘటితం చేసింది.

ఇంద్రవెల్లి సంఘటన గిరిజన పోరాట సాహిత్య సృజనకు కారణమైంది. గిరిజనుల జీవితంలో ఎదుర్కొనే నిరంతర దోపిడీని, పోరాటానికి సమాయత్తమవడానికి దారితీసిన పరిస్థితుల్ని ప్రజలకు తెలియజేసే అవసరంలోంచి గిరిజన పోరాట కథలు వెలువడ్డాయి. అంతకుముందు శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటానికి దారితీసిన యిటువంటి పరిస్థితుల గురించి భూషణం కథలు, నవలలు రాశాడు. అంతకుముందు కొందరు రచయితలు శ్రీకాకుళం గిరిజన జీవితాన్ని కథలుగా చెప్పారుగానీ గిరిజనులమీద షావుకార్ల దోపిడీని, గిరిజన కార్పొరేషన్ల ఉద్ధరింపునీ దోపిడీకి వ్యతిరేకంగా అడవి అంటుకుని పోరాటమే దారి అని గిరిజనులు తెలుసుకోవడాన్ని భూషణం శ్రీకాకుళం మాండలికంలో సజీవంగా చిత్రించాడు.

శ్రీకాకుళం రాజకీయ ఉద్యమం ఆదిలాబాదులో కొనసాగింది. 1981 ఏప్రిల్ 20 తర్వాత తెలంగాణా గిరిజన పోరాట కథ శ్రీకాకుళంనుంచి పుట్టిన సాహిత్యోద్యమ వారసత్వాన్ని అందిపుచ్చుకుంది. గిరిజన జీవితాన్ని సంఘర్షణనీ, సంస్కృతినీ మరింత సమగ్రంగా చిత్రించడంలో గిరిజన భాష కూడా ప్రముఖ భాగమైంది. గోండు భాష తెలుగు సాహిత్యంలో

ప్రవేశించి ఈ కథలకి ప్రత్యేకతని సాధించింది. గిరిజన జీవితం కథా వస్తువైనప్పుడు గిరిజన భాష అనివార్యంగా కథనంలో సైతం చోటుచేసుకుంది.

గోండు కోలాం మొ॥ గిరిజన జీవితాల్ని తెలుగులో చిత్రించవలసినప్పుడు వారి భాషలతో (గోండు, కోలామీ) మిళితమైన మాండలికాన్నే కథా రచయితలు ఎన్నుకున్నారు. గిరిజనులతో మమేకమైన రచయితలు, గిరిజనులనుండి వచ్చిన రచయితలు మాత్రమే వారి సంస్కృతిని సమగ్రంగా కథల్లో చూపగలుగుతారు. ఈ రచయితలు కాకుంటే దాదాపు అందరూ, లేదా చాలామంది అక్కడ పుట్టినవారు. అక్కడ పెరిగినవారు. ఆ గడ్డపై జీవిస్తున్నారు, వయసులో చిన్నవారే అయినా అనాదిగా అక్కడ సాగుతున్న దోపిడీ గురించి పీడన గురించీ వారి తాత తండ్రులనుండి ఎన్నో విన్నవారు. స్వయంగా కన్నవారు. ఆ నేలపై పీడితులు పీడించే వారికెదురు తిరిగింది లగాయితూ అక్కడ జరిగిన ప్రతి ఘర్షణకూ అణచివేత యత్నానికీ, పేదల ప్రతిఘటనకూ, ప్రభువుల దమనకాండకూ, పిచ్చెత్తిన రాజ్యహింసకూ, పెల్లుబికిన ప్రతిహింసకూ, ఆదినుండి నేటి దాకా సాగుతూ వచ్చిన మారణహోమాలకూ వీరంతా ప్రత్యక్ష సాక్షులు. వీరి కథలన్నీ ఓ విధమైన వాఙ్మూలాలు.[99]

అందుకే వెంకన్న రాసిన 'కన్నీటి కథ - నీటికథ 'పెళ్లికావాలి', 'కాయిదా', ' ఐదు రూపాయల కథ', 'భూమి కొరకు' లాంటి కథలు 'డాక్యుమెంటరీ'ల్లా కనిపిస్తాయి.[100] ఇంద్రవెల్లి కాల్పుల్లో గిరిజనుల రక్తం తడి ఆరకముందే యీ కథలు వెలువడ్డాయి. గిరిజనుల పోరాట నేపథ్యం వివరించిన యివి కథలు కావు - జీవిత చిత్రాలు- ప్రత్యక్ష కథనాలూ.

వీటిలోని ఐదురూపాయల కథని పి.చందు ఆ తర్వాత 'అనామతు ఖాతా'గా మలచాడు![101] రెండు తరాలపాటు పండిన పంట అంతా కట్టి అప్పు తీర్చినా - అనామతు ఖాతాగా ఐదురూపాయలు రాసి - దాన్నే ఐదువందలు చేసి బాకీ వసూలు కోసం పోలీసుల సహాయంతో జప్తుకొచ్చిన షావుకారి దౌర్జన్యాన్ని చెప్పే యీ గాథ గిరిజనుడు ప్రతిఘటించడంతో పూర్తవుతుంది.

గిరిజనులు పేపరుమిల్లు వాళ్ల కోసం అడవిలో బొంగుపనికి వెళ్తుంటారు. బొంగుపని నడిచినంతకాలం మరే సుఖం వాళ్ళెరుగరు. బొంగులు కొట్టి - కుప్పలు గట్టి లారీలకెత్తడం, లారీల కోసం కొత్త మట్టిరోడ్లు వేయడం కూడా వాళ్లపనే. పనికాలంలో సూపర్వైజర్ రేషన్ తెస్తాడు. అందులో సగానికి సగం దోపిడీ. ముందు మాట్లాడుకున్న దానికన్నా తక్కువ లెక్కలుగట్టి కూలి ఇవ్వడం కంపెనీ వాళ్ల దోపిడీలో మరో భాగం. ఆ చిక్కు లెక్కలు తెలియని గోండులు నిరంతరం ఎదుర్కొనే దౌర్జన్యాల్ని దోపిడీని 'సాహు' రాసిన 'రక్తపింజెర' వర్ణిస్తుంది.[102] చివరకు 'సంఘం' అండతో గిరిజనులు సంఘటితంగా పనులు బందు పెట్టాలనుకుంటారు. దాంతో అణచివేత మొదలవుతుంది. గోండు గిరిజనుల్లో తరతరాల దోపిడీకి వ్యతిరేకంగా రగిలే చైతన్యానికి మొదటి దశని 'రక్తపింజెర' కథ చిత్రించింది..

గిరిజనులు అంతటితో ఆగలేదు. అడవిలో పిచ్చి తుమ్మల ప్లాంటేషన్లకి వ్యతిరేకంగా పోరు మొదలుపెట్టారు. సాగులోకి తెచ్చుకున్న భూమికి ప్రభుత్వం పట్టాలివ్వాల్సింది పోయి 'బేదఖలు' నోటీసు లిచ్చింది. కానీ 'భూమి లేంది బువ్వలేదు' - అని గిరిజనులంతా భూమి దక్కించుకోవడానికీ 'ఊడులానికే భూమి పాజిలీ' (దున్నే వానికే భూమి కావాలి) అనే నినాదంతో - తుడుం మోగించారు.[103]

తుడుం గిరిజనుల సాంప్రదాయిక వాద్యం. అది వాళ్ల ప్రచార సాధనం. అడవిలో దూరంగా విసిరేసినట్టున్న గూడేలను తుడుం కలుపుతుంది. గిరిజనులు సామూహికంగా జరుపుకునే కార్యక్రమాలన్నిటినీ తుడుం మోగించడం ద్వారానే తెలియజేసుకుంటారు. భూపోరాటం గిరిజనుల జీవితంలో అనివార్యంగా మొదలయిన జాతర. ఈ జాతరలో అందరూ సమైక్యం కావడానికి 'తుడుం' ఉపయోగపడింది. సంఘం నాయకుల్ని అరెస్టు చేయడానికి పోలీసులు గూడేలమీద పడ్డప్పుడు 'తుడుం' మోగించి గిరిజనులంతా ఖాకీగుడ్డల వాళ్లనీ, తెల్లబట్టల వాళ్లనీ వెంటబడి తరిమిన యథార్థ సంఘటనని 'తుడుం' కథగా గోదావరి మలచిన తీరు చాలా హృద్యంగా వుంది.

శత్రువు నెదిరించడానికి తుడుం మోగించి ఆయుధం సైతం ధరించక తప్పదని సందేశమిచ్చిన కథ 'సాహూ' రచించిన 'మరట్ తుడుం పాయానా' (మనందరం తుడుం గొట్టాలే). ఫారెస్టు అధికారులకీ, వడ్డీ వ్యాపారస్తులకు వ్యతిరేకంగా చేపట్టిన పోరాటం గిరిజన గూడేలన్నిటినీ కలుపుకుని సాయుధ భూపోరాటంగా రూపుదిద్దుకోడాన్ని యీ కథ చిత్రించింది. అణచివేత ఎక్కువైనప్పుడు ప్రతిఘటన కూడా ఉన్నత దశకు చేరుకుంటుందని చెప్తూ పోరాటం అనివార్యంగా సాగాల్సిన దారిని సూచించింది.

ఆదిలాబాద్ గిరిజన పోరాటంలో తుడుం ఒక ప్రత్యేక స్థానం పొందింది. పల్లెపల్లెకూ గుడిసె గుడిసెకూ మనిషి పోయి పిలిచినట్లుగా తుడుం మోగింది. గిరిజన జాతుల్ని సమైక్యపరచి ఒక తాటిమీద నిలిపింది తుడుం. శత్రువు ఉనికిని తెలియజేసి జాగ్రత్తపడేలా చేసింది. గిరిజనుల్లో పోరాట చైతన్యం నింపిన తుడుం పోలీసుల గుండెల్లో కల్లోలం రేపింది. గూడెంమీద పడగానే ముందు తుడుం మీద దాడి చేయాల్సిన అవసరం పోలీసులకు ఏర్పడింది. పై అధికారులకి పంపే రిపోర్టుల్లో తుడుం గిరిజనులకు ఒక ప్రముఖ ఆయుధంగానూ పోలీసులకు ప్రమాదంగానూ ఎలా పరిణమించిందో తెలియజేసే వివరాలు చోటుచేసుకున్నాయి.[104]

చివరికి తుడుం గిరిజనుల జీవితానికీ, ఆదిలాబాద్ గిరిజన పోరాటానికీ, పోరాట సాహిత్యానికీ ప్రతీక అయింది.[105]

గిరిజన రైతుకూలీ సంఘాల్ని గూడేల్లో నిర్మిస్తూ ఉద్యమ వ్యాప్తికి దళాలు పనిచేస్తూ ప్రజల ఆర్థిక రాజకీయావసరాలతోపాటు వైద్య అవసరాలకు కూడా బాధ్యత వహించేవి.

అయితే పోలీసుల నిఘా అప్పటికే ఉధృతంగా వున్న కారణంగా గిరిజన ప్రాంతాల్లో పార్టీ కార్యకర్తలు నీళ్లల్లో చేపల్లా పనిచేయాల్సి వచ్చేది. వైద్య సహాయం చేయడానికి వచ్చిన పార్టీ కార్యకర్తని ప్రజలంతా కడుపులో దాచుకుని పోలీసులనుండి రక్షించిన వైనాన్ని 'గంగజిమ్మ'[106] కథ చిత్రించింది. ప్రజల్లో పార్టీపట్ల పెరుగుతున్న ఆదరణ నీ, క్రమశిక్షణ నీ, చైతన్యాన్నీ యీ కథ ప్రస్ఫుటం చేస్తుంది. ఇంద్రవెల్లి సంఘటనకు ముందే యీ కథ రావటం గమనించాల్సిన విషయం.

మొదటిసారిగా రాష్ట్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడినా గిరిజనులపై అణచివేతగానీ, గిరిజనుల పోరాట పటిమగానీ తగ్గలేదు.[107] గిరిజనులు సాగులోకి తెచ్చిన భూముల్ని మళ్లీ స్వాధీనం చేసుకోవటానికి రెవిన్యూ, ఫారెస్టు అధికారులు పోలీసుల సహాయంతో గూడేలమీద దాడిచేస్తే - గిరిజనులంతా సమైక్యంగా వాళ్లని పారదోలిన దుబ్బగూడెం సంఘటన బైనెట్ 'భూమి మాదె - అడవీ మాదే'లో చక్కగా చిత్రించాడు![108] ఇలాంటి దాడులు జరిగినప్పుడు చుట్టుపక్కల గిరిజన గూడేలన్నీ తుడుం పిలుపుతో సంఘటనా స్థలాన్ని చేరుకునేవి.

స్వాధీనం చేసుకున్న భూముల్ని నిలుపుకోవడానికే కాకుండా పోలీసులు గూడేలమీద దాడిచేసి మనుషుల్ని ఎత్తుకుపోతున్నప్పుడు కూడా గిరిజనులదే విధంగా ప్రతిఘటించేవారు. వీరికి నైతిక, మానసిక బలం ఇవ్వటానికి దళాలు గూడేలలో విడిది చేసి పోరాట వ్యూహాల్ని చర్చిస్తూ వుండేవి. అడవిలో దళాల కదలికపై గట్టి నిఘా వేసి వుండే పోలీసుల కళ్లుగప్పి ఆకలి దప్పిక ఎరుగకుండా విప్లవ కార్యాచరణకి అంకితమైన కార్యకర్తల ఉద్యమ నిరతిని గిరిజనులతో మమేకమైన తీరుని పి.చందు 'గెరిల్లా' కథ తెలియజేస్తుంది.[109]

1981లో ఇంద్రవెల్లిలో పోలీసుల తుపాకీ తూటాలకు చెట్టుకొకరు చెదిరిన గిరిజనులు - 1984లో సాత్నాలాకి వచ్చేసరికి తుడుం పిలుపు అందుకొని అదే రాజ్యహింసని సమైక్యంగా ఎదుర్కోగలిగారు. సాత్నాలా ప్రాజెక్టు కింద ముంపుకు గురయ్యే ప్రాంతాల గిరిజనులు పోలీసు దాడిని ప్రతిఘటించి తిప్పికొట్టడం గిరిజన పోరాటంలో గుణాత్మకంగా వచ్చినమార్పుకి ప్రతీక. సాత్నాల సంఘటనని ప్రధానేతివృత్తంగా చేసుకుని మాంగనీసు తవ్వే గిరిజన కూలీలు బొంగుపని కూలీల్లా కూలీరేట్ల పెంపుదల కోసం సమ్మె చేయడం, గిరిజన - గిరిజనేతర పేద వర్గాలమధ్య వచ్చిన మిత్ర వైరుధ్యాల్ని సైద్ధాంతిక అవగాహనతో పారకల పార్టీ పరిష్కరించడం లాంటి ఆనుషంగిక సంఘటనలను జోడించి 1981 నుంచి 1984 వరకూ జరిగిన పోరాట క్రమాన్ని తొడుసం జంగు 'రగల్ రాజ్జెం మైసివాకట్' (ఎర్ర రాజ్యం గెలిచి వస్తాం) కథలో చిత్రించాడు. యథార్థ సంఘటనని కథారూపంలో మార్చే సృజనాత్మక శక్తిని కొత్తగా కలంపట్టిన రైతాంగ - కార్మిక - గిరిజన రచయితల్లో స్పష్టంగా చూడవచ్చు. వస్తువు - భాష - కూర్పు విప్లవ సాహిత్యోద్యమంలో ప్రజలనుంచే గ్రహించి ప్రజల కోసమే అంకితం

చేయడంలో గతి తార్కిక భౌతిక వాదాన్ని సృజనాత్మకంగా వర్తమాన వాస్తవాలకు అన్వయించడంలో యీ రచయితలు ఒక చరిత్రని నిర్మించారు. ఆవిధంగా విప్లవ సంస్కృతి లక్ష్యాన్ని నెరవేర్చగలిగారు. అంతేగాదు స్వయంగా పోరాట మార్గంలో నడిచి విప్లవాచరణకూ - సాహిత్య సృజనకూ విడదీయరాని సంబంధాన్ని స్థాపించగలిగారు.

విప్లవం అడవిలో వెన్నెలలా వ్యాపించింది. గిరిజన జీవితాల్లోని చీకటి కోణాల్లోకి తొంగి చూసి, ఆ చీకటిని పారదోలడానికి అడవిలోకి వచ్చిన పొరకల పార్టీ వెన్నెలయి ప్రసరించినట్లు బి.ఎస్. రాములు 'అడవిలో వెన్నెల' కథ[110] వర్ణించింది. గిరిజన సంస్కృతిని కళ్లకు కట్టినట్లు చూపెడుతూ - పోరాడందే గిరిజన జీవితం మారదు అనే అనివార్య పరిస్థితికి దారితీసిన అనేక సంఘటనలను క్రోడీకరించిన యీ కథ పోరాటం ఆంధ్రప్రదేశ్ సరిహద్దులు దాటి మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌ల ఆదివాస ప్రాంతాలకు వ్యాపించిన నేపథ్యాన్ని వివరించింది.

గిరిజనోద్యమం సరిహద్దు రాష్ట్రాల్లో వ్యాపించిన దరిమిలా దండకారణ్య ప్రాంతాన్ని పార్టీ విముక్తి ప్రాంతంగా ప్రకటించింది. ఈ దశలో వేర్వేరు ప్రాంతాల్లో దళాల వ్యూహాలు - రహస్య జీవితం గ్రామాలపై పోలీసు దాడులు - వీటికి సంబంధించి అడపా తడపా కథలు వచ్చాయి![110a] కానీ ఉద్యమ స్వరూపాన్ని చిత్రించడంలో అవి అంతగా సఫలం కాలేదు.

రైతాంగ గిరిజన ఉద్యమాలను పార్టీ కార్యకర్తల దళ జీవితాల్ని తెలియజేస్తూ పులి ఆనందమోహన్ 'వసంత గీతం' నవల రాశారు.

పోరాటం గిరిజన సంస్కృతిలో తీసుకువచ్చిన మార్పునీ గిరిజన కుటుంబ వ్యవస్థలో కలిగించిన సంచలనాన్నీ చిత్రించిన కథలు రాలేదనే చెప్పాలి. సృజన ఆగిపోయిన తర్వాత రాడికల్ మార్చ్, అరుణతారల్లో వచ్చిన కథలు కూడా యీ కోణాన్ని స్పృశించలేదు. అయితే సాధన రాసిన 'అడవిలో అన్నలు' నవల[111] ఆ లోటు తీర్చుతుంది. గిరిజనుల సాంస్కృతిక జీవితాన్ని పెట్టుబడిదారీ నాగరికత ఛిన్నాభిన్నం చేస్తున్న వైఖరిని ఖండిస్తూ - సాంస్కృతిక రంగంలో విప్లవకారులు గిరిజనులతో మమేకం కావడంలోనూ, గిరిజనుల సామూహిక సంస్కృతిని పరిరక్షిస్తూనే ఆ సంస్కృతిలో భాగమై వాళ్ల ఆర్థిక జీవితం అస్తవ్యస్తం చేసే సంప్రదాయాలలోని చెడుని ఎత్తిచూపడంలోనూ తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి దళ సభ్యులు చేసిన చర్చలు ఆలోచన రేకెత్తిస్తాయి. సాధన రాసిందే మరో నవల 'రాగో' కూడా గిరిజన సంస్కృతికి ప్రతిబింబంగా నిలిచింది- పాఠక వర్గంలో సంచలనం సృష్టించింది.

ఏది ఏమయినప్పటికీ తెలంగాణా గిరిజన జీవితాన్నీ, సంస్కృతినీ, భాషనీ - పోరాటంలో అంతర్భాగం చేసి 80నుంచి 90 వరకూ ఒక దశాబ్దం పాటు నడిచిన చరిత్రని యీ కథలు ప్రతిఫలించిన తీరు అపూర్వమైంది. తెలుగు కథల్లోనే కాదు - తెలంగాణా మాండలిక కథల్లో సైతం యివి విశిష్టమైనవి. అసంఖ్యాకమైన గోండు, కొలామీ పదాలు తెలుగు భాషలో

కలగలిసిపోయి వినూత్నమైన మాండలిక భాషని పాఠకులకు పరిచయం చేశాయి. గిరిజనుల సంస్కృతి వాహకంగా యీ భాష పనిచేసింది. ఆ నుడికారాన్నుంచి, పద బంధాలనుంచి వేరుచేసి గిరిజన సంస్కృతిని చూడలేం. గిరిజనుల సంస్కృతి సామూహికమైంది. అది సామూహిక వారసత్వంలోనే జీవించి ఒక తరంనుంచి మరో తరానికి అందుతుంది. అది భౌతిక జీవితంతో ముడిపడివున్న వ్యావసాయిక వుత్పత్తి క్రమంలో సైతం సామూహికంగానే కనిపిస్తుంది. అందుకే భూమి సమస్యతో కలసివున్న గిరిజన పోరాటంలో కూడా సామూహిక చైతన్యం అధికంగా చోటుచేసుకుని వుంటుంది. కార్మికోద్యమంలో ట్రేడ్ యూనియన్ల పాత్ర, గ్రామాల్లో రైతాంగంలో భిన్న రాజకీయ పార్టీల ముఠా తగాదాలు వంటి వర్గాల సంక్లిష్టత గిరిజనోద్యమంలో లేదు - అని చెప్పలేంగానీ తక్కువ. ఆదిలాబాద్ గిరిజన గూడేల్లో మరాఠాలు, లంబాడీలు, తెలుగువాళ్లు మొ॥ గిరిజనేతరులైన పేదవాళ్ళు- గోండులు, కొలాములతో ఒక్కోసారి వైరుధ్యాల్ని పెంచుకున్నా అవి మిత్ర వైరుధ్యాలే. ఆ వైరుధ్యాలు కూడా పోరాటాన్ని గిరిజన-గిరిజనేతర సమస్యగా ప్రభుత్వం చేసే ప్రచారం ప్రభావంలోంచి పుట్టినవే. అటువంటి కోణాల్ని కూడా మాండలిక కథలు స్పృశించాయి.

గిరిజన సంస్కృతి- పోరాటం సామూహికమైన విధంగానే ఆ సాహిత్యం కూడా సామూహికమవుతుంది. పాట సామూహిక సాహిత్య ప్రక్రియ. అదేవిధంగా కథ కూడా సామూహికం అనే సైద్ధాంతిక అవగాహనతో- 'కథ మౌలికంగా మౌఖికం. సామూహికమూనూ' - గిరిజన పోరాట కథల్ని 'అడవిలో వెన్నెల'గా సంకలనం చేసినప్పుడు కథా రచయితల పేర్లు పేర్కోలేదు. అంతకుముందు సింగరేణి కార్మిక కథల్ని 'బొగ్గుపొరల్లో ....' గా సంకలనం చేసినప్పుడు అదే సంప్రదాయం పాటించారు.

నిజానికి కథని లిఖితరూపం నుంచి శ్రవ్యరూపంలోకి తర్జుమా చేసిన పని తెలంగాణాలో రైతాంగ పోరాట కథల్తోనే మొదలైంది. పాఠకులు చదువుకోవడంతోపాటు నిరక్షరాస్యులకి వినిపించేందుకు కూడా పోరాటాన్ని మాండలికంలో కథగా మల్చడం జరిగింది.

జానపదుల పాటకి విప్లవ సంస్కృతిని జోడించి పాటను ప్రజల దగ్గరకు తీసుకుపోయినట్లు జానపద కథా ధోరణితో తెలంగాణా 'అంతరంగజల'ని కథలుగా మల్చి మాండలిక కథకు మరింత ప్రజాస్వామికీకరణని సాధించాలనే ప్రయత్నంతో వుప్పల నరసింహం 'ముద్ర' రచించాడు. ప్రజాజీవితాన్ని, తెలంగాణా భాషని నరసింహం పాఠకుల ముందుంచగలిగాడు గానీ పాటలాగా సామూహిక సాహిత్య కళగా యివి ప్రజల్ని చేరలేకపోయాయి. ఉద్యమం నుంచి వేరయిన యిటువంటి మాండలిక కథలకి మౌఖిక ప్రచారం లేనందువల్ల వీటికి పెద్ద గుర్తింపు కూడా రాలేదు. నరసింహం చేసిన ప్రయోగాన్ని కూడా పెద్దగా ఎవరూ పట్టించుకోలేదు.

తెలంగాణా మాండలిక కథ ఉద్యమంలో భాగంగా వచ్చింది గనుకనే దానికి 'శ్రవ్య' యోగ్యత కలిగింది. అది ప్రజాసాహిత్యంగా ముద్ర వేయించుకోగలిగింది.

సమకాలీక సమస్యల్ని లేఖారూపకథనంలో భూపాల్ చక్కగా యిమిడ్చాడు. 'మండే చంద్రుడు' పేరుతో వచ్చిన[112] ఈ లేఖలు పల్లెలోని వసంత, బతుకుతెరువు వెతుక్కుంటూ పట్నం వచ్చిన చంద్రంల మధ్య నడిచి, తెలంగాణా పల్లెల్లో ఉద్యమ నేపథ్యంలో చోటుచేసుకున్న పరిణామాలని చిత్రిస్తూ, పట్టణ రాజకీయాల సంక్లిష్టతని విడమర్చి చెప్తూ - గ్రామాల్లో పెల్లుబికిన పోరాటాలకు పట్టణాల్లో రూపుదిద్దుకునే రాజకీయాలకూ వున్న సంబంధాన్ని తెలియజేశాయి. వసంత పల్లెనుంచి రాసే వుత్తరాల్లో తెలంగాణ పల్లెల నిసర్గ రామణీయకత, శ్రమజీవన సౌందర్యంతోపాటు అచ్చమైన తెలంగాణా మాండలికత కనిపిస్తే, పట్నంనుంచి చంద్రం చెప్పే కబుర్లలో -సంక్లిష్ట నగర జీవనం, నాగరికుల పైపై మెరుగుల సంస్కృతిలోని డొల్లతనం, శ్రమజీవి బతుకులోని నిరంతర సంఘర్షణ, ధనస్వామ్యంలో తరిగిపోతున్న మానవతా విలువలు - యివన్నీ చోటుచేసుకున్నాయి.

లేఖా సాహిత్యం తెలుగు కథలో కొత్త ప్రయోగం కానప్పటికీ పల్లెకీ నగరానికీ వారధి కట్టిన భూపాల్ ఉత్తరాలు తెలంగాణా ప్రజాజీవితానికీ ఆ జీవితాల్లో అలజడికీ - పల్లె అయినా పట్నమయినా శ్రమజీవిని దోచుకునే వ్యవస్థలోని కుటిల సామాజిక - ఆర్థిక- రాజకీయ నీతులకీ మరీ ప్రత్యేకంగా తెలంగాణా మాండలికానికి చక్కటి దర్పణాలు. సమకాలీన జీవితానికి మాండలిక భాష్యాలు.

కాలువ మల్లయ్య మాండలికంలో కథలు రాయమేగాక 'అవ్వతోడు గిది తెలంగాణా'[113] అనే శీర్షికతో తెలంగాణా పల్లె జీవితాన్ని చిత్రించడానికి ప్రయత్నించాడు. కథకుడుగా రాణించినంతగా కాలువ మల్లయ్య యీ శీర్షికా నిర్వాహకుడిగా రాణించలేదు. విశాఖ మాండలికంలో రావిశాస్త్రి, రాయలసీమ మాండలికంలో నామిని రాస్తే ఆదరించినట్లు తెలంగాణా మాండలికంలో వచ్చే శీర్షికనుపాఠకులు ఆదరిస్తారనే ఆశను మల్లయ్య ప్రకటించాడు. తెలంగాణా మాండలికం పట్ల మల్లయ్య బిడియపడాల్సినంత నిరాదరణ తెలుగు పాఠకుల్లో లేదు. ఈ శీర్షిక వెలువడే నాటికి కొన్నేళ్లకు ముందే తెలంగాణా మాండలికం సాహిత్య గౌరవం పొందింది. తెలంగాణా మాండలికంలో విస్తృతంగా కథలు వెలువడ్డ తర్వాతే నామిని లాంటి వారు రంగంలోకి వచ్చారు.

అంతకుముందు అల్లం నారాయణ లాంటివాళ్లు తెలంగాణా మాండలికంలో శీర్షికలు (నీలకంఠం కథలు) నిర్వహించి ఉన్నారు. తెలిదేవర భానుమూర్తి 'పలుకుబడి' తెలంగాణా పలుకుబడిని కొన్ని సంవత్సరాలపాటు ఉదయం (దిన) పత్రికలో నిర్వహించాడు. రాజకీయ వ్యంగ్య రచనగా భానుమూర్తి పలుకుబడి తెలుగునాట అన్ని ప్రాంతాల్లోనూ మంచి పలుకుబడి సంపాదించుకుంది. ఆ తర్వాత ఇది వార్త (దిన)లో కొనసాగింది. తెలుగులో ఎక్కువ కాలం నడిచిన శీర్షిక ఇదేనేమో! 'పలుకుబడి'తో పాటు 'చల్నేదో బాలకిషన్' పేరుతో భానుమూర్తి నడిపిన మరో మాండలిక శీర్షిక కూడా జనాదరణ పొందింది. మధ్యతరగతి జీవితాల్లోని

విషాద మందహాసానికి 'చల్నేదో బాలకిషన్' అక్షరరూపం ఇవ్వగలిగిన కారణంగా మధ్యతరగతి పాఠకుల నుంచి అన్ని ప్రాంతాలనుంచి అనుకూల ప్రతిస్పందన వచ్చింది.[114] ఒక విధంగా తెలంగాణా మాండలికం అంటే కొరుకుడు పడదని అనుకునే యితర ప్రాంతాల వారికున్న భయాన్ని భానుమూర్తి చాలావరకు పోగొట్టగలిగాడనే చెప్పుకోవాలి.

తెలంగాణా మాండలిక కథ తెలుగు కథని కొత్త మలుపులు తిప్పింది. రైతాంగ కార్మిక గిరిజనోద్యమాలకు భాష్యంగా నిలిచింది. మానవ జీవన సంఘర్షణలోని వివిధ కోణాల్ని స్పృశించింది. తక్కిన ప్రాంతాల మాండలిక కథల్లో లేని వైవిధ్యం కూడా యీ కథల్లో వుంది. ఇవి ఉద్యమ నేపథ్యంనుంచి వచ్చాయి. ఉద్యమంలో భాగస్వాములైన ప్రజలనుంచి వచ్చాయి. సాహిత్యాన్ని సామాజిక ఆచరణగా తయారుచేశాయి. సాహిత్యాన్ని సామూహిక కళగా నిరూపించాయి.

సాంస్కృతిక పునరుజ్జీవనంలో భాగంగా మొదలైన తెలంగాణా మాండలిక కథ ప్రజా పోరాటాల్లో ప్రధాన పాత్ర వహించే స్థితికి ఎదిగిన తీరు సురవరం ప్రతాపరెడ్డిగారి దగ్గర్నుంచీ యీనాటివరకూ వచ్చిన కథల విశ్లేషణలో గమనించవచ్చు. వస్తువులోనూ రూపంలోనూ భాషలోనూ మాండలిక కథ ప్రతి దశలోనూ మరింతగా ప్రజలకు దగ్గరవడాన్ని కూడా చూడగలం. 1970 నుంచీ తెలంగాణా మాండలిక కథ అన్ని రంగాల్లోనూ ప్రజాసాహిత్య లక్షణాలను పుణికి పుచ్చుకుంది 'ప్రజలే నిజమైన విప్లవకారులు' అన్నట్టుగా 'ప్రజలే నిజమైన విప్లవ రచయితలు' అని చాటగలిగే పరిణామాన్ని సాధించగలిగింది.

ప్రజల భాష - ప్రజల సాహిత్యం అనేవి రెండూ విడదీయరానంతగా కలిసిపోయి ఒకదానికొకటి పూరకాలుగా పనిచేశాయి. మాండలిక కథకి ప్రజాసాహిత్యంలో ఉన్నతమైన స్థానం లభించింది.

# అయిదో అధ్యాయం

# మాండలిక కథ ప్రజాసాహిత్యం

'ప్రజల సాహిత్యానికి ప్రాణం ప్రజల భాష'

– కొడవటిగంటి కుటుంబరావు

# మాండలిక కథ ప్రజాసాహిత్యం

తెలుగులో ఆధునిక లిఖిత కథ పుట్టిన అరవై సంవత్సరాల తర్వాత - కథ మౌలికంగా మౌఖిక కళారూపమే కాబట్టి ప్రజా ఉద్యమాల్లో కథని వినిపించడం ద్వారా ప్రజలకు ఉద్యమ చైతన్యం అందించగలమని కొత్త తరం కథారచయితలు భావించారు. కథని మౌఖికంగా ప్రచారం చేయవచ్చనే ఆలోచనతో మాండలిక కథల్ని కూర్చారు. మౌఖికంగా వినేదయిన కథ లిఖిత రచనా సంప్రదాయంలో చదువుకొనేదయి మళ్లీ సామూహిక ప్రదర్శనగా మౌఖికంగా మారే చారిత్రక అవసరం 70ల చివర తెలంగాణాలో ఏర్పడింది. మాండలిక కథ మౌఖిక కథగా మారే క్రమంలో ఎంతవరకు సఫలమయిందో తెలుసుకోవాలంటే మౌఖిక సాహిత్య లక్షణాలు మాండలిక కథల్లో ఏ మేరకు ఉన్నాయో పరిశీలించాలి.

## మాండలిక కథ – మౌఖికత

మానవ సమాజంలో మొదట్నుంచీ కథ 'చెప్పడమే' వుంది. శ్రోత లేకుండా పాటయినా వుంటుందేమో గానీ కథ వుండదు. మన దేశంలో వేదకాలంనుంచీ మౌఖికంగానే ప్రచారమైన ఎన్నో కథలు - వచన రూపంలో సైతం - ఈనాటికీ లభిస్తున్నాయి. ఐతరేయ బ్రాహ్మణంలో శునశ్శేఫుడికథ, శతపథ బ్రాహ్మణ్యంలో చ్యవనుడి కథలాంటివి కావచ్చు; అమ్మమ్మలు, నానమ్మలూ చెప్పినవి కావచ్చు; పసుల కాపర్లు చెప్పుకొన్నవి కావచ్చు; ప్రజలు శ్రమ చేస్తూనో విరామ సమయ్యాల్లోనో చెప్పుకొన్నవి కావచ్చు - ఒక తరం నుంచి మరొక తరానికి కథలు మౌఖికంగానే అందాయి. ఈ కథల రచయితలు ఫలానా అని చెప్పలేం. ఎన్నో కథలు ప్రజల నాలుకలమీద జీవించి ఉన్నాయి.

వాటిలో కొన్ని కథలకి స్థిరమైన పాఠ్యం(fixed text) వుంటుంది. కొన్ని కథలు అప్పటికప్పుడు తయారవుతాయి. స్థిరపాఠ్యం వున్న కథలు కథకుల జ్ఞాపకశక్తిమీద ఆధారపడి ప్రసారం అవుతాయి. స్థిరపాఠ్యం ఉన్నప్పటికీ కథల్లో మార్పులు చేసుకుంటూ వుంటాయి. కథకుల జ్ఞాపకశక్తిలోని హెచ్చుతగ్గుల కారణంగా ఈ మార్పులు జరుగుతాయి. అవి పాఠాంతరాలకి దారితీస్తాయి. స్థిర సంప్రదాయం లేనిచోట మూలాంశం మాత్రం అలాగే వుండి కథలోని ఇతరాంశాల్లో నూతన కల్పనలు చోటుచేసుకుంటాయి. కథ అంతా పునస్సృష్టికి కూడా గురయ్యే అవకాశం వుంటుంది. శ్రోతల అవసరాలకి అనుగుణంగా కూర్పులో సైతం మార్పులు జరుగుతాయి. కథా నిర్మాణం, శైలి, భాష - ఇవన్నీ కథకుడు- శ్రోతల సంబంధం మీద ఆధారపడి వుంటాయి. అవసరానికి అనుగుణమైన కూర్పును ప్రదర్శన నిర్దేశిస్తుంది.

ఈ విధంగా తరతరాలుగా కథలు మౌఖిక ప్రచారంలోనే జీవించాయి. అయితే అచ్చుయంత్రాలు కథకి వున్న మౌఖిక సంప్రదాయంమీద గట్టిదెబ్బ వేశాయి. కథ చెప్పగా వినే దశనుంచి రాయగా చదివే దశకు పరిణమించింది. బ్రిటిష్ వలస పాలనలో కొత్తగా తయారయిన మధ్యతరగతినుండి పుట్టిన రచయితలు అదే వర్గ పాఠకుల కోసం తయారుచేసిన సాహిత్య ప్రక్రియ లిఖిత కథ. ఆధునిక లిఖిత కథ కమామిషు అంతా పాశ్చాత్య కథల ప్రభావం నుంచే తయారయింది.

లిఖితకథని ఏకాంతంలో చదవడానికి అలవాటు పడ్డ దరిమిలా 'కథ' అంటే చదువుకొనేదే అనే భ్రమకు లోనయ్యే పరిస్థితి ఏర్పడింది. అంతేకాదు - అంతకుముందు మౌఖికంగా ప్రచారమైన ఎన్నో కథలు అచ్చులోకి వచ్చాయి. కొన్ని కొత్తగా ఏర్పడ్డ రచయితల నాగరిక భాషలో రాగా, మరికొన్ని యథాతథంగా మౌఖిక భాషా స్వరూపాన్ని వదులుకోకుండా వెలువడ్డాయి. ఆ క్రమంలో అచ్చయిన కథల్లో బ్రౌన్ సేకరించి ప్రచురించిన 'తాతాచార్ల కథల్ని' ముందుగా పేర్కోవాలి. మౌఖికంగా ప్రచారంలో వున్న కథల్ని మౌఖిక భాషలోనే అచ్చొత్తించడం అదే మొదటిసారి ఆ తర్వాత గురజాడ దగ్గర నుంచీ లిఖిత కథ బహుముఖంగా వికసించాకా మౌఖిక కథలు తగ్గుముఖం పట్టాయి. మౌఖిక కథన సంప్రదాయానికి చెందిన ఎన్నో కళారూపాలు మరుగునపడిపోయాయి.

కథకున్న మౌఖిక ధర్మాన్ని కూడా మర్చిపోయిన పరిస్థితుల్లో ప్రజల కోసం ప్రజలనుండి ప్రజలకు అనే ఆశయంతో ప్రజాసాహిత్య సృజనలో భాగంగా 1970 తర్వాతే తెలుగులో కథని మరోసారి మౌఖికం చేసే ప్రయత్నం జరిగింది. మౌఖిక కథ లిఖిత సంప్రదాయ చట్రం నుంచి బయటపడటానికి ప్రయత్నించింది. మౌఖికత నుంచి మౌఖికతకి ప్రయాణించే క్రమంలో కథా రచయితలు జానపద సాహిత్యంలో వున్న మౌఖిక సంప్రదాయాన్ని మాత్రం స్వీకరించి మానవ జీవితానుభవాలనూ సంఘర్షణనూ వర్ణిస్తూ, సమాజంలో వేగంగా చోటుచేసుకొనే మార్పుల్ని గతి తార్కికంగా వివేచిస్తూ, వర్గసమాజంలోని వైరుధ్యాల్ని పరిష్కరించే దారుల్లో నడిచే ప్రజలకు మద్దతునిస్తూ తెలుగు కథా సాహిత్యంలో గుణాత్మకమైన పరిణామాన్ని సాధించి కథని ప్రజాసాహిత్యంలో ప్రముఖాంగంగా మలిచే ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నంలో మాండలిక కథ కొంతవరకు ఫలితం సాధించింది.

మౌఖిక కథకుండే లక్షణాలు మాండలిక కథలకు కూడా వర్తిస్తాయి. మాండలిక కథల్లోని 'మౌఖికత' వాటిని ప్రజల దగ్గరకు తీసుకుపోయే మార్గాన్ని సుగమం చేస్తుంది. మౌఖిక ప్రచారానికి రెండు దశలు వుండవచ్చు. కథ 'రాత'లోకి రాకముందు జరిగే మౌఖిక ప్రచారం ఒకటి - కథ 'రాత'లోకి మారాకా జరిగేది మరొకటి. తెలంగాణా విప్లవోద్యమ కథల్లో రెండు దశల్నీ గమనించవచ్చు. ఉద్యమంలో ఎన్నో సంఘటనలు ప్రజల్ని కదిలిస్తాయి. ఆ సంఘటనలకి సంబంధించిన సమాచారం మౌఖికంగా ప్రచారమవుతుంది. నోటినుండి నోటికి మారడంలో

'వినుకలి' ప్రసారం ఏర్పడుతుంది. ఈ ప్రసార క్రమంలో ఏ స్థాయిలోనైనా సంఘటన నిర్దిష్ట కళారూపాన్ని పొందవచ్చు. సంఘటన కళగా రూపొందడం ఏ దశలో జరిగినా మౌఖిక ప్రసారం ద్వారా జరుగుతుంది. అయితే నిర్దిష్ట కళారూపం మొదట మౌఖికం కావచ్చు - లిఖితం కావచ్చు. కళ మొదట మౌఖికమైతే తర్వాత లిఖితంగానూ, మొదట లిఖితమైతే తర్వాత మౌఖికంగానూ మారే అవకాశాలున్నాయి. ఈ క్రమాన్ని ఈ కింది విధంగా క్రోడీకరించవచ్చు.

సంఘటన

ప్రత్యక్షసాక్షి

సాక్షి కథనం లేదా వినుకలి ప్రసారం

( ఏ దశలోనైనా కళగా మార్చవచ్చు)

నిర్దిష్ట కళారూపం

1. మౌఖికం లేదా 2. లిఖితం

లిఖితం మౌఖికం

సంఘటన నిర్దిష్ట 'మౌఖిక' కళారూపంగా మారినప్పుడు మాత్రం ఆ కళలో 'మౌఖికత' (కూర్పు = **Composition** ప్రసారం= **Transmission** ప్రదర్శన = **Performance** )పాలు ఎక్కువగా వుంటుంది.

చినమెట్‌పల్లిలో భూస్వామ్య ప్రజలమీద కాల్పులు జరుపుతుండగా ఆ మారణకాండని ఆపకుండా చూస్తూ నిలబడ్డ సబ్ ఇన్‌స్పెక్టర్ని - ' ఆ దుస్తులు తుపాకీ నాకివ్వు - వాణ్ని అరెస్టు చేస్తా 'నని నిలదీసిన శ్రామిక స్త్రీ ధైర్యసాహసాలూ, ఆ సంఘటనా విస్తృతమైన ప్రచారం పొందాయి. 'వినుకలి' ద్వారా తెలంగాణా అంతటా నోటినుండి నోటికి ఒక కథగా చెప్పుకున్న ఈ సంఘటనకి రచయితలు నిర్దిష్ట కళారూపాన్ని ఇచ్చారు. రచయితలు సంఘటనకి 'రాత'లో సాహిత్యరూపం కల్పించాకా అది మళ్ళీ సమిష్టి పఠనంలో భాగంగా మౌఖికంగా ప్రచారం అయింది. మొదటినుంచీ మౌఖికంగా ప్రచారంలో వున్న కథ కాబట్టి లిఖిత రూపం ధరించినా మౌఖిక లక్షణాలు పోలేదు. ఒకే సంఘటని వేరువేరు రచయితలు శైలీ వైవిధ్యంతో రచించడం జరిగింది. వేరు వేరు కూర్పులు (**Composition** ) ఏర్పడటమే కాదు; వేరువేరు కళారూపాలు కూడా తయారయ్యాయి.[1]

సంఘటనలు మౌఖిక ప్రచారం ద్వారా కళారూపం పొందడం కొత్తేం కాదు. తెలంగాణాలో అంతకుముందు నైజాం వ్యతిరేక రైతాంగ పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన గొట్టిముక్కల గోపాలరెడ్డిలాంటి అమరజీవుల కథలెన్నో కథాగేయాలుగా ప్రచారమయ్యాయి. కళారూపం పాటగానే కాకుండా వచన కథగా కూడా పరిణమించడం - అదీ మాండలికంలోనే వుండటం - ఆనాటి తెలంగాణా పోరాట సాహిత్య వారసత్వం నుంచే వచ్చింది. మౌఖికకథాగేయరూపంలో ప్రచారంలో ఉన్న బండోల్ల తిరుమలయ్య కథనే సురమౌళి 'రక్తపూజ'గా మలిచారు.

తెలంగాణాలో నోటినుండి నోటికి ప్రచారమవుతూ బతికున్న కథని పాఠకుల కందించడానికి రచయిత లిఖిత ప్రామాణిక భాషని వాడకుండా కథ ఏ భాషలో అయితే ఇన్నాళ్ళూ ప్రచారంలో వుందో అదే భాషను యథాతథంగా ఉపయోగించారు. మౌఖిక భాష ధ్వని సంపుటాలకు సంకేతంగా ఏర్పరచుకొన్న అక్షర రూపంలోకి తర్జుమా అయింది తప్పితే అందులోని మౌఖికత దెబ్బతినలేదు.

కథకున్న మౌలిక గుణమైన మౌఖికతను కాపాడుకోవాలంటే మాండలికమే సరైన సాధనం అనీ, మరో విధంగా మార్చి రాస్తే తరతరాల కథాకథన సంప్రదాయాన్ని కాదన్నట్టు అవుతుందనీ రచయితలు భావించారనడానికి ఈ కథలు ఉదాహరణలు.

అయితే ప్రజల నుండి తీసుకున్న ముడిసరకుని కళారూపంగా మలచి మళ్లీ ప్రజలకే అంకితం చేయాలని పూనుకోవడం మాత్రం 1970ల్లోనే జరిగింది. జానపద కథకున్న మౌఖిక సంప్రదాయ లక్షణాలను అందిపుచ్చుకుని - కూర్పు, ప్రసారం, ప్రదర్శనాంశాలతో - మాండలిక కథ మౌఖికం కావడం జరిగింది.

జానపద కథా ధోరణిలో రాసినంత మాత్రాన మాండలిక కథ ప్రజా సాహిత్యం అయినట్టు కాదు. జానపద కథల్లోని అభివృద్ధి నిరోధక భూస్వామ్య భావజాలాన్ని తొలగించుకొని వస్తు విషయకంగా సమాజంలో చోటుచేసుకునే అభివృద్ధికరమైన మార్పుల్ని అంగీకరించి - ఆ మార్పుల కోసం జరిగే ఆచరణలో భాగం అయినప్పుడే కథని ప్రజాసాహిత్యంగా పరిగణించాల్సి వుంటుంది.

మాండలిక కథలకి వస్తువు మౌఖిక రూపంలో లభించడం ఎక్కువగా గమనించవచ్చు. అల్లం రాజయ్య 'భూమి', 'సృష్టికర్తలు' కథలకి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న రైతుల ముఖతః వెలువడ్డ మాటలే వస్తువులయ్యాయి. మౌఖికంగా సేకరించిన వస్తువును కథలో యిమిడ్చి రాతలోకి మార్చేముందు రాజయ్యే చిన్న / పెద్ద సమూహాలకీ, సభలూ సమావేశాల్లో శ్రోతలకి కథని వినిపించేవాడు. ఆ తర్వాతే కథ రాతలోకి మారేది. కథ లిఖితమయ్యాక కూడా సమిష్టి పఠనంలో మళ్లీ మౌఖికంగా ప్రచారమయ్యేది.[2] అయితే మాండలికంలో రాసిన ప్రతి కథా మౌఖికంగా సమిష్టి పఠనం ద్వారా ప్రచారమయ్యేది అని చెప్పలేం. ఆ దారిలో ప్రజలకు దగ్గర కావడానికి ప్రయత్నం జరిగింది. ప్రజలకు దగ్గరయ్యే క్రమంలో కథ మాండలికంలో వుండటం ఒక గుణాంశం అని కొన్ని సర్వేలలో వెల్లడయ్యింది.[3]

సింగరేణి కార్మిక కథలు కూడా గనులలోపలా, బయటా కార్మికుల్లో వచ్చిన చైతన్యానికి యథార్థ కళారూపాలే. సంఘటనలే కాదు - 'తుపాకులు బొగ్గు తవ్వలేవు' వంటి నినాదాలు సైతం బొగ్గుగని కథలకి వస్తువుని అందించాయి.

అదేవిధంగా దిబ్బగూడెం, సాత్నాల సంఘటనలు గిరిజన పోరాట కథల్లో ప్రముఖంగా చోటుచేసుకున్నాయి. ఒకే సంఘటన వివిధ కళారూపాలుగా పరిణమించడం, కథల్లో సైతం

రెండు మూడు కూర్పులు ఏర్పడటం గిరిజన పోరాటంనుండి వెలువడ్డ కళాసాహిత్య రూపాల అధ్యయనంలో గమనించవచ్చు. తుడుం కొట్టడం ద్వారా గిరిజనులు సమైక్యమై రాజ్యహింసని ఎదుర్కొన్న సంఘటనలు అనేకంగా జరగడం వల్ల గిరిజన పోరాట కథల్లో తుడుం సాధించిన విజయాలు ఎన్నో కళాసాహిత్య రూపాన్ని ధరించాయి.

వాస్తవ ఘటనలకి కథారూపం ఇవ్వడంలో రచయితలు ఎంతో నేర్పు చూపాలి. లేకుంటే కథలు - గతాన్ని తవ్విపోసే చరిత్రలాగానో, వర్తమానాన్ని వ్యాఖ్యానించే రాజకీయం లాగానో కనిపించే ప్రమాదం ఉంది. జీవితాల్లోని అనుభూతి సాంద్రత, అనుభవ ప్రగాఢత సమపాళ్లలో చోటుచేసుకోవడం ద్వారా ఈ కథలు పరిపూర్ణ కళగా రూపొందాయి. విప్లవ కాల్పనికత అందుకు తోడ్పడింది. నిజమైన ప్రజాసాహిత్యంగా రూపొందే క్రమంలోనే మౌఖిక సంప్రదాయానికి చెందిన కొన్ని ప్రధాన లక్షణాలను ఈ కథల్లో చూడవచ్చు.

కథకి సంబంధించిన మూలాంశంలో మార్పు లేకుండా - ఇతరాంశాల్లో నూతన కల్పనలతో మార్పులు జరగడం జానపద కథల్లో చాలాచోట్ల కనిపిస్తుంది. విప్లవోద్యమంలో సంఘటనలు కథారూపం పొందడంలో అటువంటి సంప్రదాయాన్ని గమనించవచ్చు. మద్దునూరు దొరని పోరాటంలో భాగంగా ప్రజలంతా సమైక్యంగా నిలబడి వెట్టి పనులు బందుపెట్టి సాంఘిక బహిష్కరణకు గురిచేసినప్పుడు దొర అచ్చోసి వదిలిన అంబోతు - భూస్వామ్య వ్యవస్థకు ప్రతీకలా- చావడం మౌఖిక కథగా చాలా ప్రచారం పొందింది. నోటినుండి నోటికి చిన్న చిన్న సమూహాల్లోనే కాకుండా బహిరంగ సభల్లో[4] సైతం కథాగేయంలా పాటలా శ్రవ్యరూపాన్ని పొందింది. ఆ సంఘటన కళగా ప్రచారమవుతూ ప్రదర్శన పొందినప్పుడు ఎన్నో మార్పులకు లోనైంది. అది 'రాతకథ'గా మారే క్రమంలో అల్లం రాజయ్య చేతిలో 'మార్పు' కథగానూ, గోపీ చేతిలో 'దొరగారి కుక్క' కథగానూ మారింది. రెండు కథల్లోనూ మూలాంశం ఒకటేగానీ దొరగారి కుక్కలో ఆబోతు కుక్కగా మారింది. 'మార్పు'లో మౌఖిక కథాలక్షణాలు, 'దొరగారి కుక్క'లో లిఖిత కథాలక్షణాలు కనిపిస్తాయి.

మాండలిక కథల్లో మౌఖిక లక్షణాలన్నిటినీ వంటబట్టించుకొన్న కథ 'మార్పు'. మౌఖిక ప్రచారంలో వున్న ఒక కథ ప్రదర్శన రూపం పొందే క్రమానికి కూడా 'మార్పు' ఒక ఉదాహరణగా కనిపిస్తుంది. దొర - ఆబోతు కథని గంగయ్య అనే పాత్ర చెబుతుంది.

కథ చెప్పడానికి కథకుడికి ముఖ్యంగా కావాల్సింది శ్రోతలు. గంగయ్య కథ చెబుతాననేసరికి శ్రోతలంతా వినడానికి సిద్ధమవుతారు. కథా శ్రవణానికి కావలసిన వాతావరణం తయారయింది.

'దచ్చన్న రాజ్జాన ఓ ఊరట...' శ్రవ్యకథలన్నీ ఎలా మొదలవుతాయో అలాగే కథ మొదలైంది. గంగయ్య 'కంఠం కొంచెం హెచ్చించి పాట తీరుగా' కథ చెప్పడం మొదలెడతాడు. కథ శుద్ధ వచనంగా కాకుండా మౌఖిక గేయంలోకి పరిణమించింది. ఆ ఊరి వర్ణనతో కథ మొదలవుతుంది. వాక్యం చివర్ల ఉండే 'అట' శ్రోతల్ని కథలో పూర్తిగా లీనం చేశాకా

ఎగిరిపోతుంది. కథని గతం నుంచి వర్తమానంలోకి, కాల్పనికతనుంచి యథార్థతలోకి మళ్లించడానికి అది గుర్తు. కథ నడుస్తుంటే ' ఊ కొట్టడం', శ్రోతల్ని కథలో పాత్రలు చేయడం వంటివి మౌఖిక కథా ప్రదర్శనలో భాగంగా; ఈ కథలో కూడా చూడవచ్చు. ప్రదర్శనే కాకుండా కూర్పుకి సంబంధించిన మౌఖిక కథా నిర్మాణ శైలినీ, భాషా విశేషాల్నీ కూడా 'మార్పు' కథలో చూడగల్గుతాం.

ఊరి దొర తన కొక ఆబోతుని తెమ్మని మనుషుల్ని నాలుగు దిక్కులకీ పంపుతాడు. '' ఉత్తరం బోయినోడు - ఉత్త సేతులచ్చిండు. దచ్చినం బోయినోడు - దీలెపడచ్చిండు. తూరుపు బోయినోడు తిరిగి తిరిగి సచ్చిండు. పడమటికి బోయినోడు పగ్గాన్నిగ్గీ ఆంబోతును నలుగురు మనుషులతోటి పట్టిచ్చుకచ్చిండు. ''[5]

మాండలిక కథ మౌఖిక కథా నిర్మాణ పద్ధతుల్ని స్వీకరించింది. కథలో ఆంబోతునీ-దొరని వర్ణించేటప్పుడు ఒకే రకమైన పదబంధాల్ని వాడటం జానపద కథల్లోని 'పునరావృత్తి' లక్షణమే. ఆబోతు చావుతో కథని ముగించివుంటే ఇదొక అచ్చమైన జానపద కథ అయివుండేది. కానీ - విప్లవ సంస్కృతిని జోడించడంద్వారా 'మార్పు' పోరాట కథల్లో ఉత్తమ కథగా నిలబడగలిగింది. సాంఘిక బహిష్కారానికి గురైన దొర పోలీసు క్యాంపుతో ఊరిలో విధ్వంసం సృష్టిస్తాడు. కథ చెప్పిన గంగయ్య కొడుకు కూడా అరెస్టయిన వాళ్లలో ఒకడు. కథాంతంలో గంగయ్య మాటలు జారపద ధోరణిలో వెలువడ్డ మాండలిక కథకి విప్లవ కాల్పనికతని జోడించడం ద్వారా మాత్రమే ప్రజాసాహిత్యంగా తీర్చిదిద్దవచ్చని నిరూపిస్తాయి.

'నా కొడుకు మొదటోడె కాదన. నా కొడుకు గ నిప్పుల గుండం నుంచి మీదికి తేల్తడని సంబురపడ్తలేను.... ఆడు దాంట్లో మలిగిపోయిన నేను ఏడ్వ! ఏడ్సేటందుకేమున్నది? (కోడలితో) గౌరవ్వా! బిడ్డా! నాకో మనుమన్నియ్యి తల్లీ! నా కొడుకు జెండెత్తుకుని ముంగటికి నడిసే మనుమన్నియ్యి.... నా తల్లీ. '[6]

తరతరాల మౌఖిక కథని విప్లవీకరించడానికి రాజయ్య ఎన్నో జాగ్రత్తలు తీసుకునేవాడు. రాజయ్య కథల్లో పాత్రలు తమ జీవితాల్లోనో తమ చుట్టూ వున్న జనజీవితాల్లోనో జరిగిన సంగతుల్ని ఎవరికో ఒకరికి ఏకరువు పెట్టుకోవడమో, ఆర్తిగా మొత్తుకోవడమో కనిపిస్తుంది. ఆ వినిపించడాన్ని విప్లవ రాజకీయాలు శాసిస్తాయి. నిజ జీవితాల్లోంచీ పుట్టిన ఆ పాత్రలు విప్లవాన్ని శ్వాసిస్తాయి. అందుకే జానపద కథల్లో వుండే బూర్జువా కళా విలువలు రాజయ్యపాత్రల్లోగానీ, కథల్లోగానీ కనిపించవు.

ప్రజల్లో వినిపించడానికే ఉద్దేశించినప్పటికీ మాండలిక కథ మొదట రాతలోనే వెలువడితే అందులో మౌఖికత పాలు చాలా తక్కువ ఉంటుంది. రాత కథ కూర్పు వేరు. నోటి కథ కూర్పు వేరు. రాతకూర్పులో భాషకీ - నోటి కూర్పులో భాషకీ చాలా తేడా వుంటంది- కథనం కూడా వేరుగా వుంటుంది. రాత కూర్పరి దృష్టిలో పాఠకులు ఉంటారు- నోటి కూర్పరికి ఎదురుగా శ్రోతలు ఉంటారు.

దేవరాజా మహారాజు లాంటి వాళ్ళు మాండలిక కథలు పాఠకుల్ని దృష్టిలో పెట్టుకుని రాసినవే. లిఖిత కథకుండే నిర్మాణ పద్ధతులన్నీ ఆ కథల్లో చూడవచ్చు. ఈ కథల్లో మాండలికం కూడా ప్రామాణిక భాషకి అనువాదంలా వుంటుంది తప్పితే జనజీవితంలో భాగంగా వచ్చినట్లు కనిపించదు. మౌఖిక వ్యవహారంలోని భాషా ప్రయోగాల్ని - సామెతలు, నానుడులు, పదబంధాలు మొ॥ - సహజంగా కళాత్మకంగా మలిచే నేర్పు మాండలిక కథా రచయితల్లో రాజయ్య, రాములు, సాహు, తుమ్మేటి, కార్మిక లాంటి లెక్కించదగినంతమందికి వుంది.

రాయలసీమ మాండలికానికి వచ్చేసరికి ఆ కళారహస్యం నామినికి తెలిసింది. జనజీవితం - భాష - భావజాలం పట్ల అనురక్తి, ఆత్మీయత, మమైక్య భావం వున్నప్పుడే సరైన మాండలిక కథ వెలువడుతుంది. ప్రజా రచయితలూ, కళాకారులూ భాష విషయంలో తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి మావో చెప్పిన మాటల్ని ఈ సందర్భంలో గుర్తుచేసుకోవడం అవసరం.

'చాలామంది రచయితలూ- కళాకారులు ప్రజలకు ఎడంగా వుండటం వల్లా డొల్లగా జీవించడం వల్లా వారికి ప్రజల భాషతో పరిచయం లేదు. ఆ కారణంగా వారి రచనలోని భాష చప్పగా వుండటమే గాక, వాటిలో వారు స్వయంగా సృష్టించుకున్న విలక్షణమైన నుడికారాలు ప్రజల నుడికారాలకు విరుద్ధంగా వుంటాయి..... మన రచయితల కళాకారుల ఆలోచనలూ, భావాలూ ప్రజాబాహుళ్యమైన శ్రామిక - కర్షక- సైనికుల ఆలోనలతోనూ, భావాలతోనూ ఏకరూపం పొందాలి.... ఈ ఐక్యం సాధించడానికి వాళ్ళు చిత్తశుద్ధితో ప్రజల భాష నేర్చుకోవాలి.[7]

మౌఖిక సంప్రదాయాన్ని అనుసరించినప్పటికీ, ప్రజల భాషని నేర్పుతో పుణికి పుచ్చుకొన్నప్పటికీ మౌఖికంగా ప్రచారం కానిపక్షంలో మాండలిక కథ ప్రజలకు చేరువ కాదు. జానపద వృత్తి కళాకారులు కళా ప్రదర్శనల్లో కథాగేయాల్లోని సన్నివేశాలని వచనంలో వివరించే బాణీని స్వీకరించి వుప్పల నరసింహం రాసిన 'ముద్ర' కథలు మౌఖికంగా ప్రచారం లేదు. అవి ప్రదర్శన రూపం పొందాలంటే వృత్తికళారుల చేతిలోనే సాధ్యం. కథలు 'వినేటి పెద్దల' కోసం ఉద్దేశించినప్పటికీ ప్రదర్శన పొందని మాండలిక కథలు రాతలోనే మిగిలిపోతాయి. కథలేగాదు ఏ సాహిత్య ప్రక్రియ అయినా అంతే. విప్లవ సాహిత్యోద్యమంలో వందలాది పాటలు అచ్చులో మాత్రం వెలుగుచూశాయి. ప్రదర్శనకు నోచుకోని అవి అచ్చులోనే చచ్చిపోయయి.

కథ ప్రదర్శన విషయంలో పాటలాగానో కథాగేయంలాగానో వందలాది ప్రేక్షక / శ్రోతృ సమూహం ముందు జరగకపోవచ్చు. సామూహిక పఠనం కూడా కథకి ప్రదర్శనే. 'ముద్ర' లాంటి కథలకి అటువంటి ప్రదర్శన లభించిన దాఖలాలు లేవు. ఏదైనా ఒక కళ సామూహికం కావడం జానపద కళలన్నింటికీ వర్తిస్తుంది. కళ వైయక్తిక అనుభూతిగా మిగలడం లిఖిత సంప్రదాయానికి చెందిన లక్షణం. ఆ సంప్రదాయాన్ని మాండలిక కథ కొంతవరకు బద్దలు చేయగలిగింది.

## మాండలిక కథ – సామూహికత

సామూహిక - మౌఖికత అనేవి రెండు పరస్పర సంబంధం వున్న పదాలు. కథల విషయంలో మౌఖికత సమూహం ఎదుట ఏర్పడుతుంది. రాసినదాన్ని వినిపించడం కంటే కొన్ని సమూహాలకి వినిపించిన తర్వాత రాయడంలో మౌఖిక లక్షణాలు ఎక్కువ చోటుచేసుకుంటాయి. సంఘటన కథారూపం పొందే ముందు జరిగే మౌఖిక ప్రసారం కథలకి సామూహిక శ్రోతృవర్గాన్నే కాదు - సామూహిక కర్తృత్వాన్ని సైతం సాధించగలుగుతుంది. శ్రోతల ప్రతిస్పందనలోంచి ఎన్నో మార్పులు చేర్పులు జరుగుతాయి. సంఘటన కళారూపాన్ని పొందడంలో ప్రజలకు దగ్గరవడానికి అనుగుణమైన పద్ధతులు ఎప్పటికప్పుడు మారుతూ వుంటాయి. జనామం పాటలు కర్మాగారంలో అలా ఎన్నో పాటలు తయారయి ప్రజలకు అందాయి. మాండలిక కథ, నవల కూడా ఆ దారిలోనే ప్రయాణం చేశాయి. రాజయ్య 'కొలిమంటుకొన్నది' అలా తయారయిందే. ఆ విధంగా ఎన్నో కథలు సామూహిక కర్తృత్వంలో వెలువడ్డాయి. రచయితల వైయుక్తికమైన గుర్తింపు (**Individual identity**) నశించి కథ కూర్పరులుగా సామూహిక కర్తృత్వం మాత్రం మిగులుతుంది. సింగరేణి కార్మిక కథలు అదే రీతిలో వచ్చాయి. అందుకే 'కార్మిక' ఒక వ్యక్తి కాదు - సమూహం అనడం.[8]

పత్రికల్లో వచ్చినప్పుడు సొంత పేర్లతో వచ్చినప్పటికీ సంకలనంగా తెచ్చినప్పుడు రచయితలు తమ వైయుక్తిక కర్తృత్వాన్ని వదులుకొని కథల్ని సామూహిక కర్తృకాలుగా ప్రచురించారు. ప్రజాసాహిత్య సంప్రదాయంగా జనామం పెట్టిన 'అనామధేయత్వం (**Anonymity**)' ఒరవడినే తర్వాత కథా రచయితలు కూడా సింగరేణి కార్మిక కథలు (బొగ్గు పొరల్లో), గిరిజన పోరాట కథల్లోనూ (అడవిలో వెన్నెల) కొనసాగించారు. ఇది తరతరాల మౌఖిక కథా సంప్రదాయమే.

నిజానికి 'తాత్వికార్థంలోనేగాక ఆర్థికంగా కూడా పెట్టుబడిదారియే 'వ్యక్తి' ని సృష్టించింది.' [8a] సమాజానికంతటికీ చెందాల్సిన ఉమ్మడి ఆస్తిలాంటి కళని సైతం వ్యక్తి ఆస్తిగా మార్చింది. సాహిత్యాన్ని 'కమోడిటీ' గా మార్కెట్లో ట్రేడ్‌మార్క్ వేసి విడుదల చేసే వ్యాపారాన్ని పోషించింది. మానవ మేధస్సుని పేటెంట్ చేసింది. పాటలాంటి ప్రజాకళారూపాలు ఈ కబంధ హస్తాలనుంచి అంతకుముందే బయటపడ్డాయి గానీ కథని సైతం రచయితలు సమాజానికి చెందిన కళగా ఉమ్మడి ఆస్తిగా మార్చడం తెలంగాణా మాండలిక కథలతోనే మొదలైంది.

అయితే మాండలిక కథ అచ్చయిన తర్వాత సామూహికతని కోల్పోయే ప్రమాదం వుంది. అచ్చులో మౌఖిక భాషా స్వరూపం తెలియకపోవడం జరుగుతుంది. అచ్చయిన పుస్తకాల్లో మౌఖిక కథ చదివినా సరైన రీతిలో అర్థం కాదు.[9] సంభాషణల్లో వ్యక్తీకరణ పద్ధతి సన్నివేశాలకనుగుణంగా మారుతుంది. ఆ కథల స్వభావం ముఖాముఖి వింటేనే తప్ప

తెలియదు. జానపద కథలని మాండలిక భాషలో యథాతథంగా లిఖితరూపంలో అందించిన నామిని 'మాయమ్మ జెప్పిన కథల్లో' కూడా ఈ అంశాన్ని గమనించవచ్చు.

అందువల్ల రాతలోకి మారిన మాండలిక కథ ప్రజల్లో సమష్టి పఠనంద్వారా మరోసారి సామూహికతను సంతరించుకుంటుంది. అయితే ఈ పఠనాలకు స్థిరపాఠ్యం (Fixed text) ఏర్పడటంవల్ల చదివేవాళ్ళ స్వీయకల్పనకు తావుండదు. అదీగాక గొంతెత్తి బిగ్గరగా చదివే కథకుడు (teller of the story) సందర్భానుసారంగా భావాలను పలికించే నేర్పు కలవాడు - అభినయం తెలిసినవాడూ అయివుండాలి. జానపద కథాగేయాల గాయకుడికి(Singer of folktale) వుండే లక్షణాలు మాండలిక కథ చదివే కథకుడికి వుండాలి. అప్పుడే సమూహాల్లో కథ 'రక్తి' కడుతుంది. ఒంటరిగా చదువుకొనేటప్పుడు రాని సంచలనం కథకుడు చదువుతుంటే పదిమంది వింటున్నప్పుడు కలుగుతుంది. 'రక్తి' కట్టడమనేది పదిమంది కలసి అనుభవించే కళకే వర్తిస్తుంది.[10]

కథ లిఖితం కాకపూర్వం మౌఖికంగా ప్రచారంలో వున్నప్పుడు రచయితకి శ్రోతలకి ప్రత్యక్ష సంబంధం వుంటుంది. రచయిత స్వయంగా అక్కడికక్కడ కొన్ని మార్పులు కూడా చేసుకుంటూ కథ నడుపుతాడు గానీ రాతలోకి వచ్చాక కథకుడు మధ్యలో ప్రవేశిస్తున్నాడు. రచయిత ఎరుగని సమూహాలకి కూడా కథ చేరుతుంది. అందువల్ల మౌఖికంగా ప్రచారమైన కథని రాతలోకి మార్చేటప్పుడు - వచనంలో కూడా వచనగుణం గాని కవితావేశం వుండేటట్టు రచయిత చూసుకోవాలి.[11] దాన్ని మాండలిక కథా రచయితలు సాధించారు. ఏనాటి ఉత్తమ సాహిత్యమైనా ప్రజలను ఒక సంస్కృతిపథంలో వుంచి ఒక జాతిగా రూపొందించాలంటే అది సమిష్టిపఠనం ద్వారా మాత్రమే సాధ్యం''[12] అని విమర్శకులు అభిప్రాయపడేంతగా మాండలిక కథా సామూహిక పఠనాలు ప్రభావం చూపెట్టాయి.

అచ్చువరకే పరిమితమై సమూహాల మధ్య శ్రవ్యరూపం పొందనప్పుడు - మాండలిక కథ తక్కిన పత్రికల భాషలో వెలువడే కథలకన్నా మించి అదనంగా సాధించే ప్రయోజనం ఏమీ ఉండదు. జీవిత వాస్తవికతని ప్రజల భాషలో చిత్రించే వాస్తవికతకి మాత్రం అవి ఉదాహరణలుగా నిలుస్తాయి. పోరాట ప్రాంతాల్లో వినిపించినప్పుడు మాండలిక కథ విప్లవాచరణలో భాగం కాగలుగుతుంది.

మౌఖికత, సామూహికత అనే లక్షణాలని మాండలిక కథ కొంతవరకు సాధించినప్పటికీ రచయితల దృష్టిలో పాఠకులూ శ్రోతలూ రెండువర్గాలవారు ఉండటంవల్ల, లిఖిత కథకి అలవాటుపడ్డ సాహిత్య వ్యవస్థ ప్రభావం నంచి బయటపడలేకపోవడం వల్ల ఈ కథల్లో లిఖిత - మౌఖిక సంప్రదాయాల మిశ్రరూపాన్ని చూడగలుగుతాం. మౌఖిక లక్షణాలు కూడా రాజయ్యలాంటి వాళ్ల కథల్లో మౌఖికంగా ప్రచారమైన కథల్లో ఎక్కువగా కనిపిస్తాయి. కేవలం భాషా విషయకంగా మాండలికాన్ని స్వీకరించిన రచయితల కథల్లో శ్రవ్యకథా లక్షణాలు కనిపించవు.

శ్రవ్యరూపం పొందినప్పటికీ మాండలిక సాహిత్యం ఒక ప్రత్యేక మండలానికే పరిమితం అవుతున్నది - అనే అభిప్రాయం కూడా వుంది. కానీ మాండలిక కథ ఆ పరిమితుల్ని అధిగమించి సార్వజనీనతని సంతరించుకుంది.

## మాండలిక కథ - సార్వజనీనత

మాండలికత - సార్వజనీనత అనేవి పరస్పర విరుద్ధాంశాలుగా కనిపిస్తాయి. 'మాండలికం అనడంలోనే ఒక మండలానికే పరిమితం అన్న సంకుచితార్థం వున్నది. విప్లవం విశాల ప్రజానీకం కొరకైనప్పుడు, విప్లవ ప్రయోజనాన్ని నెరవేర్చడానికి లక్షించబడ్డ రచన గూడా విశాల ప్రజానీకం కొరకే ఉండాలి. అట్లాగాక మాండలికంలో వున్నందువల్ల అది తన విశాలతను కోల్పోయే ప్రమాదం వుంది' అని విమర్శకులు మాండలిక భాష సార్వజనీనతని సాధించడానికి అడ్డంకి అని భావించారు.[13]

విశాలతని సాధించడం ప్రజా సాహిత్య ప్రయోజనం అయిన పక్షంలో మాండలికంలోనే కాదు; దేశీయ భాషల్లో సైతం సాహిత్యం ఆ ప్రయోజనాన్ని సాధించలేదు.

నిజానికి ఏ కళ అయినా భాషని బట్టీ సంకుచితమూ విశాలమూ కాదు. జీవితానికి దగ్గరగా వుండటం - జీవితంలోని వివిధ కోణాల్ని, సంఘర్షణనీ - మానవ సంవేదననీ ఎత్తిచూపడంలోనూ కళ సార్వజనీనతని సాధించగలుగుతుంది. జీవితం అన్నిటికన్నా విశాలమైనది. జీవితానికి చెందిన సూక్ష్మాంశాలని సైతం కళలో పెట్టగలిగినప్పుడు దానికి బృహద్రూపం ఏర్పడుతుంది. జీవితాన్ని కళగా మలచినప్పుడు స్థానికత్వం నుంచి సార్వత్రికతలోకి, ప్రత్యేకతనుంచి సామాన్యంలోకి పయనిస్తుంది. 'పచ్చనాకు సాక్షిగా' నామిని చెప్పిన కథల్లో జీవితం ఒక ప్రాంతానిది కాదు - ఒక వ్యక్తిదీ కాదు - అందరిదీ. నామిని అమ్మకూడా అందరికీ అమ్మే. అమ్మ ప్రేమ అంతటా ఒక్కటే. ఆ కథలకున్న ప్రాంతీయ స్పర్శగానీ, అందుకు వాడిన ప్రాంతీయ భాషగానీ వాటికి సార్వత్రికతని సాధించడంలో అడ్డుకాలేదు. ఖదీర్‌బాబు దర్గామిట్ట కథల్లో సైతం ఈ అంశాన్ని చూడవచ్చు. కథలో వస్తువు ఎంతగా స్థానికమైతే అది అంతగా సార్వత్రికతని సాధించుకోగలుగుతుంది. మానవ జీవితాల లోతుల కెళ్లినకొద్దీ సంవేదనా మట్టివాసనా అంతా ఒకటే అయి వుంటాయి. ప్రపంచవ్యాప్తంగా జానపద కథల్లో కనిపించే సమానాంశాలు ఈ విషయాన్నే నిరూపిస్తున్నాయి.

అంటే ప్రపంచ వ్యాప్తంగా శ్రామిక జీవన పోరాటంలో మానవసం వేదనలన్నింటినీ యీ కథలు ప్రతి బింబించ గలిగాయని అర్థం.

అధిక సంఖ్యాకులైన ప్రజల జీవితాన్ని వర్ణించడం ద్వారా కూడా కథకి సార్వత్రికత సిద్ధిస్తుంది. తెలుగులో మాండలిక కథ గ్రామీణ శ్రామిక సంస్కృతితోనూ, జీవన పోరాటాల నేపథ్యంతోనూ వెలువడుతోన్నందువలన అది సార్వత్రికం కాగలుగుతోంది.

మాండలిక కథ మౌఖికమవడానికి ప్రయత్నం చేసిన కోణంనుంచీ చూసినా అది విప్లవ ప్రయోజనాలను సాధించడంలో సంకుచితం కాలేదని తెలుస్తుంది. ప్రామాణిక లిఖిత భాషలో కథకు 'పరిమిత పాఠక వర్గం' మాత్రం వుంటుంది. ఉద్యమావసరాలకు అనుగుణంగా కథ మౌఖికమైనప్పుడు అది అధిక సంఖ్యాకులైన నిరక్షరాస్యుల దగ్గరకు చేరగలుగుతుంది. వినిపించే కథలోని భాష స్థానిక మాండలికం కావడం సహజం.

ఆర్థిక - సామాజిక రంగాల్లో అసమానతలు నశించి అభివృద్ధి చెందిన సమాజంలో సాహిత్యం లిఖితరూపంలో సైతం అధిక సంఖ్యాక ప్రజలకు ఉపయోగపడే భావజాలాన్ని ప్రచారం చేయగలుగుతుంది. కానీ మన దేశంలాంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో సాహిత్యం మౌఖికంగానే ప్రయోజనాన్ని సాధించగలుగుతుంది. మౌఖిక ప్రచారానికి ప్రామాణిక భాష సరైన మాధ్యమం కాదు.

''ఎప్పటికైనా మాండలికాలన్నీ పర్యాయపదాల కింద చలామణి అయే రోజు రావచ్చు. అప్పుడు ఒక జాతియొక్క భాషా సాహిత్యాలు అవిభాజ్యాలు అవుతాయి. అంతదాకా చదువుకొనే రచనలూ - వినే రచనలూ వేరువేరుగా ఉండక తప్పదు.''[14]

ప్రాంతీయ అసమానతలున్నంత కాలం, జాతుల సమస్యలున్నంత కాలం మాండలిక రచనలు వెలువడుతూనే వుంటాయి. సమాజంలో అన్ని రకాల అసమానతలు తొలగిపోయి విద్యావకాశాలు అందరికీ అందుబాటులోకి వచ్చినప్పుడు, ప్రాంతాల మధ్య - వర్గాల మధ్య దూరం చెరిగిపోయినప్పుడు మాత్రమే మాండలికాలు పర్యాయపదాలుగా మారే అవకాశం ఉంది. అంతవరకూ మాండలిక రచనలు వస్తూనే వుంటాయి. తక్కిన ప్రాంతాలవారికి అర్థం కావడానికి పాదసూచికల్లో అర్థవివరణలు ఇవ్వక తప్పదు.

తెలుగులో మాండలిక కథల్లో చెప్పిన రాజకీయాల పట్ల వ్యతిరేకత వుండటంవల్ల కూడా వాటికి పరిమితి ఏర్పడటం జరిగింది గానీ వాటిలోని భాషవల్ల కాదు.

కథల్లోని భాష అర్థం కాకపోవడంవల్ల సార్వత్రికతని కోల్పోయే ప్రమాదం వుందనడం కూడా సరైంది కాదు. మనం వెయ్యి సంవత్సరాల క్రితం రాసిన పద్య గ్రంథాలు నిఘంటువుల ఆధారంతో శ్రమపడి చదివి అర్థం చేసుకోవడానికీ, వేలాది మైళ్ల దూరంలో వున్న పరాయి భాషలో వున్న సాహిత్యాన్న చదవడానికీ శ్రమపడతాం - ఉత్సాహం చూపిస్తాంగానీ సమకాలీన సమాజంలో మన పొరుగునే వున్న మన భాషకే చెందిన మాండలికాన్ని చదివి ప్రజల జీవితానుభవాల్ని తెలుసుకోవాలనే ఆసక్తి చూపించం. ప్రజల జీవితంపట్ల అనురక్తి మాండలికం చదవడానికి పడే ఇబ్బందిని అధిగమించేలా చేస్తుంది.

అంతేగానీ ప్రాంతీయ భాష, మాండలిక పదజాలం అంటూ ఒకపక్క, రాజకీయ విద్వేషంతో మరోపక్క మాండలిక కథల గురించి ఆక్షేపణ తెలియజేయడంవల్ల భాషలో

ఐక్యతని సాధించలేం. మాండలిక రచనలు విస్తృతంగా వెలువడ్డప్పుడే వాటికున్న పరిమితులు తగ్గుముఖం పట్టి విశాల ప్రజానీకానికి దగ్గరయ్యే భాష[5] రూపొందడానికి అవకాశం ఏర్పడుతుంది. ఆ విధంగా మాండలిక కథ సార్వజనీనత వైపుకే దారి చూపిస్తుంది.

మాండలిక సాహిత్యంగానీ భాషగానీ ప్రాంతాలమధ్య వైషమ్యాన్ని సృష్టించవచ్చనే భయం కూడా నిరాధారమే. ప్రజల జీవద్భాషలోని సాహిత్యం మాత్రమే దావుల్‌చెరువును దేవరయాంజాలను కలపగలదు.[16] ప్రాంతాలమధ్య దూరాన్ని చెరిపివేయగలదు.

కాబట్టి కథ మాండలికంలో వుండటంద్వారా సార్వత్రికతని కోల్పోదు సరికదా - మరింత విశ్వజనీనం కావడానికీ, అఖండ భాషా సాహిత్యాలకు పరిపోషకమయి సాహిత్యాన్ని మరింత సంపన్నం చేయడానికీ, ప్రాంతీయ వైషమ్యాలు తొలగించి ఐక్యతని సాధించడానికీ ఉపయోగపడుతుంది.

అయితే రాజయ్యలాంటి వాళ్ల కథల్లోని మాండలిక భాషనీ, గ్రామీణ జనజీవిత చిత్రణలో వాళ్ల నైపుణ్యాన్ని మెచ్చుకొంటూనే వాళ్ల రాజకీయాలతో విభేదించే వర్గం కూడా ఒకటుంది.[17] సాహిత్యాన్ని రాజకీయ ప్రచారం కోసం ఉపయోగించుకోవడాన్ని కూడా వీళ్లలో కొంతమంది వ్యతిరేకిస్తారు. అందుకే యథార్థ జీవిత చిత్రణ వరకు మాత్రమే పరిమితమై రాజకీయాల జోలికి వెళ్లని నామిని పాపులర్ పత్రికలకు దగ్గర కాగలిగాడు; ఉత్తర తెలంగాణా పోరాటాన్ని సమర్థిస్తూ రాసిన మాండలిక కథలు సృజన - అరుణతార - ప్రజాసాహితి - నూతన-లాంటి వాటికే పరిమితమయ్యాయి.

మాండలికంలో వచ్చిన ప్రతి కథా ప్రజాసాహిత్యమేనని కూడా చెప్పలేం. రచయితకి సాహిత్య రచన సామాజిక ఆచరణ అయినప్పుడూ, సమాజంలోని వైరుధ్యాల్ని ఆవిష్కరించి వాటిని తొలగించడం కోసం సాహిత్యాన్ని నిర్దేశించినప్పుడూ, ప్రజల జీవన్మరణ సమస్యలతో కొట్టుమిట్టాడుతున్నప్పుడు వాళ్లకోసం నిలబడినప్పుడు మాత్రమే - అతను ప్రజా రచయిత కాగలుగుతాడు. అతని సాహిత్యం ప్రజా సాహిత్యం అవుతుంది. మాండలిక కథా రచయితల్లో - ముఖ్యంగా విప్లవోద్యమంలో చురుగ్గా పాల్గొన్న రచయితల్లో ఆ నిబద్ధత ప్రజాసాహిత్యానికి గీటురాయి అవుతుంది. ఆ పరీక్షకు నిలబడగలిగినప్పుడే మాండలిక కథని ప్రజాసాహిత్యంగా పరిగణించవచ్చు.

## నిబద్ధత

జీవిత వాస్తవికతను సాహిత్యంలో ప్రతిఫలింపజేస్తూ, వర్గ సమాజంలోని దోపిడీని బహిర్గతం చేస్తూ, ఆర్థిక - సామాజిక - సాంస్కృతిక రంగాల్లోని అంతరాలని తుడిచిపెట్టాలనే

రాజకీయావగాహనతో సాహిత్య సృజన చేయడమే సాహిత్యంలో ఈనాడు నిబద్ధతగా పేర్కొనవచ్చు. రచన ఎవరికోసం? దేనికోసం? అనే ప్రశ్నలకు లభించే సమాధానం ద్వారా రచయితకున్న నిబద్ధతని తెలుసుకోవచ్చు.

సాహిత్యంలో నిబద్ధత గురించి ఇప్పుడు కొత్తగా చెప్పవలసింది లేదు. నిబద్ధత నుంచి మంచి సాహిత్యం వస్తుందా - రాదా అన్నది కూడా ఇక్కడ చర్చనీయాంశం కాదు. మాండలిక కథా రచయితలు ఏ రాజకీయాలకు నిబద్ధులో తెలుసుకొని మాండలిక కథల్లో వస్తువు అందుకు ఎంతవరకు సాక్ష్యంగా నిలుస్తుందో చూసి వాటికున్న ప్రజాసాహిత్య విలువల్ని బేరీజు వేయడమే ప్రస్తుతానికి అవసరం.

నిజానికి ప్రజాసాహిత్య సృజన అనేది చాలా కష్టమైన పని. అది విప్లవాచరణ అంత కష్టమైన పని.

దేన్ని ప్రజాసాహిత్యం అనాలి అన్న ప్రశ్న ఉదయించినప్పుడు అందులోని వస్తువు ప్రధానాంశం అవుతుంది. అది ప్రజలకు చేరువ కావడానికి ఎన్నుకున్న ధోరణి రెండోస్థానంలో వుంటుంది. అందులోనే భాష - శైలి లాంటి విషయాలు చోటుచేసుకుంటాయి. రచయితల సామాజిక స్థాయి విషయం కూడా ప్రజాసాహిత్యాన్ని నిర్ధారించడానికి ఒక్కోసారి పరిగణనలోకి వస్తుంది.

70లనుంచి తెలంగాణాలో విప్లవోద్యమ కాలంలో పుట్టిన మాండలిక కథారచయితల్లో ఎక్కువ భాగం పీడిత ప్రజానీకం నుంచి వచ్చినవాళ్ళే. వాళ్లలో కొంతమంది పోరాటంలో ప్రత్యక్ష భాగస్వాములైన రైతుకూలీ, గిరిజన, కార్మిక వర్గాల్లోంచి వచ్చిన వాళ్ళు. మధ్యతరగతి పెటీ బూర్జువా వర్గానికి చెందిన రచయితలు అరాకొరా వున్నా వాళ్లుకూడా 'డీక్లాస్' అవడంద్వారా పీడిత జనంతో మమేకం అయి ప్రజాసాహిత్య నిర్మాణానికి అర్హత పొందారు. రచయితలు ఇంతగా శ్రామికజనంతో కలగలిసి పోవడంగానీ, కింది తరగతినుంచే రావడంగానీ తెలుగు సాహిత్యంలో విప్లవోద్యమ కాలంలోనే మొదటిసారిగా జరిగింది.

అంతకుముందు జానపద కళాధోరణులని అనుసరిస్తూ ప్రజలనుండి తీసుకున్న కళారూపాల్ని మళ్లీ ప్రజలకే అందించే కార్యక్రమాన్ని మధ్యతరగతి కవులు / రచయితలు / కళాకారులు చేశారు. అక్కడ ఉపదేశంగానీ చైతన్యంగానీ పైనుంచి కిందికి అనే ధోరణిలోనే అందింది. ఉద్యమ నాయకత్వం కూడా వాళ్ల చేతుల్లోనే కేంద్రీకృతమై వుండటం కూడా జరిగింది. కానీ ఈనాటి ఉద్యమాలకు నాయకులుగానీ ఉద్యమ సాహిత్య నిర్మాతలుగానీ కిందినుంచే (**From the bottom**) రావడం - ఉద్యమ స్వరూప స్వభావాల్లోనే గాక సాహిత్య స్వరూప స్వభావాల్లో సైతం వచ్చిన గుణాత్మకమైన మార్పు. ప్రజా సాహిత్యానికి ఇది అదనంగా లభించిన కొత్త ఊపు.

ఆ విధంగా ప్రజలనుండి వచ్చిన లేదా 'డీక్లాస్' అయి ప్రజలతో మమేకం అయిన రచయితలు కథల్ని ప్రజల కోసమే ఉద్దేశించడం సహజంగానే జరుగుతుంది. ఎవరికోసం రాస్తున్నాం - అన్నదానికి మాండలిక కథా రచయితలు స్పష్టంగానే జవాబుచెప్పారు. మాండలిక కథ మౌఖికం కావడానికి కారణం కూడా ఆ జవాబులోనే వుంది. కాగితాల్లో రాతలో వున్న కథలు భయంకర జీవన్మరణ పోరాటాల మధ్య ఉన్న ప్రజలకు చేరతాయో లేదో అని తపన పడ్తూ అల్లం రాజయ్య చెప్పిన మాటలు ఇక్కడ పేర్కోదగ్గవి.

''వేలయేండ్లు (కాగితాలు) వాళ్లనెంత దగా చేశాయి? వాళ్ల దగ్గరికి పట్వారోని బెల్లంపురంగు అప్పుకాయిదమో? షావుకారి తెల్లకాయిదమో? శిస్తు కాయిదమో? భూమిని తెగనమ్ముకొన్న కాయిదమో? ఇందిరమ్మ చెయ్యి గుర్తు కాయిదమో? ఇప్పుడైతే పోలీసు జవాను తెచ్చే సమను కాయిదమో? తప్ప వేరే కాయిదమెట్లా వచ్చింది? ఈ కాయిదాలు వాళ్ల బతుకుల్లో కార్చిచ్చు పెట్టడానికే వచ్చాయిగాని వాళ్లను ఓదార్చడానికి ఎప్పుడూ రాలేదు... కాయిదం చూస్తే వనుకు పుట్టే నా కూలినాలన్నల దగ్గరికి - ఆ మురికి కొంపల్లోకి - ఆ ఎర్ర సెలుకు దుబ్బల్లోకి - ఆ మట్టి చేతుల్లోకి నాకథ లెట్లా వెళ్లాలి?''[18]

రాజయ్య మాటలు మాండలిక రచయిత లెవరికోసం నిబద్ధులై కథలు రాస్తున్నారో చెబుతున్నాయి. అంతేకాదు - 'కాయిదాలు చూస్తే వనుకుపుట్టే' ప్రజల దగ్గరికి కథ మౌఖికంగానే చేరాలనే అవగాహన ఉంది. అందుకు మాండలికమే సరైన సాధనం అని ఈ రచయితలు నమ్మారు. ప్రజల భాషని వదిలేసి ప్రామాణిక భాషలో వాళ్ల జీవన పోరాటాన్ని చిత్రించడం అంటే ''శ్రమనుండి పుట్టిన చెమట ప్రాధాన్యాన్ని విస్మరించి అత్తరు సెంటు వాసనల కెగబడటమే'' అనీ - అలా చేస్తే ప్రజలకు తమ అవసరం ఉండదనీ మాండలిక రచయితలు దృఢంగా విశ్వసించారు.[19]

వీరి ఈ నిబద్ధతని వ్యతిరేకిస్తే అక్కడి ప్రజా జీవితాన్ని తెలుసుకోవడానికి ఈ కథలు తప్ప వేరే దారి లేదు.

వస్తువుని స్వీకరించే విషయంలో కూడా మాండలిక కథ ప్రజాసాహిత్య రచనలో ఎంతో పరిణతిని సాధించింది. ఉద్యమ నేపథ్యంలో వచ్చిన కథకీ మిగతా సందర్భాల్లో వచ్చిన కథకీ వస్తు విషయంలో చాలా తేడా వుంటుంది.

ఉద్యమాలకు ముందు వెలువడే కథలుసాహిత్యం ప్రజా జీవితాల్లో వుండే వేదనని యథాతథంగా చిత్రించి సానుభూతి కథల్లా మాత్రం మిగిలిపోతాయి. ఇలాంటి వాటిని లూసన్ 'ఫిర్యాదు కథల' టాడు.[20] వీటివల్ల ఉద్యమాచరణకి గానీ ప్రజల జీవన పరిణామానికి గానీ పెద్దగా ఒరిగేదేం వుండదు. ప్రజల వేదనలూ అసంతృప్తులూ ఉద్యమ రూపాన్ని దాల్చక ముందు ఇటువంటి కథలు రావడం సహజం. కానీ ఉద్యమం వైయక్తిక ప్రతిఘటనతో మొదలై

సంఘటిత శక్తిగా పురోగమించే కాలంలో వచ్చే 'ఫిర్యాదు కథలు' ఉద్యమానికీ, ఉద్యమ సాహిత్యానికీ కీడు కలగజేసే అవకాశం కూడా వుంటుంది. సాహిత్యం ఉద్యమాలతోపాటు సమంగా పురోగమించకపోవడం వెనకడుగు వేయడం కిందకే వస్తుంది. అటువంటి కథలు శిల్పం రీత్యా ఎంతమంచివయినా ప్రజాసాహిత్యంగా అంగీకరించలేం.[21]

ప్రజలు సంఘటితం కాకముందు జరిగిన వైయక్తికమైన తిరుగుబాటులు గురించి వివరించిన కథల్తో ఆగిపోయివుంటే ( ఉదా: రాజయ్య - 'ఎదురుతిరిగితే', వుప్పల నరసింహం - 'తిరగబడ్డ భూమి' మొ॥) తెలంగాణా మాండలిక కథ ప్రజాసాహిత్యంగా నిలబడేది కాదు. ప్రజలు దోపిడికి వ్యతిరేకంగా సంఘటిత మవుతూ పోరాటంలో ఎదిగిన క్రమాన్నంతటినీ ఆ కథలు చిత్రించగలిగాయి.[22] కేవలం ఆర్థిక పోరాటాల చిత్రణ వరకే పరిమితం కాకుండా మానవ జీవితంలోని వివిధ కోణాలనీ, మానవ సంబంధాల్లో కంటికి కనిపించని చీకటి లోతుల్ని, సంఘర్షణలో తారుమారవుతున్న జీవితం విలువల అంచుల్నీ తడిమి చూపగలిగాయి - జనజీవన తత్వాన్ని అవగాహన చేయించగలిగాయి. ప్రజాసాహిత్య సంప్రదాయంలో ఆవిధంగా వస్తుస్వీకరణ విషయంలో ఎంతో జాగరూకత వహించడంవల్ల మాండలిక కథలు తెలుగు సాహిత్యంలో అత్యున్నత దశకు చేరుకోగలిగాయి.

వస్తువు పోరాటంనుంచీ స్వీకరించినదైనప్పుడు భాష మాండలికం కాకున్నప్పటికీ ప్రజా సాహిత్యమనడానికి సందేహించనక్కరలేదు. ఎటొచ్చీ - ప్రజల భాష ప్రజల పోరాట సంస్కృతిని చక్కగా ప్రతిఫలించగలుగుతుంది; కథని మౌఖికం చేయడానికి మరింతగా తోడ్పడుతుంది. అందువల్లే ఈరోజు ప్రజాసాహిత్యం అంటే మాండలికంలోనే వుంటుంది అన్నంతగా మాండలిక కథలు తెలుగు సాహిత్య రంగాన్ని ప్రభావితం చేశాయి.

మాండలిక రచయితలు తమ వర్గ స్వభావానుగుణంగా సమాజం మారడానికి ప్రకటించే భావజాలం కారణంగా, సాహిత్య సృజనలోని రాజకీయ నిబద్ధత కారణంగా అనివార్యంగా పాలకవర్గంనుంచి అణచివేతని ఎదుర్కోవలసి వచ్చింది. ప్రజాసాహిత్య సృజన అందువల్ల ఎంతమాత్రం కేవల సాహిత్య రచన కాదు - అది విప్లవాచరణలో భాగమవుతుంది. జైళ్ళూ, అజ్ఞాతవాసాలూ, ఎన్‌కౌంటర్లూ రచయితలకు తప్పలేదు. సాహిత్యంలో నిబద్ధతకి ఇది పరాకాష్ట.[23] రచయితలు ఒడ్డున కూర్చొని సందేశం ఇచ్చే దశ నుంచి పోరాట భాగస్వాములుగా ఒక రాజకీయ లక్ష్యాన్ని సాధించే ఉద్దేశంతో తమ అనుభవాలను ప్రజలతో పంచుకొనే క్రమంలో కూడా మాండలిక కథ ప్రజాసాహిత్యంగా స్థిరపడింది.

రూపం - భాష - వస్తువులద్వారా ప్రజలకి దగ్గరయిన మాండలిక కథా సాహిత్యంలో మౌఖిక సంప్రదాయానికి చెందిన రూపాన్నీ, ప్రగతిశీలమైన వస్తువునీ పక్కనపెట్టి కేవలం **భాషను** గురించి చర్చలు చేయడం పాక్షిక దృష్టే అవుతుంది. ప్రజల సాహిత్యంలో ప్రజల

భాష ఒక అంగమే కాదు అవసరం కూడా - అందులో చర్చించాల్సిన విషయంగానీ వ్యతిరేకించాల్సిన అంశంగానీ లేదు. మౌఖికత, సామూహికత, సార్వజనీనత, నిబద్ధత వంటి లక్షణాలన్నీ మాండలిక కథని ప్రజాసాహిత్య రంగంలో అగ్రశ్రేణిలో నిలబెడుతున్నాయి.

మాండలిక కథ ప్రజాసాహిత్యంగా రూపొందే దశలో రచయితల అవగాహనలోని లోపం కారణంగా సహజత్వం పేరుతో తిట్టూ బూతులూ వాడటం జరిగింది. భూస్వామ్య పురుషాధిక్య భావజాలంలో తయారైన తిట్లని మాండలిక కథా రచయితలు మొదటి దశలో ఎక్కువ వాడారు. 'మీ అమ్మల...', 'వానవ్వల కుక్కలు...' మొదలైన స్త్రీలను ఘోరంగా అవమానించే అసహ్య / అసభ్యపదజాలాన్ని ప్రజాసాహిత్యంలో ఉపయోగించకూడదు. ఈ వ్యవస్థను సమూలంగా మార్చాలనే లక్ష్యంతో వెలువడే సాహిత్యంలో భూస్వామ్య - పెట్టుబడిదారీ సమాజంలోని దుష్ట సాంస్కృతికాంశాలన్నిటినీ నిరసించాలి.

సాహిత్య విమర్శకులు మాండలిక కథా రచయితలకి ఈ విషయంలో సరిగ్గానే మార్గ దర్శకులయ్యారు.[24] తెలంగాణా మాండలిక రచయితలు నెమ్మదిగా అశ్లీల పదజాలాన్ని పరిహరించడంలో సఫలమయ్యారు. ఒక దశలో ప్రజాసాహిత్యంలో వుపయోగించే అశ్లీ పదజాలం గురించి చర్చ జరిగింది. చాలా కోణాలనుంచి విమర్శ ఎదురయ్యాకా విప్లవ రచయితలు ' ఆత్మవిమర్శ'[25] చేసుకున్నారు. స్త్రీలను అవమానపరిచే మాటల్ని వాడకూడదని ఫ్యూడల్ పురుషాధిక్య ఆలోచనలని మనుసులనుంచి తుడిచేసుకోవాలని తీర్మానించారు.

దోపిడీ సంస్కృతికి వారసులైన భూస్వాముల నోటినుంచి, రాజ్యహింసని పాశవికంగా అమలుపరిచే పోలీసుల నోటినుంచి మాత్రం అశ్లీ పదాల్ని పాత్రౌచిత్యం కోసం వాడటం జరుగుతూనే ఉంది.

ప్రజల దైనందిన జీవితంలో బూతు పదాల వాడకం ఒక భాగమే కావచ్చు. ప్రజల భాషని యథాతథంగా సాహిత్య సృజనకు స్వీకరించినంత మాత్రాన సహజత్వం పేరున బూతుని అవసరం వున్నా లేకపోయినా అందులో భాగం చేసుకోనక్కరలేదు. శ్రామిక వర్గ శత్రువుని తిట్టడానికి సైతం బూతుల్ని వాడటం మంచిదికాదు. వర్గకసి పేరుతో దాన్ని సమర్థించనక్కరలేదు.

నామిని మిట్టూరోడి కతల్లో సహజత్వం పేరున వాడిన అశ్లీల పదజాలం విమర్శకు గురైనప్పుడు మళ్ళీ కథ ద్వారానే రచయిత తన్ను సమర్థించుకోవడం చూస్తే బూతువాడడం ఒక లౌల్యం అనిపిస్తుంది. ఆ లోలుపత నుంచి తెలంగాణామాండలిక కథా రచయితలు బయటపడడం ప్రజాసాహిత్య సంప్రదాయాన్ని వారు గౌరవించడంగా భావించాలి.

మాండలికంలో లేనప్పటికీ వస్తురీత్యా ప్రజా రాజకీయాల పట్ల నిబద్ధత వున్న కథల్ని ప్రజాసాహిత్యంగా పరిగణిస్తున్నాం. అలాగే ప్రజల భాషలో వున్న ప్రతి కథనీ ప్రజాసాహిత్యంగా

పేర్కొనలేం. ప్రజావ్యతిరేక భావజాల ప్రచారంకోసం పాలకవర్గ సైతం ప్రజల భాషని మాధ్యమంగా గ్రహించవచ్చు. అందువల్ల వస్తువు మౌలికంగా దోపిడిని వ్యతిరేకించేదిగా, వైరుధ్యాల్ని పరిష్కరించేదిగా వుండాలి. ఆ నిబద్ధత వున్నప్పుడే మాండలిక కథని ప్రజాసాహిత్యంగా పరిగణించగలం.

నిబద్ధత మెదట్లో సామాజిక వైరుధ్యాల్ని యథాతథంగా చిత్రించడం వరకే పరిమితం కావచ్చు. తర్వాతిదశలో జన జీవిత సంఘర్షణకి మద్దతుతెలపడం ద్వారామాత్రమే పరీక్షకు నిలుస్తుంది. అందుకే 'పచ్చనాకుసాక్షిగా' నామిని చెప్పిన కథల్లో మట్టివాసన, స్థానికత, మానవసంవేదన - వాటిని సార్వజనీన సాహిత్యంగా నిలబెట్టాయి గానీ 'సినబ్బకతలు', 'మిట్టూరోడికత'ల్లో అవి తగ్గుముఖం పట్టి క్రమంగా హాస్యం మోతాదు ఎక్కువైన కారణంగా ప్రజాసాహిత్యంలో ఆ కథలు భాగం కాలేకపోయాయి.

అమ్మ ఒడినుంచి- బడికి, బడినుంచి- ఊరికి - ఈవిధంగా నామిని కథా ప్రస్థానంలో వస్తువు పరిధి విశాలమయింది గానీ దానికి వ్యతిరేకంగా ప్రజాసాహిత్య దృక్పథం సంకుచితమైనట్టు తోస్తుంది. నామిని ఎంతో నైపుణ్యంతో ఉపయోగించిన రాయలసీమ మాండలికం పాఠక జనామోదం పొందగలిగింది తప్పితే మరే ఇతరమైన ప్రయోజనాన్ని సాధించలేకపోయింది.

ఉత్తర తెలంగాణా పోరాట నేపథ్యంలో వెలువడుతోన్న మాండలిక కథలకీ నామిని కథలకీ మౌలికమైన తేడాలున్నాయి. గ్రామీణ జనజీవితాన్ని యథాతథంగా వర్ణించడం వరకూ నామిని పరిమితమైపోతే- ఆ జీవితాన్ని నడిపించే కారణాల్నీ, సమాజ చలన సూత్రాల్నీ వివరించడానికి సైతం తెలంగాణా రచయితలు పూనుకొన్నారు. నామిని యథాతథ స్థితి రచనలకి చాలాకోణాలనుంచి కఠిన విమర్శలు ఎదురయ్యాయి.

'దారిద్ర్యాన్ని అతి సుందరంగా అభివర్ణించే యథాస్థితి పాదపు బురదపైన రాయలసీమ మాండలికమనే పన్నీటిని గుమ్మరించారు నామినివారు. బురదను పన్నీరుగానూ, యథాస్థితిపాదాన్ని మానవతావాదంగానూ చెలామణి చేయడమే వీరి ఉద్దేశ్యం.[26]

ప్రజాసాహిత్యాన్ని సమాజంలో చెలరేగే ఉద్యమాలు సరైన దారిలో నడిపిస్తాయి అనడానికి నామిని కథల్ని- ముఖ్యంగా హాస్యరస ప్రలోభానికి లోనై రాసిన కథల్ని- వ్యతిరేక ఉదాహరణలుగా పేర్కోవచ్చు. తెలంగాణాప్రజల జీవితాల్లో అతి వేగంగా చోటుచేసుకొన్న మార్పులు- ఉద్యమాలు అక్కడి ప్రజారచయితల ప్రాపంచిక దృక్పథాన్ని నిర్ణయించాయి. నామిని ఉన్న వాతావరణం అతన్ని యథాస్థితి వర్ణనకు మాత్రమే ప్రేరేపించగలిగాయి. అతని చుట్టూవున్న సమాజంలో దారిద్ర్యానికి కారణాలు వెతికే మార్పు చోటు చేసుకోలేదు. సమాజంలో లేని చలనాన్ని రచయిత చూపించే క్రమం అతి కాల్పనికతకు దారితీస్తుంది. అప్పుడుకూడా అటువంటి సాహిత్యం ప్రజాసాహిత్య లక్షణాన్ని కోల్పోతుంది. అయితే

రచయిత వర్తమానాన్నే కాదు, భవిష్యత్తుని కూడా చూడగలగాలి. వర్గసమాజంలో దోపిడికి వ్యతిరేకంగా ప్రజల్లో చలనం అస్సలు లేకుండాపోదు. అది ఏదోఒక రీతిలో వ్యక్తమవుతూనే వుంటుంది. కొన్ని చోట్ల చలనం మాములు కంటికి కనిపించదు. రచయిత క్రాంతదర్శి కాబట్టి సూక్ష్మమైన సంచలనాన్ని కనిపెట్టి, దాన్ని సరైన దారిలో నడిపించడానికీ, ప్రజాఉద్యమ ఉన్నతీకరణకు తన సాహిత్యాన్ని ఉపయోగించగలిగి వుండాలి. అటువంటి నిబద్ధత లేనప్పుడు ఏ రచనైనా- (ప్రామాణిక భాషలో కావచ్చు, మాండలికంలో కావచ్చు - ప్రజాసాహిత్యం కాలేదు.

వాస్తవ జీవితాన్ని కళాత్మకంగా మలచి ప్రజాబాహుళ్యానికి మంచి జీవితాన్ని అందించడానికి సహాయపడగలిగిందే నిజమైన ప్రజాసాహిత్యం .

ప్రజల కోసం సాహిత్య సృజన జరిగే క్రమంలో పాత సాహిత్య రూపాల్ని వినియోగించుకోవడం- జానపద మౌళిక సంప్రదాయాన్ని స్వీకరించడం జరుగుతుంది. తెలంగాణా విప్లవోద్యమనేపథ్యం నుంచి వచ్చిన మాండలిక కథారచయితలు ఈ పని అపూర్వమైన రీతిలో చేశారు. పాతరూపాల్నీ, భావజాలాన్నీ సంస్కరించుకొని ప్రగతిశీల ప్రజాస్వామ్య భావాలతో ప్రజాసాహిత్యాన్ని నిర్మించగలిగారు.

కిందితరగతి ప్రజల నుండి వచ్చిన రచయితలూ సంపూర్ణభావ పరివర్తన ద్వారా 'డీక్లాస్' అయిన పెటీ బూర్జువా రచయితలూ పెట్టుబడీదారీ వైయక్తిక దృక్పథం తెంచుకొని ప్రజాజీవితాల్లోని ముడిపదార్థాన్ని విప్లవ సాహిత్యకళగా పరివర్తనం చేయడంలో ప్రజల నుంచే నేర్చుకొంటు వారితో మమేకమై విశ్వసనీయతని సాధించగలిగారు. ఆ విశ్వసనీయత మాండలిక కథా రచయితలను ప్రజలకు ఆత్మీయుల్ని చేయగలిగింది. కథల్లోని సజీవ పాత్రలు రచయితల్ని గుండెలకి హత్తుకున్న సందర్భాల్ని-[27] ఇంతకుముందు తెలుగు సాహిత్యంలో వినివుండం- మాండలిక కథల్ని ప్రజాసాహిత్యంగా నిలబెట్టడానికి ఇవి ప్రత్యక్షసాక్ష్యాలు. ప్రజలు తమదని ఆదరించిన సాహిత్యమే ప్రజాసాహిత్యం.

ఆ విధంగా చరిత్ర నిర్మాతలైన ప్రజల్నే పాత్రలుగా మలచి, జనజీవన పోరాటాన్ని వస్తువుగా చేసుకొని, ప్రజలకోసమే అంకితమై, ప్రజలభాషలోనే వారికి దగ్గరవుతూ, వారి జీవన పరిస్థితుల్ని మెరుగు పర్చడానికి తోడ్పడే చైతన్యాన్ని అందిస్తూ సాహిత్య రచనని సామాజిక ఆచరణలో భాగం చేసిన తెలుగు మాండలిక కథ నిక్కమైన ప్రజాసాహిత్యం అని చెప్పడంలో ఎటువంటి సందేహం అక్కరలేదు.

# ఆరో అధ్యాయం

## ముగింపు

తెలుగులో మాండలిక కథారచన ప్రజా ఉద్యమాలతో ముడివడి జరిగింది. ఉద్యమాలు ప్రజాస్వామ్య సంస్కృతి ఏర్పడటానికి కారణం అవుతాయి. ప్రజాస్వామ్య సంస్కృతి ప్రభావం కళలూ సాహిత్యంమీద ప్రసరిస్తుంది. తెలుగులో మాండలిక కథల పరిణామ పరిశీలనలో యీ విషయం స్పష్టంగా కనిపిస్తుంది. మాండలిక కథలు రాసిన వాళ్లలో అధిక శాతం సాంఘిక - సాంస్కృతిక - అభ్యుదయ - విప్లవోద్యమాల్తో సంబంధం ఉన్నవాళ్ళే. జనాభాలో అధిక సంఖ్యాకులైన శ్రామిక - రైతాంగ ప్రజానీకంతోనూ - వారి భాషా సంస్కృతులతోనూ సన్నిహిత సంబంధం ఉన్నవాళ్ళూ - ఆ వర్గాల్లోంచీ వచ్చిన వాళ్ళే మాండలిక కథా రచనని చేపట్టారు.

ప్రజా ఉద్యమాలు బలపడినకొద్దీ సాహిత్యం ప్రజాస్వామ్య దృక్పథం వున్న మధ్యతరగతి మేధావుల చేతినుంచి కింది తరగతి ప్రజల చేతిలోకి మారిన క్రమంలో మాండలిక సాహిత్య రచన ఎక్కువైంది. ఉద్యమావసరాలు సాహిత్య రూపాన్నీ - భాషనీ శాసించాయి. మాండలిక కథారచన అందుకు లోబడే జరిగింది. ఈ రచయితలు సాహిత్యంలో వాస్తవికతకో, సాహిత్యంలో నిబద్ధత వరకో పరిమితం కాలేదు. సాహిత్యాన్ని సామాజిక ఆచరణగా భావించారు. సాహిత్యం విప్లవాచరణకు మారుపేరయింది.

మాండలిక కథారచయిత సమాజం ఒడ్డున కూర్చున్నవాడుగానో, సమాజంలో ఒకడుగానో మిగిలిపోలేదు. రచయిత సమూహం అయ్యాడు. వర్తమాన వ్యవస్థతో అనుక్షణం సాగించే సంఘర్షణకు ప్రతీక అయ్యాడు. జీవితం, ఘర్షణ - సాహిత్యం కావడానికి ఒక రాజకీయ సందర్భం కారణమవుతుంది. ఆ రాజకీయ సందర్భమే సాహిత్యరూపాన్ని - వస్తువునీ - భాషనీ - శైలినీ నిర్దేశిస్తుందని చెప్పడానికి తెలుగులో మాండలిక కథ మంచి ఉదాహరణగా కనిపిస్తుంది.

అందువల్లే మాండలిక కథల్ని ప్రజాఉద్యమాల నేపథ్యం నుంచీ విశ్లేషించడం యీ పరిశోధనలో ముఖ్యాంశంగా చోటుచేసుకుంది.

ఈనాడు మాండలిక కథల ఉధృతి తగ్గినట్లు కనిపిస్తుంది గానీ నిజానికి ఏదో ఒక ప్రాంతంనుంచి మాండలిక రచయితలు పుట్టుకొస్తూనే ఉన్నారు! ఆయా ప్రాంతాల రాజకీయ - సామాజిక అవసరాలు అందుకు ప్రేరణ నిస్తున్నాయి. సమాజంలో ప్రాంతీయ - వర్గ వైరుధ్యాలున్నంతకాలం మాండలిక రచనలు వస్తూనే వుంటాయి. దళిత స్త్రీవాదోద్యమాలు బలపడుతున్న కొద్దీ దళితుల, స్త్రీల భాషకూ వ్యక్తీకరణ పద్ధతులకీ అనివార్యంగా ప్రాముఖ్యం

ఏర్పడే అవకాశం కూడా సమీప భవిష్యత్తులో వుంది.

అయితే (నాగప్పగారి సటిదరరాజు 'మాదిగోడికతులు' వేముల ఎల్లయ్య 'కక్క' ఈ విషయాన్ని నిజమని నిరూపించాయి) తెలంగాణా ప్రాంతంనుండి రైతాంగ - కార్మిక - గిరిజనోద్యమాల నేపథ్యంలో మాండలిక సాహిత్యం వచ్చినప్పుడు వస్తువుమీద పడాల్సిన విమర్శకుల దృష్టి భాషమీద పడింది. అందువల్ల ఆనాడు మాండలిక సాహిత్యంమీద జరిగిన చర్చ సమగ్రం కాలేకపోయింది. చర్చలు ఎలావున్నా 70ల తర్వాత తెలుగు సాహిత్యరంగంలో ఉత్తమమైన కథలు ఎన్నో మాండలికంలోనే వెలువడ్డాయి. వాటిలో తెలంగాణా మాండలిక కథలు ఉన్నత శ్రేణికి చెందినవి.

సాహిత్యరంగంమీద కార్మిక గిరిజన జీవితాన్ని వస్తువుగా ఆవిష్కరించిన విశిష్టత కూడా మాండలిక కథలదే.

వ్యాపార దృక్పథంతోనే కావచ్చు. పత్రికలు మాండలిక రచనలకి విస్తృతంగా ప్రోత్సాహం ఇవ్వడం వల్లగానీ, తాము వాడుతున్న భాష విషయలో పునరాలోచించుకుని[2] రచయితలు జాగ్రత్తలు తీసుకోపడం వల్లగానీ యీనాడు మాండలిక రచనలు అర్థం కావడం లేదన్న ఫిర్యాదులు తగ్గాయి.

తెలంగాణా మాండలిక రచయితలు మొదట్లో ఉద్యమ సంఘటనల్ని జీవిత వాస్తవికతనీ యథాతథంగా చిత్రించిన సందర్భాల్లో శైలికంత ప్రాముఖ్యం ఇవ్వలేదనిపిస్తుంది. కానీ రానురాను జనజీవితంలోని ఘర్షణకీ గ్రామాల్లో జరుగుతున్న విధ్వంసానికి కారణమైన దుష్ట వ్యవస్థని నడిపిస్తున్న శక్తుల్ని తెలియజెప్పడానికీ, వ్యక్తుల అంతశ్చేతనలో జరిగే కల్లోలాలకీ, ఛిద్రమవుతున్న మానవ సంబంధాలకీ, నాశనమవుతున్న విలువలకీ, రోజురోజుకీ పెరిగిపోతున్న పరాయీకరణకు కారణమైన సామాజిక కల్లోలాన్ని విప్పిచెప్పడానికీ పూనుకోవడంతో యివి విలక్షణమైన కథలుగానే కాకుండా ప్రపంచంలో ఏ భాషలోనైనా అత్యుత్తమ సాహిత్యంగా నిలువగల స్థితికి ఎదిగాయి.

# అనుబంధం - 1

తెలంగాణా మాండలికంలో కథలు విస్తృతంగా రావడం 1978నుంచి మొదలైంది. 78 నవంబర్‌నుంచి 'కొలిమంటుకొన్నది' నవలంతా మాండలికంలోనే 'సృజన'లో సీరియల్‌గా రావడంతో - కథ, నవలల్లో భాష గురించి పాఠకుల్లో, రచయితల సర్కిల్స్‌లో లిఖితంగా, మౌఖికంగా చర్చలు జరిగాయి. 79లో రాజయ్యతోపాటు మరికొంతమంది రచయితలు పూర్తి మాండలికంలో కథలు రాయడం మొదలుపెట్టారు. దాంతో మాండలిక సాహిత్యం గురించి పాఠకులు, విమర్శకులు, రచయితలు పత్రికాముఖంగా తమ అభిప్రాయాల్ని ప్రకటించడంతో ఆగకుండా సైద్ధాంతిక చర్చని మొదలుపెట్టారు. 'కొలిమంటుకొన్నది' నవల పూర్తికాకముందే రచన - భాషల గురించిన చర్చలు ఊపందుకున్నాయి. సృజన, నూతన లాంటి పత్రికలు ఈ చర్చలకి వేదికలయ్యాయి. కె.రాంమోహన్‌రాజు, ముడార్ వేణు, నిజాం వెంకటేశం, గంగాధర్, కర్రా రమేశ్‌రెడ్డి, ఎన్నారెస్, ఉదయ్‌కుమార్, సిహెచ్.మధు, ఎ.శంకర్, విరాజ్‌లాంటి రచయితలు, విమర్శకులు, పాఠకులు చాలామంది చర్చల్లో మాండలికం గురించి - ప్రజా సాహిత్యం గురించి తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

మాండలికం గురించి తన అభిప్రాయాన్ని అల్లం రాజయ్య పత్రికాముఖంగా (నూతన, ఏప్రిల్ 79; సృజన, అగస్టు 79), సభాముఖంగా (8-9-79న ఉదయసాహితిలో చేసిన ప్రసంగం - ఈ ప్రసంగ వ్యాసాన్ని నూతన, నవంబర్ - డిసెంబర్ 1979 సంచికలో చూడవచ్చు) వ్యక్తం చేశాడు. ఆ నేపథ్యంలో 1979లో 'సాహితీ సర్కిల్' హైదరాబాదు రచయితల్ని పాఠకుల్ని విమర్శకుల్ని ముఖాముఖి మాట్లాడించి, జరిగిన చర్చల్ని క్రోడీకరించి ఒక ప్రశ్నావళిని తయారుచేసింది. 1980 జనవరి - ఫిబ్రవరి నూతన సంచిక మాండలికం మీద తయారయిన ఈ ప్రశ్నావళిని పాఠకులకు అందించింది. ఆ తర్వాత జరిగిన చర్చలు ఈ ప్రశ్నావళిని ఆధారం చేసుకొనే జరిగాయి. అందువల్ల నూతనలో వెలువడ్డ ప్రకటననీ, ప్రశ్నావళిని ఇక్కడ పొందుపరుస్తున్నాను.

# ప్రకటన

## మాండలీకంపై అభిప్రాయాలు పంపండి

ప్రియమైన కామ్రేడ్,

దోపిడీ సమాజంలో తలెత్తుతున్న సమస్యలన్నిటికీ విప్లవం మాత్రమే సవ్యమైన పరిష్కారం, 'కళలూ, సాహిత్యం ప్రజల కోసమే' - విప్లవాభిమానులంతా అంగీకరించే విషయమే ఇది. ఇవ్వాళ తెలుగులో వస్తున్న విప్లవ సాహిత్యంలో 'భాష' ప్రధాన చర్చనీయాంశం అయింది.

అందులో మాండలీక రచల విషయమై చర్చలు సాగుతున్న ఈ తరుణంలో దానికొక సమగ్ర దృక్పథంతో ఆలోచించి ఆచరణలో పెట్టాల్సిన సమయం ఆసన్నమైంది.

చాలారోజులుగా సాగుతున్న చర్చోపచర్చలవల్ల దాని ప్రయోజనం ఇసుమంత కూడా దెబ్బతినకూడదనే ఉద్దేశంతో జంటనగరాల ప్రగతిశీల సాహిత్యాభిమానులు కొందరు కలిసి గద్దర్, అల్లం రాజయ్యలతో ఇష్టాగోష్టి చర్చలు జరిపారు.

సాహిత్య నిర్మాతలు ప్రజలే. ఇది ఎలా ఉండాలో సూచించే హక్కుదారులూ వాళ్ళే. ఏ కొందరో క్షణంలో నిర్ణయించాల్సింది కాదు, అందుకే ఈ విషయంలో వాళ్ల అభిప్రాయాలు తీసుకోవడానికి వీలుగా చర్చించిన విషయాలను 'ప్రశ్నావళి'గా రూపొందించి మీ ముందుంచడం జరిగింది.

మీ అభిప్రాయాలను, సూచనలను మాకు పంపితే ఒక సమగ్ర అవగాహనను నలుగురితో పంచుకోవడం సాధ్యమవుతుంది.''

**ప్రశ్నావళి**

1. మాండలికంలో వస్తున్న విప్లవ సాహిత్యం మీకు సులభంగా అర్థమవుతున్నదా?
2. మాండలీకాన్ని అర్థం చేసుకోవడంలో వున్న యిబ్బందులేమిటీ?
3. ఆ రచనలు అర్థం కాకపోతే అది మాండలిక రచన వైఫల్యమా? పాఠకుల వైఫల్యమా?
4. మాండలికంలో వస్తున్న సాహిత్యం ఇతర ప్రాంతాలకు వ్యాప్తి చెందుతుందా?
5. వ్యాప్తి చెందకపోతే దానికి గల కారణాలేమిటి?
6. పాఠకులే ప్రయాసతోనైనా ఆ సాహిత్యాన్ని అవగాహన చేసుకోవాలంటారా?
7. ఎందుచేత?
8. విస్తృత ప్రచార లక్ష్యంతో మాండలీక రచనలను ఏవిధంగా సులభతరం చేయాలంటారు?
9. పదాలకు అర్థ వివరణలు(Foot Notes) యిస్తే అర్థం చేసుకోవడంలోని యిబ్బందిని

అధిగమించగలరా?

10. మాండలీకంలో వున్న నవలలూ కథలూ చదివి వినిపించినప్పుడు అర్థం చేసుకోవడంలోని క్లిష్టత పోతుందా?

11. మాండలికంలో వున్న పాటతో మమేకం అయినట్లుగా కథ, నవలల్లో లీనం అవుతున్నారా? కాకపోతే ఎందువల్ల?

12. ఒక మాండలీకంలో వచ్చిన రచనను ఇతర మాండలీకాల్లోకి అనువదిస్తే ఎలా వుంటుంది?

13. మాండలీకంలో సినిమా తీస్తే, నాటకం రాస్తే ఎలా వుంటుంది?

*(నూతన, జనవరి - ఫిబ్రవరి **1980** నుంచి)*

# అనుబంధం - 2

## రచయిత బి.ఎస్.రాములుతో ఇంటర్వ్యూ★

ప్రశ్న: కథల్ని మాండలికంలో రాయాలనే వుద్దేశం / రాయాల్సిన అవసరం మీకెందుకు కల్గింది?

జవాబు: అది నా జీవ భాష నేను నా భాషలోనే రాశాను. అది వేరే ప్రాంతంవారికి మాండలికంగానీ నా భాష నాకు మాండలికం కాదు. అవసరం అనేది నా జీవితంలోంచి వచ్చింది. నా చుట్టూ వున్న సమాజాన్ని నాతోపాటు కలిసి మెలసి బతికే జన జీవితాన్ని చిత్రిస్తున్నప్పుడు అక్కడి వాతావరణం - భాష సహజంగానే వచ్చి చేరతాయి.

సాహిత్యపరంగా ఆలోచిస్తే - పత్రికల భాషలో కొన్ని పదాలు మాకు పరిచయం వుండకపోవడం - మా ప్రాంతంలోని భాషే మాకు తెలిసి వుండటంవల్ల మేం మా భాషలోనే రాశాం. పత్రికల భాష రైతాంగానికి చెందిన భాష కాదు. అది మధ్యతరగతికి చెందిన భాష. ఉత్పత్తి సంబంధాలకి దూరమైనటువంటి వాళ్ళూ బ్యూరోక్రసీ యంత్రాంగంలో భాగంగా బతుకుతున్న వాళ్ళ భాష. రైతాంగం భాష పత్రికల భాషలో బాగా వచ్చి చేరుంటే మాకీ ఇబ్బంది ఉండేది కాదు. మాకు కావాల్సిన పదాలు పత్రికల భాషలో దొరకనందువల్ల కూడా మేం మా భాషలోనే రాయడం తప్పనిసరయింది.

స్వీకరించిన వస్తువు కారణంగా కూడా మేం మా భాషలోనే రాయాల్సి వచ్చింది. అది ఒక సమస్యగా మారుతుందని కూడా మాకు తెలియదు. వేరేవేరే ప్రాంతాలవాళ్ళు తమ భాషల్లో రాయగా అచ్చయినప్పుడు, మేం మా భాషలో రాస్తే ఎందుక్కాదు అనే వుద్దేశం తప్ప మరొకటి కాదు. మా జీవితం - మా ప్రాంతంలోని సామాజిక జీవితమే మా సాహిత్యంలో ప్రతిఫలిస్తుంది కనక మా భాషే అందులో చేరింది. దాన్ని ఇతర ప్రాంతాల వారు చదివినప్పుడు తెలంగాణా మాండలికంలో వుందనుకోవడం - దానిమీద వాదనలు చేయడం మొదలుపెట్టారు.

ప్రశ్న : తెలంగాణా మాండలికంలో యశోదారెడ్డి లాంటివాళ్ళు రాసినప్పుడు రాని వాదనలు - సమస్యలు కొత్తగా ఎందుకొచ్చాయి?

జవాబు : పాఠకులకు మా మాండలికం సమస్యగానో ఇబ్బందిగానో ఉండటానికి చాలా కారణాలున్నాయి. విద్య, కళ, సాంస్కృతిక, సాహిత్య రంగాలు అన్నీ ఇంతకుముందు వరకూ ఒక section కి చెందినవి మాత్రమే. కానీ ఆ section కాకుండా అదనంగా కింద వున్నటువంటి వాళ్లనుంచి సామిత్యం రావడం వల్ల - వాళ్ళు తమ culture కి ligitemacy కావాలి అనే

యువతరం కావడంవల్ల - కింది వర్గాలు, కులాలు, సంస్కృతి నుంచి వచ్చిన వీళ్ల సాహిత్యంలో తమకు సాధికారమైన గుర్తింపు రావాలని కోరడం వల్ల ఈ వ్యతిరేకత వచ్చిందని నేననుకుంటున్నాను. పాఠకులకీ - సమీక్షకులకీ పూర్తిగా తెలయకపోవచ్చు కానీ వ్యతిరేకత వచ్చింది, ఉత్పత్తి సంబందాల్లో ప్రత్యక్షంగా పాల్గొంటూ దోపిడీకి గురవుతున్న వర్గంనుంచి వచ్చినవాళ్ళు- తమ భాషని ప్రవేశపెడుతున్నారు గనక అది సాంస్కృతిక - సాహిత్య - కళారంగాల్లో సైతం ఒక వర్గ పోరాటం లాంటిదే. విప్లవ సాహిత్యాన్ని అభిమానించే పాఠకులు కూడా ఒక దశలో ఇబ్బంది పడ్డారు- భాష అర్థం కావడం లేదని - చాలా సిన్సియర్‌గా - కానీ అర్థం కాకుండా రాయడం రచయిత ఉద్దేశం కాదుకదా!

సాహిత్య సాంస్కృతిక రంగాల్లో శిష్టవర్గాల రచయితలే- గురజాడ దగ్గర్నుంచి శ్రీశ్రీ, కొ.కు. వరకూ అభ్యుదయ దృక్పథంతో ప్రజాసాహిత్యాన్ని రాశారు. అందువల్ల వారి భావజాలాన్ని అంగీకరించారు.

ప్రశ్న: మరి మా గోఖలే మాట ఏంటి?

జవాబు: **Acadamic** గానో సాహిత్య వ్యవస్థలోనో సామాజిక గౌరవం గుర్తింపు పొందిన - పొందుతున్న వ్యక్తి మాండలికంలో రాస్తే చర్చనీయాంశం కాదు. ఉదా: రావిశాస్త్రి, మా గోఖలే లాగానే **established** కాని కొత్త రచయితలు మొట్టమొదటిసారిగా ముందుకు వస్తున్నారు. కొత్త భాషని - భావాన్ని - కొత్త వస్తువుని తీసుకొస్తున్నారు. పోతే విప్లవోద్యమానికి చెందిన వస్తువుపట్ల వ్యతిరేకత - ఇవన్నీ రచయిత మీదకు - భాష మీదకూ ప్రసరించాయి. నిజానికది భాషకి చెందినవి కాదు - రచయిత వ్యక్తిగత జీవితం పట్ల రచయిత వచ్చిన వర్గం పట్ల వుండే చిన్న చూపు కారణంగా వారిని సమాన స్థాయిలో గౌరవించకపోవడం వల్ల ఇది జరిగింది. ఉద్యమమే - ఉద్యమంపట్ల వ్యతిరేకమే కారణం అని కొందరు వాదిస్తున్నారు. పూర్తిగా నిజం కాదు - అన్ని పార్శ్వాలు చూడాలి. నేను చాలామందిని చూశా - అన్ని ప్రాంతాలు తిరిగాను - అఖిల భారత ప్రజా సమాచార సాంస్కృతిక పర్యటన దళంలో తిరిగినప్పుడు విప్లవోద్యమం అంటే ప్రాణాలిచ్చే వాళ్ళు కూడా - 'ఏంది - మేం చదువుదామంటే అస్సలు చదవలేకపోతున్నామే' అనీ '**soft**గా మా భాషలో రాయిరాద' అని అన్నారు. వాళ్ళ చిత్తశుద్ధిని శంకించలేం కదా! మాకు ఎంతమందికి అర్థమైతే అంత గొప్పగా రచన లక్ష్యం నెరవేరిందనుకుంటాం తప్ప కొద్దిమందికే చేరాలనుకోం....

ప్రశ్న : మాండలిక రచనలు ఎవరి కోసం వుద్దేవించి రాశారో - వారి దగ్గరకి చేరాయా?

జవాబు : ఈ ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పాలంటే - చాలా బాగా చేరాయి. రచనలని ఎవరికి ఉద్దేశించి రాశామో ముఖ్యంగా ఏ లక్ష్యం కోసం రాశామో ఆ లక్ష్యాన్ని సాధించడంలో బలంగా ముందుకు తీసుకెళ్లాం - అందువల్లనే మాండలిక కథ గురించి అది లక్ష్యాలని **సాధించ**డానికి శక్తి కలిగిందని విప్లవోద్యమంలో వున్నవాళ్ళ గ్రహించగలిగారు. ఎంతమంది

పాఠకులకు చేరాలో అంతమందికి చేరాయా? అని ప్రశ్నించుకొంటే - మా కథలు సృజన, అరుణతార లాంటి వాటిలో మాత్రమే వచ్చాయి. వాటి సర్క్యులేషన్ తక్కువ - వెయ్యి లేదా రెండువేలు. పైగా ఇవి మేధావుల పత్రికలని అవగాహన - సామాన్య రైతాంగానికి భయం...

ప్రశ్న : మరి రైతాంగంలో ఎవరు చదువుతారు? వాళ్లకెలా చేరతాయి?

జవాబు : రాజకీయ అవగాహన అదీ వచ్చాకా మన జీవితం సాహిత్యంలో వస్తుందని గ్రహించిన వాళ్ళు చదివి - సంఘటనల గురించి పోరాటం గురించి కథల్లో వచ్చిందని తెలుసుకొని తమ వాళ్లకు చెప్తారు - పత్రికల్ని చదిపి వినిపిస్తారు. కార్యకర్తలద్వారా, యువకులద్వారా మా రచనలు ప్రజల్లోకి వెళ్లాయి - వాటి లక్ష్యాన్ని సాధించగలిగాయి. దేశంలో అంతటా విప్లవోద్యమం రావాలి అనేది అతి పెద్ద లక్ష్యం - అందులో కొంతమేరకు సాధ్యమైంది. మొత్తంగా మా కథలు ప్రజలకు చేరాయి. పత్రికలద్వారా - చదివి వినిపించడంద్వారా - సంఘటనలతో కథల్ని taly చేయడంద్వారా ప్రజల్లోకి ఇవి చొచ్చుకువెళ్లాయి.

ప్రశ్న : మీ కథల్ని మౌఖికంగా అలా చదివి వినిపించినపుడు ప్రజల మనోభావాలు - ప్రతిస్పందన ఎలా వున్నాయి?

జవాబు : బతుకపోరులాంటి నవలని tape చేసి బీడీ కార్మికులకి వినిపించడం జరిగింది. మంచి response వచ్చింది. మేం ఆశించిన ప్రయోజనం చాలావరకు లభించింది. రచయితగా మా కథలు చేరాల్సిన చోటకు చేరాయన్న సంతృప్తి లభించింది. సాధారణ పాఠకుడు బావుందంటే - అదొక మెచ్చుకోలు. కానీ రైతులు - యువజనులు - అక్కడివాళ్లు చదివి inspiration పొంది తమ కార్యాచరణకు వుపయోగించుకొంటున్నప్పుడు - ఆ చైతన్యంలో మా కథ - సాహిత్యం భాగమైందని అనిర్వచనీయమైన ఆనందం లభించింది. అందువల్లే మాకు నిర్బంధాలు ఎదురైనప్పుడు తట్టుకోగలిగాం. మేం - మా శక్తియుక్తులు వాళ్ళ భౌతిక శక్తిలో భాగంగా మారడం జరిగింది.

ప్రశ్న : కథని చదివి వినిపించేదయినప్పటికీ, కథనం పత్రికల భాషలోనే రాసి - సంభాషణలు మాత్రం మాండలికంల రాయడంద్వారా రెండు వర్గాలవారికీ పాఠకులకీ, శ్రోతలకీ కూడా దగ్గరయ్యే అవకాశం వుందని కొందరు అంటున్నారు కదా- మరి మీరేం అంటారు?

జవాబు : కానీ ప్రమాదం వుంది. అదేం కొత్తది కాదు. కాళిదాసు కాలం నుంచీ చేస్తున్నదే. పాత్రోచిత భాషే - నీచ పాత్రలకి నీచ భాషలాగా -పరోక్షంగా మీ భాష రైతాంగం భాష. నీచభాష అనీ - మంచిది కాదనీ చిన్నచూపు చూడటమే.

ఏదో రాయితీ ఇచ్చినట్టుగా కొంతవరకూ ఇలా రాయండి మిగతాది పత్రికల భాషలో రాయండి అనడం బాగోలేదు. భాష జాతుల సమస్యలో భాగం - మాండలికం జాతుల సమస్యలో భాగం. జాతుల సమస్యని ఎన్ని కోణాల్లోంచి ఆలోచించాలో మాండలిక సమస్యని

కూడా అన్ని కోణాల్లోంచి ఆలోచించాలి. స్వయం నిర్ణయాధికార హక్కు - విడిపోయే హక్కుతో సహా - జాతులకీ మాండలికాలకీ వుండాలి. మా భాషలో మేం మాట్లాడుకొనే, రాసుకొనే, పత్రికలు నిర్వహించుకొనే హక్కు వుండాలి. మా భాషకి స్వతంత్ర ప్రతిపత్తి వుంది. అది మా జీవ భాష - మా జీవితం నుంచి పుట్టిన భాష - మేం తెచ్చిపెట్టుకున్నది కాదు.

మమ్మల్ని శాసించడం అణచివేతకు సంబంధించిన విషయం. పత్రికల భాష ఏ కొందరిదో. దాన్ని మామీద రుద్దడానికి ప్రయత్నించడం మంచిది కాదు. అందువల్ల basicగా ఆ వాదన తప్పు. అయితే ఒక కోణంలోంచి చూస్తే దాన్ని ఆచరించాల్సిన అవసరం వుంది. పత్రికల భాషకి పాఠశాలల్లో నేర్చుకునేదయినా చిన్నప్పటినుంచి అలవాటు పడివున్నాం. అందులో రాస్తే ఇతరులకి చేరే అవకాశం ఉంది. అది ఒక mediumగా కూడా పనిచేస్తుంది. అందువల్ల ఒకదానిమీద మరొకటి ఘర్షణ పడాల్సిన అవసరం లేదు. ఒకదాన్ని మరొకటి గౌరవించుకుంటే సరిపోతుంది. అందువలన మేం రాసే దాన్ని స్వీకరించాలి. అన్ని ప్రాంతాల భాషల్లోనూ సాహిత్యం రావడంద్వారా ఒక ఉమ్మడి జాతి ఏర్పడే మార్గంలో ఉమ్మడి భాష ఏర్పడుతుంది. తెలుగు జాతి కంతటికీ ఒకే భాష ఉంటే మంచిది కదా! అని కొందరంటారు. అయితే వారనేది పత్రికల భాష. మన జాతి ఇంకా సమగ్రంగా ఎదగలేదు. భాష కూడా పరిపూర్ణంగా రూపుదిద్దుకోలేదు. అలా జరిగివుంటే మాండలికాలు వుండవు కదా! అంతా కలిసిపోయి వుండేది.

ప్రశ్న : తెలుగుజాతి - భాష ఒకటిగా కలిసి ఎదగడానికి మాండలిక రచనలు ఉపయోగపడతాయా?

జవాబు: తప్పకుండా. అన్ని ప్రాంతల తెలుగువారు - అన్ని ప్రాంతాల గురించి తెలుసుకోవడానికీ, భాషలో - సంస్కృతిలో ఏకసూత్రతని సాధించడానికి మాండలిక రచనలు ఉపయోగపడతాయి.

ప్రశ్న : మీరు మాండలిక రచన చేసేటప్పుడు ఈ అవగాహనతోనే చేశారా?

జవాబు : లేదు. మేం అనుకొని రాయలేదు. కానీ ఇప్పుడు సైద్ధాంతికంగా ఆలోచించుకుంటే అనిపిస్తుంది. మా భాషలో మేం రాసుకుంటున్నాం అనే మొండి ధైర్యంతో రాసుకున్నాం తప్ప ఇంత అవగాహన లేదు.

అయితే భాష పట్ల ఉన్న అసహనత వస్తువుమీద పడి మేం ఆశించిన లక్ష్యాలకు కొంత ఆటంకం ఏర్పడుతుంది కాబట్టి ప్రామాణిక భాషలో కూడా మేం వస్తువుని అందించాం. సాహిత్యమంటే కాంతాసమ్మితం అని కదా! పాఠకులకి అనాసక్తిని కలిగించే రూపం వున్నప్పుడు మనం ఆ రూపాన్ని వదివేయాల్సి వుంటుంది. అది మార్క్సిజం మౌలిక సూత్రం - సాహిత్యానికి సంబంధించినంతవరకు. సారానికి రూపం అడ్డంకి అయినప్పుడు ఆ రూపాన్ని వదిలేసి కొత్త రూపాన్ని ఎన్నుకుంటామే తప్ప సారాన్ని వదులుకోం. వస్తువు ఇతర ప్రాంతాలవారికి

చేరడానికి మాండలికం అడ్డంకి అవుతుందని భావించినప్పుడు కథనం పత్రికల భాషలో సంభాషణలు మాండలికంలో ఉండటానికి అంగీకరించాం.

ప్రశ్న : అంటే విప్లవోద్యమ లక్ష్యాలని సాధించడంలో మాండలిక సాహిత్యానికి పరిమితులున్నాయనే కదా!

జవాబు : కాదు. విప్లవోద్యమంలో భాగస్వామ్యం వహించిన మా ప్రాంతంవాళ్ళు మమ్మల్ని ఆత్మీయంగా ఆదరించారు. అంతేకాదు సాహిత్యం సామాజిక ఆచరణగా కూడా మేం భావించడంవల్ల విప్లవ సాహిత్యోద్యమంలో అన్నిsections ని కలుపుకురావాలని ఆశించడంవల్ల మాండలికత దెబ్బతినకుండా వస్తువుని అందరికీ అందించడానికి ప్రయత్నించాం.

ప్రశ్న : దాన్నెలా సాధించగలిగారు?

జవాబు : 1984లో విశాఖపట్నంలో కథ - నవల workshop జరిగింది. కాళీపట్నం దాన్ని నిర్వహించారు. 6, 7 ఏళ్ళుగా మొగమాటంతో చెప్పని విషయాలు ఎన్నో చర్చకు వచ్చాయి. అల్లం రాజయ్య, వి.వి., రాంమోహన్‌రాజు, నేను అందరం పాల్గొన్నాం. మావైపునుంచి సానుభూతిగా ఆలోచించి చెప్పడం జరిగింది. కేవలం ప్రాంతీయమైన మారుమూల పదాలు తగ్గించుకొని - అన్ని ప్రాంతాలవాళ్ళు ఉపయోగించే పదాలు కొన్ని వుంటాయి - వాటిని వాడమని ప్రపోజల్ వచ్చింది.

యాసని భాషలో పెట్టడంద్వారా వచ్చే ఇబ్బందిని కూడా తొలగించాలన్నారు. నిజమే. అక్షరాలు పూర్తిగా ధ్వని సంకేతాలని చెప్పలేవు. తెలుగు లిపికి ఇంకా అది సాధ్యం కాలేదు. Tapeద్వారా లేదా మౌఖికంగా చెప్పడంద్వారా హావభావాలతో వ్యక్తం చేయవచ్చు. అది లేకుండా కాగతం మీదికి ఎక్కేసరికి భాషకి సంబంధించిన స్వరూపం తెలియక కష్టమవుతుంది. పలికే భాషని కాగతంమీద పెట్టడంలో అలవాటు లేకపోవడం వల్ల అక్షరాల్లో వ్యక్తం చేయలేని ధ్వనుల్ని తెలియజేయడానికి మేం కూడా ఇబ్బందిని ఎదుర్కొన్నాం. అటువంటి వాటిని సరళతరం చేయాలని కూడా నిర్ణయించుకున్నాం.

ప్రశ్న : రచయిత శిష్టభాషలో ఆలోచించి మాండలికంలోకి అనువదిస్తాడు అన్న వాదన మీద మీ అభిప్రాయం?

జవాబు : ఇది పూర్తిగా నిజం కాదు. కొంతమేరకు జరుగుతుంది. రచయిత సాధారణంగా educated అయి వుంటాడు. ఉన్నత సంస్కరణని అలవాటు చేసుకుంటాడు. సామాజికంగా తన స్థాయిని పెంచుకునే క్రమంలో భాషలో కూడా సంస్కరణని సాధిస్తాడు. అయితే పుట్టుకనుంచి వున్నత - మధ్యతరగతి కుటుంబాల్లోంచీ వచ్చిన వాళ్ల విషయంలో ఈ వాదన కొంతవరకు నిజమేగానీ working class నుంచి వచ్చిన రచయితలకు ఇది వర్తించదు.

మేం మాండలికంలో ఆలోచిస్తాం. మాండలికంలో రాస్తాం. పత్రికలో భాషలో రాయాల్సినప్పుడు నేర్చుకొన్న ప్రామాణిక భాషకి తర్జుమా చేస్తాం.

ప్రశ్న : ఇతర ప్రాంతాల్లో వస్తున్న మాండలిక కథలమీద మీ అభిప్రాయం?

జవాబు : అన్ని ప్రాంతాలనుంచి మాండలిక రచనలు వస్తున్నాయి. పత్రికలు కూడా ప్రోత్సాహం ఇస్తున్నాయి. అయితే రైతాంగం కార్మిక జీవితాన్ని గురించిన మరింతగా ఎక్కువ రచనలు రావాల్సి వుంది. ఇటీవల అప్పల్నాయుడు, చక్రవేణులాంటి వాళ్ళు వాళ్ల ప్రాంతాల భాషలో మంచి కథలు రాస్తున్నారు. ఇది కొనసాగాలి.

ప్రశ్న : నామిని రాసే కథలకి మీరు రాసే కథలకి తేడా గురించి చెప్తారా?

జవాబు : వస్తువుని విశ్లేషించే ప్రాపంచిక దృక్పథంలో తేడా వుంది. నామిని నాకు మంచి మిత్రుడు. ఆయనలో విశ్లేషణా శక్తి గొప్పగా వుంది - గోర్కీ 'నా బాల్యం' స్థాయిలో, ప్రేమ్‌చాంద్‌కన్నా పైస్థాయిలో. అయితే - జీవితాన్ని నడిపిస్తున్న కారణాల్ని చెప్పాల్సిన అవసరాన్ని ఫీల్ కావడం లేదు. అది ప్రధానంగా కమిట్‌మెంట్‌కి సంబంధించినది. మాలో ఒకడైన నామినికి మాకూ వున్న మౌలికమైన తేడా అదే.

శిల్పం - నామిని శిల్పం చాలా ఉన్నతంగా వుంది. ఆయన తన శిల్పంద్వారా మాండలికంపై పాఠకులకున్న అనాసక్తతని అధిగమింపజేశాడు. పైగా తల్లి - బిడ్డల సంబంధం - స్పందనల్ని- మనస్సు మూలల్ని స్పృశించి రచయితగా అతన్ని స్థిరంగా నిలబెట్టింది. 'పచ్చనాకు సాక్షిగా' కంటే ముందుగా 'మునికన్నడి సేద్యం' వచ్చి వుంటే డా. కేశవరెడ్డి లాగా రచయితగా గుర్తింపు పొంది వుండే వాడు తప్ప పాఠకులకి దగ్గరయ్యే వాడు కాడు.

ప్రశ్న: భవిష్యత్తులో మాండలిక రచనల వ్యాప్తికి మీరిచ్చే సూచనలేంటి?

జవాబు: పత్రికలు ఇందుకు విశేషంగా కృషి చేయాలి. ఎట్లాగా జిల్లా ఎడిషన్స్ మొదలయ్యాయి కాబట్టి ఆయా ప్రాంతాల్లో పన్జేసే విలేకర్లను ఆ ప్రాంతపు ప్రజల భాషలో రాయడానికి అనుమతించాలి- ప్రోత్సహించాలి. కొన్ని వార్తలు ఇతర ప్రాంతాల వారికి తెలియాల్సినవైనపుడు ఆ వార్త భాషే రెండూ చేరతాయి. భాషే సంపర్కం పెరుగుతుంది. వారపత్రికల్లో కాలమ్స్ నిర్వహించడం ఎక్కువ చేయాలి. వ్యాపార పత్రికల్లో సైతం - జనాభా నిష్పత్తిలో కాకపోయినా ఏరియాల అమ్మకం నిష్పత్తిలోనన్నా కథలు, నవలల ప్రచురణ ఎక్కువ చేయాలి.

ప్రజల భాషలో వస్తున్న పాటలకి కవిత్వంలో గుర్తింపు స్థాయి లభించినట్లు - అన్ని పత్రికల్లో మాండలికంలో కథలు నవలలు విస్తృతంగా వచ్చినప్పుడు ప్రామాణిక భాషతో సమాంతరంగా - మాండలిక సాహిత్యం వ్యాపించే అవకాశం ఉంటుంది.

★ రచయిత - అజ్ఞాతంనుంచి బయటకు వచ్చాక 1990లో చేసిన ఇంటర్వ్యూలో కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు. చారిత్రక ప్రాధాన్యాన్ని దృష్టిలో వుంచుకొని ఈ ఇంటర్వ్యూ యథాతథంగా ఉంచడమైంది.

# అనుబంధం-3

## తెలంగాణా జనజీవితాన్ని పోరాటాన్ని చిత్రించిన మాండలిక కథలు

(రచయితల అకరాది క్రమంలో)

| క్రమ సంఖ్య | రచయిత పేరు | కథ పేరు | ప్రచురించిన పత్రిక /కథల సంకలనం | కాలం |
|---|---|---|---|---|
| 1. | అబూజ్ మహడ్ | ప్రతిఘటన | అరుణతార | ఏప్రిల్ 90 |
| 2. | అమర్.డి | '?' | నూతన | జూన్-జూలై 79 |
| 3. | అంతర్ముఖ్ | రాకాసి చేతులు | అరుణతార | జన-మార్చి 87 |
| 4. | ఆర్వీ | పిడికిలెత్తినరైతు | అరుణతార | ఏప్రిల్/మే 92 |
| 5. | ఎంకన్న | సారాకథ | అరుణతార | జూన్ 84 |
| 6. | ఎ. ఎన్. | నాడె... | సృజన | ఏప్రిల్ 81 |
| 7. | ఎన్నారెస్ | బంధం | సృజన | సెప్టెం.82 |
| 8. | ఎన్నార్‌భోలా | నూలుపోగు | సృజన | ఫిబ్ర.82 |
| 9. | ఎల్లం.జి. | బొడ్డురాయి | ప్రజాసాహితి | జన.79 |
| 10. | కర్షక(యస్పెల్?)[1] | షురూ | అరుణతార | ఆగస్టు-సెప్టెం88 |
| | | తిరిగితల్లి ఒడిలోకి | అరుణతార | సెప్టెం.90 |
| | | ప్రజాదన్ను | అరుణతార | సెప్టెం.90 |
| 11. | కాంతి | గంగజిమ్మ | సృజన | జనవరి 81 |
| 12. | కాడి | బోరింగ్ | సృజన | జన-ఫిబ్ర. 91 |
| 13. | కార్మిక | సమ్మె-విస్తరణ | సృజన | అక్టోబర్ 81 |
| | | నిర్బంధంలో సమ్మె | సృజన | నవం. 81 |
| | | విజయం మనదే | సృజన | జనవరి 82 |
| | | లీడరు | సృజన | జూలై 82 |
| | | ఇంధనం | సృజన | మార్చి-ఏప్రిల్ 83 |
| | | కుంపటి(దొంగలు)[2] | సృజన | ఆగస్టు-సెప్టెం.83 |
| | | పిచ్చోడు | అరుణతార | మార్చి 84 |
| | | కొత్త ఎత్తు | సృజన | మే84 |
| | | మరోసారాకథ | సృజన | జనవరి 85 |

| | | | |
|---|---|---|---|
| | నెలవు | అరుణతార | జూన్- ఆగస్టు 85 |
| | పోరుబాటల్లో | సృజన | నవం/డిసెం. 85 |
| 14. కృష్ణమూర్తి, ఇరివెంటి | రంగులంగయ్య | పరిసరాలు రెండోభాగం- (దేశోద్ధారకగ్రంథమాల) | 1952 |
| | పట్నపోల్లు | వర్ధిని | ? 1957 |
| | పంచాయతీ నెంబరు | భారతి | జూన్ 60 |
| 15. కె ఆర్కే | కిరాయిబతుకులు | సృజన | ఏప్రిల్ 81 |
| 16. కే ఎల్ | కాల్చినా కూల్చినా | సృజన | నవం/డిసెం. 83 |
| 17. కేసరి | సర్కారుబాకీ | నూతన | జూలై 81 |
| 18. గట్టయ్య, మొగురం | దారులు | నల్లకలువలు (అబంపి: గోదావరిఖని) | 1988 |
| 19. గోదావరి | తుడుం | సృజన | మే/జూన్ 81 |
| | ప్రారంభం | సృజన | ఏప్రిల్/మే 90 |
| 20. గోపాల్ | తాగొద్దుతన్నులాటలొద్దు | " | అక్టో/నవం.91 |
| 21. గోపి | తల్లిచేప | సృజన | అక్టోబర్ 84 |
| 22. చందు.పి. | ఒరిగిన అన్నల కెన్నీయలో | " | ఆగస్టు/సెప్టెం.83 |
| | గెరిల్లా | సృజన | జనవరి 84 |
| | అనామతు ఖాతా | అరుణతార | డిసెం.84 |
| | ప్రజాస్వామ్యం | సృజన | ఏప్రిల్ 85 |
| | సమ్మె | అరుణతార | ఫిబ్ర/మార్చి 91 |
| 23. చంద్రుడు | గురువులు | సృజన | జూలై 91 |
| 24. చినబాబు | మేకపోతుగాంభీర్యం | రాడికల్ మార్చ్ | జూన్ 88 |
| 25. చిన్న | కలుపుమొక్క | రాడికల్ మార్చ్ | సెప్టెంబర్ 87 |
| 26. చుక్క | ఎత్తుగ్రని పిడికిళ్ళు | సృజన | జన-ఫిబ్ర-మార్చి 79 |
| 27. తిర్మల్, ఎన్ | బానిసోడు | రచన-5 | అక్టో.నవం.88 |
| 28. తొడసంజంగు | రగల్‌రాజ్జెం మెసివాకట్ (ఎర్ర రాజ్యం గెలిచి వస్తాం) | సృజన | ఏప్రిల్ - 84 |
| 29. నరసింహం,పుప్పల | పంచాది | సృజన | ఫిబ్ర.మార్చి 81 |
| | తిరగబడ్డ భూమి | జ్యోతి (మాస) | అక్టో.81 |
| | పడావుపన్ను | అరుణతార | నవం/డిసెం.82 |
| | కథ అడ్డం తిరిగింది | అరుణతార | మార్చి 83 |

| | | | | |
|---|---|---|---|---|
| | | ఇసప్పురుగు | అరుణతార | ఏప్రిల్/మే 84 |
| 30. | నరసింహమూర్తి | ఇంటర్వ్యూ | నల్లకలువలు | పై. ఉ |
| 31. | పర్వత్ | బాకీ | జీవనాడి | జూన్ 74 |
| 32. | పవన్‌కుమార్ ఎన్.ఆర్ | శత్రువు | నల్లకలువలు | పై. ఉ |
| 33. | పోశెట్టి కయితికాల | బండకింద బతుకులు | కథల సంకలనం (కొత్తగూడెం బుక్‌ట్రస్టు ఖమ్మం) | 1991 |
| 34. | ప్రదీప్, ఎం. | రాక్షసులు | నల్లకలువలు | పై. ఉ |
| 35. | ఫణికుమార్ | అన్నలొచ్చిన్రు | భూమిక (అబంపి,గోదావరిఖని) | 1991 |
| 36. | బాలరాజు | మక్కలు | జీవనాడి | డిసెం. 74 |
| 37. | బైనెట్ | భూమి మాది - అడవీ మాదే! | రాడికల్ మార్చ్ | ఆగస్టు 83 |
| 38. | భానుమూర్తి.వి. | ఊరు పిసికలు పోరువెట్టి | సృజన | ఆగస్టు 91 |
| 39. | మల్లయ్య, కాలువ | వెలి | సృజన | జనవరి 83 |
| | | పాలేరు | అరుణతార | ఫిబ్రవరి 83 |
| 40. | మహారాజు, దేవరాజు[3] | యెలుగు మింగిన శీకటి | ఆంధ్రజ్యోతి | 4-10-74 |
| | | మంత్రం | జయశ్రీ రిపబ్లిక్‌డే ప్రత్యేక సంచిక | 1975 |
| | | కడుపుకోత | కేకలు జన్మదిన ప్రత్యేక సంచిక | 1975 |
| | | కోళ్లపందెం | ఆంధ్రజ్యోతి | 20-6-75 |
| | | కండ్లు దెరిశిన నెత్తురు | యువజన | ?76 |
| 41. | మార్కండేయ,కొరెంపూడి | నిరసన | అరుణతార | సెప్టెం/అక్టో.92 |
| 42. | ముత్యం | పాడె ఎనుక | జీవనాడి | ఫిబ్రవరి 74 |
| 43. | మురళీధర్,పి. | గీటురాయి | సృజన | జూన్ 91 |
| 44. | మొండయ్య, అందుగుల | కుంపటి | సృజన | డిసెంబర్ 78 |
| | | పంట | సృజన | మార్చి 82 |
| 45. | యశోదారెడ్డి.పి | మా ఊరి ముచ్చట్లు | కథల సంకలనం (సుధర్మ పబ్లికేషన్స్ హైదరాబాద్) | 1973 |
| | | ఎచ్చమ్మ ముచ్చట్లు | మా తెలంగాణా | జన. 90. |
| 46. | రంగనాథరావు, బూర్గుల | ఎందుకు? | కమ్మతిమ్మెరలు (ఆంధ్రకేసరి గ్రంథమాల) | 1940 |
| 47. | రంగారావు, బోయినపల్లి | ఆడివాప | ,, | |

| | | | |
|---|---|---|---|
| 48. రఘోత్తమరావు, చరకుపల్లి | కోవిల్లో | ,, | |
| 49. రఘోత్తంరెడ్డి, తుమ్మేటి | ధిక్కారం | సృజన | మే/ జూన్ 81 |
| | సవారి-1 | సృజన | నవం.81 |
| | ఒక్కటైతే | సృజన | డిసెం.81 |
| | నీళ్ళుతగవు | సృజన | మే/ జూన్ 82 |
| | బొగ్గు పొరల్లో | సృజన | మే 83 |
| | ఇల్లు [4] | సృజన | ఆగస్టు 84 |
| | సవారి-2 | సృజన | అక్టో.84 |
| | ఈ భూమి ఎవరిచ్చిన్రు? | అరుణతార | నవం. 85 |
| | పెండ్లి | నల్లకలువలు | పై. ఉ |
| 50. రవీందర్, మేర్గు | జీవితం | నల్లకలువలు | పై. ఉ |
| 51. రాజయ్య, అల్లం | ఎదురుతిరిగితే | సృజన | సెప్టెం.అక్టో.77 |
| | మనుషుల వేట[5] | సృజన | జనవరి 78 |
| | చిలుకా! నువ్వేట వెళ్ళావు? | ప్రజాతంత్ర 29 | జనవరి 78 |
| | సంఘం | సృజన | మార్చి 78 |
| | రాజీ | సృజన | జూన్ 78 |
| | ఊరూరి కథ | అరుణతార | జూన్-నవం.78 |
| | గోడ | సృజన | ఆగస్టు 78 |
| | దున్నేవాడిదే భూమి | అరుణతార | అక్టో.78-జన.79 |
| | అడివి మనిషి | అరుణతార | ఫిబ్ర.మే.79 |
| | చేపలు | అరుణతార | జూన్- ఆగస్టు 79 |
| | సృష్టికర్తలు | సృజన | అక్టో.79 |
| | సత్యం | సృజన | అక్టో.80 |
| | శత్రువు నేర్పిన పాఠం [5] | అరుణతార | ఏప్రిల్/మే 81 |
| | మార్పు | సృజన | జూలై 81 |
| | రేగుపండ్లు | అరుణతార | నవం.81 |
| | కథ | సృజన | మే/ జూన్ 82 |
| | పుడమి పుత్రులు | అరుణతార | నవం. 83-జన.84 |
| | మట్టిమనిషి | అరుణతార | సెప్టెం. 84 |
| | తుఫాను | సృజన | మే.85 |
| | నీల | అరుణతార | జూన్/ జూలై 87 |

| | | | | |
|---|---|---|---|---|
| | | భూమి | భూమి(కథల సంకలనం) 1982 (యుగ ప్రచురణలు: హైదరాబాద్) | |
| | | భూదేవి | నల్లకలువలు | పై. ఉ |
| 52. | రాములు. బి. ఎస్. | ఇంటర్వ్యూ | నూతన | మే 81 |
| | | తిరుగుబాటు | సృజన | డిసెం.80 జన.81 |
| | | దొంగగొడ్డుకు లొటారం | సృజన | ఫిబ్రవరి 84 |
| 53. | రాయేశం | మాలోని వాడివే | సృజన | నవం.78 |
| 54. | వి. ఎస్.[6] (మూట శంకర్/సృష్టి) | ఐక్యత-ఘర్షణ | స్పందన | నవం. 86 |
| | | గుణపాఠం | ప్రతిస్పందన | ? |
| | | జీతం-లాభం | ,, | ? |
| 55. | విజయ్‌చందర్. బి | ఆయువుపట్టు | నల్లకలువలు | పై. ఉ |
| 56. | వెంకటేశ్వర్లుఓదెల | గీట్లు చేసే పని గిదేన | ఆంధ్రజ్యోతి(వార) | 17-4-92 |
| 57. | వెంకట్రావు | నక్కలు | జీవనాడి | మార్చి 73 |
| 58. | వేకువ | ప్రజాసైన్యం | రాడికల్ మార్చ్ | ఆగస్టు 88 |
| 59. | శశిధర్. పి | వాల్‌పోస్టర్ | సృజన | మార్చి 91 |
| 60. | శేరాలు, బండి | పురుడు | నల్లకలువలు | పై. ఉ |
| 61. | శ్రీనివాసరావు, ఆకిరెడ్డి | నిరసన | నల్లకలువలు | పై. ఉ |
| 62. | సముద్రుడు | నివురుగప్పిన నిప్పు | అరుణతార | జన.93 |
| | | బతుకుపాట | అరుణతార | ఫిబ్ర. 92 |
| 63. | సమ్మయ్య, ఆకుల | తనకుతాకుతే | నల్లకలువలు | పై. ఉ |
| 64. | సాహు | రక్తపింజెర | సృజన | ఫిబ్ర. 82 |
| | | ఆకలి-నిర్ణయం-జెండాకథ | సృజన | ఏప్రిల్ 82 |
| | | మరట్ తుడుం పాయనా (మనమే తుడుంగొట్టాలె) | సృజన | ఆగస్టు/సెప్టెం.83 |
| | | పోలీస్ దాడి | అరుణతార | మార్చి 84 |
| 65. | సిద్దారెడ్డి, నందిని | పుల్లర | భూమిక (కథల సంకలనం) | పై. ఉ |
| 66. | సీతారామారావు బి. | గరిబోణ్ణి[7] | తెలుగుతల్లి | డిసెంబర్ 1939 |
| | సీతారాం, గూడూరి | మారాజు | ఆంధ్రప్రభ | 1957 (పు.ము. 10.5.99) |

| | | | | |
|---|---|---|---|---|
| 67. | సురమౌళి. జి.[8] | రక్తపూజ | నినాదం? | |
| | | | (సాధన కథానికా సంకలనం) | 1953 |
| | | అంగుడుపొద్దు | పరిసరాలు మొ॥ భా. | పై. ఉ |
| | | మోసపోయిన మల్లమ్మ | జనధర్మ | ? |
| | | మంకు | ఆంధ్రసచిత్ర వారపత్రిక? | |
| 68. | హరికృష్ణారావు,చరకుపల్లి | పల్లెబడి | కమ్మతెమ్మరులు | పై. ఉ |

# మాండలిక కథలు లభించే కథల సంకలనాలు

1. పోశెట్టి కంయితికాల బండకిందబతుకులు కొత్తగూడెం బుక్‌ట్రస్టు ఖమ్మం: 1991

2. యశోదారెడ్డి.పి. మావూరి ముచ్చట్లు సుధర్మా పబ్లికేషన్స్ హై.బాద్:1973

3. రంగనాథరావు, బూర్గుల (సంపా) కమ్మతెమ్మెరలు ఆంధ్రకేసరి గ్రంథమాల, హై.బాద్:1940

4. రాజయ్య, అల్లం భూమి యుగప్రచురణలు, హై.బాద్:1982
   సృష్టికర్తలు కరీంనగర్ బుక్‌ట్రస్ట్, కరీంనగర్:1982

5. వి. ఎస్. (సృష్టిమూట శంకర్) సింగరేణి బతుకులు కొత్తగూడెం బుక్ ట్రస్ట్, ఖమ్మం:1990

6. వివిధ రచయితల సంకలనం నేలతల్లి విముక్తి కోసం విరస నెల్లూరు యూనిట్ 1990

7. అడవిలో వెన్నెల కరీంనగర్ బుక్ ట్రస్ట్, 1985

8. బొగ్గుపొరల్లో కరీంనగర్ బుక్‌ట్రస్టు 1983

9. నల్లకలువలు అబంపి పబ్లికేషన్స్ 1988

10. భూమిక గోదావరిఖని, 1991

11. శ్వేతరాత్రులు ఆర్.కె.పబ్లికేషన్స్, విశాఖ, 1993

12. మల్లయ్య కాలువ మాకథ
   అవ్వతోడు గిది తెలంగాణ

12. మహారాజు, దేవరాజు కడుపుకోత చైతన్య ఆర్గనైజర్స్, 1977

# అనుబంధం - 4

## వివిధ పత్రికల్లో వచ్చిన మాండలికం శీర్షికలు ( ఫీచర్స్ )

**తెలంగాణా**

| | | |
|---|---|---|
| నరసింహం, పుప్పల | స్వగతాలు | ఆంధ్రజ్యోతి (దిన) |
| | ముద్ర | ఆంధ్రప్రభ( ఆదివారం) |
| | గుగ్గిళ్ళు | కృష్ణాపత్రిక? |
| భానుమూర్తి, తెలిదేవర | పలుకుబడి | ఉదయం(దిన);వార్త (దిన) |
| | చల్నేదో బాలకిషన్ | ఉదయమ (వార) |
| కయితికాల పోశెట్టి | బండికింది బతుకులు | కోల్‌బెల్ట్(వార) |
| | జనపదం | ఉదయం (వార) |
| భూపాల్ | మండేచంద్రుడు | ఉదయం(వార) |
| మల్లయ్య, కాలువ | అవ్వతోడు గిది తెలంగాణా | ఆంధ్రప్రభ (ఆదివారం) |
| యశోదారెడ్డి.పి. | ఎచ్చమ్మ ముచ్చట్లు | మా తెలంగాణా (పక్ష) |
| నారాయణ, అల్లం | నీలకంఠం కథలు | |
| | అల్లంకారం | ఆంధ్రజ్యోతి మంగళవారం |
| | పర్వతాలు చెప్పిన కథలు | జీవగడ్డ (దిన) |

**రాయలసీమ**

| | | |
|---|---|---|
| కృష్ణారెడ్డి పులికంటి | నాలుగ్గాళ్ళ మండపం | ఆంధ్రప్రభ( ఆదివారం) |
| రామకృష్ణారెడ్డి | పెన్నేటి కథలు | ఆంధ్రజ్యోతి (వార) |
| సుబ్రహ్మణ్యం నాయుడు, నామిని | పచ్చనాకు సాక్షిగా | ఉదయం( దిన) |
| | సినబ్బకతలు | ఉదయం (దిన) |
| | మిట్టూరోడి కతలు | ఆంధ్రజ్యోతి (వార) |
| | మాయమ్మ జెప్పిన కథలు | ఆంధ్రజ్యోతి(సోమవారం) |

**విశాఖ**

| | | |
|---|---|---|
| పతంజలి | పలుకుబడి | ఉదయం |

**నెల్లూరి భాషలో**

| | | |
|---|---|---|
| మహమ్మద్ ఖదీర్‌బాబు | దర్గా మిట్టకథలు | ఆంధ్రజ్యోతి (వార) |

# పాద సూచికలు

## మొదటి అధ్యాయం

1. F. Engles, The Part Played by Labour in the transition from ape to man, (Mascow: 1952), PP5-20.
2. గుగి వాధియోంగో, 'ఆఫ్రికా సాహిత్య భాష', అను: ప్రసాద్‌రాజు, అరుణతార, ఆగస్టు & సెప్టెంబర్, 1990.
3. Joyee. O. Hertzler, A Socialogy of Language, (Newyark: Randam house, 1965), p.141.
4. W.N. Francis, Dialectology, (London: Longman, 1983), PP 5-16.
5. బూదరాజు రాధాకృష్ణ, వ్యావహారిక భాషా వికాసం, (విజయవాడ: విశాలాంధ్ర, 172), పే.104.
6. R.A.Hudson, Sociolinguistics, (Cambridge: CUP, Re-pri-1987, First Pub: 1980), PP 48-52; Peter Trudgill, Sociolinguistics, (Penguin: Rev. Ed. 1986, First Pub: 1974) P.101.
7. కుంటముక్కల లక్ష్మీనారాయణ, భాషాశాస్త్రం - ఎంకి, (హైదరాబాదు : 1982) పే. 41.

7a. 'అపశబ్దా హి ప్రతిదేశం ప్రతిగృహం - ప్రతి పురుషం ప్రత్యవస్థం భిన్నాశ్చానవస్థితాః' కాశికావృత్తి.

8. R.A. Hudson, పై.ఉ.
9. "Language' or "Dialect'?, "Socialinguistics, Ed. Samir K.Ghosh (Hugu: Mouton, 1972) P.P. 17-22.
10. Sociolinguistics, Peter Trudgill, పై.ఉ.
11. F.M.Berezin, Lectures on Linguistics, (Vijayawada: Vishalandhra: Pri.1976, First Pub.1969) P.35.
12. R.E. Keller, German Dialects, Introduction, (1961) అను: బూదరాజు

రాధాకృష్ణ, 'మాండలిక లక్షణాలు', తెలుగు, జనవరి - మార్చి - 1973.

13. ఆంధ్ర భాషావికాసము, (మచిలీపట్నం: త్రివేణి, రెం. ము. 1968) పే.

14. భాషాశాస్త్ర పరిచయము, (నరసరావుపేట : 1982) పే. 222

15. Lectures on Linguistics పై.ఉ. పే.39.

16. వ్యావహారిక భాషా వికాసం, పై.ఉ. పే.3

17. German Dialects, పై. ఉ.

18. కథాకథనం, (విజయవాడ : స్వేచ్ఛా సాహితి, 1990), పే.62.

19. నేలతల్లి విముక్తి కోసం, ముందుమాట, (నెల్లూరు : విరసం, 1990) VI.

20. భద్రిరాజు రాధాకృష్ణమూర్తి, 'తెలుగు మాండలికాలు : ప్రమాణభాష', తెలుగు భాషా చరిత్ర, (హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, రెం. ము. 1979) పే.400.

21. OttoJesperson, Mankind, Nation and individual from a linguistic Point of view, P.P. 46-47.

21a. A Dictionary of Linguistics and Phonetics, (Newyork : Rev. Ed. 1985), P.93.

22. Labove (1966); Chambers J.K. (1980), Hockett (1958); Trudgill (1974).

22a. మాండలిక వృత్తిపద కోసం -I, II, IV సంపుటాల్లో తయారుచేసిన పటాల్ని 'తెలుగు మాండలికాలు - ప్రమాణ భాష' తెలుగు భాషాచరిత్ర, పై.ఉ, పే. 414-426ల్లో చూడవచ్చు.

23. భద్రిరాజు కృష్ణమూర్తి, పై.ఉ. పే.407.

24. N.Shivarama Murthy, "Social mobility and Language variation, Sociolinguistics and Diatectology, Ed. S.Agesthialingom & K.KarunaKaran, (Annamalai University : 1980), P.P. 368 - 381.

25. Sociolinguistics, పై.ఉ., పే.36.

26. భద్రిరాజు కృష్ణమూర్తి, పై.ఉ. పే.407.

27. W.N.Francis (1983), పై.ఉ. PP 17,18.

28. Bloomfield, Language, (Newyork : Re. Pri 1963) PP. 49,50.

28a. మాం.వ్యా.కో. I, పటం-13, పే.77.

29. వివ.చూ. గంటిజోగి సోమయాజి, పై.ఉ. పే.246-48.

30. వివ.చూ. వి.స్వరాజ్యలక్ష్మి (1974), తెలుగులో అన్యదేశ్యములు', తెలుగు భాషాచరిత్ర, పై.ఉ. పే. 326-340.

31. Linguistic Survey of India, Vol. IV., P.577.

32. "Dialect is the natural form of language' -Max Muller, Science of Language.

33. Bloom field, పై. ఉ. P.485.

34. బూదరాజు రాధాకృష్ణ, పై.ఉ., పే.119.

35. ఆరుద్ర 'త్వమేవాహం', పఠాభి 'ఫిడేలు రాగాల డజన్'లలో ఇలాంటి ప్రయోగాలు చేశారు.

36. బూదరాజు రాధాకృష్ణ, పై. ఉ.పే. 109.

37. Bloomfield, పై.ఉ. పే.485.

38. బూదరాజు రాధాకృష్ణ, 'మాండలిక లక్షణాలు' (R.E.Kellar, German Dialects, Introductionకి అనువాదం) పై.ఉ.

39. Bh. Krishnamurthy, A Basic Course in Modern Telugu, (1968), P.XII.

40. గిడుగు రామమూర్తి, వాడుకభాష (వేకుమళ్ళ కామేశ్వరరావు) పీఠిక.

41. జయధీర్ తిరుమలరావు, మౌఖిక సాహిత్యం (జి.వి.బి.నరసింహారావు - 1991)కి రాసిన ముందుమాటలో.

42. Science of Language, Vol. I, Lecture I.

43. "I clothed the play in the spoken dialect not only that it is better ***intelligible*** to the stage-going public than the literacy dialect, but also from a conviction that it is the proper ***comic diction*** for telugu'' (కింది గీతలు నావి)

- *గురజాడ, కన్యాశుల్కం, మొదటి కూర్పు (1897) పీఠికలో.*

# రెండో అధ్యాయం

1. గురజాడ, అసమ్మతిపత్రం, (గురజాడ రచనలు: సంపా. పెట్టి ఈశ్వరరావు) అను: వి. రామచంద్రరావు, (హైదరాబాదు: విశాలాంధ్ర, 1987), పే. 52, 53.

   కావ్యభాష వాడుక భాషకంటే భిన్నంగా వుండటం భారతీయ భాషలు అన్నిట్లోనూ వుందని కాడ్వెల్; తెలుగు కావ్యభాషకీ, వాడుక భాషకీsaxonకి ఇంగ్లీషుకీ మధ్య వున్నంత తేడా వుందని సి.పి. బ్రౌన్ అభిప్రాయపడ్డారు. స్టెన్‌కొనొన్, కాంబెల్, ఆర్టన్‌లు కూడా దాదాపు ఇలాంటి అభిప్రాయాలే వ్యక్తం చేశారు.
2. గురజాడ, పైనే, పే.49.
3. గిడుగు (బాలకవి శరణ్యం, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం); చిలుకూరి నారాయణరావు ( ఆంధ్ర భాషాచరిత్రము); వడ్లమూడి గోపాలకృష్ణయ్య (ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష లేక ధ్వని - లిపి- పరిణామం); బూదరాజు రాధాకృష్ణ (వ్యవహారిక భాషావికాసం); బి.రామరాజు (''కావ్యభాషా పరిణామం-1600-1899,'' తెలుగు భాషా చరిత్ర, సంపా: భద్రిరాజు కృష్ణమూర్తి.
4. బూదరాజు రాధాకృష్ణ, వ్యావహారిక భాషా వికాసం, (విజయవాడ: విశాలాంధ్ర, 1972) పే.42.
5. శ్రీనాథుడు పప్పు (హరవిలాసం -II 31) ప్రయోగిస్తే రాయలు బేడలు (ఆముక్త మాల్యద -II 88) ప్రయోగించాడు. ఇటువంటి ప్రయోగాలన్నీ నిఘంటువుల్లో చోటుచేసుకున్నాయి. ఉదా: పప్పు, బేడయున-సూపంబుదనరారు' (ఆంధ్ర భాషార్ణవము, -II 248)
6. కాళహస్తీశ్వర శతకము, పద్యం-7, పద్యం-52.
7. బూదరాజు రాధాకృష్ణ, పై. ఉ., పే.52
8. బి. రామరాజు, ''కావ్యభాషా పరిణామం', తెలుగు భాషా చరిత్ర, సంపా. భద్రిరాజు కృష్ణమూర్తి, (హైదరాబాదు: ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, 1979) పే.243
9. అహల్యా సంక్రదనము, సముఖం వెంకటకృష్ణప్ప నాయకుడు, 1.69
10. శుకసప్తతి, పాలవేకరి కదిరీపతి రాజు, (-II.4549,477)
11. షట్చక్రవర్తి చరిత్రము, కామినేని మల్లారెడ్డి- (II.60)
12. విన్నకోట పెద్దన, కావ్యాలంకార చూడామణి.

13. ''పెద్దలు శెప్పగించి బవుపెద్దట యొగ్గె సోమాదులంట...''. - చంద్రశేఖర శతకం, పద్యం 24.

14. బాలకవి శరణ్యం, (విజయవాడ: విశాలాంధ్ర, 1958) పే. 66

15. జయధీర్ తిరుమలరావు, తెలంగాణా రైతాంగ పోరాటం - ప్రజా సాహిత్యం (హైదరాబాదు: సాహితీ సర్కిల్, 1990), పే. 1-46.

16. ..... కుందవరపు చౌడుని నీతుల్

వినవిన దేట తెనుంగై, కనపడు గద కుందవరపు కవిచౌడప్పా! ''కవిచౌడప్ప శతకము'', అధిక్షేప శతకములు, సం.పా. కె.గోపాలకృష్ణరావు, (హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ) పే. 61.

17. పోలిపెద్ది వేంకటరాయకవి, వేణుగోపాల శతకములు, ప. 22&98. అధిక్షేప శతకం, పై.

ఉ., పే.89 &122.

18. కూచిమంచి తిమ్మకవి, శ్రీభర్గ శతకం, ప. 93,95, పైనే. పే.32.

19. పండితారాధ్య చరిత్ర.

20. చూ. బసవపురాణం, రంగనాథ రామాయణం- ఫలశ్రుతులు.

21. బి.రామరాజు, తెలుగు జానపదగేయ సాహిత్యము, (హైదరాబాదు: ఆంధ్ర రచయితల సంఘం, 1958), పే. 28.

22. ఆర్వీయస్ సుందరం, ''లిఖిత జానపద సాహిత్యం'', తెలుగు జనసాహితి, సంపా. కె.కె. రంగనాథాచార్యులు, (హైదరాబాదు: ఆంధ్ర సారస్వత పరిషత్తు, 1990) పే. 170 &173.

23. వివ.చూ. తెలుగులో పదకవిత, ఎస్. గంగప్ప, (గుంటూరు: 1983); తాళ్లపాక కవుల పదకవితలు, వేటూరి ఆనందమూర్తి (హైదరాబాదు: 1976) ద్వి.భా.

24. ఎస్.గంగప్ప, పై. ఉ.పే.202.

25. పైనే.

26. పదములు శృంగార వధూ/ మృదు మధుర మనోజ్ఞ వాక్య మిశ్రములైనన్విదితార్థ గ్రామ్యోక్తులు/ పదిలముగాఁ బొంకమెఱిగి పలుకుగ జెల్లున్.

-సంకీర్తన లక్షణం, పద్యం 56.

27. ఎస్. గంగన్న, పై. ఉ.

28. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, ''త్యాగరాజయ్య సాహిత్యము'' ఆంధ్రపత్రిక-స్వర్ణోత్సవ సంచిక, 1965, పే.246-247.

29. ఉదా. విజయ రాఘవ నాయకుడి ప్రహ్లాద చరిత్ర యక్షగానంలో ప్రహ్లాదోవ హమభినాదయే' అని పండిత ప్రేక్షకుల ముందు, 'మ్రొక్కేను-మ్రొక్కేనయా యయ్యా' అని సామాన్య జనం ముందు సంభాషణ మార్చుకోమని నటులకి సూచన ఇవ్వడం చూడవచ్చు. యక్షగాన ప్రదర్శనలో ప్రజల భాష అవసరాన్ని ఈ సూచనలు తెలుపుతున్నాయి.

30. సి.వి. రామచంద్రరావు, రాయవాచకం (హైదరాబాదు: ఆం.ప్ర. సాహిత్య అకాడమీ, 1982) పే. XXIII

30a. గిడుగు, వ్యాసావళి, (విజయవాడ: విశాలాంధ్ర, 1958) పే. 20-25.

31. బి.రామరాజు, పై. ఉ., పే. 670.

32. నాయని కృష్ణకుమారి, ''తెలుగు జానపద భాషలో మార్పులు-చేర్పులు'', అక్షరార్చన (పాటిబండ మాధవశర్మగారి షష్టిపూర్తి సన్మాన సంచిక) పే. 263.

33. బి.రామరాజు, పై. ఉ., పే.635-645.

గోపు లింగారెడ్డి, తెలంగాణా శ్రామిక గేయాలు, (సుషమ-కరీంనగర్, 1982).

34. తెలంగాణా శ్రామిక గేయాలు, పై. ఉ., పే.50

35. పైనే, పే. 17

36. ఉదా. ఏటిగడ్డ ఎర్రజొన్నా/ ఏడుమంచీల కావలోడా/ ఎన్నుమీదారా గువ్వావాలె-సిన్నావోడా / నా రొమ్ముమీది రా సెయి దియరో - పైనే. పే.53.

37. ఉదా. 'కోతల్లో మునిగున్న- ఉయ్యాలో' పాటలో శ్రామిక సంస్కృతి కనిపిస్తుంది; జయధీర్ తిరుమల్‌రావు, పై. ఉ. పే.21.

38. వివ.,చూ. జె.సి. ''తెలంగాణా పోరాట పాటలు-ప్రజల పాటలు'' కవిత్వం -గతి తార్కికత, (సృజన ప్రచురణలు: 1991) పే.21.

39. ప్రతి పాటకు ఒక కథ ఉందా? ఆ ఉంది!, గద్దర్, (జననాట్యమండలి, 1991) పే. 4-10 &95-99.

40. జజ్జనకరి జనారే, వంగపండు-పాటలు, (విశాఖ: విరసం, 190) పే.76.

41. తెలంగాణాలో విస్తృతంగా ప్రచారంలో వున్న 'గోరంట సెట్టుకింద నరుడా ఓ నర్సిరెడ్డి' అనే జానపద గీతానికి (చూ. గోపులింగారెడ్డి, పై. ఉ., పే. 218) విప్లవ సంస్కృతిని

జోడించి కట్టిన ఈ పాట విరసం ప్రచురించిన 'ఝుంఝు'లో, 1970లో వచ్చింది. జానపదుల నర్సిరెడ్డి ఇందులో విప్లవకారుడు భాస్కరుడయ్యాడు. నర్సిరెడ్డి 'దోస్తీదారులంతా మెుకాన కొంగులేసి' ఏడిస్తే భాస్కరుడి అనుయాయులు 'బందూకులు సేతబట్టి బంధాలు తెంచుతామ'న్నారు.

42. చలసాని ప్రసాద్ ''పాటల పంట'', జజ్జనకరి జనారే, పై. ఉ. ముందుమాట.

43. "....... it is primarily a peasant activity"

- Stith Thompson, The Folk Tale, (New York-Dryden Press, 1946) P.449.

44. తెలుగు జానపద కథలు, జి. ఎస్.మోహన్, (సికిందరాబాద్: యువ భారతి, 1984) పె.36-38.

45. ''తెలుగు పత్రికా రచనలో వ్యావహారిక భాషా వికాసం'' వి.లక్ష్మణరెడ్డి, మరోసారి గిడుగు రామమూర్తి, (హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 1986) పే. 131, 132.

46. 'కంకణాల కైఫీయత్తు'', తెలుగు వచన రచనా పరిచయం, ( ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, 1984), సంపా. కేతు విశ్వనాథరెడ్డి, పే. 17,18.

47. ''నిఘంటు పూజ'', తాతాచార్ల కథలు, పైనే. పే.23

48. ''పదవిన్యాసంలో నడకలో మాట సూటిలో గ్రాంథిక భాషలోని అత్యుత్తమ రచనలేవీ వీటికి దీటురావు''

మెుకంజీ కైఫీయుతుల్ల గురించి - గురజాడ, కన్యాశుల్కం-రెండోకూర్పు, ముందుమాట.

49. వివ.చూ. ఆంధ్ర వచన వాఙ్మయము, నిడదవోలు వేంకటరావు, (హైదరాబాద్: రెం.ము, 1977), పే. 57-63.

50. పైనే, పే. 78,79.

51. గద్య చింతామణి, గిడుగు, (గుంటూరు: తెలికిచెర్ల వెంకటరత్నం, 1933).

52. గిడుగు, వ్యాసావళి, పై. ఉ. పే. 151-159.

53. వివరాలకు చూ. బూదరాజు రాధాకృష్ణ, పై. ఉ. పే. 84,85.

54. కన్యాశుల్కం మెుదటి కూర్పు గురించి "The People's Friend" (21-1-2-1897) పత్రికాభిప్రాయం, కన్యాశుల్కం, (గురజాడ రచనలు, సంపా. సెట్టి ఈశ్వరరావు, హైదరాబాదు: విశాలాంధ్ర, రెం.ము, 1990) పే. 27.

55. కన్యాశుల్కం, రెండో కూర్పు, ముందుమాట.
56. ఒంగోలు నుంచి సుబ్రహ్మణ్యంకు గురజాడ లేఖ, గురజాడ లేఖలు, (విజయవాడ: విశాలాంధ్ర, 1958)
57. "... there is an unconcious effort to form a new literary Dialect. My complaint is that this movement is logically slow."

    - కన్యాశుల్కం, రెండో కూర్పు, ముందుమాట.
58. శ్రీపాద సుబ్రహ్మణ్యాశాస్త్రి, అనుభవాలూ- జ్ఞాపకాలూనూ, సంపు.2, పే. 261.
59. ''తుది విన్నపం'', గిడుగు, వ్యాసావళి, పై. ఉ.
60. అంతేకాదు- గ్రామ్యాన్ని 'కులట' (వావిలికొలను సుబ్బారావు, కాశీభట్ట బ్రహ్మయశాస్త్రి) అనీ, 'లంజసంతతి' (భోగంరాజు నారాయణమూర్తి) అనీ నిందించారు. చూ. ''గ్రామ్యశబ్ద విచారము'', గురజాడ, వ్యాసచంద్రిక, పే. 58-64).
61. ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక -1-2, పే. 151-158.
62. బాలకవి శరణ్యం, గిడుగు, (విజయవాడ: విశాలాంధ్ర, 1958), పే. 271-274.
63. అసమ్మతి పత్రం, గురజాడ, పై. ఉ.
64. గురజాడ దీన్ని ' ఉమ్మడి సాహిత్య భాష'గా పేర్కొన్నారు. చూ. కన్యాశుల్కం, మొ. కూ., ముందుమాట.
65. నిడదవోలు వేంకటరావు, పై. ఉ., పే. 105.
66. వేల్చేరు నారాయణరావు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, (హైదరాబాదు: హైదరాబాద్ బుక్‌ట్రస్టు, 1987), పే. 60, 63.
67. ''తుది విన్నపము'', గిడుగు, పై. ఉ., పే. 155.
68. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు: ప్రయోగములు, (హైదరాబాదు: రచయిత, 1967) పే. 156-157.
69. కన్యాశుల్కం, రెండో కూర్పు, ముందుమాట.
70. కరుణకుమార కథలు(హైదరాబాదు: విశాలాంధ్ర, 1984)కి మల్లంపల్లి సోమశేఖర శర్మ రాసిన ముందుమాట.
71. మధురాంతకం రాజారాం, ''కరుణకుమార'', తెలుగు కథారచయితలు, (హైదరాబాదు: ఆం.ప్ర.సాహిత్య అకాడమీ, 1991) పే. 108.
72. కళలు -శాస్త్రీయ విజ్ఞానం, కొడవటిగంటి కుటుంబరావు (విరసం 1980, సంపా. త్రిపురనేని మధుసూదనరావు) పే. 35.

73. కొ.కు తనకు మార్గదర్శి అని మూగజీవాలు పుస్తకానికి (యువ ప్రచురణలు: 1950) ముందుమాటలో మా గోఖలే చెప్పుకొన్నాడు.

74. జి.సురమౌళి తన మాండలిక రచనలకి మాగోఖలే ఆదర్శంగా వుండేవాడని నేను చేసిన ఇంటర్వ్యూ (1990)లో చెప్పారు.

75. కమ్మతెమ్మరలు, (హైదరాబాదు (ద): ఆంధ్రకేసరి గ్రంథమాల, 1940)

76. కాకరాల, ''తెలంగాణా పోరాట నాటకాలు-నాటికలు'' సృజన, తెలంగాణా విమోచనోద్యమ ప్రత్యేక సంచిక, అక్టో. 1982, పే. 28; గొర్రెపాటి వెంకటసుబ్బయ్య, అభ్యుదయ, సెప్టెంబరు, 1947.

77. చూ. ఇదే, నాలుగో అధ్యాయయం.

78. ఉన్నవ లక్ష్మీనారాయణ, మాలపల్లి ముందుమాట, ''పరిచయం''; వట్టికోట అల్లారుస్వామి, ప్రజల మనిషి ముందుమాట, 'మనవి'.

79. చలసాని ప్రసాద్, ''సాహిత్యంలో తిరోగమనం'', మనలో మనం, సంపా. కాళీపట్నం రామారావు, (విశాఖ: సాగర గ్రంథమాల, 1990) పే. 198.

80. జయధీర్ తిరుమలరావు, ''సాహిత్యంలో సామాజికత'', పాలు, బి.ఎస్.రాములు, (ఖమ్మం:కొత్తగూడెం బుక్‌ట్రస్ట్, 1991), పే. 4.

81. అల్లం రాజయ్య, సృష్టికర్తలు, (హైదరాబాదు: యుగ ప్రచురణలు, 1982) పే.IX

# మూడో అధ్యాయం

1. వరవరరావు, '''పాఠకులు' తగ్గిన్రు, 'శ్రోతలు' పెరిగిన్రు'' కొలిమంటుకున్నది, అల్లం రాజయ్య, (హనుమకొండ : సృజన ప్రచురణలు : 1979)కి రాసిన ముందుమాట; మధురాంతకం రాజారాం, ''ఛల్ ఛల్, బళా బళీ! పదండి ముందుకు'', ముద్ర, వుప్పల నరసింహం, (హైదరాబాద్ : మైనా ప్రచురణలు : 1989)కి రాసిన ముందుమాట.

2. 'మాండలికంలో మాణిక్యాలు', ఆంధ్రభూమి, (దినపత్రిక,15-4-90), సంపా. ఎ.బి.కె. ప్రసాద్.

3. కథలు - శాస్త్రీయ విజ్ఞానం, కొడవటిగంటి కుటుంబరావు, (విరసం 1980, సంపా. త్రిపురనేని మధుసూదనరావు) పే.35, 36 ఇకనుంచీ కొ.కు.

4. R.E.Keller, German Dialects, Introduction (1961)కు అను: బూదరాజు

రాధాకృష్ణ, 'మాండలిక లక్షణాలు', తెలుగు, జనవరి - మార్చి 1973. ఇకనుంచీ కెలర్ - బూ.రా.

5. ప్రశ్నావళి ఆసక్తికరంగా వున్న కారణంగా అనుబంధంలో చేర్చడమైంది. చూ. అను.1
6. చూ. ఇదే, అధ్యాయం 1, పటం: ప్రాంతీయ వర్గమాండలికాల సంబంధం, పే.25
7. కొ.కు., పై.ఉ., పే.44
8. పి.సి.నరసింహారెడ్డి, 'శ్రవ్యనవల', కొలిమంటుకున్నది, పై.ఉ. పైసమీక్ష - పుస్తకం వెనక, పే.iii
9. కొ.కు., పై ఉ., పే.47
10. కె. రాంమోహన్‌రాజు, రచన - భాషపై చర్చ, సృజన మే - 1979.
11. అల్లం రాజయ్య, 'ఇది చివరి మాట కాదు' కొలిమంటుకున్నది, పై.ఉ., పే. 158.
12. బి.ఎస్.రాములుతో నేను చేసిన ఇంటర్వ్యూలో ఆయన ఈ అభిప్రాయం వ్యక్తం చేశారు. ఆ ఇంటర్వ్యూ మాండలిక కథ, నవలల గురించి ఎన్నో విశేషాలను తెలియజేస్తున్నందువల్ల అనుబంధంలో చేర్చడమైంది. చూ. అను.2
13. పైనే
14. జయధీర్ తిరుమలరావు, 'సాహిత్యంలో సామాజికత', పాలు, బి.ఎస్.రాములు (ఖమ్మం : కొత్తగూడెం బుక్ ట్రస్ట్, 1991)
15. కె.శివారెడ్డి, 'ముందుమాట', తొక్కుడుబండ, టి.కృష్ణమూర్తి యాదవ్ (హైదరాబాద్ : రచయిత, 1988) పే.6
16. 'మాండలిక రచయితలు అలభ్యులు కాబట్టి మాండలిక సాహిత్యమూ అసాధ్యమే'. కెలర్, 'మాండలిక లక్షణాలు', అను. బూ.రా., పై.ఉ.
17. వెలుగూ - వెన్నెలా - గోదారీ (1958), ముత్యాలపందిరి (1964), రంగవల్లి (1974) - వీటిలో వెలుగూ - వెన్నెలా - గోదారీ భాష మాత్రమే రచయితకు చిన్నప్పటినుండీ తెలిసిన భాష.
18. డా॥ పోరంకి దక్షిణామూర్తితో నేను చేసిన ఇంటర్వ్యూలో ఆయన ఈ విషయాన్ని పేర్కొన్నారు. (ఇంటర్వ్యూ తేదీ: 21-2-1992).
19. నేలతల్లి విముక్తి కోసం (జనజీవన పోరాట కథలు), (నెల్లూరు జిల్లా యూనిట్ : విరసం, 1990) పే.299
20. 'దూరానికి దగ్గరగా (శ్రవ్యనవల?), కొలిమంటుకొన్నది (అల్లం రాజయ్య, పై.ఉ.)

